శ్రీ

# విజయరాఘవము.

ఎనిమిదంకముల నాటకము.

ఇది

ప్రచండ చాణక్యము; నర్మదా పురుకుత్సీయము

మొదలగు నాటకములు రచించిన,

## పానుగంటి - లక్ష్మీనరసింహారావు గారిచే

రచియింపఁబడి,

తణుకు

శ్రీ సౌదామినీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

ప్రకటింపఁబడియె.

1909

కాపీరైటు] మొదటికూర్పు 1000 ప్రతులు. [రిజిష్టరు.

వెల 1—0—0.

# పీఠిక



శ్రీమద్రామాయణమునంతయు నాటకరూపముగ వ్రాయదలంచి యిదివఱకయోధ్యాకాండలోని గాథను "పట్టభంగ రాఘవమను" పేర వ్రాసియుంటిని. మహారాజరాజశ్రీ శ్రీపీఠికాపుర ప్రభువువారగు శ్రీశ్రీ రాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావు బహద్దరువారి పట్టాభిషేకమహోత్సవగౌరవార్థమై యుద్ధకాండలోని గాథను సంగ్రహించి విజయరాఘవమను పేరనీనాటకమును వ్రాసితిని. దీనిని 1906సం॥ రం॥ జూలై నెలలో మొదలుపెట్టి 4—10—06 తేదీని ముగించితిని. శ్రీశ్రీ పీఠికాపుర సంస్థానప్రభువువారే తమధనమొసఁగి యీనాటకమునచ్చు వేయించిరి. విద్యాపోషకులు లోకోపకారధురీణులగు నీప్రభువువారు పరమేశ్వరకటాక్షముచే జిరకాలము సమస్తసౌఖ్యసమన్వితులై తమసంస్థానప్రజను బోషింతురుగాక!!

ఈనాటకమునకు నాందీప్రస్తావనలను వ్రాసి నన్ను సంతోషపెట్టిన నామిత్రులగు బ్ర॥ శ్రీ కూచి నరసింహముగారికనేక నమస్కారములాచరింతును.

పిఠాపురము.
9/11/09

పానుగంటి లక్ష్మీనరసింహారావు.

ఈ గ్రంథకర్తగారిచే రచియింపఁబడి అచ్చుకానున్న

# నాటకములు

---

1. బుద్ధబోధసుధ అను బుద్ధనాటకము.

2. బాలరాఘవము లేక కళ్యాణరాఘవము.

3. ఉత్తర రాఘవము.

"The following extract from a letter from one of our distinguished countrymen M. R. R. V. Rangarau Pantulu garu*of refined literary taste will serve, we think as a clear proof of the popular appreciation accorded to the author's plays even before they have appeared in print.

Dt. Munsiff, Peddapuram.

But what indeed shall I say of Vizia Raghavam? Whether for range of knowledge or for vigour of expression, or for the sustained maintenance of the force of each and every one of the characters from the sensual parasites Malodara and Deerghakaya upwards to Rama at the top of all, the play is really one of the grandest products of art for recent times for rising India. Would to heaven that others walked in your footsteps with at least a portion ever so small of your success, and I shall have no doubt of the regeneration of our unfortunate country condemned unknowingly by others for want of originality, purity of thought, conception and ideal.

You appear to have remarked that the Drama Vizia Raghavam, whatever its merit, is too long and too tediou to be exhibited on the stage. Well, I agree with you i that it should tax the dramatic troupe itself, and to a con siderable extent also, but, healthily divided into two par as it was done here, there is no reason whatever for anxie ty on the score of the audience itself. The mind must be a very poor mind indeed that should complain of the mere length of the Drama or imagine that, all bloodshed and violence being left behind the scenes, only their progress should be indicated by pronouncements on the stage. The

real grand point of the drama is from an artistic view of the struggle between evil and good. There is a grandeur in even evil and its embodiment is Ravana and induced a grandeur in Good and Great in the commensurate embodiment Rama. The final submission of Ravana to Rama immediately before the crowning event of Ramayana arose, namely the death of Ravana, is the grandest of moral lessons and the utterance of Ravana at such a juncture I can honestly tell you so much overpowered me that I hardly felt myself being a mere listening person forming one unit of the audience. The vanity of human wishes so forcibly brought to my mind was worth the purchase of whole life time. There is a world of thought surging in my mind in relation to the drama, and I feel myself quite unequal to express it.

ఈనాటకమునందు వచ్చుపాత్రలు.



పురుషులు.

1. శ్రీరామమూర్తి—కథానాయకుఁడు.
2. లక్ష్మణుఁడు—
3. భరతుఁడు— } శ్రీరామునిసోదరులు.
4. వశిష్ఠుడు—ఇక్ష్వాకుకుల పురోహితుడు.
5. సుగ్రీవుఁడు—వానరులకురాజు.
6. అంగదుఁడు—యువరాజు.
7. ఆంజనేయుఁడు—సుగ్రీవునిమంత్రి.
8. నీలుఁడు—సేనాధిపతి.
10. మొదటివానరుఁడు.
11. రెండవవానరుఁడు.
12. మాతలి—ఇంద్రసారథి
13. గరుడుఁడు—పక్షిరాజు.
14. గోవిందుఁడు—
15. మాధవుఁడు— } అయోధ్యయందలి బ్రాహ్మణులు.
16. రావణుఁడు—లంకాధిపతి.
17. కుంభకర్ణుఁడు—రావణుని సోదరుఁడు.
18. విభీషణుఁడు—రావణునిసోదరుడు.
19. ఇంద్రజిత్తు—యువరాజు.
20. ప్రహస్తుఁడు—రావణుని సేనానాయకుడు.
21. దీర్ఘకాయుఁడు—రాక్షసవైద్యుడు.
22. మహోదరుఁడు—రాజబంధువు.
23. ద్విజిహ్వుఁడు—రావణునిపురోహితుడు.
24. శుకుఁడు—రావణునిచారుఁడు.

25. జంబుమాలి— } రాక్షసులు.
26. నికుంభుఁడు—
27. విరూపాక్షుఁడు—
28. కాకాక్షుఁడు—
29. సారథి—రావణసారథి.

## స్త్రీలు.

1. సీత—శ్రీరామచంద్రునిభార్య
2. సరమ—విభీషణునిభార్య
3. సులోచన—ఇంద్రజిత్తునిభార్య
4. మండోదరి—రావణునిభార్య

☞ ఇంకను సందర్భానుసారముగ పుట్టుకొనుచువత్తురు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః

శ్రీ

# విజయరాఘవము.

(నాంది)

సీ. మేఘుంబుచెంతఁ గ్రొ ♦ మ్మెఱుంగురీతిని సీత
వామభాగంబున ♦ వఱలుచుండ
ముకుళితహస్తుఁడై ♦ మ్రోలఁ బావని నిల్వ
వెనుక సౌమిత్రి సే ♦ వించుచుండ
భరతశత్రుఘ్ను లి ♦ ర్వంకల నిలుచుండి
వింజామరము లూని ♦ విసరుచుండ
మూలల భల్లూక ♦ ముఖ్యసుగ్రీవాంగ
దవిభీషణులు, భృత్య ♦ తతియుఁ గొలువ

గీ. నీలకోమలనీరేజ ♦ నిభశరీర
రుచులనడుమ సింహాసనా ♦ రూఢుఁ డౌచు
జగములను బ్రోచుశ్రీరామ ♦ చంద్రమూర్తి
శాశ్వతైశ్వర్యముల మీ కొ ♦ సంగుఁ గాత!

(నాంద్యంతమందు సూత్రధారపారిపార్శ్వకులు ప్రవేశింతురు.)

సూ.—ఈవిజయరాఘవ మనేకసరసనాటకరచనానిపుణుండు, నాధునిక కవియు నగు పానుగంటి లక్ష్మీనరసింహారావుసత్తమనాటకము. ద్రష్టం జూచినహూణాంధ్రభాషాకుశలుండును, బహుసద్గ్రంథా

వలోకనపటిష్ఠరసజ్ఞతాప్రశస్తమేధావిభ్రాజితుండును, సకలసు గుణాకరసామ్యహృదయుండును, అనేకపండితకవితల్లజపరివేష్టితుండును, నూత్నపట్టాభిషిక్తపీఠపురసంస్థానాధీశ్వరుండు నగు శ్రీ రాజా రావు వేంకటకుమారమహీపతిసూర్యారావు బహదర్ వారు. నాటక మన్ననో, జన్మతారకశ్రీమద్రామాయణపావనకథా సంభావనీయము. ఇట్లుండ మన ప్రదర్శనపై పుణ్యమునకు మాత్రము కొఱంత వచ్చునా? రాదు.

పా—ఎందుచేత? ప్రదర్శననిపుణత ప్రదర్శకులసామర్థ్యమునుబట్టి యుండును గాని, గ్రంథకర్త తెలివి తేటలంబట్టియు, ద్రష్టలబుద్ధికుశలతంబట్టియుఁ, గథామహిమంబు ననుసరించి, యుండునా? అదేమి యమళజ్వరమా? సాంక్రామికవ్యాధియా?

సూ—ఆహా! ఏమిపరిహాసము!

గీ. పారిపార్శ్వక! చుంబక ♦ ప్రాంతకాంత
మెట్లు చాలనచలనంబు ♦ లెనయునొక్కొ!
వట్టి జడమైనప్రకృతికిఁ ♦ బ్రాణ మెట్లు
వచ్చెనొకో! పరమాత్మసం ♦ బంధమునను.

గీ. రమ్యనాటకరంగపు ♦ రస్థధీవి
శాలసద్గుణధృతిమహా ♦ శక్తి వడయు
పట్టునందున నటనటీ ♦ పాళిమనము
లచ్ఛముకురఫలకముల ♦ యట్లె వెలయు.

కావున నింక నీపరిహాసములఁ గట్టిపెట్టుము. ఏది యెట్లున్న నీకవిమాత్రము ధన్యతరుఁడు సుమా!

పారి—అదేమి? ధన్యుఁడే కాక ధన్యతరుఁ డెట్లు?

సూ—గీ. చేసి, పాదుకాపట్టాభి ♦ షేకనామ
నాటకము ధన్యుఁ డయ్యెఁ బు ♦ ణ్యమున వెనుక;

సీవిజయరాఘవముఁ జేసి ♦ యిప్పు డితఁడు
ధన్యతరుఁ డయ్యె నని పల్కఁ ♦ దప్పె? చెప్పుము.

పారి—ఈనాటకంబులు నీతిప్రతిపాదకంబు లగుటచేతనా యిట్లనుచున్నారు?

సూ—అదొక్కటియే కారణము గాదు. నీతి యత్యుత్కృష్టమాట సత్యమే. కాని, దానికంటె నుత్కృష్ట మైనది వేఱొకటి గలదు. నీతితత్త్వమును బాగుగఁ బరిశీలించి చూడుము.

గీ. దేశకాలంబులనుబట్టి ♦ స్థితులఁబట్టి,
పురుషు లొనరించువ్యాపార ♦ ములనుబట్టి,
మంచిచెడ్డలు, ధర్మముల్ ♦ మాఱుఁ గాన
నీతు లెప్పుడు స్థిరములై ♦ నెగడలేవు.

సీ. సవనంబునను మేకఁ ♦ జంపి వేల్చుటయును,
మాంసాశనులజంతు ♦ మారణంబు,
సత్యవంతుఁడు హరి ♦ శ్చంద్రుఁ డాలిని గత్తి
కెరసేయఁబోవుట ♦ కరుణ లేక
యాత్మజు దశరథుం ♦ డడవుల కంపుట,
మృతపతితో సతి ♦ చితిని బడుట
యాలంబులను రాజు ♦ వ్యాజ్యంబులను న్యాయ
వాదియు, సత్యగో ♦ పనము సేఁత

గీ. బహుజనసుఖార్థ మొకనికి ♦ బాధ సేఁత
కాపథంబుల సత్కార్య ♦ కరణములును
నమ్రకవిజనోక్త్యానృత ♦ క్రమవచన
ములు, సమీచీనములె యిష్టా ♦ మున్నె సఖుఁడ!

ఆ. వె జీవయాత్ర నరుఁడు ♦ సేయుచో నొకధర్మ
మొక్కధర్మమునకు ♦ నెఱవ యగుచు

నష్టు వచ్చుఁ గాన ♦ నన్ని సద్ధర్మము
లెన్నరపువాఁ డెవండు ♦ లేఁడు నుమ్మి.

పారి—సరి! సరి! అట్లయిన జనులు నీతిబాహ్యులై స్వచ్ఛందచారులై యుండవలయు ననియా మీయభిప్రాయము?

సూ—హరిహరీ! న న్నిట్టులా తెలిసికొంటివి? నీతిప్రవర్తన సద్ధర్మాచరణంబు లైహికసుఖదాయకములే కాక యాముష్మికసుఖప్రాప్తికిఁ గూడ ముఖ్యసాధనములు. కాని, వీనికంటె భవతారణసమర్థ మైనయొకదాని నీగ్రంథము బోధించుచుండుటచేఁ గా ధన్యుఁ డంటిని.

పారి—అదేదియో సెల విచ్చెదరా?

సూ—అదియే వచింపఁబోవుచుండ నీవు నా కడ్డము వచ్చితివి.

సీ. దొంగపోటునఁ బిత ♦ దోర్చుటేనియుఁ జూడ
కంగదుఁ డేతండ్రి ♦ యండఁ జేరె
శత్రుపక్షం బని ♦ సంశయింపక విభీ
షణుఁ డేమహాత్ముని ♦ శరణు సొచ్చె
నేనేత మారుతి ♦ హృదయాబ్జమున నాలు
కను నెల్లప్రొద్దులఁ ♦ గట్టిపెట్టె
భరతుఁ డేదలను నె ♦ వ్వనిపాదుకలఁ దాల్చి
కాని, రాజ్యము సేయఁ ♦ బూన ననియె

గీ. నట్టిరాజాధిరాజు దే ♦ వాదిదేవు
దివ్యనామంబు పఙ్క్తిప ♦ ఙ్క్తిని ఘటిల్లు
దీన శ్రీరఘురామభ ♦ క్తియె సఖుండ
సకలభవదుఃఖరోగంబు ♦ లకును మందు.

పారిపార్శ్వకా! పిపీలికాదిబ్రహ్మపర్యంతము బాలాదివృద్ధపర్యంతము దుఃఖనష్టియు, సుఖపుష్టియునుగదా కాంక్షింతురు! ఐహిక

సుఖంబులు క్షణభంగురంబులు, దుఃఖాత్మకంబులు, ననుమాట నంద తెలియంగినదియే. ఇక నఖండవినిర్మలానందావాప్తి కమోఘసాధనంబు భక్తిసుమా!

పారి—కాంబోలును. ప్రదర్శనార్థం బీనాటకముఁ బఠనము సేయునప్డు "జయ రామచంద్ర! జయ రాజీవలోచనా!" యనుచోట్ల నొకవిలక్షణమైనయంతరానుభవము గలుగఁ బులకితశరీరుండ నైతిని.

సూ—మిత్రమా! అదియే సర్వాంతర్యామిరామనామప్రభావము. అదియేముముక్షువాంఛితభక్త్యానందరసానుభూతి.

పారి—అట్లు నాకు సర్వకాలసర్వావస్థలయం దున్న నే నెంతహాయిగ నుందును? కాని, యింకనొక్కసందియము బాధించుచున్నది.

సూ—అది యేది?

పారి—నీతివలెఁ గాక, భక్తి దేశకాలాద్యబాధ్యమని కాదా మీయభిప్రాయము? అట్లైన 'నేకమేవాద్వితీయంబ్రహ్మ,' 'సర్వంఖల్విదంబ్రహ్మ,' త్యాదివాక్యప్రమాణు లగువేదాంతు లీభక్తి నట్లుగణింతురో!

సూ—(నవ్వుచు) పారిపార్శ్వకా! ఇటు విను.

సీ. త్రిశరీరములకు న ♦ తీతుఁడౌ శ్రీరాము
నామంబు భక్తుక ♦ ర్ణములఁ దాఁక
నొడ లెల్ల నుప్పొంగి ♦ యుత్కటరోమాంచ
మతనిమై యంతయు ♦ నాక్రమించుఁ
బవనచాలితమంజు ♦ వల్లరివలె గాత్ర
మొనయును గంపంబు ♦ కనులు బాష్ప
నదులను వెల్చు; మ ♦ నంబు చక్కెరబొమ్మ
చెలువుఁబానకమునఁ ♦ గరఁగుమాడ్కి

గీ. వమ్ము వ్రాపు; నుపాసకో ♦ పాస్య భేద
మంతయు నశించు నిటువంటి ♦ యవసరమున;
నందుచే బ్రాహ్మలమతంబు ♦ నం దొకటియె
పూర్ణ భక్తియు, నద్వైత ♦ ముక్తి సఖుఁడ!

కావున భక్తిస్వభావ, భక్త్యనుభవంబు లన్ని కాలంబుల నన్ని దేశంబుల నన్ని మతంబుల నొక్కటే.

పారి— నే నివేళ గరితార్థుఁడ నైతిని. ఇఁకఁ బ్రదర్శనకార్యమునకై మన మేగుదము.

గీ. అల మహోదారమైమ జ్ఞ ♦ నమరినట్టి
కాఁగడా రామరావణ ♦ కదనరంగ
తిమిరమును బాపినట్లు నీ ♦ దివ్యసూక్తు
లార్య! నాయజ్ఞతాసంశ ♦ యముల దుల్చె.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

శ్రీ

# విజయరాఘవము.

## ప్రథమాంకము.

[ప్రదేశము—లంకలో రావణునిసభాశాల.]

(ప్రవేశము—మహోదరుడు.)

మ—ఈరావణాసురుఁడు చచ్చి లంకారాజ్యము మదధీన మైన నేను మహాదృష్టవంతుఁడ నగుదును గదా! నారసజ్ఞతకు, నాగుణగ్రహణశక్తికి, నావదాన్యతకు, నాభోగేచ్ఛకు, నన్నిఁటిని మించిన పెద్దద్రోణమువంటి నాకడుపునకు నీచచ్చుమాన్యము లెక్కడ—ఈనిర్భాగ్యక్షేత్రము లెక్కడ—

గీ. కోళ్లపందెముల్, గొఱ్ఱెపొట్టేళ్లగముల
పందెములు, నాలఁబోతుల ♦ పందెములును
నరపశువులపందెములును ♦ నాకు నిత్య
విధు లగుటచేత ధన మంత ♦ వెచ్చ మయ్యె.

గీ. ప్రక్కకొకసాని కడుపుపై ♦ నొక్కసాని
తలగడగ నొక్కసాని కొఁ ♦ గిళుల నొక్క
సాని కణుపుకణుపునకొక ♦ సాని రోమ
రోమమున కొక్కసానిగా ♦ రోజు లేఁగె

గీ. రసవిహీనులు దాతృత్వ ♦ రహితు లల్ప
భోగభాగ్యు లాపెద్దల ♦ భూము లన్ని

గిరిగిరను ద్రిప్పి స్వైరిణీ ♦ చరణనఖర
కోటులకు దిగదుడుపుగా ♦ మీటినాఁడ.

గీ. పుట్టఁగలయంతవఱకు న ♦ ప్పులను దెచ్చి
తెచ్చి మొగఁబెట్టి ఋణముల ♦ నిచ్చువారి
నోట బెడ్డగొట్టి బిడియ ♦ మేటఁ బెట్టి
పొట్ట చేతను బట్టి యీ ♦ పురినిఁ బడితి.

గీ. ప్రబలలంకాధినాథుఁడు ♦ పరసతీహ
రణవిచిత్రపాండిత్యధు ♦ రంధరుండు,
కఠినహృదయుఁడు, మాయావి ♦ కాన నాదు
మనసువచ్చినసార్వభౌ ♦ మమణి యతఁడు.

గీ. బొల్లిసైచ్యంబు, లొట్టులు ♦ బూటకములు,
కల్లయేడ్పులు, నోటిబిం ♦ కములు, దొంగ
తనములు, స్తుతిపాఠములు, విం ♦ తలగుమాయ
లెన్నొ యొనరించి దినముల ♦ నీడ్చుచుంటి.

అడుగో! దశకంఠవయస్యుఁ డైనద్విజిహ్వుఁ డిక్కడకు వచ్చుచున్నాఁడు.

సీ. వెనుక వాల్తులవాఁడు, ♦ విస్తృతదీర్ఘమై
మొనదేలుసోలెఁడు ♦ ముక్కువాఁడు,
పెద్దముక్కుఱముల ♦ భీకరుం డగువాఁడు,
క్షౌరోత్తమైనమీ ♦ సాలవాఁడు,
తెఱనోరుగలవాఁడు, ♦ దిగువక్రమముగ న
క్షయపాత్రవలె లావు ♦ గలుగువాఁడు,
బోరలించినబొచ్చెఁ ♦ బోలుకడుపువాఁడు,
మహితరుద్రాక్షల ♦ మాలవాఁడు,

ఆ. వె. కల్లనవ్వువాఁడు, బొల్లియేడ్పులవాఁడు,
పడుచువాఁడు, పొట్టివాఁడు, నట్టి
చిట్టుమనెడువాఁడు, జీడిమామిడిపండు
రంగువాఁడు, కటికదొంగవాఁడు.

అయ్యో! అనుకొంటి (ద్విజిహ్వుఁడు ప్రవేశించును.) మా! నమస్కారము.

ద్వి—(వక్రముగ నవ్వుచు) నే నెఱుఁగుదు నండి! నే నెఱుఁగుదు నండి! మీ రూరక వంకదండములఁ బెట్టుటయే కాని, యంతకంటె మ తేమియు లేదండి! మహారాజబంధువులు; మీరు మా మొగ మువంకఁ జూచెదరండి!

మ—నేను మహారాజబంధువుఁడ నైన, మీరు మహారాజవయస్యులు. బంధువుకంటె వయస్యుఁ డెక్కుడు కాదా?

ద్వి—ఎందుచేతనో?

మ—బంధుసంబంధము. దేహసంబంధము, మిత్రసంబంధము, మనస్సంబంధము.

ద్వి—మహాపాదరా! పైనున్నదేహముకంటె లోపల నుండుమన స్సెక్కువ దని మీయభిప్రాయమా? గుడికంటె లింగము పెద్దదై యుండునా?

మ—(తనలో) అసాధారణమై, యపరిమిత మైననాకడుపు నీపొట్టిపురోహితపునిర్భాగ్యుఁ డధిక్షేపించుచున్నాఁడు. (ప్రకాశముగ) ఏ సంబంధ మెక్కువయో మీవంటిబుద్ధిమంతులకు నేను జెప్పవలయునా? రావణుఁడు కేవలసోదరుఁ డైనవిభీషణునియందు బద్ధమత్సరుఁ డై యున్నాఁడు. జానకీనాథుఁడు పండుక్రోఁతి యగు సుగ్రీవునిఁ బ్రాణపదముగఁ జూచుకొనుచున్నాఁడు.



ద్వా—లక్ష్మణునికంటెనా? కాని, పండుక్రోఁతివలె నుంటి నని యధిక్షే పి. చుంటివా? ఇదేనా మీమర్యాద?

మ—క్రోఁతిమాట తలపెట్టనే కూడదా? అందువలన మి మ్మొట్లు నిం దించితిని. (తనలో)

గీ. కాలుకలుపుగ నెల్లరా ♦ కసులు గ్రాల
వీఁ డొకఁడు మర్కటమువలె ♦ పింగళచ్ఛ
విగలవాఁడు; వీనిని నమ్మఁ ♦ దగ దెవండు;
చర్మకారులఁ బచ్చని ♦ జనునిఁ బోలె.

(తెరలో) శ్రీమద్దేవాంతక నరాంతకసార్వభౌమ! బ్రహ్మప్రపౌ త్ర! అకుంఠితశౌర్యాడంబరవిచలితత్రిలోక! రామగృహిణీవిని క్షిప్తచిత్తోత్కంఠ! దశకంఠ! జయ!

(తిరిగి తెరలో) హా—హా—హా—హా—సాధు! మాగధా! సాధు! ఏదీ? మఱియొకమాఱు! రామగృహిణీ—.

(తిరిగి తెరలో) రామగృహిణీవినిక్షిప్తచిత్తోత్కంఠ! దశకంఠ! జయ! జయ! జయ!

మ—మనమహారాజుగారు దయచేయుచున్నారు.

(రావణుఁడు ప్రవేశించును.)

మ&ద్వా—మహారాజవంచానవా! నమస్కారము.

రావ—ఈదినమునఁ జేయఁదగినమంత్రాలోచనమున కేర్పరుపఁబడినవే ళ యింకఁ గాకుండనే ముం దిచ్చట కేమియుఁ దోఁచకుంటచే వచ్చితిని. మిత్రులగుమీవినోదములచే బరువగుకాలమును ద్రో యఁ దలఁచితిని. ఏఁడీ! మనదీర్ఘకాయుఁడు నావెంటనే బయలు వెడలియు నింక రాకున్నాఁ డేమి?

మ—అదుగో! నామిత్రుఁడు వచ్చుచున్నాఁడు.

ద్వా—(తనలో) దుర్మార్గుఁ డగునీదీర్ఘకాయుఁడు రాజేంద్రు నంటఁగ్రాగి తదనుగ్రహపాత్రుఁ డగుచున్నాఁడు. అందుచే వీఁడు నాకు విరోధి. ఏదో యొకవంకఁ గల్పించి వీనిని రాజాగ్రహపాత్రుని జేసి నాపీడఁ దొలఁగించుకొనవలయును. నేనుదప్ప రాజకృపాధీనుఁడు మఱెవ్వ రుండఁగూడదు.

గీ. రాజకరుణయుఁ, గాంతాను ♦ రాగలీల,
సరసకవితాప్రశస్తియ ♦ శస్సమృద్ధి,
యనెడు మూఁడగువస్తువు ♦ లవనియందు
బంచుకొనఁగూడనట్టివై ♦ ప్రబలుచుండు.

రావ—దీర్ఘకాయుఁడు వచ్చుచున్నాఁ డంటిరే? ఏఁడీ?

ద్వా—మహాప్రభూ! నే నంటిని గాదా? దీర్ఘకాయుఁ డేల?

రావ—ఒకని కొకఁడు సహాయు డై నలుగురుఁ జేర వినోద మధికము గ నుండదా?

ద్వా—మహాప్రభూ! నూఱుకాళ్లరోఁకటిబండ రెండుకాళ్లసారసపక్షికంటె నెక్కువవేగముగఁ బరుగెత్తఁ గలదా? (తనలో) పదితలకాయ లుండినంతనే బుద్ధివిభవ మధిక మగునా? (ప్రకాశముగ) అదుగో!

గీ. పొడుగుకాళ్లును, దొమ్మరి ♦ గుడిసెవంటి
ముక్కు, దోనెకడుపుఁ, గల్గి ♦ భుజము నిట్టె
యెగరవైచుకొనుచు బిట్టు ♦ బిగిసి నక్క
వినయముల దొంగచూపులఁ ♦ గనుచు వచ్చు.

(దీర్ఘకాయుఁడు ప్రవేశించును.)

ద్వా—దీర్ఘకాయా! నమస్కారము! (కౌఁగిలించుకొనుచు) నాకును, మహారాజునకును బహిఃప్రాణమ వీవే.

దీ—సందేహ మేమి? మీయంతరంగవైఖరి నే నెఱుఁగనిదా?

మ—ప్రాణమిత్రుఁడా! నమస్కారము.

దీ—ఇవే యనేకసమస్కారములు.

రావ—దీర్ఘకాయా! ఇంతయాలస్య మేల చేసితివి?

దీ—మహాప్రభూ! దారిలో నెవ్వరో వైద్యప్రశంసఁ జేయుచుండఁ గొంచెము నిలిచితిని.

ద్వా—(తనలో) ఇంక వైద్యప్రశంస యేల? ఈమహాదరునిపుణ్యమున నాబాధ లోకమునకు వదలినది కాదా?

గీ. పాత్రము వదలి చేతికిఁ ♦ బత్ర మయ్యె;
ఖల్వము వదలి చేతికిఁ ♦ గలము వచ్చె
పుట మెగిరిపోయి వర్ణసం ♦ పుటము గల్గె;
వైద్యకళ జాతి లౌకిక ♦ విద్య యబ్బె.

(ప్రకాశముగ) అయ్యా! ఇప్పుడు వైద్యప్రశంస యేమి?

దీ—దుర్ముఖునికిఁ బథ్య మిచ్చుటనుగూర్చి.

ద్వా—ఆతఁ డేమి లంఘనములఁ జేయుచున్నాఁడా?

దీ—నిన్ననే మూఁడులంఘనములఁ గట్టించితిని.

ద్వా—ఒకదినమున మూఁడులంఘనములెట్లు?

దీ—నిన్న దినత్రయము వచ్చినది కాదా?

రావ—దీర్ఘకాయా! నీ కౌషధీవిద్య బాగుగఁ దెలియునా?

దీ—చిత్తము. (చేతులనులుముకొనుచు నసుఁగును.)

మ—ఒక్క వైద్యవిద్యలోనే కాదు. అఱువదినాలుగువిద్యలలో నింతవాఁడు లేఁడు.

ద్వా—(తనలో) ఈదొంగముండకొడుకు వీనిని సర్వజ్ఞుఁ డని బూటకపుఁ లు వచించియే యీయనురాధ్యక్షునియనుగ్రహమునకు భాజనముగఁ జేసినాఁడు. (ప్రకాశముగ) మహాప్రభూ! మహాదరుఁ డీమహానుభావునిఁగూర్చి ప్రశంసించినది యథార్థమే.

గీ. పూర్వమున వేదములు శ్వాన ♦ మూర్తు లగుచు
నతులభక్తి దత్తాత్రేయు ♦ నాశ్రయించె;
నఖిలవిద్యలు గాడిద ♦ లగుచు నిపుడు
వదల కీదీర్ఘకాయుని ♦ పజ్జ జేరె.

దీ—సెబాస్! అట్టినావిద్యామూర్తులలో నీ వొక్కఁడవు సుమా!

ద్వి—నేను గాడిద నని యధిక్షేపించు చున్నాఁడు. గాడిదకుఁ దన్నుట స్వభావము గావున మహాప్రభూ! సెల వైనయెడల నీతనిఁ దన్నెదను.

మ—(అపవారించి) మహాప్రభూ! మీరు గాడిదలకుఁ బ్రభుఁడని యీనీచుఁడు సంబోధించుచున్నాఁడు. ఆనజ్ఞ యగునెడల నతిహేయకంఠుఁ డగునీగాడిదను జావ మోదెదను.

రావ—హా—హా—

గీ. ఖరకిరణసముజ్జ్వలదాశు ♦ గ్రపకాండుఁ
డైనఖరు నట్టె పరిమార్చె; ♦ నబ్ధిసప్త
కమున నన్ముంచువాలినిఁ ♦ దుమురు సేసెఁ
గార్ముకగుణారవంబైనఁ ♦ గలుగ కుండ.

గీ. అతనిదాసానుదాసుఁడై ♦ నట్టికపి యొ
కండు వచ్చి సీతను గాంచి ♦ కన్నసుతుని
లంకతోఁ గాల్చి మూఁడుపా ♦ ళ్లొనుకపాలు
బలము వధియించి గర్వోలు ♦ పఱచి పోయె.

హా—హా—హా—హా—అట్టిరాముఁ డిప్పు డెక్కడ నున్నాఁడో? ఏమిప్రయత్నమున నున్నాఁడో? ఎప్పు డిక్కడకు వచ్చునో? యేమియుఁదెలియదయ్యెను: పంపఁబడినచారుఁడింకరాలేదు.

శు—చారుఁ డక్కఱలేదు. రామవృత్తాంతమును మూఁడునిమేషములలోఁ గనిపెట్టి నేను జెప్పఁగలను.

రావ——ఎట్లు?

ద్వి——మహాతపశ్శాలి! దివ్యదృష్టిచేత——

మ——(అపవారించి) మిత్రమా! ఇదే సమయము. నీవు నన్నుఁగూర్చి కొంతస్తోత్రపాఠ మొనర్పుము.

దీ——ద్విజిహ్వా!

గీ. కడుపు చీల్చిన నొక్కయ ♦ క్కఱపుముక్క
లేనిశుంఠ వౌనె కీమ ♦ హానుభావుఁ
డనధిగతవిద్యుఁడై తోఁచుఁ ♦ డా? విశీర్ణ
నేత్రమున కన్ని నలుపుగా ♦ నెగడుఁ గాదె?.

మహాప్రభూ! దివ్యదృష్టిచే మహాహ్లాదరుఁడు రామచారిత్రము గనిపెట్టఁ గలఁ డని యీతఁడు హేళనముఁ జేసినాఁడు. దివ్య దృష్టితో సమానమైనశక్తిచేతనే యీతఁడు చూడఁగలఁడు.

రావ——అదేది?

దీ——హస్తాంజనము. అన్ని విధములైనయంజనము లీవిద్వాంసుఁ డెఱుగును.

ద్వి——(అప) మహాప్రభూ! నేత్రాంజన మని, ధనాంజన మని రెండు ఈమహాపండితుఁ డనేకులకన్నుఁ గట్టి సొమ్ము కాటుక వేసినాఁడు. మొదటిది నేత్రాంజనము, రెండవది తదంతర్లాపియే ధనాంజనము. నీకుఁగూడ నీకాటుకఁ దగిల్చి నిన్నుఁ బాడు సేయుదురు. జాగ్రత్త!

రావ——ఏమియుఁ దొందర లేదు. (ప్రకాశముగ) మహాహ్లాదరా! నీయంజనవైచిత్రిఁ గానిపింపుము.

మ——(అంజనము చేతికి రాచికొని తదేకదృష్టిగఁ జూచుచు) (అప) దీర్ఘకాయా! మాటఁ దక్కించవలయును సుమా! నాకు రాఘవవార్త లేవియుఁ దెలియ లేదు.

దీ—(అప) నే నెఱుఁగుదును గాదా? నేను జెప్పినదానికి నీవు 'ఊఁ' యనుచుండుము.

మ—(అప) అలాగే.

దీ—మహోదారా! ఇంకఁ దెగలేదు కదా!

రావ—తెగున దేది?

ద్వా—(తనలో) గొంతుక.

దీ—మహాప్రభూ! తెగుట యనఁగా నంజనమున స్వస్వరూపదర్శన మగుట.

రావ—అలాగా? అటులైన నెప్పుడు తెగును?

దీ—శీఘ్రముగనే.

ద్వా—(తనలో) ఆ! శీఘ్రముగనే. రాముఁడు వచ్చినతరువాత నందఱు కుత్తుక లొక్కసారి తెగును.

మ—ఇప్పుడు విడినది.

ద్వా—(తనలో) ఆయుర్గ్రంధి—

దీ—దీపములచాలు గనఁబడుచున్నదా?

మ—మొదట నొక్కదీపము గానఁబడి యదే యనేకదీపములుగ విరియఁ బాఱినది.

ద్వా—(తనలో)

గీ. కరచరణశీతలతకంటె ♦ కటుతరోర్ధ్వ
గశ్వసనమునకంటె నె ♦ క్కుటగువస్తు
వెన్నె వస్తువులుగఁ గాని ♦ పించు టధిక
సన్నిహితమృత్యునిశ్చయ ♦ సంజ్ఞ గాదె?

రావ—మహోదారా! ఇప్పు డేమి కానఁబడుచున్నది?

ద్వా—మహారాజా! మీ రడిగిన విడ నేరదు.

మ—(అప) దీర్ఘకాయా! ఏదియో యొకటి ప్రేలవలయును గాదా? చెప్పుము.

దీ—(అప) చెప్పక తప్పునా?

గీ. కట్టుమంత్రము లని వశ్య ♦ కఘుటిక లని
యంజనము లని సంస్తంభ ♦ నౌషధు లని
క్షుద్రధర్ములకుత్తుకలు మెల్లఁ ♦ గత్తిరింప
నిత్యకర్మ మనకు వారి ♦ నెత్తి వ్రాఁత.

(ప్రకాశముగ) బాగుగఁ జూడుము. ఆంజనేయుఁడు గ
చున్నాఁడా?

మ—ఆఁ.

ద్వా—అత్యంతభైరవకర్ముఁ డగునాంజనేయుఁడు నిన్నటినుండి య
వృద్ధపర్యంత మందఱి కన్నియవస్థలలో నతిరౌద్రమూర్తి
నఁబడుచునే యున్నాఁడు. ఆసంగతి యడుగ నక్కఱ
చెప్ప నంతకంటె నక్కఱ లేదు.

రావ—(తనలో) ఆస్థానమున నాకస్మికముగ వానరు నే నెప్పుడ
చెదనో మరణ మప్పు డాసన్న మైనట్లు గ్రహించుకొను
బ్రహ్మ నాతో నొకపుడు చెప్పినాఁడు. హా! ఆయవశిష్ట
ఱనది గదా!

దీ—శ్రీరాముఁ డాయంజనాసుతుని యెదుటఁ గూర్చుండెను

మ—ఆ! సింహాసనముపై—

ద్వా—హే—హే—హే—నాకుఁ దెలియక యడుగు చుంటిని
హేబాదరుఁడా! సింహాసనముపైఁ గూరుచుండుటకు వా
గా రనుకొను చున్నావా? వానరప్రస్థునకు సింహాసన
దయ్యా?

దీ—మహారాజా!

గీ. వక్రగుణి దర్పణమున లో ♦ పలను గలుగు
నాకృతి సరిగ రానేర ♦ దంజనమున;

గ్రస్తబింబంబు గర్భిణి ♦ గాంచునంత
నాంతరార్భకుఁడు వికృతుఁ ♦ డైనయట్లు.

మ—(అప) సింహాసన మని పొల్లుమాటఁ జెప్పితిని. ఇప్పు డెట్లు సవ
రించుకొనవలె?

దీ—(అప) ఋశ్యమూకపర్వతాంతికోద్యానమున వాలిసింహాసన మని
న బాధ యేమున్నది?

మ—(అప) వాలిఁ జంపి సుగ్రీవున కాసింహాసనమునఁ బట్టాభిషేక మొ
నరించిన శ్రీరాముఁ డాయాసన మెట్లధిష్ఠించును?

దీ—(అప) నీవూరకుండుము. చల్లఁగఁ బైవృత్తాంతమునకుఁ బోవుద
ము. (ప్రకాశముగ) శ్రీరాముఁ డాకపివరునిఁ గౌఁగిలించుకొ
నుచున్నాఁడా?

మ—(అప) ఆ, యనవచ్చునా?

దీ—(అప) నీ కేమియు భయము లేదు. అనుము.

మ—(అప) ఈద్విజిహ్వుఁ డసాధ్యుఁడుండకొండుకు. ఎక్కడ తప్పుఁబ
ట్టునో యని జడియు చుంటిని. (ప్రకాశముగ) ఆ. రాముఁడు
పావనిని గౌఁగిలించుకొను చున్నాఁడు.

రావ—ఎందులకో?

ద్వి—మనకొంపలను గాల్చినందులకు.

దీ—(అప) ఊరకుండు వేమి? సీతాదర్శనముఁ జేసి వచ్చినందుల కని చె
ప్పుము.

మ—(అప) నీవు చెప్పు మనకుండ నే నెట్లు చెప్పుదును?

దీ—(అప) నీ వనేకసంసారముల మాపినవాఁడవు. ఎఱుఁగవా? సంద
ర్భోచిత మైనమాట యైనఁ జెప్పవచ్చును.

మ—సీతాదర్శనముఁ జేసి వచ్చినందులకు—

రావ—(తనలో) హా. సీతా!

గీ. ఉన్న కొడుకు లూడిన సరే, ♦ యుర్వి రక్త
మయ మయిన సరే, యొకమాఱు ♦ మధ్యమముఖ
మునను నిన్నుద్దుగొందును ♦ బొటకరించి
మిగులు పెదవు లుఱ్ఱూటల ♦ మిడుకుచుండ.

మ—అసాధ్యము. అసాధ్యము.

రావ—(తనలో) హా! దురపశ్రుతి. (ప్రకాశముగ) అసాధ్య మేమి

మ—అసాధ్యముగ నున్నది. భయంకరముగ నున్నది. వందలు—వే లు—లక్షలు—కోటులు—వానరములు—గజసన్నిభములు; పర్వతసంకాశములు; వృక్షపాషాణహస్తభైరవములు; కొండ ముచ్చులు; ఎలుఁగుగొడ్లు; లులాయాభములు; అయ్యయ్యో! మనవైపునకు వచ్చుచున్నవి.

దీ—(అప) సెబాస్! బాగుగఁ బలికితివి.

రావ—(తనలో నవ్వుచు) రావణసంహారమునకై రామదండయాత్ర యారంభ మైనట్లున్నది.

(తెరలో) మహాప్రభూ! మరణము. మరణము.

రావ—ఆఁ. అదేమి? శుకా! చారాగ్రణీ! ఇటురా.

(శుకుఁడేడ్చుచుఁ బ్రవేశించును.)

శు—మహాప్రభూ! మరణము నొందినవాఁడనే మఱలవచ్చితిని.

రావ—ఏలాగున?

శు—దురదృష్టమున.

రావ—నిన్ను బాధించినవా రెవ్వరు?

శు—(వడఁకుచు) ఎవ్వ రని చెప్పఁగలను? ఎఱ్ఱమొగములవారు కొందఱు, నల్లమొగములవారు కొందఱు, గండ్రవెండ్రుకలవారు కొందఱు, తోఁకలవారు కొందఱు, కిచకిచలాడువారు కొందఱు, బొకురు బొకురుమనువారు కొందఱు, ఇగిలించువారు

కొందఱు, బుఱ్ఱుమనువారు కొందఱు, అడ్డునడకవారు కొంద ఱు, నిల్వనడకవారు కొందఱు, పొడుగుమాతులవారు కొంద ఱు, ముడిమాతులవారు కొందఱు, తిట్టి, కొట్టి, దక్కి, పీకి, తన్ని, చీల్చి, ముక్కలుగఁ గోసి, పొడుముక్రిందఁ జేసి—

రావ—(నవ్వుచు) ఆఁ! ఆఁ!

ధీ—వస్త్రఖాలితము చేసి, నీళ్ళలోఁ గలిపి పానముఁ జేసి—

ద్వా—వైద్యశిఖామణీ! ఔషధము లేనియనుపానసేవ సెలవిచ్చెద రేమి?

రావ—తరువాత?

శు—చంపి, కట్టఁ గట్టి, రాముఁడఁట—ఆయనయొద్దకుమోసికొనిపో యి యెదుటఁ బెట్టిరి.

ద్వా—బ్రదికి యుండునంతవఱకు జ్ఞానశూన్యుఁడ వయ్యును జచ్చినతరు వాతనైన జ్ఞానవంతుఁడ వైతివి.

శు—తరువాత నా మహానుభావుఁడు—ఆదయాళుఁడు—ఆయుదార హృదయుఁడు—ఆనవనీతకోమలుఁడు—ఆనీలమేఘశ్యామలవర్ణుఁ డు—ఆయసురఖండనపటిష్ఠుఁడు—

రావ—చీ! చీ! వాగకు. జాగ్రత్త!

శు—మహాప్రభూ! బ్రదికి యక్కడకు వెళ్ళినందుల కక్కడదెబ్బలు, చచ్చితిరిగి యిక్కడకు వచ్చినందుల కిక్కడదెబ్బలా? (ఏడ్చును)

రావ—భయపడక చెప్పుము.

శు—ఆతఁడు నన్ను సేదఁదేఱునట్లు చేసి, వానరభయము లేకుండఁ గాపాడి యిక్కడకుఁ బంపివేసినాఁడు.

రావ—పిఱికిపంద వైననిర్భాగ్యుఁడ విక్కడ చావనేల? అచ్చటనే చా వలేక పోయితివా?

శు—నేను నాలాగే యూహించితిని గాని శ్రీరాముఁడు సీతతో నొక్క మాటఁ జెప్పుమనుటచే వచ్చితిని.

రావ—కానీ. అదేదో యేఁడువుము.

శు—మహాప్రభూ! ఏడ్చుచునే యున్నాను. "నాలుగుతలలుగలతనవంశమునఁ బదితలలుగలనీ వుద్భవించి వేదాధ్యయనసంపన్నుఁడవైతి వని సంతసించినబ్రహ్మదేవునికిఁ బ్రపౌత్రమరణవార్త నామూలముగఁ దెలియవలసివచ్చె నని విచారించుచుంటిని,"

రావ—ఆఁ! ఏమి! రామమూర్తికి మాయెడల నింతయనుగ్రహము! నాకొఱకుఁ దాను విచారించుచున్నాఁ డేమి? ఆఁ! సర్వసిద్ధమైనతనసామ్రాజ్యపట్టాభిషేకము భంగమగుటకు విచారించుట లేదా? తండ్రియు,సవతితల్లియు, నేకీభవించి భార్యాసోదరులతో మెడఁ బట్టి దండకాటవికిఁ దన్ను గెంటినందులకు విచారించుట లేదా? యజ్ఞవేదిసంభవయు లోకానందమూర్తియగు జానకి నే నపహరించినందులకు విచారించుట లేదా? శాఖామృగములతోఁ బాటుతా నొక్కతోఁకలేనిమృగమై యడవుల నిర్భాగ్యుఁడై సంచరించుచుండుటకు విచారించుచుండుట లేదా? ఎన్ని జన్మము లలో లక్ష్మణా!, యని దివారాత్రము లేడ్చినను తఱుఁగని తలమునిఁగినచింతలు తనకుండ, హా—హా—నాకొఱకు చారించుచున్నాఁ డేమి? ఏమి దయ! ఏమి దాక్షిణ్యము! ఏమి యాత్మవిషయకనిర్లిప్తత! ఏమి పరకష్టవార్తాశ్రవణాసహిష్ణుత. స్వభార్యాపహర్తపై నింతయనురాగము గల మహోదారస్వభావు నీరాఘవునే చూచితిని! రాష్ట్రము పోయి, బంధుసన్నిధి పోయి, సౌఖ్యముపోయి, సహధర్మచారిణిపోయి, గౌరవము పోయి చచ్చిన ట్లేడ్చుచుండక మాకు బెదరింపులతో

రాయబారములా? ఆఁ! శుకా! ఏమనెను? ఏదీ? నాలుగుమొ
గముల బ్రహ్మవంశమున——

ద్వా—రెండు బ్రహ్మలన్నర వైననీ పుద్భవించితి వనెను.

(నేపథ్యమున) హా! హా! హా! ప్రమాదము సంభవించినది. ప్ర
భువువారు మనకంటె ముందుగ సభాశాలకు వచ్చినారు.

శు—మహాప్రభూ. ప్రహస్త కుంభకర్ణ విభీషణ మేఘనాదాదు లాస్థాన
మునకు వచ్చుచున్నారు.

రావ—సరే, రానిమ్ము.

(ప్రహస్తుఁడు, కుంభకర్ణుఁడు, విభీషణుఁడు, ఇంద్రజిత్తు ప్రవేశించు
చున్నారు.)

కుం—అగ్రజా! నమస్కారము.

విభీ—అసురాధ్యక్షా! విభీషణుఁడు నమస్కరించు చున్నాఁడు.

ద్వా—(తనలో) "అగ్రజా!", యనిపిలుచుటకు విభీషణుఁ డిష్టపడకు
న్నాఁడు.

ఇం—తండ్రీ! నమస్కారము.

ప్ర—మహాప్రభూ! సేనాధిపతి ప్రహస్తుఁడు సాష్టాంగపడుచున్నాఁడు.

రావ—మీ కందఱకు శుభ మగుఁగాక! ప్రహస్తా! రాఘవుఁడు శుకు
నిచే నా కేమనివార్త నంపెనో వింటివా?

ప్ర—మహాప్రభూ! అవహితుఁడనై యున్నాను.

రావ—గీ. స్వాశుగాగ్రమును మదస్ర ♦ మందుముంచి
తనయశఃపత్త్రమున నామ్ర ♦ తిని లిఖించి
బ్రహ్మ కాలేఖ మంపించి ♦ బాష్పములను
మైలస్నానముఁ జేయించు ♦ వాఁడఁటతని.

ప్ర—శివ, శివా!

ద్వా—(అపవారించి) వింటిరా! ప్రహస్తుఁడు "శివశివా", యనుచున్నాఁ

డు కర్ణకఠోర మగువిూమరణప్రశంస మీాతనికి మంగళప్రద మగును గాఁబోలు.

రావ—ప్రహస్తా! శివశివాయనెదవేమి? ఒక్కక్రోఁతి రామదూతయై వచ్చి యెంతపని చేసినదో చూచితివి కాదా? అట్టివానరకోటులకధిపతియగుసుగ్రీవుఁడు రాముని కతివిధేయుఁడయి మదానుఁడై రామకార్యపరిత్యక్తజీవుఁడై సాహాయ్యము చేయుచుండ రాముని యమోఘసాయకములు దశకంఠునికంఠములతోఁ గందుకక్రీడలు సలుపవా?

ప్రహ—హరహరా! (చెవులు మూసికొనును.)

ద్వి—(అప) మహాప్రభూ! హరహరా, యనుచున్నాఁడు. మిమ్ములను రాముఁడు హరించుటయే తన కభిమత మని ప్రహస్తుఁడు వెల్లడించుచున్నాఁడు.

ప్ర—మహాసురశిఖామణీ! ఎన్నఁడు లేనియీ బేలతన మిపుడేల?

దీ—(అప. మహోదరునితో)

గీ. అమితధైర్యాచలీకృతుఁ ♦ డైనవీరు
నకుఁ బిఱికితన మేకార ♦ ణమున నైన
యుదయ మందిన నదివాని ♦ మొదలు చెఱచు
నధికభోజనప్రియుని మం ♦ దాగ్ని యట్లు.

మ—(అప—దీర్ఘకాయునితో)

గీ. రామచంద్రుఁడు ప్లవగవీ ♦ రప్రకాండు
చేత మంత్రప్రయోగంబుఁ ♦ జేసియుండు
నచలములనైన నభిచార ♦ మదరఁజేయు
యోగివరుఁ గంతుబాణప్ర ♦ యోగమట్లు.

ద్వి—(అప) మహారాజా! ఎన్నఁడు లేని బేలతన మిపుడేల?, యని మిమ్ము ప్రహస్తుఁడు పరిహాసించుచున్నాఁడు.

రావ — సేనాపతీ! నేను ధైర్యవిహీనుఁడ నైతి నని నీ వెత్తిపొడుచు చుం టివా?

ప్ర — మహాప్రభూ! (మోఁకరించి) నే నెఱుఁగనా? నే నెఱుఁగనా? —

ద్వి — (అప) ఆసంగతినే మఱింత స్థిరపఱచు చున్నాఁడు.

(అప, ప్రహస్తునితో) యోధాగ్రేసరా! అసురాధ్యక్షుఁ డెత్తువడినయేనుఁగువలె నున్నాఁడు. ఏవియో కొన్ని పోటుమాటలాడినగాని యీతఁడు ధైర్యసమన్వితుఁడై కుమురుఁ బడి యుద్ధమునకు లేవలేఁడు.

గీ. మిడుకుమనువత్తి నెగసనఁ ♦ బొడిచినట్లు
బండకత్తిని సానపైఁ ♦ బట్టినట్లు
లాఁగ నెదురుగ్రాఁచును దోఁక ♦ లాగినట్లు
కుట్టుబునుల సీతని రేఁగఁ ♦ గొట్టుమయ్య!

ప్ర — (అప—ద్విజిహ్వునితో) ఓరీ! మాయావీ! నీవు నాకొంప తీయ కుమా!

ద్వి — (అప, ప్రహస్తునితో) అది నీవు శ్రీరామునిఁ గోరుకొనఁదగిన మాట.

ప్ర — మహాసురశిఖామణీ! నే నెఱుఁగనా?

సీ. యక్షకోట్యావృత ♦ హారమిత్రమానము
నతనివిమానము ♦ నపహరించి
తూపుఁగోడను, వాలు ♦ చూపుఁగోడను, మఱియు
నధికశక్తిని గూఁతు ♦ నపహరించి
బహుదుగాసదు మధుఁ ♦ బట్టి నీకాళ్లఁ దోఁ
బుట్టువుకాళ్లను ♦ బట్టఁజేసి
వజ్రపాణిని బట్టి ♦ పడఁగొట్టి యస్త్రంబు
గాత్రనేత్రములందుఁ ♦ గారఁజేసి

గీ. మృత్యువన కమోఘమృత్యువై ♦ మెలసి జగము
లట్టుడికినట్లు చేసిన ♦ దిట్ట వీవు
ప్లవగమాత్రున కింతగా ♦ వగవఁ దగునె?
నన్నుఁ బంపించి కాంచుమీ ♦ నాదుప్రజ్ఞ.

రావ—ఇప్పుడు వేఱే కాంచవలయునా?

ప్ర—మహాసురేశ్వరా? సామాన్య మగుక్రోఁతి యనుకొనినిర్లక్ష్యము
నఁ బ్రమత్తులమై యుంటిమి. లేనియెడ,

గీ. కరమునను దోఁకఁ గొని గిర ♦ గిరను ద్రిప్పి
యోజనశతాయతాంబుని ♦ ధ్యుత్తరాశఁ
బడెదునట్లు మీాటకయుండు ♦ వాఁడనే! భ
వత్కరుణ యిట్లు నాపైనిఁ ♦ బ్రబలియుండ.

విభీ—ఏమిమాటలు. ప్రహస్తా! ఆంజనేయుని సామాన్యకపి యనియెం
నుకొంటివి?

సీ. లీల మున్నీటి నా ♦ మూలాగ్రముగ దాఁటు
మహితసత్త్వుండు సా ♦ మాన్యుఁ డేమి?
ఖరదంష్ట్రిభయదలం ♦ కానామదానవి
మడియించినబలి సా ♦ మాన్యుఁ డేమి?
ప్రబలారిదళనభీ ♦ భత్సరూపాక్షుకు
మారఘుస్మరుఁడు సా ♦ మాన్యుఁ డేమి
హర్మ్యగోపురవనీ ♦ ప్రాంచితం బగులంక
మాడ్చురౌద్రుండు సా ♦ మాన్యుఁ డే

గీ. శాంభవీయుక్తశంభుప్ర ♦ శస్తరజత
పర్వతాకంపనోద్దామ ♦ పటుబలాఢ్య
తామహాశోభి నింతటి ♦ దైన్యవృత్తి
మఱుగఁ జేసినవాఁడు సా ♦ మాన్యుఁ డేమి?

ద్వి—(అప) ప్రహస్తా! విభీషణుఁ డెట్టిమాట లాడెనో వింటివా? బుద్ధి వచ్చున ట్లుత్తర మిమ్ము. నీకు బుద్ధిహీనత, మహారాజునకు శౌర్యహీనత, నారోపించుచున్నాఁడు.

(తనలో)

ఆ. వె. మగఁ డభిముఖుఁ డైనఁ ♦ దగనికొంకును, బరా
ఙ్ముఖత నున్న ధైర్య ♦ ముఖరవృత్తి,
వెలయువింతవారు ♦ వీరులందును నారు
లందుఁ గూడ నుందు ♦ రవనియందు.

ప్ర—మహారాజా! విభీషణుఁడు స్వబలనిందాపరబలశ్లాఘాపరాయణుఁడై ప్రకాశించుచు నేను బుద్ధిహీనుఁడ నని నిందించుచున్నాఁడు. నా కీయవమానము తొలఁగునట్లు నన్నుఁ గపిసేనానాశనమునకై పంపి కటాక్షింపుఁడు.

ద్వి—(అప) విభీషణా! అవమానము తొలఁగునట్లు కాదు; ప్రాణము తొలఁగున ట్లని ప్రహస్తుఁడు వచించిన బాగుగ నుండును జుమా!

రావ—అనుజా! విభీషణా! నాకు దైన్యవృత్తిని గూడ నారోపించు చుంటివి!

విభీ—మహాప్రభూ! ఇప్పటికి సంభవించిన దింక దైన్యవృత్తియే కాదు.

రావ—ఆఁ! ఆఁ! నా కింతకంటె దీనత సంభవించు ననుచుంటివా?

ద్వి—(అప) దుష్టుఁ డెంతమా టాడిన నాడినవాఁడే! (అప) విభీషణా! బాగుగఁ జెప్పితివి.

విభీ—ఇంతకంటె మహాదైన్యము సంభవింప నున్నది. కావుననే నేనింత పట్టుదలగ నెన్ని దినములనుండియో చెప్పుచున్నాను. మహాప్రభూ! క్షమియింపుము.

రావ—కుంభకర్ణా! విభీషణుఁడు శత్రువవలె మొదటినుండియు మరణ సూచక వార్తలనే వెల్లడించుచున్నాఁడు. నీయభిప్రాయ మేమి?

కుం—ఏమియు లేదు.

రావ—ఆఁ! లేకపోవుట యేల?

కుం—ఇప్పుడు చెప్పఁదగిన దేమున్నది?

రావ—ఇప్పుడే చెప్పఁదగినది కాదా? ఇంతకంటె నావశ్యకమైనయవస రమేమి?

కుం—ఈయవసర మనుభవమునకుఁ గాని యభిప్రాయమునకుఁ గాదు.

రావ—ఇప్పుడు చేయఁదగినకార్యమునుగూర్చి నీయభిప్రాయ మడుగ నట్లు చెప్పెద వేమి?

కుం—మహారాజా! సర్వముఖ్యకార్యముల మంత్రాలోచనపూర్వకము గఁ జేయవలయును. స్వేచ్ఛానుసారముగ నిరంకుశముగ నొనర్చిన కార్యములకుఁ గష్టపర్యవసానము తటస్థపడినపుడు మాత్రమే మంత్రాలోచనముచే యవలయు నని పెద్దలయభిప్రాయము కాదు.

రావ—నేను యథేష్టముగఁ జేసినకార్యమేమి? అందువలన నా కిప్పుడు గల్గినప్రమాద మేమి?

కుం—నన్నడుగ నేల? ఇష్టానుసార మొనర్చినకార్య మేదియో మీా రే యెఱుఁగుదురు.

విభీ—రాఁదలఁచినప్రమాద మేదియో యెఱుఁగఁదలఁచి యున్నారు

ద్వి—(అప—రావణునితో)సీతాపహరణ మని మందబుద్ధి యగుకుం కర్ణుఁడు సూచించుచున్నాఁడు. (అప. కుంభకర్ణునితో) కుం కర్ణా! మూర్ఖునియెడల నీ కీమార్దవ మేమి? జానకీహరణమహా పాపఫలము పుత్త్రమిత్రకళత్రాదులతో నిన్ను నశింపఁజేయు ని స్పష్టముగఁ జెప్పుము.

మహా—(అప. దీర్ఘకాయునితో) సీతాపహరణవిషయమైన మం త్రాలోచనము జరుగలే దని కుంభకర్ణుఁ డెత్తిపొడుచుచు

న్నాఁడు కదా! రాజకార్యవిషయమై మంత్రము కాని కాంతా కార్యమునుగూర్చి మంత్ర మేల?

దీ—(అప) కాంతాకార్యముఁ గూర్చి మాత్రము మంత్ర మక్కఱ లేదా?

మహో—(అప) ఏమంత్రము?

దీ—(అప) మదనమంత్రము.

ఇంద్ర—తాతానుజా! ఏదియో మహాప్రమాదము రానున్న దని యనురాధ్యక్షుని ముం దూరక యింత సేపటినుండి నైరిక థాస్త్రోత్ర పాత్రప్రవీణుఁడ వగుచున్నావు. ఏదీ? ఆయాపద యేదియో శీఘ్రముగ నించుక నవిఁయింపుము. వింటిని.

విభీ—వినఁ దలఁచితివి; కనఁ దలఁచితివి; అనుభవింపఁ దలఁచితివి.

ద్వా—(అప. విభీషణునితో) సెబాస్! "అనుభవింపఁ దలఁచితివి" యనియాతని యొక్కవిషయమే చెప్ప నేల? సర్వబాంధుపరివారసమేతముగా నని కూడఁ జెప్పఁ దగును. (అప. రావణునితో) మహాప్రభూ! భవదనుజుఁడు విభీషణుపలుకులు నా చెవులు చిల్లులువడఁ జేయుచున్నవి. ఆయుష్మంతుఁ డైనభర్తృదారకునంతము నెట్లు సూచించుచున్నాఁడో!

ఇం—(విభీషణునితో) మీమాటలకు బెదరునట్టివాఁ డెవ్వఁ డిక్కడ లేఁడు.

విభీ—నామాటలకు భయపడ నక్కఱ లేదు. రాముని చేష్టలకు—

ఇం—రాముఁడు! గీముఁడు! అబ్బ! ఎంతటివానిని బట్టినలెఁ గైవారముఁ జేయుచున్నారు! ఎట్టియధముని మహాపరాక్రమవంతుఁ డని స్తోత్రపాఠము లెన్నిదినములనుండి చేయుచున్నారు. విన లేక, విన లేక చెవులు చిల్లులువడఁగ, మనసు పుండుగాఁగ, నఱకాలిమంట బ్రహ్మరంధ్రమున కెక్క, పెద్దతనమును సహించి, నోరు మూసికొని, యసురాధ్యక్షునిమోముఁజూచి యుద్రేక మడఁచు

కొని మీరామస్తోత్రకథాపారాయణములను విధిలేక వినుచుంటిని. ఇఁక నేను సహింపను. మీరు రామునిపై రెత్తవలదు. తండ్రీ! మీకు సందేహ మక్కఱ లేదు. నరాధములు, వానస్థులు, మృగప్రాయులు, బలహీనులు,నిష్కవచులు, బుద్ధిహీనులు, బంధువిశ్లేషపరిదగ్ధభావు లైనరామలక్ష్మణులను రూపుమాపుట యెంతపని. మనవంశమునఁ బుట్టినయధమాధముఁడైన,వారి నిట్టె పరిమార్పఁ గలఁడు. తండ్రీ! మీ రేమియు సంశయింప వలదు.

ద్వి—(అప. ఇంద్రజిత్తుతో) సెబాస్! మేఘనాదా! పితృద్రోహి యని యెంచక చెప్పనఁ గొట్టితివి. రణశూరుఁడవు; నిరంకుశపరాక్రముఁడవు. (అప—విభీషణునితో) నిర్భాగ్యుఁడు! అల్పాయుష్మంతుఁడు! చావుశౌర్యము ప్రేరేపఁ గాఱు లఱచుచున్నాఁడు.

రావ—(నవ్వి) నాయనా! నాకు సందేహ మేమి? మీయందఱిబుద్ధు లెట్లుండునో యని దైన్యమును కొంతనటించితిని.

ప్ర—కదనప్రవేశమునకు నేను సర్వసిద్ధముగ నున్నాను.

ద్వి—(తనలో) కాదు. యమసదనప్రవేశమునకు—

ఇం—తండ్రీ! శౌర్యోత్సిక్తము లగునూహృదయము లెన్నఁడు పరవిముఖములై యుండవు. నిశ్చయము. సురలను దిక్కులవెంబడి నంబరములు జాఱఁ బరుగెత్తించినమనయసురవరులకు నరు లెంత? భల్లుకములు చీమలపుట్టలను జిదిమివేయునట్లు పరిహరింపరా? అందుపై నిద్ద ఱొకగణనమా! ఉష్షూ, మని యూదునంతకి హిమాలయప్రాంతముల కారాఘవుల నెగరఁ గొట్టలేక పోవుదుమా? కాని, సమరశౌర్యరసాలంకారపరిశోభిత మగుమనమహావంశమున మహానుభావు లైనమాపితృద్రిగా రొక్కరు—

విభీ—ఛీ! బాలకా! ఛీ! మూఢా! నీ కేమి తెలియును? నిన్నఁ గాక మొన్నఁ గన్నుఁ దెఱచినవాఁడవు. నీవు గురుజనము నధిక్షేపింతువా? రఘువీరులఁ జంపుట నీతర మగునా? నిన్నుఁ గన్నయా తనితర మగునా? ఆతనితాత యైన బ్రహ్మతర మగునా? ఊరక కాఱు లేల ప్రేలెదవు? నాకుఁ బిఱికితనము నాపాదించుచుంటివా?

రావ—నాయనా! నీ వుంచుము. విభీషణా! పిఱికితనము గానియెడల దీని కింకఁ బే రేమి?

విభీ—న్యాయబుద్ధి.

ఇం—(నవ్వి) న్యాయబుద్ధియా! రాక్షసకులమందు న్యాయబుద్ధి నీనాఁడు వినఁబడినది. న్యాయబుద్ధియా? దానవకులమున న్యాయబుద్ధి యెక్కడిది? మనకు నిర్దాక్షిణ్యమే న్యాయము. కాఠిన్యమే న్యాయము. కర్కశపరాక్రమమే న్యాయము. న్యాయహీనతయే న్యాయము. నరహత్యయే న్యాయము. దేవాంతకత్వమే న్యాయము. పరధనదారాకర్షణమే న్యాయము. అసత్యమే న్యాయము. విశ్వాసఘాతనమే న్యాయము. మన మేమి నిర్భాగ్యులయిన నరులమా? పిఱికిపంద లైనదేవతలమా? ముక్కులు మూసికొని సమాధులఁ గూరుచుండినయోగులమా? హా—హా—హా. పిఱికితనము కాదఁట! న్యాయ మఁట! స్వకులాచారక్రమానుసరణమే న్యాయము. పరాస్వయాచారావలంబన మన్యాయము. అయ్యో! మీరు న్యాయ మని సంతోషించునదిమనకు బుద్ధికాదు.

రావ—పుత్త్రా! నిన్ను మాటలాడవలదని చెప్పితిని కాదా?

ద్వి—(తనలో) తండ్రిని లక్ష్యపెట్టనిమూర్ఖుఁడు పినతండ్రిని గౌరవించునా? (అప—ఇంద్రజిత్తుతో) ఆహాహా! శ్రవణామృతములు! మన స్సుధాపూరములు! ఆహా! ఎట్టియాసురధర్మనిర్ణయోపన్యాస

మును జేసితివి! సెబాస్! కవిత్వ మున్న యెడల రాక్షసధర్మశా
స్త్రగ్రంథకర్తృత్వమునకు నీ వర్హుఁడవు.

(తనలో)—

ఆ. వె. నరులలోన క్షాత్ర • ధరులందు దయ లేదు;
సత్య మిల్ల వైశ్య • జాతిఁ దఱచు;
శూద్రునందు శుచిత • సున్న! యీమూఁడుఁగ
లిక మునకును దనుజ • లకును లేవు.

రావ—విభీషణా! నీది న్యాయబుద్ధియు, మాది యన్యాయబుద్ధియునా
ఎందుచేత?

విభీ—మహాప్రభూ! ఇప్పుడు మీ రీయుద్ధమున కింతసన్నాహ మే
చేయవలయును?

రావ—రాముఁడు కపిసేనతో మనపై దండయాత్ర కేల బయలుదే
వలయును?

విభీ—మహారాజా! రామకాంతను మీ రేల యపహరింపవలయు

రావ—అపహరించుట తప్పా?

విభీ—కాదా! ఆతనిభార్యను హరింప నాతఁ డూరకుండునా?

రావ—లజ్జలేనిమాట లాడెద వేల? మనముద్దులచెల్లెలిముక్కు సెవుల
రామానుజాధముఁడు గోయ మనము బానిసలమై పందల
రామదాసులమై యూరకుండవలసిన దని నీయభిప్రాయమా

ద్వీ—(తనలో) ముద్దుల చెల్లె లఁట! ముహూర్తమునాఁడు నఖ
ములతోఁ గాంతునిఁ గాఁజేసినకాలరూపిణి యైనచుప్పనాతి—

రావ—ఏమి? మాటలాడ వేమి? విఖండితనాసాపుటయైన చెల్లెలు వల
ల నేడ్చుచుండ నోరు మూసికొని యుండవలసినదా? అవమా
మును గడుపునిండ మ్రింగి మూలఁ గూరుచుండవలసినదా? —
రుషపరాక్రమములు మంటఁ గలిపికొని చచ్చినట్లుండవలసి—

డా? నీచులు, అధములు, యుక్తాయుక్తవిమర్శనారహితు లైన పాపులు సిగ్గులేక, యొడలు తెలియక, స్త్రీయని యెంచక, సర్వనరాంతక దేవాంతకుఁడ నైననే నుంటి నని కన్నుఁ గానక—నట్టిసభలో నొంటరిదైయుండ, సోదరినిఁ బట్టి పరిహసించి, పరిభవించి, చిత్రవధము సేయుటకుఁ బ్రయత్నింప—ఆఁ! ఆఁ! ఏమి? నపుంసకులమైయూరకుండవలసినదా? ఆఁ! మాటలాడ వేమి?

—(తనలో) విభీషణుఁ డిప్పు డేల మాట లాడును? చుప్పనాతిముక్కుచెవులు గోయఁబడుట న్యాయ మైనను న్యాయ మని విభీషణుఁడు వచియించునా? ఎవనియింటిలంకు వాఁడు వెల్లడిచేసికొనునా?

రావ—వెన్నుఁ దన్నుకొనివచ్చిన చెల్లెలిపై నీ కింతయభిమానమా? ఇంతదాక్షిణ్యమా? ఆమె కింత ముప్పు, ఇంత వికృతి, ఇంత దుఃఖము, ఇంత యవమానమును దెచ్చినశుంఠలు నీకు స్తోత్రపాత్రులా? సీతపై నున్న దాక్షిణ్యములో సహస్రాంశ మైన నీకు నీచెల్లెలిపైఁ గలదా?

—(తనలో) నీకుమాత్రమో? సీతాపహరణమున కిది యొక వంక యని లోక మెఱిఁగి యుండ నెంతబంధ్వభిమానపూర్ణుఁడై నట్లుగ శ్రీరంగనీతు లుపదేశించుచున్నాఁడో? ఆశ్చర్య మేమి? ద్విజిహ్వుఁడ నైననేనే యింతదొంగ నైనపుడు దశజిహ్వుఁ డెంత వాఁడో చెప్పవలయునా? (అప—విభీషణునితో) విభీషణా! గ్రంథము పెంచకూరకుందు వేమి?

రావ—సీతను దెచ్చితిమి. పుష్పవనమునఁ బుష్పముకంటె భద్రముగ నుంచితిమి. మే మామె నవమానించితిమా? అపహసించితిమా? బంధుకాంతాపరిభవసంజాతవేదన మనసునకు నాటి రామునకు బుద్ధిగలుగుటకై కాదా నే నిట్లు చేసితిని? అయినను నేనెంతసు

గుణసంపన్నుఁడనో చూడు! ఎంతమానినీమానపరిరక్షణాసక్తుఁడనో చూడు! నా కేమి చేతులు లేవా? కత్తులు లేవా? నాకు ముక్కుచెవులు లేవా? కోఁత లేదా? కోసిన సాఁగదా?

ద్వా—(తనలో) సాఁగదు. సాఁగదు. ఏదీ? వివాహప్రయత్నము. కన్నుముక్కుతీరు చూచి మోహపడి తెచ్చిన నవికోసివైచునా? లాభమునకై మానఁబడినపనిని సర్వసుగుణపుంజప్రేరితమైనదానిగా మార్చుచున్నాఁడు. అజీర్తిహారణమునకై చేసినలంఘనముపవాస మగునా?

రావ—విభీషణా! మాట లాడ వేల?

విభీ—నామాటలతో నేమి ప్రయోజనము? మీయిష్టానుసార మాచరింపుఁడు.

రావ—తుద కాచరించునది నాయిష్టానుసారమే. అందులకు సందేహమేమి? కాని, యింకను సీతను రాముని కర్పింపుమనియేనా యభిప్రాయము?

విభీ—నమస్కారపురస్సరముగ—

రావ—మాపరాక్రమసంపన్నమైనవంశమునఁ బౌరుషపుఁగార్జముగలసు వుద్భవించి నరాధమునకు నమస్కరించుచుంటివి చాలదా? నుగూడ నమస్కరింపవలయునా? మావంశమునకు నీకాతరతవలనఁ గలిగినయప్రతిష్ఠ చాలదా?

విభీ—నాభీరుస్వభావమువలన వంశమునకప్రతిష్ఠ వచ్చు ననుటసందేహాము గాని, మీయనవసరాతిపరాక్రమక్రమమున వంశమునాశన మగుట నిశ్చయము.

రావ—నాపరాక్రమవైఖరి యసమయాటోపవినింద్యమైయున్నదా?

విభీ—లేదా?

రావ—ఎందుచేత?

విభీ—మొదటనే యుద్ధప్రయత్నము సేయుట వీకోచిత మైనదని యేనా?
చతురుపాయములలో దండము కడపటిది కాదా?

ద్వి—(తనలో) మానవుల కవలోమక్రమము గాని దానవులకు విలోమ
క్రమమే కాదా?

విభీ—యుద్ధము సాధ్య మైనంతవఱకుఁ దప్పించుకొనవలయును. అవి
లంఘ్యవిధి యైనపు డుండనే యున్నది.

రావ—రాఘవనాశనము. సర్వకపిసేనావిధ్వంసము.

ద్వి—సెబాస్! మహాప్రభూ! (అప) విభీషణా! రాఘవనాశన మనఁగ
రాఘవునిచే నాశనము సుమా!

రావ—ద్విజిహ్వ! అంతే కాదా? ఉండనే యున్న దఁట! ఏదో! నాకుఁ
బ్రక్కలో సీతస్ రామునికి గొంతుపైఁ గోఁత.

విభీ—ఇంతవ్యత్యయముగ సెల విచ్చితి రేమి?

ద్వి—(అప) మహాప్రభూ! ఎంతమాట నాడినాఁడో చూచితిరా? మీ
రుమాట లాడినది వ్యత్యయ మఁట! నాకు గొంతుకోఁత—రా
మునకుఁ బ్రక్కలో సీత—యనుట క్రమ మఁట!

రావ—ఆఁ! వ్యత్యయ మేమున్నది?

విభీ—కాదా? రామునిసంగతి నెఱిఁగియుండియు మీ కవశ్యము జయ
ముకలుగు నని నమ్ముటకంటె వ్యత్యయ మున్నదా?

సీ. పదునాలుగేండ్ల ♦ పసితనంబునఁ దాట
కాంతకబిరుదంబు ♦ నందినాఁడు
కనుబొమకంటె శీ ♦ ఘ్రముగ శంకరువిల్లు
వంచి వెన్వెంటఖం ♦ డించినాఁడు
క్షత్రియాంకురసము ♦ ద్ఘాటనోద్దాముఁడౌ
పరశురాముని భంగ ♦ పఱచినాఁడు

ఖరదూషణాసుర ♦ ఖండనవ్యాయోగ
వీరనాయకుఁడుగా ♦ వెలసినాఁడు
గీ. వాలిముఖలోకకంటక ♦ ప్రవరబహుల
కాపురుష ఖండనపటిష్ఠ ♦ ఖరిసలసద
మోఘబాణౌఘు నిస్తంద్రు ♦ రాఘవేంద్రు
గెలుతుననుటకంటెను వెఱ్ఱి ♦ గలదె నీకు?

ద్వా—(అపవారించి) రాక్షసాగ్రణీ! విభీషణుఁ డెట్టిపరపక్షపాతియో వింటివా! (అప) విభీషణా! రావణుఁడు వెఱ్ఱివాఁ డని లోకము మెచ్చఁదగినమాట నాడితివి.

రావ—ఛీ! ఛీ! రాఘవమాగధాధముఁడవై జన్మించుటకు బదులుగ శౌర్యాహార్య మగు రాక్షసాన్వయమునఁ దప్పిదారి వెట్లుపుట్టితివో! యతిభయస్వభావము గలనీకు విభీషణుఁ డనునామము మనపెద్దలెట్లు పెట్టిరో! ఛీ!

ద్వా—(అప) మహాప్రభూ! విభీషణుఁ డనుపే రున్నంతమాత్రముననే నిర్భయస్వభావుఁడగునా? నూదిపూవులకు వాసన గలదా? లెంపకాయలు కూర కక్కఱకు వచ్చునా? విభూదిపండ్లు రసాస్వాదనార్హము లగునా?

రావ—విభీషణా! ఇంకనైన మాట లాడక నీ వూరకుందువా?

విభీ—నే నూరకుండిన రాఘవుఁ డూరకుండునా?

రావ—ఊరకుండక—ఊరకుండక—చావనీ!

విభీ—మహాప్రభూ! అతఁడే మనలఁ జంపును! క్షమియింపుము.

రావ—అలాగే. నీ వనినట్లే. నన్నుఁ జంపనీ. తరువాత?

ద్వా—(తనలో) తరువాత శ్రాద్ధక్రియలలో మే మదృష్టవంతుల మగుదుము. నాకు గృహదానము, మాయన్నకుఁ గన్యాదానము. మాయింట నిత్యమంగళము పచ్చతోరణము.

విభీ—మహాప్రభూ! ఒక్క మీమరణముతోడనే యుద్ధము పరిసమాప్తి నొందునా? వీరందఱు—మీ కిప్పుడు వెనుకముం దెఱుంగక దుష్టాలోచనమును జెప్పి శౌద్రరసముల నెడలు తెలియక యట్టహాసములు చేయుచుఁ దాండవించునీదానవవీరు లందఱు పండ్లిగిలించువారే! ఇది గాక—

ద్వి—(అప) దీర్ఘకాయా! మనకుఁగూడ మరణమును సూచించుచున్నాఁడు. నీవు వైద్యుఁడవు. మేము చచ్చునెడలఁ బాషాణప్రయోగమున మఱల బ్రదికింపవలయును సుమా?

దీ—(అప) ఓరి మూఢుఁడా! పాషాణప్రయోగము మరణము నిచ్చునని యెఱుఁగవా?

ద్వి—(అప) లోకప్రఖ్యాతి యైనసంగతి నే నెఱుఁగకుందునా? మరణము నిచ్చును గావుననే తత్ప్రయోగము మృతినొందినవానిని బునరుజ్జీవితునిఁ జేయును.

దీ—(అప) అదెట్లు?

ద్వి—(అప) క్రిందఁబడిపోయినవానికిఁ జెవు లాకస్మికముగ గడియలువడిన వైద్యమేమి?

దీ—(అప) రెండుచెవులు గట్టిగ మూయుట.

ద్వి—(అప) మూసిననేమగును?

దీ—(అప) గడియలు విడును.

ద్వి—(అప) అలాగే చచ్చినవానికి మరణప్రద మైనమందు జీవనహేతువు. చావునకుఁ జావు బ్రదుకే కద?

విభీ—ఇదిగాక యెందఱునిర్దోషులు, యెందఱుసాధు లీయుద్ధమువలన క్షోభ మొందువారో యాలోచించుకొనరాదా?

సీ. సుతుల కేడ్చెడువృద్ధ ♦ పితలగోలలు, నవ
విధవా[illegible]నాగళ ♦ విదితసూత్ర

పుటుకు పుటుకు రవ ♦ ములగములును సహా
గమనాఢ్యసుందరీ ♦ కచచ యోద్ధ
దుర్గంధములు మాత్ర ♦ దూర బాలాక్రంద
నములు దుర్గంధహే ♦ యమృగతతిక
శేబరా కబళన ♦ లీలా విలోలిత
దాఁరుణ గృధ్రనా ♦ దములు భూత

గీ. తాండవధ్వనులును హోమ ♦ దత్త వేద
నలు గలసి పెద్దగోలయై ♦ కలకలమయి
యల్లకల్లోలమై పెద్ద ♦ నల్లకాడ
యి చెడిపోవును నీరాష్ట్ర ♦ మీవుయుద్ధ
పక్షచిత్తత నుండ రా ♦ క్షసవరేణ్యా.

రావ—ఏమి! అసందర్భప్రలాపము లాడుచుంటివి. యుద్ధమున జయాపజయములు సందేహాస్పదము లని యంద రెఱిఁగి యుండ —బుత్త్రమిత్ర కళత్రాదులతో నశింతు నని నీవింతనిశ్చయ—నెట్లు చెప్పఁగలవు?

విభీ—మహాప్రభూ ఈరాక్షసవంశమునకు రాఁబోవుమహాపదను కన్గొనియే చెప్పుచుంటినా? పక్షులో! మృగములో! కీటకము—పంచభూతములో!

సీ. హేమామయ్యాప్రాత్రికఁ ♦ జీమలుచేరెను
త్రేతాగ్ను లతిమంద ♦ దీప్తి నొందె
వాహ్యాహసంఘంబు ♦ వర్షించు నస్రంబు
భానుండు కాలాంక ♦ భాజియయ్యె
పరికంపనాతిభీ ♦ కర మయ్యె ధారిణి
వృక్షాళి సుమఫలా ♦ పేత మయ్యె

కుణపభుక్కులు గృహ ♦ గోపురంబుల వ్రాలు
సంధ్యల జంబుక ♦ సమితిగూయు

ఆ. వె. ఆవు లెండిపోయె ♦ నర్ధరాత్రముల శి
రోవిహీనకాల ♦ రూపశక్తి
తిరుగుచుండుఁ జెప్పఁ ♦ దరమానె భైరవ్యు
త్పాతకోటి వివిధ ♦ పాటవములు.

రావ—(నవ్వి) హా! హా! హా! ఇవియా నీకు భయకారణములు?

విభీ—నాకేకాదు. మహాప్రభూ! మీకు మనరాజ్యమునకు—వంశమునకు—

రావ—ఇఁకఁ జాలించు. ఇఁకఁ జాలించు.

గీ. అంబుదంబులు బడబడ ♦ మనక యగ్ని
చల్లఁబడక రవియొకప్డు ♦ జలదపిహిత
మండలుఁడుగాక గర్భాగ్ని ♦ చండపటిమ
ధరఁ గదలక లోకమొక్కవై ♦ ఖరి నిలుచునె?

ఆ. వె ధరను వస్తు లన్ని ♦ పరమాణుపూర్ణంబు
లణువులకును సహజ ♦ మగును జలన
మవ్వి యిట్టె కలియు ♦ నట్టె వేర్పడు చుండు
నిరతగతియె వాని ♦ నెత్తివ్రాఁత.

ఆ. వె. ప్రకృతి శాసనము ల ♦ బద్ధంబులై యుండి
యీడ్వఁబడుచు నయ్యు ♦ వేర్పుచుండ
మన కవేవొ బాధ ♦ లొనరించు నను చింత
కంటె వెఱ్ఱి లేదు ♦ గాదె జగతి?

ఇది గాక,

గీ. పాలపొదుగు లెండక వృక్ష ♦ పాళి మొరడు
గాక, ఱెక్కలుగలవి యై ♦ గరక, కనులు

గలవి యేడ్వక, నోళులు ♦ గలవి గూయ
కేమి సేయంగఁదగు నంటి ♦ వీవు చెపుమ!

గీ. అగ్నిశాల స్థహాహామాజ్య ♦ లగ్నకీట
కమున కసురాధిపతి శిరః ♦ కర్తనమున
కేమిసంబంధ మున్నది? ♦ యెవనికర్మ
సరణియెట్లొ వానికి నట్లె ♦ జరుగుఁగాదె?

విభీ—నేను మనవిఁ జేసికొనునది యదియే. మీరొనరించినదారుణ
మ్మకర్మము సీతాపహారణము. అప్పటినుండియే తత్కర్మము
ననుసరించియే యిట్టి విపరీతము లారంభ మైనవి. మహారాజ
మీరొనరించిన యుత్పాత నిరసనోపన్యాసము సరికాదు.

రావ—ఏల?

విభీ—జగతి పంచభూత కల్పిత మని మీరు సెల విచ్చిరి. మనముగా
నట్లేమనలో గలుగఁ బోవుమార్పు మనకుఁ దెలియకపోయిన
స్వభావ పరమాణుసంబధమున బాహ్య ప్రపంచ మూహా
సూచింపవచ్చును.

గీ. జీవబాధ భూతములు సూ ♦ చింపవచ్చు
క్రిమివినాశము ప్రాజ్ఞులు ♦ తమువడువున
భూతగతి పోలుపును జీవ ♦ ములు గ్రహించు
నీరదాగమనంబు దూ ♦ నికలయట్లు.

ఇది గాక,

గీ. సకలవిద్యాప్రవీణతా ♦ సహితజనుల
కంటెఁ బక్షులు చిత్రధీ ♦ ఘనతరములు
ప్రాణినాశ మిట్టె గ్రహించు ♦ వైద్యుకంటె
వేగమెఱుఁగును తీతువు ♦ రోగిచావు.

కే—(అప) ద్విజిహ్వా! సామాన్య వైద్యు లేమో నేచెప్పలేను గానినే నుమాత్రము రోగిమరణ మమోఘముగఁ జెప్పఁగలను.

ద్వ—(అప) మీరు చెప్పుట యొకటి చేయుట యొకటియునా? సత్యవాక్యధురీణులు.

ఖీ—మహాసురాగ్రణీ! ఈయుత్పాతములను మీరు నిర్లక్ష్యముగఁ జూడకుఁడు.

గీ. కారణము లేకయె ప్రకృతి ♦ క్రమము దప్పఁ
జేసు రానున్న దనుచు శం ♦ కింపవలయు;
హేతురహితార్తి యెద్దియో ♦ హృదయ మావ
రించునపు డాపదను నిశ్చ ♦ యింపవలయు.

ావ—(ఊస్సురనుచు) యుద్ధము జరుగుట నిశ్చయము. అం దనేకులు మడియుట సిద్ధాంతము. ఈయుత్పాతములు తజ్జనానీకమరణమును నీ వనినట్లే సూచించుచున్న వనఁదగును. కానియివి యన్నియు నానాశమునే బోధించుచున్న వన నేల?

ధి—మహాప్రభూ!

గీ. అధము లగువారు మృతి నందు ♦ నపుడుగల్గు
నే? మహోత్పాతములు ఘను ♦ లీల్గునపుడె
కాని; తుంగఁ జంప మెఱుపు ♦ గ్రాలునే? య
శని మొనఁగి తాళవృక్షంబుఁ జంపఁ గాని.

వైదేహి లంకలోఁ గాలువెట్టిన దారంభముగ నీమహోపద్రవము లుద్భవములై విజృంభించు చున్నవి. కుమారాక్షవీరుఁడు నామమాత్రశేషుఁ డైనాఁడు. లంకాపట్టణ మంత బూడిదయైనది. సర్వసేనలో మూఁడవపాలు నాశన మైనది. ఇంక నేమి కానున్నదో! ఇప్పు డైనను మేల్కాని, మంచియాలోచనము చేసి, సీతను రామచంద్రున కిచ్చి, హతశేషులప్రాణములఁ గా

పాడి, నీమానప్రాణములఁ దక్కించుకొని వంశము నిర్మూలము గాకుండ రక్షించుకొనుము. మహాప్రభూ! జానకిని రామున ర్పింపుము. ఇదియే నాప్రార్థనము. క్షమియింపుము.

రావ—(వికలముగనవ్వి) సీతను రామభద్రున కర్పించు మంటివా?

విభీ—మహాప్రభూ! ముమ్మాటికి. పరదారాపహరణము నీవంటిప్ర నకుఁ దగదు.

మహో—(అప) దీర్ఘకాయా! జరుగుబా టున్నయెడల పరదా సంగ్రహామంతసౌఖ్యమే లేదుసుమా?

దీ—(అప) సందేహ మేమి? పరాసుగ్రహణము లేనికట్టుమంత్రము, రధనగ్రహణము లేనిలౌకికము, పరకాంతాగ్రహణము లే చతికము వట్టిపనికిమాలినవి.

రావ—అనుభవించుటకుఁ దెచ్చినసీతను విడుతు ననుకొంటివా?

విభీ—అనుభవ మీరీతిగా నైనది కాదా? ఇంతవఱకుఁ జాలదా?

రావ—ఇంతవఱకుఁ గాదు ఇఁక నింతవఱ కైన సరే. వినుచున్నా

గీ. అసురవీరు లందఱు చచ్చి ♦ న సరె, రామ
మార్గణములు నాకసుపురు ♦ మార్చిన సరె,
జలధి లంకఁ గ్రుంకిన సరె, ♦ జనకసుతను
బ్రాణ మీఘటమున నుండ ♦ వదల నయ్య!

విభీ—మీ కిట్టిపట్టితన మేల? ఎన్నటికైన జానకి మీకుఁ దక్కు యనుకొన్నారా? అదిమిథ్య.

గీ. జలధులింకిన సరె, రవి ♦ చల్లఁబడిన
సరె, ధరాస్థలి గిరగిర ♦ దిరిగిన సరె,
చుక్క లూడిన సరె, దిక్కు ♦ లొక్కటైన
సరె, జనకపుత్త్రి చిక్కదు ♦ సత్య మయ్య!

మహో—(అప) దీర్ఘకాయా! (చిటుక వేసి) ఇదిగో! నేనే యుగ

డలమూఁడుని మేషములలో సీతను వశ్యఁగఁ జేసికొనలే కుండు
నా? ఆనేర్పే వేఱు. ఆప్రయోజకతయే వేఱు. ఆపాండిత్యమే
వేఱు. రావణాసురునకుఁ బ్రభుత్వము పట్టినది గాని ప్రాజ్ఞత
యెక్కడిది? బల మున్నది కావున జానకిని యెత్తుకొని వచ్చెను.
కాని స్వాధీనఁగాఁ జేసికొనుటకుఁ జాకచక్య మెక్కడిది? ఒకనినె
త్తిఁ గొట్టి ధనముఁ దెచ్చినతోడనే యయినదా? అనుభవింపవ
లయును. అనుభవింపవలయును. అది పౌరుషము.

దీ—(అప) మీచౌరవకు మీనిరంకుశతకు మీత్యాగభోగపారాయణ
తకుఁ దగినంతమహదైశ్వర్యము మీ కానిర్భాగ్యవిధాత కలుగఁ
జేసినాఁడు గాఁడు. చేసి యుండినయెడల—హా. హా. హా. ఎ
టు లుండునో చెప్పఁగలమా?

గీ. ఎన్ని మందు లుండి, ప్రయోగ ♦ మెఱుఁగకున్నఁ
దెలివి గలిగి దేహబలము ♦ గలుగకున్నఁ
ద్యాగముండి ద్రవిణహైన్య ♦ మమర నేదె
తామరకు నోళ్లు లేనట్టి ♦ దారి గాదె?

మహా—(అప) అది యంతయిబ్బంది లేదు. అందినంతవఱ కట్లకే
త్రాతో గోకికొనవచ్చును. కూడినంతవఱకు గోడపై రాయవచ్చు
ను. ఇదేమి? ఈనిర్ధనభోగేచ్ఛాప్రారబ్ధమువంటిది మఱియొకటి
గాదు.

రావ—విభీషణా! ఏ మంటివి? సీత చిక్కనే చిక్కదు కాదా?

ద్వి—చిక్క కేమి? మునుపటి కిప్పటికి నెంతయో భేద మున్నది. పర
హా మాఁదలోఁ బడినది.

రావ—హా. హా. ద్విజిహ్వాఁ నీవాడినది తెలివితక్కువమాట యైనప్ప
టికి (లోఁబడినది, యనునదుపశ్రుతి సమయానుసరణముగ నీము
ఖమునుండి వెడలినది సంతసించితిని.

విభీ—ఈమాత్రపుసదుపశ్రుతికి నుత్సాహపడినవారు సమాసన్నప్రళయ
కాలసన్నిభమహోత్పాతముల కేల నిరుత్సాహపడరు? మీ
కు హితమైనయంశమునకు సంతసించుటయు నహితమై పథ్యమై
నదానిని నిరాకరించుటయునా? మహాప్రభూ! ద్విజహ్వుని పలుక
లతోడనే వైదేహి స్వాధీన యగు నని తలంచుచుంటిరా?

రావ—ఆతనిపలుకులతో నేమిని? నాచేష్టలో! ఆశ్చర్యరసలోక
మ్మోహనీకరణబలిష్ఠములైన నాచేష్టలో!

సీ. శిరము తుంబగఁ జేసి ♦ చేయి దండముఁ జేసి
నరములు తంత్రీప్ర ♦ కరముఁ జేసి
కల్పించువీణియ ♦ కలనాదమున దశ
గళసుందరధ్వనుల్ ♦ గలిపి బ్రహ్మ
శంకరాదులయొజ్జల్ ♦ జల్జల్లు మన మహా
సామగానంబును ♦ సలిపి వారి
మెప్పించి వరములు ♦ కుప్పలుగాఁ గొని
యష్టదిగీశుల ♦ నడంచి సామ్య

గీ. శూన్యహయగజధనధాన్య ♦ సుందరీని
చయమహాభోగభాగ్యవి ♦ స్తారభార
పరిణతుఁడ నను సీత చే ♦ పట్టకున్నె?
ఇంతకంటెను గలవార ♦ లెవ్వ రిలను?

గీ. ధనము, శౌర్యము, విద్య, యౌ ♦ వనము, రూప
మొక్క టొక్కటియే స్త్రీని ♦ గక్కటికిని
బడఁగఁ జేయఁగ నన్నియుఁ ♦ గలియుచోట
సందియమునకు నాస్పద ♦ సరణి యెట్లు?

ద్వా—(తనలో) కృతయుగపురుషుఁ డైనయీతని కింక యావన[illegible]

రాఘవాదులనుబోలు గల మొగములనిమ్ము సామాన్యులతో నె
మంటు!

విభీ—మహారాజా! ఇట్లు లాడెదవ రేల? జానకిని సామాన్యస్త్రీగ భా
వించుచున్నారా?

రావ—నేనుమాత్రము సామాన్యపురుషుఁడనా? అట్లిదిగాక యుసమా
నశోభావతి కావునచే నేను దెచ్చితిని. విడువ నని చెప్పితిని. అ
నుభవించుటకు నిశ్చయించితిని.

ద్వి—(తనలో) సామాన్యస్త్రీ యనుభవ మీతనికి శాపముతో ముగి
సినది కాదా?

విభీ—అయ్యో! అట్టిమాట లాడకుము. సీత లోకమాత యని వాడుక
కలదు.

రావ—నేను లోకప్రభుఁడ నని, లోకపిత నని యంతకంటె నెక్కువవా
డుక కలదు.

విభీ—ఆమె మహాశక్తి; మహామాయ; మనకొంపలు గూల్చుట కిక్క
డకుఁ జేరినది. మహారాజా! నమ్ముము.

రావ—హా. హా. నాది మహత్తమశక్తి; నాది మహత్తమమాయ;
రామాపహరణ మొనర్చి రామునికొంప నేనే కూల్చితినిగాదా?

విభీ—ఎందుల కీవాక్యోపవాక్యములు. మహాప్రభూ!

గీ. కొమ్మగా దసురపతుల ♦ దొమ్మ గాని
కాంత గాదు సురారికిఁ ♦ శాంత గాని
నారి కాదు రక్షోమహా ♦ మారి గాని
సీత కాదు మీగొంతుక ♦ కోఁత గాని.

ద్వి—(అప) విభీషణా! ఒక్కటి గనుకనా? గొంతుల యసన యభార్థ
ముగ నుండును గాదా?

రావ—(వక్రముగ నవ్వి) రాముఁడు నన్ను వధించుగాథ పూర్తియైన

దా? ఇఁక సీత నన్నుఁ జంపు ననునూతనకథ నారంభించితివా
నీకటువాక్యము లిఁక నేను విననుు. చాలింపుము.

రా—(అప) విభీషణా! రావణాసురుని లెక్క నీ కేమి? నీయిష్టము
చ్చినట్లు జాడించుము. (అప) మహాప్రభూ! విభీషణునిప్రసం
ము మిక్కిలి తూలుగ నున్నది. నేను సహింపలే కుంటిని.
మ్ముఁడు గావున నెన్నికొట్లు దిట్టిన మీకుఁ దప్పదు.

[illegible]—సీ. మనను రంజింప నీదాసా ♦ మ్మును హరింపఁ
దలఁచి యెన్నె న్నొప్రియవాక్య ♦ ములను బలికి
పీడ నిను హరింతురు నమ్మ ♦ విభుని యాజ్ఞ
తలఁకిని వారసతికి భే ♦ దంబు గలదె?

సీ. ప్రియును లిహావరాపద్దాన ♦ భీకరములు
పరసతీతస్కరపరిరం ♦ భములఁబోలె
పక్ష్మములిహాపరానంద ♦ భావుకములు
నిజసతీపవిత్రాశ్లేష ♦ నియతిలాగు.

వి—(అప) మహోదరా! విభీషణుఁడు చెప్పినమాట యథార్థమే
కాని సంపూర్ణముగాఁ జెప్పలేక పోయినాఁడు.

సీ. శిష్టవాక్యంబు లిడుమల ♦ నిచ్చుఁ దుదకు
శర్కరా సేవ మధుమేహ ♦ జనున కట్లు;
శత్రునాను లోసంగు నానంద ♦ భరము తుదకు
జ్వరితునకు నేలవేముక ♦ షాయ మట్లు.

[illegible]—మహాప్రభూ! మీక్షేమమునందే ముఖ్యోద్దేశము కలవాఁడనై
[illegible] లాడితిని.

సీ. [illegible] ప్రియామృత ♦ సమితిఁ బలుకు
[illegible] నమ్మ మత్స్యంబు ♦ గాలమునటు;

రాట్సుఖార్థి యప్రియసత్య ♦ రాజి పలుకు
పార్థివుఁడు తిట్టు గురు శిష్య ♦ బాలుఁ డట్లు.

మహాప్రభూ! ముఖోద్దిష్టభవదీయకీర్తిక్షేముఁడనై దైవముఖ
మును జూచి తమ్ముఁడఁగాన నిట్లు—

ద్వా—(అప) మహాప్రభూ! ఈతఁడు కుంభకర్ణునికంటె నీ కెక్కువతమ్ముఁ
డా? నీకొడుకుకంటె నీక్షేమ మధికముగఁ గోరినవాఁడా? (అప)
విభీషణా! 'తమ్ముఁడనుగాన,' యని బాగుగఁ బలికితివి. నీ వె
క్కుఁడవే రావణునకుఁ దమ్ముఁడవు. సంవత్సరమునకుఁ బదునె
కండుమాసములిరువదియెనిమిదిదినములుచచ్చినట్లు నిదురించు
కుంభకర్ణుఁడు లేనివాఁడే! అది గాక వయసువచ్చినరాజబాలకు
లు పితృమరణము నపేక్షించుచుందురు. కావున నీవే రాక్షసా
ధిపతికి ముఖ్యుఁడైనతమ్ముఁడవు. తమ్ముఁడవు.

రావ—(కోపమున) "తమ్ముఁడనుగాన," నని నిశ్చయముగఁ బలికితివి. త
మ్ముఁడవు కావుననే నాయాధిక్యమును సహింపలేకుంటివి. నా
యైశ్వర్యమున కసూయ పడుచుంటివి. నాసౌఖ్యమున కేడ్చు
చుంటివి. నాకీర్తికి కనులఁ బొడుచుకొనుచుంటివి. నారాజ్య
ము నపేక్షించు చుంటివి. నామరణమును గోరుచుంటివి. ఛీ!
ని న్నెవఁడు నమ్మును?

గీ. ప్రబలశార్దూలమును నమ్మ ♦ వచ్చుఁ గాల
లేలిహానంబు మెడఁ దగి ♦ లించుకొనఁగ
వచ్చు, నెదను గుంపటిఁ బూని ♦ పండవచ్చుఁ,
గాని దగఁ జేరనీరాదు ♦ జ్ఞాతి నెపుడు.

గీ. పరమనిస్త్రింశభీకరపరి ♦ పంథియైన
మనమరణము కోరునుగాని ♦ మనదు సర్వ

వంశనాశనమును జ్ఞాతి ♦ వాఁడు గోరు
ధరను దాయాదికంటె భీ ♦ కరుఁడు లేఁడు.

గీ. చేతఁబడిఁ జేసి చంపఁ గాం ♦ క్షించు నొకఁడు
వంటఁ జేయునతనితోను ♦ వైద్యుతోను
చేరి గరళప్రయోగంబుఁ ♦ జేయు నొకఁడు
రాజు గలచోట నుండనీ ♦ రాదు వీరి.

ఛీ! ఛీ! నీమొగము చూడ రాదు. కులపాంసనా! అధ—మా! పో! పో!

విభీ—కాలచోదితులై పోవునాగు మహాప్రభూ! మీరైయున్నా [illegible] జానకిని సమర్పించి యిహపరతారకము లగు శ్రీరామపాదముల [illegible] బట్టి కృతార్థు లగుఁడు.

రావ—రాఘవకింకరా! రామదాసానుదాసాధమా! ఆతనిపాదముల [illegible] నీవే పట్టుకొనుము పో, పో శీఘ్రముగఁ బో! లేనియెడ నా తనిపాదసాన్నిధ్యమునఁ బడునట్లొకతన్నుఁ దన్నెదను (లేచును.

కుం—మహాప్రభూ! శాంతింపుఁడు.

విభీ—మహాప్రభూ! కానిండు. అగ్రజులును బూజ్యులు నగు మీ సేవ తిరిగి నాకు లభించునా? ఓయసురవరులారా! మీరు వధింపఁబడువారే. స్వలాభము నైన నపేక్షించి రాజుగారిబుద్ధిని మరల్పుఁడు. నాకు సాధ్యమైనది కాదు. మ[illegible] ప్రభూ! మీరు రామబాణనిహతు లగుట నేఁ గాంచలేక [illegible] ట్లు పలికితిని. స్వామీ! క్షమింపుఁడు. మీకు సుఖ మగుఁగా[illegible] నేను బోవుచున్నాను. ఇదె నమస్కారము.

(నిష్క్రమించును.)

రావ—కుంభకర్ణా! చూచితివా? నీతమ్మునినిర్ణయము? నీయభి య మేమి?

కుం—సీతాపహరణ మాలోచింపక చేసినారు అప్పుడు మంత్రాలోచనముఁ జేసియుండినయెడల నీబాధ మనకు రాకయుండును. ఇప్పుడుమాత్రము నాయభిప్రాయ మేల? యుద్ధముఁగూడ నిరాలోచనముగనే చేయుము. ఏమికావలసియున్నదో యది యగును. ముందుపని వెనుక, వెనుకపని ముందు చేయువారి కెవ్వరు చెప్పఁగలరు?

రావ—తమ్ముఁడా! ఇప్పుడు సూడుమాట లేల? నీవు నాకు యుద్ధమునం దోడ్పడుదువా?

ప్ర—నిద్రించు చుండినయెడల—

కుం—తోడ్పడక తప్పునా? నాశక్తివంచనము లేకుండ శత్రునాశనముఁ జేయక తప్పునా? ఇంతకాలమునుండి దయతో నన్నాదరించిన రాజుఋణముఁ దీర్చుకొనక తప్పునా?

రావ—సాధు! కుంభకర్ణా! ఇఁక యుద్ధము తప్పదు. ప్రహస్తా! తప్పదు. నీవు బహుజాగరూకతతోఁ దత్ప్రయత్నమున నుండుము. ఏమియు లోపము రానీయఁ గూడదు. జాగ్రత్త!

ప్ర—చిత్తము.

రావ—ఇదివఱకే చాలనాలస్య మైనది. (ఆలోచించి) యుద్ధ మవశ్యము జరుగవలసి యున్నది. కాని యేమి యగునో?

(నేపథ్యమున) మహాప్రభూ! సూర్యాస్తమయ మైనది. కాలోచితవిధులనిర్వర్తింప లోనికి దయచేయఁ బ్రార్థితులు.

ప్ర—సరే! ఇఁక మనపని పూర్తి యైనది కాదా? పోవుదము.

(అందఱు నిష్క్రమింతురు.)

(ఇది ప్రథమాంకము.)

శ్రీ

# విజయరాఘవము.

## ద్వితీయాంకము.

[ప్రదేశము—లంకలోనివీథి.]

(ప్రవేశము మహోదరుఁడు దీర్ఘకాయుఁడు చెఱియొకవైపునుం

మ—ఓహో! దీర్ఘకాయుఁడా!

దీ—ఓహో! మహోదరుఁడా! అయిదుదినములనుండి గనఁబడుట దేమి?

మ—అజీర్ణబాధవలన నాస్థానమునకు వచ్చుచుండుటలేదు. వింత నఁజెప్పవా?

దీ—మహోదరునకు మందాగ్నిబాధకంటె నీటిపై రాళ్లు తేలు టె వింతయేమున్నది.

మ—ఔనఁట! వార్ధిబాధనుఁ డగురామునిమహిమమేనా? ఇది—

దీ—రాముని మహిమముగాదు; సముద్రునివరప్రభావము.

మ—సముద్రుని గూర్చి రాముఁడు ధ్యానించినాఁడా?

దీ—మూఁడుదినములు—దర్భశయ్యపై—ననశనవ్రతమున—ని క్షతో—

మ—ఆతనితపస్సామర్థ్యమునకు మెచ్చి సముద్రుఁడతనికిఁ బ్రత్యక్షమాయె ను గాఁబోలు!

దీ— గీ. వేఁడినకొలందిని జడుఁడు ♦ బిగియ సాఁగు
దండనంబునఁ గాని వ ♦ శ్యుండు కాఁడు
గోకుకొలఁదిఁ దామర తెగ ♦ బ్రాఁకి విరియు
జీడిచే వాతఁ బెట్టఁ జ ♦ చ్చినటు లొంగు.

మ—అలాగా? సముద్రుని రాఘవుఁడు శిక్షించెనా?

దీ—లేదు. ప్రయత్నించెను.

మ—ఎట్లు?

దీ—బ్రహ్మాస్త్ర మభిమంత్రించి సముద్రు నిపై విడువ యత్నించెను.

మ—తరువాత నే మయ్యెను?

—ఏ మయ్యెనా?

ఆ. వె. ఇరులు గ్రమ్మె నెల్ల ♦ యెడ; రవిచంద్రన
క్షత్రరాజి యొక్క ♦ సారి మింట
వెలిఁగెఁ; దోఁకచుక్క ♦ లలరె; లక్షోపల
క్షులుగ వ్యోమమున న ♦ గంబు లెగిరె.

మ—(నవ్వుచు) ఏమీ! ఈబాధలు మన కేమియుఁ గనఁబడ లే దేమి?

దీ—కనఁబడ కేమి? కోటబురుజుపై కెక్కి చూడలేకపోయితివా?

మ—పైచూపువలన నాకు బాధ లేదు గాని, వంగి క్రిందికిఁ జూచుట
లోఁ గడు పడ్డముగాదా? చూచిన దేదో నీవే చెప్పుము.

దీ—లంకాబహిఃప్రదేశమందు,

గీ. భల్లుకములచేఁ జీఁకటి ♦ పడియె; బాణ
ధరరఘువరులు తారమా ♦ ర్తాండచంద్ర
కాంతి; వెలిఁగిరి; తోఁకచు ♦ క్కలకు బదులు
క్రోఁతితోఁక లెగిరె; గిరి ♦ కోటిశోడ.

మ—సోమరి యగునటునివలె నిక్కడ కథ దాఁటవేసినా వేమి?

దీ—రాముఁడు సమస్తకపిసేనతోఁ గంధిసే దాఁటఁగ నేను కథలోనై దాఁటలేకుందునా?

మ—సిగ్గుమాలినవిభీషణుఁడుగూడఁ గానఁబడినాఁడా?

దీ—ఆ!. అంతకంటె సిగ్గుమాలినరామునిసాన్నిధ్యమున—.

మ—రాముఁ డంతకంటె సిగ్గుమాలినవాఁ డెట్లగును?

దీ—విభీషణుఁడు సిగ్గుమాలినవాఁ డెట్లగును?

మ—సమస్తసద్గుణభూయిష్ఠ మైనరాక్షసమతమును వదలుకొని గుణగణహేయ మైననరమతము నవలంబించుట సిగ్గుమాలినతనము కాదా?

దీ—అట్టి సిగ్గుమాలినవానిని నెత్తిపైఁ బెట్టుకొనుట యంతకంటె మాలినతనము గాదా?

మ—రామునకుఁ దెలివికూడ నున్నట్లు నాకుఁ దోఁచదు.

దీ—ఎందుచేత?

మ—ఆపత్సముద్రమున నున్నయన్నగారిని ద్యజించినఖలుఁడు తనా ర్యముమాత్రము గడ్డలు చేయునా? యనుసందియము రామున కుండనక్కఱ లేదా?

దీ—ఈయంశమునే సుగ్రీవుఁడు బోధించినాఁడు.

మ—నీకు బహుస్పష్టముగఁ దెలిసినదే! ఎట్లు తెలిసినది?

దీ—నే నదృష్టరూపుఁడనై యచ్చట నిలిచి వింటిని.

మ—ఒక్కయింద్రజిత్తునకే యిట్టిప్రజ్ఞ గల దని చెప్పుదురు. నీకుఁగూడ నున్నదా?

దీ—హా. హా. ఇంద్రజిత్తున కీమంత్ర ముపదేశించినవా రెవరు?

మ—ఆలాగా! సుగ్రీవుఁడు నావలెనే పలికినాఁ డేమి?

దీ—ఒక్కసుగ్రీవుఁడేనా? విభీషణునిఁ జేరనీయ వలదని కొందఱు సందేహింప వలదని కొందఱుఁ, బరీక్షింప వలదని కొందఱు

బోధించిరి. ఎందఱు చెప్పినను రాముఁడు లక్ష్యపెట్టక పో
యెను.

7/47

మ—గొప్పవారి కందఱకు ముఖ్యగుణ విమూర్ఖతయే.

చీ—మూర్ఖత గాదఁట—ఆశ్రితపక్షపాత మఁట—భక్తవాత్సల్య మఁ
ట—ప్రపన్నపర్యాదరణ మఁట—శరణాగతరక్షణ మఁట—

మ—ఏడిచినట్లే యున్నది. అశక్తికి, నజ్ఞానమునకు, నప్రయోజకతకు,
నధైర్యమునకు, నవకతనకు వైష్ణవసాంప్రదాయమున ననేకవి
చిత్రపవిత్రనామము లున్నవి. సతి యాసన్న మైనపుడు, మృతి
యాసన్న మైనపుడు మతి దూర మగును గాదా?

—ఆలాగు కాదు. అపు డాతఁడు ధీరోదాత్తుఁడు కోసినకోఁత లిన్నియా?

——ఆలాగా? ఇతనిధీరోదాత్తత గూనపులిపస మేనా? ఆతనివికత్థనా
టోప మెట్లు?

—"గీ. రాక్షసపిశాచయక్షవా ♦ రముల నైన
నఖముఖక్షేపణమునఁ గుం ♦ ఠన మొనర్తు
సర్వపలలాశతతివధా ♦ చరణమునను
కాలదండంబె నాసాయ ♦ కంబు నిజము.

గీ. రావణభ్రాంతమైన గా ♦ నీ విదేహ
రాజతనుజాపహర్త యౌ ♦ రావణుండు
నైనఁగానీ, యిటకు శర ♦ ణార్థి యగుచు
రా నభయ మిత్తు నేది యే ♦ మైన సరియె"

మ—బాగు. గూనపులి యఱచును గాని కఱచునా? ఆలాపములతో
నసురవధ మగునా? ఔను గాని—

కి—అదేమి? స్వవచనవ్యాఘాతముగఁ బలుకుచుంటి వేమి?

సు—ఏదియో చెప్పఁబోయి యూఁతగ నట్లంటిని.

కె—అదేది?

మ—జయ మెవరికిఁ గలుగు నని నీయభిప్రాయము?

దీ—మనసాహాయ్యముననను రాధ్యక్షునికి—నీ కెట్టులుతోఁచుచున్నా

మ—నాకు నట్లే తోఁచుచున్నది. ఈపండుక్రోఁతులకుఁ బండ్లూడ ట్టు లేదైన వైద్యము నీవు చేసినయెడల తోడిమేలతోఁ న మొవ్వంగకాయకూరనువలె దోఁకలతోఁ గూడినప్లవంగ యములవారగముల నట్టె యట్టె చప్పలింపక పోదునా?

దీ—సెబాస్! అపరిమితాశనప్రాశనప్రవీణతను గుంభకర్ణునితరువా వనామికాధిష్ఠాతవు నీవే.

మ—నీవు వధించినవారి నందఱను నేను దిందును. ఇదియే నాపంతము

దీ—అందులకు నే నంగీకరింపను.

మ—ఎందుచేత?

దీ—నన్నుఁ గనిపెట్టుకొని యున్నవారికి నే నుపకారముఁ జేయవల

మ—నీ కట్టిముఖ్యాశ్రితు లెవరు?

దీ— గీ. కాకజంబుకగృధ్రకం ♦ కముఖకోటి,
యపరమంత్రజ్ఞులుశవవా ♦ హకులు వైద్యు
వలనఁ బోషింపఁబడుటచేఁ ♦ బరమముఖ్య
బంధుపరివార మగు వారు ♦ వైద్యునకును.

ఆ. వె. ఇట్టి మాత్ర వేసి ♦ యట్టిరోగిని గూల్చి
దయను వాహకునకుఁ ♦ దార్తునతని
ధనముఁ బీల్చి కత్య్య ♦ దారుని ఋణదాత
వాతఁ బెట్టున్యాయ ♦ వాదిఁబోలె.

కావున నేను నీమతమున కంగీకరింపను.

మ—సరే నీయిష్టానుసారమే కాని మనలో మనకుమాత్రము వైషమ్యము వలదు. నీవును నేను నన్యోన్యాశ్రయులమై రెండుపేటలుగల జాలిబొంగరమును ద్రిప్పినట్లు రావణుని ద్రిప్పవలెను.

దీ—ఒకమాట! రహస్యము. రావణునిబొంగరమునువలెగిరగిరఁద్రిప్పుట యేకాకసుగ్రీవుఁడాతనికిరీటమునుక్రిందఁబడఁగొట్టినాఁడునుమా!

మ—ఆ! ఆ! అదెప్పుడు?

దీ—నిన్నరాత్రి

మ—అదెట్లుజరిగెను?

దీ—రామలక్ష్మణాదులు ససుగ్రీవులై సువేలపర్వతము నధిష్ఠించి యుండగఁ నాసమయమున వానరసేనాజదృక్షుచే రావణుఁడుఁ కోటబురుజుపై కెక్కెను. అంతట సుగ్రీవుఁ డాకస్మికముగ నెగిరియసురాధ్యక్షునిపైఁ బడితత్కిరీట భంగము నేసి కొంతసేపు పోరాడి తుఱ్ఱున బారిపోయెను.

మ—ఈవార్త పొక్కలేదేమి?

దీ—నాలుకపై జీడిపొక్కునా?

మ—ఇది కొంచె మశుభమును సూచించుట లేదా?

దీ—అశుభ మేమున్నది. సుగ్రీవునికిమాత్రము దెబ్బలు తగుల లేదా?

మ—కాదు. మకుటభంగమునుగూర్చి చెప్పుచుంటిని.

దీ—తలఁ దఱెగినను సీమచింత మఱెంతగుమురుగ నెదుగదా? బ్రహ్మామనుమనికి బొమ్మజెముడునకు దుంపశుద్ధియైనను నాశనమున్నదా? (నేపథ్యమున) ఆ! ఆ! ఇప్పుడే.

మ—ఆదురుపశ్రుతి యేమి?

(నేపథ్యమున) ఇప్పుడే రానైయున్నారు సేనాపతీ! మీరులోనికిరావచ్చును.

—రాజుగారు సభ కిప్పుడు రానైయున్నారు. సభ యిప్పుడు జరుగనై యున్నది కాఁబోలు. ప్రహస్తాదులు వచ్చినారు. మనముకూడ సభ కేగవలయును. రమ్ము.

(ఇద్దఱునిష్క్రమింతురు.)

ఇదివిష్కంభము.

[ప్రదేశము—ఉద్యానవనము.]

(ప్రవేశము—రావణప్రహస్తులు.)

ప్ర—సెలవుప్రకారమే యాచరించితిని.

రావ—సెలవుప్రకారమే చేసితి నని యూరకే యనుట కాదు. ఏ
సితివో తిరిగి చెప్పుము. యుద్ధసమయమున నెంతజాగరూ
కు న్నంత మంచి. చేయఁదలఁచినపనిని గూర్చి యెంత
చించిన నంత క్షేమము. చేసినపని నెన్నిసారులు పునరవలో
కనమొనర్చిన నంత బాగు.

గీ. సప్రతర్కాలసత పున ♦ శ్చర్వణంబు
తగనిఛాందసతయు నుండఁ ♦ దగని వైన
మంత్రమున భేషజమున స ♦ మరవిధిప్ర
యత్నమున నన్వి గలుగ మే ♦ లగును గా దె

కావునఁ దిరిగి చెప్పుము.

ప్ర—చిత్తము.

గీ. ప్రాఙ్మహాద్వారరక్షణ ♦ భరము నాది,
బలి మహాపార్శ్వ దక్షిణ ♦ ద్వారమందుఁ,
బశ్చిమద్వారమున భవ ♦ త్ప్రథమపుత్త్రు,
శుకుని, సారణు, నుత్తర స్థులుగ నిడితి.

రావ—ఆయుత్తరద్వారముననే మేము స్వబాహువింశతిసమా
పరిరక్షితముగఁ జేయుదుము. తెలిసినదా?

ప్ర—బోధ మైనది.

రావ—ఇఁక వారిప్రయత్నము లెట్లున్నవి?

ప్ర—కొంతసేపటికిఁ దెలియనై యున్నవి.

రావ—ఎవరి నైన శత్రుమధ్యమునకుఁ బ్రణిధిగఁ బంపితివా?

ప—చిత్తము. శార్దూలుని.

రావ—అటులైనమన సేనామధ్యభాగపరిరక్షణమున కెవరిని నియమించితివి?

—మహాప్రభూ! విరూపాక్షుని.

రావ—రాక్షసు లందఱు సర్వసన్నద్ధులై యుండిరా?

ద్వి—(ప్రవేశించి) ఎవరిసంగతియు నే నెఱుఁగను గాని నేను సర్వసిద్ధముగ నున్నాను.

(దీర్ఘకాయుఁడు మహోదరుఁడు, ప్రవేశించి) నీ వొక్కఁడవే యను కొంటివా? మేమో?

—(అప) దీర్ఘకాయా! సుగ్రీవుఁ డొనర్చినపరిభవమునుగూర్చి మన మీ మహారాజును గొంత పరామర్శ చేయవలయు నేమో? ఆలోచింపుము. బంధుమర్యాద దాఁటఁగూడదు కదా?

—(అప) పరామర్శకుఁ బ్రశస్తములైనయవసరములు ముం దనేకములు గలుగును. ఇప్పుడు తొందర పడఁగూడదు. వ్యాధికిఁ దరుణతలోఁ బని చేయవలయును గాని యాధికిమాత్రము ముదిరి పడిలినతరువాతఁగాని పరామర్శ పనికిరాదు.

రావ—మిత్రులారా! మీరుగూడ యుద్ధ మొనర్తురా?

ద్వి—మహాప్రభూ! 'మీరుగూడ,' నంటి రేమి? యథావిధిగ యుద్ధము సేయునది మేమే.

రావ—ఆలాగా? నీకు సమరతంత్రమునఁ బ్రవేశ మున్నదా?

ద్వి—శ్రాద్ధమంత్రమమునఁ బ్రవీణత యున్నది కాదా?

రావ—చీ! చీ! అపరమంత్రముతో నీ విచ్చట నేమి సేయఁగలవు?

ద్వి—గీ. క్రిందిజీవులఁ బైకి నె ♦ క్కించుటందు
శ్రాద్ధమంత్రంబు సమరతం ♦ త్రంబు నొకటె;

గానిక్రిందికి నూర్ధ్వలో ◆ కప్రవాసి
తతిని దింపుటచే మంత్ర ◆ మతితరంబు.

రావ—అదేమి? అదేమి! పైనుండి యెవ్వఁడో దిగుచున్నాఁడు.

(అంగదుఁడు పైనుండి దుముకును.)

(అంద ఱాశ్చర్యమునఁ జూతురు.)

ద్వా—ఎవఁడవు నీవు?

దీ—ఎందులకు వచ్చితివి?

ప్ర—ఎవనియొద్దనుండి వచ్చితివి?

ద్వా—మాటలాడ వేమి?

దీ—నోరు లేదా?

మ—చెవులు లేవా?

ప్ర—ఏమి అది! మూతి ముడుచుకొని గ్రుడ్లు మిడకరించుకొనుచు నూరక చూచెద వేమి? గ్రుడ్లు పీఁకించెదను. జాగ్రత్త!

ద్వా—పండ్లూడఁ గొట్టించెదను. చెప్పు.

మ—తోఁక మొదలంటఁ గోయింతును. ఎవఁడవో చెప్పు.

దీ—తల వెలఁగకాయ నొక్కినట్లు నొక్కెదను. కాచికో!

రావ—తొందర లేదు. వ్యోమయానమువలనఁ గలిగినయాయాసము నుబాపుకొనియే మాట లాడవచ్చును.

అంగ—అసురేశ్వరా! మాట లాడక మిన్నకయున్నవానిపై నింతతీవ్ర పౌరుషప్రాగల్భ్యములను వెల్లడిపఱుచు నీకీఁచుపిట్టలను, ఈగలితిత్తులను, ఈకూఁతవీరులను, ఈబుడబుడక్కలవేషముల నెచ్చటజాగ్రత పెట్టితివి? ఈనిర్భాగ్యపుఁజెత్తతోడనయా మా శ్రీరామభద్రుని గెలువ సంకల్పించుకొంటివి!

రావ—అబ్బ! ఏమి యధిక్షేపణ! ఏమి గర్వభూయిష్ఠత! వీ రందఱు నీ కంటికిఁజెత్తవలె నున్నారా? చెత్త యైనను దుక్కైనను వీరి

తిర్యగ్గమనులు గారే? శాఖామృగములు గారే? వాలధరులు గారే? చంచలస్వభావులు గారే? క్రోఁతులతోడను గొండ్రముచ్చులతోడను నెలుఁగుబంట్లతోడను, త్రిలోకైకాధిపత్యధురంధరుఁ డైనమహాసురేశ్వరుని దద్రాజ్యమును గెలువ దాడివెడలి వచ్చినమీరాముని కంటె మూఢుఁడనా? అసురుల కధిపతి నగు నేను పశువులకధిపతి యగుమీరామునికంటె హేయస్వభావుఁడనా? తోఁకలు ముడిచి కిచకిచలాడి పండ్లిగిలించుమీమూఁకల కంటె మూఢులను నేను జాగ్రత్త పెట్టితినా? ఆరాముని సేవకుఁడవై యాతనియొద్దనుండి వచ్చినవాఁడ వైన యెడల నెవరియనుజ్ఞపై నీవు మాసభలోనికి వచ్చితివి?

అం.—ఇది కాంతలయంతఃపుర మని నే ననుకొనలేదు. ఇచ్చటికి మగవారు రాఁగూడ దని నే నెంచ లేను. ఈమీసాలవా రందఱు పైవేసాలవారే యని నే ననుకొన లేదు. నాకు సెల వేల? నీ యనుజ్ఞనొందుటకు నీసభాద్వారముగుండ వచ్చితినా? బహిరంగముగ, నిర్భీతిగ, నిరంకుశముగ నంతరిక్షమునుండి దిగిననాకు నీయంగీకార మేల? అశనిపాతమున కనుజ్ఞయేల కావలయును?

సీ. దొంగనుగాను; భ్రము ♦ చ్చుంగాను; సంసారి
నై యుండి కపటస ♦ న్యాసివేష
మూనువాఁడను గాను; ♦ భూనాయకుఁడు లేని
సమయంబు, గనిపెట్టి ♦ సతులకడకుఁ
దారువాఁడను గాను; ♦ దారిద్ర్యము నటించు
మొఱఁబెట్టుముష్టిదా ♦ సరిని గాను;
కుటిలచౌర్యంబున ♦ గుంటనక్కను గాను;
న్యాయంబు విననిదు ♦ ర్ణయుఁడఁ గాను;

గీ. సర్వసద్గుణమాంగళ్య ♦ సంప్రపూర్ణ
జానకీనాథసందేశ ♦ జల్పభార
పరిణమితశీర్షనిశ్వాస ♦ పాణిపుటుఁడః
సంగదఖ్యాతసమ్యాక్స ♦ మాహ్వాయుండ.

రావ—ఏమీ! ఏమీ! అంగదుఁడవా! అంగదుఁడవు నీవేనా?

ద్వా—(తనలో) అమ్మయ్యో! వాలిపుత్త్రుఁడైనయంగదుఁడు కాఁబో లు! కడుపులో గలగల లాడుచున్నది.

మ—(అప) దీర్ఘకాయా! ‹అంగదుఁడవు నీవేనా?› యని యసురాధిపతి యంతయాందోళనముగా నడిగె నేమి?

దీ—(అప) దాని కొక చిన్నయితిహాస మున్నది.

మ—(అప) ఏదో చెప్పెదవా?

దీ—(అప) ఒకపర్వతముక్రింద మందోదరి యున్నట్లు రావణుఁడు యామెను బరిణయ మాడ నెంచి యాపర్వతమును దనబాహువులఁ బెకలించుటకై యెంతశ్రమ మొనర్చిన నది కదల దయ్యెను. వాలి యాదారిని బోవుచు నదియేమి యని రావణు నడిగను. ఈతఁడు యథార్థమును వచించి యాపర్వతమును బెకలించియాకాంతను దన కిమ్మని వాలిని బ్రార్థించెను. మందోద ముందుగఁ దాఁ గలియుట కీతఁ డంగీకరించినఁ బెకలింతు నని —లి బదులు చెప్పెను.

మ—(అప) అందుల కీతఁ డంగీకరించెనా?

దీ—(అప) అంగీకరించుట—అగము పెకలించుట—వాలియభిసంధి ఆవేళుట—ఈయంగదుఁడు పుట్టుట—ఇవి యన్నియు నీవు ను మాటలాడుకొనునంతలో జరిగెను.

మ—(అప) అటులైన నీక్షోణిముండకొడుకు సుందరీరత్న మగుమం డోదరిపుత్త్రుఁడా?

దీ—(అప) సుతజననవిషయమై,

గీ. నూటిపని ఫలింపదు; కను ♦ చాటుదొంగ
పని ఫలించు; కాచఫలక ♦ ద్వయము గలియు
కోణ మొకటియాకారంబు ♦ గొనదు; ప్రక్క
చాటువస్తువుఁ బట్టి ♦ సంగ్రహించు.

మ—(అప) పెనిమిటియంగీకారముపైననే జరిగినది దొంగతన మెట్లగును?

దీ—అస్వాధీ మగు నోరు మూసికొనుట యంగీకారమా? అసాధ్యవిధిప్రేరణ మనుజ్ఞయా?

గీ. కవితను వరింప వచ్చుఁ; ద ♦ త్కవితఁ బాడు
సేయఁ ఖలుపోడిమాటలఁ ♦ జెవిని బెట్ట
కుండ వచ్చు; దుష్టవిమర్శ ♦ కొండు దాని
పైనిఁ బుట్టఁ గవి పడుక్లే ♦ భంబువలెనె.

గీ. కలికి కడఁద్రొక్కవచ్చును; ♦ గాంతుఁడు కని
కననియట్లుండవచ్చును; ♦ గాని తదుప
పతిసమాసుతుండు దాపరిం ♦ పఁగను మగఁడు
పడెడు మొండిఅంపపుఁగోఁత ♦ కెడము గలదె?

మ—(అప) సరి. సరి. అందుచేతనా? అంగదుఁడవు నీవేనా. యుం యన్నిసారు లీతఁ డడిగినాఁడు.

రావ—మాట లాడవేమి? అంగదుఁడవు నీవేనా?

అం—విధి లేక స్వనామోచ్చారణ మొకసారి చేసినందుకే విచారించుచున్న నే నేమని తిరిగి చెప్పుదును. ఔను వాలిపుత్త్రుఁడను నేనే.

రావ—నేను దొంగ నని, కపటవేషధారి నని, గుంటనక్క నని నన్ను నీవధిక్షేపించుచుంటివా? మూఢా!

సీ. అవిరళచతుర్దశభువన ♦ భవనసంప్ర
దీపనోజ్జ్వలదస్మదు ♦ ద్దీర్ణశౌర్య
కేలికాళిచే నీకనుల్ ♦ కాలిపోయి
నను స్పృశింతు వైనను నీకుఁ ♦ దనువు లేదె?

సీ. శౌర్యరసపాటవమునను ♦ సమయసముచి
తప్రశస్తమాయాకలా ♦ దక్షతను యు
రుల గెలువఁదగు ముకుమూసి ♦ మడిని గట్టి
యోరగిల్లినఁ జత్తురే ♦ వైరివరులు.

సీ. శ్రీకరిమకుఁ బెంకితనము; ♦ త్యాగమునకుఁ
గఱకుఁదనము; కవితకు వా ♦ క్స్వతంత్రతయు;
వీర్యమునకు మాయయు; వన్నెఁ ♦ బెట్టు; బండ
బలము తలఁ గొట్టికొనుటకే ♦ పనికివచ్చు.

అనఘిని నీకు మాటలచేత నే నుపదేశించుచుంటిని గా
ముఁడు నీకుఁ గ్రియచేతనే యుపదేశించినాఁడు గాదా?

రా—ఏమి చేసె?

రావ—ఏమి చేసెనా! మఱపా! మొండితనమా? సిగ్గుమాలినతనమా
ఏమిచేసెనా? నీతండ్రిని జంపి—నీగొంతుకఁ గోసి—

సీ. చెట్టుచాటునఁ బొంచి ♦ చట్టున విల్వంచి
చటుకున మనకయుండఁ ♦ జిటుకలోన
నిరపరాధుండైన ♦ నీతండ్రి నిట్టె నీ
ల్గుడుగకుండఁగ వడిఁ ♦ బుడమిఁ బడఁగ
జేయవనరాదుని ♦ చేష్ట దొంగతనము
కాదో! మహామాయ ♦ కాదా! గుంట
నక్కతనము గాదా! ♦ నాన లేక, భుజసా
రమును లేక, మగత ♦ నమును లేక,

గీ. పందవై చచ్చి యుండక ♦ వానిపాద
ములఁ గడిగి తీర్థముగఁ ద్రావఁ ♦ దలఁచినావొ
యేమొగము వెట్టికొని వచ్చి ♦ తిటకు రామ
దూత నంచు? నధమ! పాపి! ♦ తులువ! పంద!

ం——చీ! చీ! దురాత్మా! పదితలకాయ లుండినందులకు ఫలము యుక్తాయుక్తవిమర్శనానైపుణ్యవిశేషము గాని యిట్లు తెగవాగుటనుకొంటివా? నీ వెక్కడ! రాముఁ డెక్కడ! మూఢా! మదాంధా! కాలచోదితుఁడవై కారు లఱచుచుంటివా? రామచంద్రుఁడు భూభారనిర్వాపణమునకై యవతరించిన శ్రీమన్నారాయణుఁడని యెఱుఁగవా? ఆతఁడు స్వేచ్ఛానుసారముగ లోకభారమును మానుపును. నాతండ్రి యైన నేమి? నీయుత్తాతయైన నేమి? ఆతని కేమిఁగణన యనుకొంటివా? బ్రతుకఁ దలఁచినవాఁడవైన 'రామ, రామ, యని లెంపలు వైచుకొనుము.

ావ——నీకు, రామునకు, లక్ష్మణునకు, నీపినతండ్రికి, నతనిమంత్రికి నింక ననేకకపిభల్లుకయోధులకు నొక్కసారి లెంపకాయలమహోత్సవమిచ్చుటకే నా కిన్ని భుజము లీయఁబడినవి. నిత్యసత్యానుష్ఠానమున నపుంసకులై యడవుల నివసించుటచే పశుప్రాయులై కేవలవైదికబ్రాహ్మణదరిద్రు లగుటచే స్తోత్రపాఠకులై సిగ్గు, బిడియము లేనిముదిమిగడ్డపుమునిమూఢు లీరాముని విష్ణుఁడని, నారాయణుఁడని, గోభూహిరణ్యాదిదానార్థులై స్తుతించిన స్తుతింతురుగాక! శూరుఁడవు, శూరునిపుత్త్రుఁడవు, రాముఁడు నీతండ్రినెత్తిఁ గొట్టి నీనోట బెడ్డఁ గొట్టకుండినయెడల రాజ్యార్హుఁడవు; నీ కేమి పోఁగాలమా? రాముఁడు దైవ మని నీవెట్లంటివి? సముద్రబంధనము చేసినాఁ డని మతి చెదఱి యట్లు ప్రేలుచుంటివా?

ు—కాదు. తాతకుఁ దండ్రియైన శ్రీమన్నారాయణమూర్తి కథ.

ావ—హా. హా. రామనామమాహాత్మ్యము ఆలమదింపునందు విని యోగించెనా?

ం—ఇప్పటివఱకంతే కాని కొలఁదికాలములో రావణమథనమునకై విని యోగింప నున్నది

ావ—రావణమథనము! అబ్బ! రావణమథనమునకు నేఁటికి మహాశూరుఁడు బయలుదేరినాఁడు. ఫాలాక్షుని తృణప్రాయముగ భావించినలంకానాథుని జాపఁగలజగదేకవీరుఁడు నేఁడు తారసిల్లినాఁడు. పదునాలుగులోకము లొక్కపెట్టున భస్మముసేయఁగలబ్రహ్మప్రపౌత్త్రుని బరిమార్పఁగలమహాపరాక్రమశాలి నేఁడు సమకూడినాఁడు.

ం—సెబాస్! రావణా! గంభీరమైననీవాణి సత్యముచే నెంతయింతగ శోభించుచున్నది! తథాస్తు! కాని నా ఆలస్య మగుచున్నది. రామసందేశము నీఁక వినెదవా?

ావ—వినుట కేమున్నది! రామసేవకాధముఁడవైననీనోటివెంట నే రావణమథనము బయలువెడలుచుండఁగ రాముఁడుమాత్ర మంతకంటెఁ బలుకఁదగిన దేమున్నది?

మ—మహాప్రభూ! శత్రుసందేశము విననని నిరాకరింపఁ గూడదు. క్షమింపవలయును.

వ—ఆఁ! కానీ.

—సీ. భూసుతను మాకు సాష్టాంగ ♦ పూర్వకముగ
నర్పణముఁ జేసి శరణార్థి ♦ వయిబ్రదుకుము;
లేనియెడ బ్రహ్మశంకరు ♦ లైననిన్నుఁ
గావలే రస్మదీయమా ♦ ర్గణమునుండి.

అని రాఘవుఁడు పలికెను.

రావ— గీ. తాను మగవాఁడు కాఁడొ! తా ♦ లోనికి దయ
సేయరాదొ! తా సతిని తీ ♦ సికొనరాదొ!
యేను బంపినఁ గాని గ్ర ♦ హింపఁ దగదొ!
తలుపుచాటునఁ గూర్చుండి ♦ దౌత్య మేల?

అం— గీ. తాను పురుషోత్తముఁడె యౌను ♦ తా నిటుపయి
లోపలికి వచ్చు త్వద్భిరో ♦ ఋరదనంత
రక్తభరమునభూతల ♦ ర్పణము సేయు
సీతను జయలక్ష్మిఁ గొని వేం ♦ చేయు నిజము.

ఈదినము ఫాల్గుణబహుళనవమి. ఈరాత్రి యుద్ధ మారంభ కాచికొనుము. నేను బోయెద.

రావ—సరే! కాని చూడు! మావిభీషణయ్య మీతోపాటు పర గవతోత్తముఁడై యుండెనా?

ప్ర—(తనలో) ఆహా! సోదరప్రేమము బలీయముగదా?

అం—ప్రబనుకఁ దలఁచినవానికిఁ బరము నపేక్షించినవానికి భగవ ద్యముకంటె వే తేమున్నది? విభీషణయ్య యనెద వేమి మహారాజనుము.

రావ—ఆఁ! ఆఁ! నేను జీవించియుండఁగనే, విభీషణుఁడు మహా రాజయ్యెను?

అం—నీవుజీవించి యున్నట్లు నీ వనుకొనుచుంటివి కాని నీవు ర చినట్లే నిశ్చయపఱుచుకొని యీలంకారాజ్యమున కాతని మచంద్రుఁడు పట్టాభిషిక్తుని జేసినాఁడు.

రావ—ఆఁ! ఆఁ! నిజముగానే?

అం—ఒక్కనాలుకవాఁడ నసత్య మెట్లాడఁగలను?

ద్వా—(అప) అనురాధ్యత్నా! ఈశూలపుఁబోటున నిన్ను నన్ను గుది చ్చినాఁడుసుమా?

రావ.—విభీషణుని లంకారాజ్యమున నభిషిక్తుని జేసినాఁడా? ఆహా! ఏమి వదాన్యుఁడు! ఏమి యుత్తమపురుషుఁడు! ఏమి మహానుభావుఁడు! ఏమి స్వపరద్రవ్యభేదశూన్యుఁడు! ఏమి మహాజ్ఞాని! ఆహా! అవతారపురుషుఁ డని నీవు చెప్పినమాట నిశ్చయమే.

సీ. తనపట్టవిభవంబు ♦ దగ్ధమై పోయి, కై
 కేయిచే మెడఁ బట్టి ♦ గెంటఁబడఁగ
గతిలేక, యేడ్చుచుఁ, ♦ గాంతతోఁ దమ్మితో
 వనమున నెదురీతఁ ♦ బడుచు, వచ్చి
పతి నేను హరియింప, ♦ సాఁబాలు చచ్చి, క్రోఁ
 తులలోన గద్దరి ♦ తులువ యగుచు,
తనదాసులకుఁ బర ♦ ధరణీధవులరాజ్య
 ములఁ బంచిపెట్టుచు ♦ మొండిదేతి
గీ. పడఁబుచున్నాఁడె? యీరాష్ట్ర ♦ భరము తనదు
సామ్మొ? తనబాబుసామ్మొనె? ♦ సుదతితోడ
మతి దొలంగెనో? యసురాధి ♦ పతిని హుఁహుఁహుఁ
ఏమనుకొనుచున్నాఁడో? యే ♦ మీ! నరాధ
ముసకుఁ గన్నులు పోయెఁ గాఁ ♦ బోలు నేమి?
గీ. తనసతిని నేను గొనఁ గుదయో! ♦ యనుచు నేడ్చు
చిటకు వచ్చెఁగా యొకనిసొ ♦ మ్మొకనికిడ
నాతఁ డెంతక్షోభించునో ♦ యనుభవమున
నీపరద్రవ్యవేదాంతి ♦ యెఱుఁగవలదె?
గీ. ఇటుల రానీ! కనులఁ బడ ♦ నీ! విలు గొని
మగతనమున నిల్వఁబడనీ! ♦ మాదుదెబ్బ
వాచవులు బ్రహ్మరంధ్రంబుఁ ♦ బట్టఁ దెలియు
నిప్పుడేల? కానీ! నాకు ♦ నీ డెవండు?

అం—సీ. ఆదాడ నీదాడ ♦ నట్టె చెప్పినఁ గొట్టెఁ
డా? నిన్నుఁ గార్చ్రీ ♦ ర్యాబుసనుంచు
బొట్టెలు పదిగల ♦ పురు గంచు నుష్ణాన
నూదరే? శ్వేతదే ♦ శోద్ధకాంత
లలనాఁడు మాతండ్రి ♦ యట్టె ని గ్గహాంత
రంబున నిక్షేంచి ♦ యంబుధులను
ముంచి, కెక్కురు మని ♦ పించి, మాయింటిలో
విడిపించి, శిశువునై ♦ వెలయునాడు

గీ. మంచముదిగునఁ గట్టించి ♦ యుంచ బుగ్గ
మీసలు గఱుసుదేఱ నీ ♦ మీఁదనేను
మూత్రము విడిచినబలుసొం ♦ పు మఱచితివె?
యేల పదరెదు? తులువ! యీ ♦ డెవ్వఁ డనుచు.

రావ—ఆఁ! ఆఁ! ఆఁ! ఎవ రక్కడ! పట్టుకో! కొట్టు! ఎవ రక్కడ! చంపు! నఱుకు! ఆఁ, ఆఁ! (నలుగురుభటులు వచ్చి పట్టుకొనుచున్నారు)

అం—నే నిదివఱకు వెళ్లెద నని నీతోఁ జెప్పి యుంటిని. నీతనువు నుండి ప్రాణపంచకము వెడల నున్నట్లు నీసభనుండి యిప్పుడు మఱి నలుగురితో వెళ్లుచున్నాను. (నలుగురురాక్షసుల నీడ్చుకొపోవును.)

రావ—అన్నా! ఆగడము. ఈచండాలుఁడు సభానర్హము లైనమెన్ని కాఱు లఱచినాఁడో!

ప్ర—క్రోఁతిముండకొడుకున కర్హతానర్హత లెట్లు తెలియఁగలవు? మీరు శాంతి నొందవలయును. వానికిఁ జావుసమీపించుటచేనట్లు ప్రేలినాఁడు.

అం—(నేపథ్యమున) నాకుఁ గాదు. మీకుఁ జావు సమీపించి నది. కాచికొండి. (పెద్దధ్వని యగును.)

ప్ర—అయ్యయ్యో! అంగదుఁడు మేడగోపురమును విఱుగఁ ద్రొక్కుచున్నాఁడు. ఇటు ఇటు తప్పించుకొనుఁడు అయ్యయ్యో! గోపురాగ్రము కూలినది. (నేపథ్యమున పెద్దధ్వని)

(రావణుఁడు తప్ప నందఱు భయమున నోసరిల్లుదురు.)

ద్వి—మహాప్రభూ! గోపురమున కేమిగాని మన మిప్పటికి బ్రదికితిమి.

రావ—ధనుస్సు. ధను స్సేదీ? ప్రహస్తా!

ప్ర—మహాప్రభూ! ఇఁక నక్కడ లేఁడు. అప్పుడే యెగిరిపోయినాఁడు.

రావ—ద్విజిహ్వా! గోపురము మీఁదఁ బడకుండ బ్రదికితి మనుచుంటివా?

గీ. అఖిలనక్షత్రతారాగ్ర ♦ హతిగార
వ్షబంధురితాకాశ ♦ భారమైన
మీఁదఁ బడినఁ జలింపని ♦ మేటిమగఁడు
చచ్చె గోపురపతనంబు ♦ సరకు గానునె?

ద్వి—(తనలో) గోపురాగ్రపతనమునఁ జత్తు మేమో యని భయపడినన న్నధిక్షేపింపఁబోయి 'మేటిమగఁడు చచ్చె,' నని తానే చెప్పుకొనుచున్నాఁడు.

రావ—ప్రహస్తా! నాకు వీరితోఁ గొంచెము పని యున్నది నీవు యుద్ధకార్యసన్నాహమం దప్రమత్తుఁడవై యుండుము. పొమ్ము.

ప్ర—చిత్తము. (తనలో)

గీ. చెవిఁ గొఱుకువారు, తార్పుడు ♦ సేయువారు,
కొండెకూఁతలవారును ♦ గోడెగాండ్రు
కుత్సితేశ్వరునకుఁ జాలఁ ♦ గూర్చుప్రియ
తములు సేనానికంటెఁ బ్ర ♦ ధానుకంటె.

సీ. పొట్టివానికి హేళన ♦ నస్థాగ్రి మొంపు;
పొట్టవానికి మితిలేని ♦ పొలఁతివాంఛ;
కాలుపొడుగువానికిఁ దెగ ♦ నీలు గెంతో;
తలబఱువువాని కీమూఁడు ♦ చెలఁగు మిగుల.

రావ — మిత్రులారా! చూచితిరా? అనుజుఁ డావిధముగ నరిపక్షమునఁ జేరెను. అసాధ్య మనుకొనిన యంభోధి బంధనమైనది. రాముఁడు కపిసేనతో లంకను ముట్టడించినాఁడు. జానకి యింతవఱకు మదధీన కాదయ్యెను. ఏమిసేయుదును?

మ — మూఁడు చిటికెలలో — ఱెప్పపాటులో — ఆఁ, యనువంతలో — ఎకాఎకిఁ బదుసరికి మీకు సీత లొంగి చెప్పినట్లు విని మీయందు బద్ధానురాగ యగునట్లు చేయుదునా? నాచమత్కారము. నా చాకచక్యము. నానైపుణి — ఇదిగో! ఇప్పుడే!

ద్వి — మహోదరా! స్త్రీరహస్యపరిజ్ఞానమున నీవు స్త్రీకంటెఁ బ్రబలుఁడవు. (అప) అనురాగశీలా! వీఁడుదొంగ — తుచ్ఛుఁడు — అవిశ్వసనీయుఁడు — జాగ్రత్త.

రావ — మహోదరా! నీవెట్లు సీతను నాకు విధేయ యగునట్లు చేయఁగలవు?

మ — ఎన్ని స్త్రీవశీకరణమంత్రములు! ఎన్ని తంత్రములు! ఎన్ని మూలికలు! ఎన్ని చిటికెలు! ఎన్ని మోహనకములు! ఎన్నిమత్తులు! గ్రుడ్లు పీకవచ్చినగయ్యాళియైన సరే! ఉఫ్ఫూ మనుసరికిఁ జచ్చినట్లు క్రిం- కావలసినదే! ఎంతసామగ్రి లేనిదే నే నింతకాలమునుండి, యింతబహుళముగ వ్యవహరింపఁగలిగియుందునా?

ద్వి — ఇప్పుడు దివాలా వచ్చినది — ఉవిదవాంఛకు నుదరమునకుఁ దప్ప

సీ. మంత్రములఁ గాంత లభిచార ♦ తంత్రములను
శత్రుమృతి, దీవనముల నై ♦ శ్వర్యములును,

రక్తరేఖలఁ బుత్త్రులు ♦ ర్వరలభింప
నితఁడె లోకాధినాథుఁడై ♦ యెసఁగుఁ గాదె.

దీ—మంత్రములు, తంత్రము లున్నవనుమాట నిశ్చయమే. కాని యది సామాన్యులకు; బలహీనులకు. అది మీ కేల? అది గాక,

ఆ. వె. వనిత యొకతె, పెంకి ♦ వారువ మొక్కటి,
వాతజాతి దైన ♦ వ్యాధియొకటి,
సౌమ్యలాలనమున ♦ స్వాధీనపడ వట్టె
బలిమిచేత వానిఁ ♦ బట్టవలయు.

రావ—ఆమాత్రపుటవకాశ మున్న నే నూరక యుందునా? ఇదివఱకే జానకిని బలాత్కరించి యుందును.

మ—అది గాక బలాత్కారమున రస మేమున్నది?

ఆ. వె. కాంతరాగ మొకటి ♦ గానంపు రాగ మొ
క్కటి తమంతఁ దామె ♦ పొటకరింప
ముద మొసంగుఁ గాని ♦ బెదరించి లాగుచో
నాఱునొక్కరాగ ♦ మగును కాదె?

ద్వి—ఈపాటికి నీసప్తరాగపాండిత్యమును గట్టిపెట్టుము. మహాప్రభూ సీతాబలాత్కారమునకు మీ కభ్యంతర మేమున్నది?

రావ—గీ. పుంజికస్థల యను స్వర్గ ♦ పుష్పగంధిఁ
గని బలాత్కరింపఁగ నది ♦ కంజభవుని
సన్నిధికి నేగి రోదన ♦ సహిత యగుచు
నేను జేసినపని యంత ♦ నిజముఁ దెలిపె.

గీ. బ్రహ్మ యప్పుడు కోపవి ♦ భ్రమము గదుర
నిటుపయిని నీవు స్త్రీబలా ♦ త్కృతి నొనర్ప
నీతలలు వేయిభిన్నంబు ♦ లై తనర్చు;
ననుచు శపియించె; నిదియె య ♦ భ్యంతరంబు.

ద్వా—మహారాజా! ఇదిశాపమువలె నాకుఁ దోఁచెను. దశకంధరుఁడ వింక సహస్రకంధరుఁడవగుదు వేమో?

దీ—హీహీ! కాంతాబలాత్కారమునకుఁ గొప్పయుపరోధమే యయ్యె న్నది. కావున నింక మహోదరునిమోహనమార్గమే మేలు.

రావ—మహోదరా! సీతావశ్యమునకు మన మిప్పు డుపయోగింపవ లసినది మంత్రమా?

మ—అతఁడుమారుఁడు గతించి యొకపక్షమైనఁ గాలేదు కావున నిప్పు డు మంత్రము ఫలింపదు. తంత్రమే కర్తవ్యము.

రావ—సరే. కానిమ్ము.

మ—కొన్ని మోహనలేపము లున్నవి. వాని నొక్కజాము మీరు సీత యొడలికి మర్దింపవలయును.

ద్వా—హే. హే. హే. ఓరి నీతెలివి కాలిపోను. మూఁడుగంటలసే మర్దించుటకుఁ జన విచ్చిన నైనయెడల మర్దనౌషధ మెందులకు?

మ—పోనీ! అదే యన్నమాట యేమి? మనయొద్ద నెంతసర కున్న ఆదివార ముదయమున నరఁటి చెట్టుపైఁ దూర్పుశాఖను దక్షి ణోత్తరమధ్యముఖమై మరణించిన యూసరి వెల్లిఁ దోఁకఁ దెచ్చియా ది సీత చెవిలోఁ ద్రిప్పవలయును. ఇదియుఁ గష్టమనితోఁచినయెడల మఱియొకటి చెప్పెదను. పిచ్చుకరక్తమునుదెచ్చి యామెకన్ను లకుఁ గలికమును వేయవలయును.

ద్వా—ఓరి మూర్ఖుఁడా! ఆమె మహారాజుగారివంకఁ జూడనే చూడదుక దా? ఎట్లు కలికము వేయు నని తలఁచుచుంటివి?

మ—ఏలాగుననో పట్టి వేయవలయును.

ద్వా—మహోదరా! పట్టి వేయుట బలాత్కార మని యెఱుఁగవా. (అప) మహాప్రభూ! వీఁడు మీకక్షేమమును మిత్రరూపమునఁ గోరుచున్నాఁడు.

రావ—మహోదరా! నీవు చెప్పినక్రియలు నచ్చలేదు. మేమామె ను స్పృశింపకుండ నామె మాకు వశ్య యగుసాధన మున్నయెడలఁ జెప్పుము.

మ—అభ్యంతర మేమి? మీ రామె యెనుట నిలువఁబడుసరికి మిమ్ముఁ జూచి మోహించునట్లు చేసిన చాలునా?

రావ—అంతకంటెఁ గావలసిన దేమున్నది.

మ—అట్లయిన నొకపరమహంసక్రియ! మహాప్రభూ!

గీ. మిరియములు నైలతుత్తంబు ♦ నరుగఁదీసి
నల్ల పిల్లి కన్నులఁబెట్టి ♦ బిల్లి తుమ్ము
నపుడు ముక్కులోనుండి జా ♦ యి పడు; దాని
నోటిలోఁ బెట్టికొని సీత ♦ ను గనవలయు.

ద్వి—ఈపరమహంసక్రియ మనదశకంధరమహారాజుగారు పుట్టకముందుఁ జెప్పఁబడినది. ఇప్పుడిది యక్కఱకు రాదు.

రావ—ఏల?

ద్వి—నల్లపిల్లి యొక్కటి దొరకుటయే దుర్లభము. అట్టిచోఁ బది యెక్కడలభించును? పదినోళ్లకుఁ బదిరాళ్లు కావలదా?

మ—ఆసందేహ మక్కఱ లేదు. నే నీవృత్తిలోఁ దిరుగుచున్నవాఁడను గానఁ దొమ్మిదినల్లపిల్లులను జాగ్రత్త పెట్టినాను.

దీ—పదవపిల్లినిగూర్చి చింత లేదు. ఇంద్రజిత్తు నికుంభిలాహోమము నిమిత్తము క్రొత్తగా నొకపిల్లిని బెంచుచున్నాఁడు. క్రొత్తపిల్లిని జంపవచ్చును.

మ—క్రొత్తపిల్లిని జంప నక్కఱలేదు. తన్నాసాగతపాషాణమే మనకుఁ గావలయును.

దీ—సరే. మహోదరా! నీవే పోయి యాజాలను దీసికొని రమ్ము.

మ—ఇదిగో! వెళ్లెదను. (నిష్క్రమించును.)

రావ—కాలమార్గాలములశిరస్సుల త్రాలుంచునా?

దీ—కళాశాస్త్రసాంప్రదాయమది.

ద్వా—కవిసమయముమాత్రము కాదు.

దీ—హా. హా! ఈతఁడు గ్రుడ్డికవిగారిశిష్యుఁడు. ఈతఁ డెందునకుఁ బని. కిరాకపోవుటచే నిప్పుడు గవిత్వ మభ్యసించుచున్నాఁడు.

రావ—గ్రుడ్డికవిగా రెవరు?

దీ—శుక్రాచార్యులవారు.

ద్వా—దీర్ఘకాయా! మూర్ఖా! న న్నధిక్షేపించుచుంటివా? మూర్ఖతరుడవై మాగురువుగారినిగూడ నధిక్షేపించుచుంటివా? నే నెందులకుఁ బనికిరానివాఁడనా? విషౌషధప్రయోగమున లోకులను జంపునిన్ను విషమాక్షరప్రయోగమున నేను జంపుటకంటెఁ బ్రయోజకత యే మున్నది? కాచికో!

రావ—అయినను నీ కిప్పుడు కవిత్వ మెందులకు?

ద్వా—మహాప్రభూ! రావణవిజయ మనుప్రబంధమును మొదలుపెట్టితిని.

రావ—రావణుఁడు గెలువనీ చెప్పవచ్చును.

ద్వా—మహాప్రభూ! అంతదనుక నేను జీవించి యుండవలదా?

దీ—కష్టపడి కవినాశక మైనగ్రంథమును వ్రాయుటకంటెఁ గష్టహీనమరణప్రద మగు నాసంచికట్టులోని దొకమాత్ర వేసికొనరాదా?

ద్వా—మీరు రాజవైద్యు లండి. మావంటినిర్భాగ్యులను మీరు చూచెదరండి. మీమాత్రలు ప్రభువుల కిచ్చెదరు గాని—

(నేపథ్యమున) ప్రభువులవారి కిచ్చుటకొఱకే తీసికొని వచ్చుచున్నాను. పాషాణపుమాత్రలు గావు. పాషాణమాత్రము లే.

దీ—మహోదరుఁడు వచ్చుచున్నాఁడు. (మహోదరుఁడు ప్రవేశించును.)

రావ—తాళం దెచ్చితివా?

మ—ఇవిగో! ఇవి నోళ్ల నుంచుకొనుఁడు. (ఇచ్చును.)

రావ—మహోదరా! నా కొక్కసందేహము తోఁచుచున్నది.

మ—సందేహ మేల? ఆజ్ఞాపింపవలయును.

రావ—రాముఁడు మరణించినఁగాని సీతకు నాపై ననురాగము గలుగదు.

మ—ఏల?

రావ—గీ. కాంతుపై నాశలు నిరాశ ♦ గాకయుండఁ
బరవిభుని జేర దెప్పుడు ♦ పరమసాధ్వి
మానససరస్సు తుహినపా ♦ షాణవృతము
గాక క్రౌంచాద్రిఁ జేరదు ♦ గాదె హంసి.

మ—జనప్రకృతి యట్టు లని నాకుఁ దోఁచదు. అందుపై స్త్రీప్రకృతి బొత్తుగ నది కాదు.

గీ. ఖలతరావలంబన మొందు ♦ గలుగకుండఁ
బ్రస్తుతావస్థ పీడ స్వ ♦ భావ మగునె?
ముక్కుకాళ్లకు పట్టెదో ♦ చిక్కకుండ
జడమగుపురు గయినను గా ♦ లిడునె ముందు?

నీవు మహావైభవసంపన్నుఁడవు. నిన్ను జూచి మక్కువతో సీత యిదివఱకే యుండవచ్చును. లేనియెడల నామందు లట్టిమక్కువను గలిగింపఁగలవు. సందేహింపకుము.

రావ—నీవు చెప్పినది సాధ్వీలక్షణము గాదు. నాయభిప్రాయము నీవు తెలిసికొనలేకుంటివి. రాముఁడు వచ్చును; యుద్ధము సేయును; నన్ను గెలుచును; తన్నుఁ దీసికొనిపోవు ననునాశలు సీత కున్నంతకాల మామె నన్ను వరింపదు. ఈనాలుగాసలలో నొకయాస నెఱవేఱినది. మిగిలినవికూడ నేల నెఱవేఱకపోవు

నను వెట్టితన మిప్పు డామె నావహించి యున్నది. ఆయాశలను జెడఁగొట్ట వలయును. అనఁగ రాముఁడు చచ్చె నట్టిప్పు డామె తో విశ్వాసార్హముగఁ జెప్పవలయును.

ద్వి—ఆమాట చెప్పినతోడనే జానకికూడ మరణించు నేమో?

దీ—చచ్చినతరువాతనైన సరే, తరుణములోమాత్రము నామాత్ర ప డినయెడలఁ బ్రతికి తీరవలసినదే!

ద్వి—హే. హే. హే. ఇదుగో! అపరబ్రహ్మ!

రావ—సీత మరణించుట సంభవింపదులే. ఆసంగతి నాకుఁ దెలియు ను. ఆమె మంచి గంభ్ర—మహాయోధ—గట్టి గుండెనిబ్బర ముగలది—జేల యైనయెడల నిదివఱకే మరణించి యుండవలె ను. ఎక్కడి జనస్థానము! ఎక్కడి లంక! ఎక్కడి రామసన్నిధి! ఎక్కడి యశోకవనము! చెక్కు చెదరినదా? జేలవడినదా? టొంకినదా? రాము నెడఁబాసి యెంతకాల మైనది? ఎల్లకాలము దుఃఖము లోకరీతిగ నిలుచునా?

గీ. గాత్రనిర్మాణరీతియే ♦ కాయమందుఁ
గలుగు, గాయంబు మానువఁ ♦ గలదు; చిత్త
వైఖరియు నట్లె శోకంబు ♦ పరిహరించు
మానుపకొనుశక్తి ప్రకృతి ♦ లోనె కలదు.

మ—నిజమే! మహాప్రభూ!

గీ. అతనిస్మృతివార్తఁ దేల్గుట్టి ♦ నప్డు గలుగు
మంటవలె సీతచిత్తంబు ♦ మండు క్షణము
మంత్రముల నది దిగిపోవు ♦ మనదుతంత్ర
చయముచే నిద్దికూడను ♦ సమసిపోవు.

దీ—అదిగాక,

గీ. మాటల లభియింపరానిసా ♦ మగ్రి పోవ
మిగుల వెతఁ జెందఁదగును తి ♦ రిగి లభింపఁ
దగినదాని కేడ్వఁ దగదు ♦ మగనికొఱకు
మఱుగు టాచార మగు నవ ♦ సరము కాదు.

ద్వి—హె. హె. ఈనీతి నీభార్యకు బోధించితివా?

రావ—ద్విజిహ్వా! నీ వుండుము. మహోదరా! రామమరణవార్త ను వైదేహికిఁ జెప్పవలయును.

మ—అద్దే! ఒక్క త్రుటికాలములో—

రావ—దృష్టాంతసహితముగ—విశ్వసనీయముగ—

దీ—అందులకు నేను సిద్ధముగ నున్నాను.

రావ—నీ వేమి చేయుదువు?

దీ—మాయాప్రభావమున రాముశిరమును గల్పించి దాని నామెకుఁ గనుపఱచినఁ జచ్చినట్లు చచ్చినట్లు నమ్మును.

రావ—సెబాస్! కానీ. మాయారామశిరమును దీసికొని రమ్ము.

దీ—ఇప్పుడు—కంటికిఁ గలికము దగిలించినంతలో—

రావ—శిరము సంగ్రహించి నీవు ద్వారమునొద్దనే యుండుము. నేను బిలిచినప్పుడు లోనికి రావచ్చును.

దీ—చిత్తము.

రావ—ద్విజిహ్వా! నీవు పోయి సీత నానవమల్లికలపందిరిక్రిందికిఁ దీసికొని రమ్మని నాసెలవుగా సరమతోఁ జెప్పుము.

ద్వి—చిత్తము. (పోవును.)

రావ—(తనలో)

గీ. నేస్తము సమస్థితిని గాని ♦ నిలువకుండుఁ
గాన ద్విమ్మాధవునకు నేస్త ♦ గాండ్రు లేరు

(ద్విజిహ్వుఁడు, సీత, సరమ ప్రవేశింతురు.)

మ—(అప) మహాప్రభూ! మీరు సిద్ధముగ నుండుఁడు.

గీ. కోరమీసాల నెడ్రసేసి ♦ కోరచూపు
లందు రాగంబు తవణింప ♦ మందహాస
సంపదలు కోరలను బిసా ♦ ళింపఁ బెండ్లి
కొడుకులాగునఁ గులుకుచు ♦ నిలువు మయ్య!

రావ—(అప) ఏమి నీవెఱ్ఱితనము! మన పైమెఱుఁగులు టక్కులు వేసాలు నెయ్యారములవలన స్వాధీన యగునది కాదు. ఈమె కడు జాణ.

మ—(అప) జాణ యైన సరే జాణసత్తిపై నెగిరిపోవునదైన సరే మనతంత్రమునకు లొంగనిది కాదు. ఆలు నోటిలో నున్నవి కాదా?

రావ—ఆ!

ద్వి—మహాప్రభూ! సీతాసాన్నిధ్యమునకు దయ సేయుఁడు.

రావ—ఇదిగో! (సీతయొద్దకుఁ బోవును.)

మ—(అప) మహాప్రభూ! సీతావదనము మునుపటికంటెఁ బ్రసన్నమై యున్నట్లు కానుపించుట లేదా?

రావ—(అప) అలాగే యున్నట్లు తోఁచుచున్నది.

మ—(అప) అలాగే యనఁగ నాకుఁ దెలియలేదు. మునుపటివలెనే యున్నదా? ప్రసన్నముగ నున్నదా?

రావ—(అప)

గీ. ముంగురులయుంగరములఁ దు ♦ అంగలించు
నుదురు చిట్టింపఁగాలేదు ♦ నోటిమూల
లు దిగువకు వంపలేదు; ని ♦ దుదగుముక్కు
ప్రక్క ముడుతలు లేవు; త ♦ ళ్కొక్కె మొగము.

మ——(అప) చూచితిరా? మార్జాలనాసికాపాషాణమాహాత్మ్యము.

రావ——(అప) ద్విజిహ్వునియభిప్రాయ మెట్లున్నదో యడిగెదను.

మ——(అప) వలదు. మహాప్రభూ! వాఁ డేదో వంకకూఁతఁ గూయును.

రావ——(అప) తొందర లేదు. ద్విజిహ్వా! సీతావదన మీదినము నిర్మలముగ నిష్కళంకముగ నుండలేదా?

ద్వి——అలాగున నుండదా?

రావ——ఏలయుండవలయును?

ద్వి——కాఁదగని సేతుబంధన మైనది. రాఁదగనిరాముఁడు వచ్చినాఁడు. ఇంక బొందఁదగినసంతోష మామె పొందుట వింతయేల?

మ——(అప) చూచితిరా? తుచ్ఛునినాస్తికత!

ద్వి——నీ వేమో మహారాజుగారి చెవిఁ గొఱుకుచున్నావు. నీమందుగుణమును పొంగుచుంటివి కాబోలు! చాలించు.

రావ——సంశయవిచ్ఛేదమును జేసెదను. త్రిలోకసుందరీ! జానకీ!

సీత——(పరమవంకఁ దిరిగి కొంచెము నవ్వును.)

మ——(అప) సెబాస్! సెబాస్! ఇఁక నేమి? నగను గుణ మెత్తినది. చూచితిరా? మహాప్రభూ! మందమందహాససుందరత!

రావ——(అప) ఆహా! కనిపెట్టితిని. ఇరువదికన్నుల కొక్కసారి కలుఁగరునట్లుగఁ గనిపెట్టితిని.

మ——(అప) ఇం కొకనిమిసమునకుఁ జూడుఁడు. ఇరువదిబాహువులు ప్రదత తీఱునట్లు కౌఁగిలించెదరు.

రావ——(అప) ఆహా!

గీ. నానయందుండి చిన్నారి ♦ శ్యామ మొప్పు
వదన మెడమప్రక్కకుఁద్రిప్పి ♦ పెదవులు విడి
విడనియట్లుగఁ గుడిచెంప ♦ వెనుక సేయు
నరమఁ గని సేయుమందహా ♦ సంబె చాలు.

మ—(అప) మీరు చాలునన్న సౌషధ మూరకుండునా?

ద్వి—(అప) మహాప్రభూ! వైదేహి యేల నవ్వెనో యూహించితిరా?

రావ—(అప) నీవు చెప్పుము.

మ—(అప) వీఁడు ద్విజిహ్వుఁడు కాఁడు. ద్విగవీఁడుడుగాఁడు. మహాప్రభూ! నీనితో మీ కాలోచన మెందులకు?

ద్వి—(అప) తల తప్పించిన నాలుగుమలకవృష్టధాన్యము పట్టఁగలయొర లగా దెవంటి యీమహోదరుని ముడుతలుగల పెద్దకడుపును జూచి యామె నవ్వి యుండును.

మ—ఈకడుపు నాకీదినముననే వచ్చినదా? సీత నన్నీ వేళనే చూచి నదా?

రావ—అదిగాక—నేను జానకీ! యని పిలిచినప్పుడుగదా నవ్వినది. ద్విజిహ్వ! నీ వట్లనెద వేల?

ద్వి—మహాప్రభూ! మిమ్ములను గాంచి మందహాసము చేసిన దనియే నా మీయభిప్రాయము?

రావ—అలాగే యెంచవలసియున్నది.

ద్వి—మహారాజా! మీపై ననురాగముచే నవ్విన దని మీరు బహు మానించుకొనఁ దగదు. ఆనవ్వు చాల వికటముగ నున్నది.

రావ—వికట మనఁగ నేమి?

ద్వి—అనురాగసహితము కాదని—

రావ—కాక—

ద్వి—హేయతాయుక్తము.

రావ—ఏల?

—సూర్యకాంతి సూర్యుని ద్యజించి యె ట్లుండదో రాముని విడిచి మనస్సు చేనైనఁ దా నుండ ననియు, నీవెట్టియాసలు మానుకొ నుమనియు, నెన్నిసారులు చెప్పినను వీని కింక మతి లేదా? హి.

మోచలమంతకడువుగలవెఱ్ఱిమొగమును వెంటఁబెట్టికొని తగుద
నమ్మ యనుచు జానకీ నామాటయేమని తిరిగియీతఁడు సిద్ధ
డినాఁడు. అదిగాక మహాయుద్ధారంభసమయమం దీతని కీమద
నవికారమున కవకాశ మెట్లు కలిగెను? లంఘనములలో నీమ
నుగుడువుముచ్చట లేల? ప్రాయశ్చిత్తకాలమున పరస్త్రీవాంఛ
ల? మహామరణసమయంబున నీమంగళపుటారతు లేల? యనియా
మె నిందాగర్భితముగ నవ్వి యుండును.

మ—ఆఁ! ఆఁ! మూర్ఖా! వృథాగాడంబరా! ఆనవ్వున కింత యర్థము
న్నదా?

ద్వి—లేదా? సరసము, వికట మని నవ్వులు రెండువిధములు. సరసహా
సముగౌరవానురాగాంగీకారగర్భితము. వికటహాసము నిందా
సూయా హేళనగర్భితము.

మ—ఏన వ్వేదియో నీ వెట్లు కనిపెట్టఁగలవు?

ద్వి—అనుభవమున—

మ—అనుభవముమాట యటుంచుము. దేనినిబట్టి వానివిభాగ మేర్ప
డును?

ద్వి—నవ్వువైఖరిని బట్టియే భేద మేర్పడును.

గీ. పండ్ల నిగిలించు టొకటైనఁ ♦ బరగ నవ్వు
విధముఁబట్టి నరసమును ♦ వికట మగును;
స్వర మొకటియైన నాలాప ♦ సరణిఁబట్టి
నురట కేదారగౌళ యన్ ♦ గుఱుతు తెదె?

రావ—ద్విజిహ్వా! నీ వికనోరు మూసికొనుము.

ద్వి—(తనలో) ఒక్కనోటి నెంతసేపు మూసికొనవలయును?

రావ—హా! ప్రాణప్రియా! జానకీ!

గీ. అతివ లేనైన సరె తనూ ♦ జాదు లేమి
యైనను సరియె రాష్ట్రమే ♦ మైన సరియె
ఎవరితో దేనితో నాకు ♦ నింతపనియు
నీడ లేదు నీపాదాల ♦ తోడఁ దప్ప.

సీత—సరమా! ఈతనియంతఃకరణవృత్తి నిగాఢ మైనది.

మ—(అప) చూచితివా? ఒప్పుకొన్నది. శాస్త్ర మసత్య మగునా?
మంత్ర తంత్రము లీనాఁడు కల్గినవా?

రావ—(అప) అంతటితో నాఁగినది. ఆయాఁగుట నాకు సందేహాస్పద
ముగ నున్నది.

సీత—ఈతనియంతఃకరణవృత్తి నిగాఢ మైనది. పశుపత్నీసుతాలయా
దైహికవస్తువిరాగయుక్తుఁ డగునీతనిచిత్తము కేవలపరతంత్ర
నగునాపాదముల లగ్న మగుటకంటె సర్వతంత్రస్వతంత్రుఁడు,
భగవానుఁడు, నానాథుఁడు నగుశ్రీరామచంద్రునిపాదారవిం
దముల లగ్నమై యుండునెడల నిట్టిభక్త్యావేశము మఱియొక
చోట నుండదు. ఇట్టిభక్తశిఖామణి యుండఁడు. పరమపూజ్య
మైనప్రపత్త్యనుసంధానమునకు మార్గ మిదియే. కావున నన్నుఁ
దీసికొని శ్రీరామమూర్తి కర్పించి యిప్పుడు నన్నుఁ గూర్చి
తా ననినమాటలు మేమిద్దఱ మామహామహునిపాదపద్మములఁ
గూర్చి పలికి శరణ మనినచో నాతఁడు కృతార్థుఁ డగును. నేను
గృతార్థ నగుదును. ఇట్టిరాగగభీరతాప్రపూర్ణ మైనచిత్తవృత్తి
తుచ్ఛసుఖాపేక్షయందు నిబద్ధ మగుటచే నాకు మిగుల సంతా
పకరముగ నున్నది. పూర్వజన్మమహాపుణ్యమునఁ గాని లభింప
నిమహాపురుషుఁ డూరుబయట నున్నాఁడు. బుద్ధిహీనుఁ డై
యీయవసరమును వృథ పోనీయవల దని యాతనితోఁ జె
ప్పుము.

సర—అమ్మా! నీ వెంతదయార్ద్రహృదయవు! ఎంతజ్ఞానవైరాగ్యసంప న్నవు!

మ—(తనలో) అయ్యయ్యో! కొంప మునిఁగినది. నామోసము ఫలించినది కాదు. మఱియొకమోస మాలోచింతును. మోసమునకుమోసమే విరుగుడు కాదా?

ద్వా—మహోదరా! మందు సందుగొట్టిన దేమి? మొగము దిగఁబడినదేమి? పొంగు పొలిపోయిన దేమి?

రావ—జానకీ! చర్విత చర్వణ మగుపించకు వింక మానవా?

సీత—సరమా! దుర్బుద్ధికి జ్ఞానమునచ్చువఱకుఁ జడువే సాధనముకాదా?

రావ—సీతా! నీనోటివెంట నిట్టిబింకములైనమాటలు నే నిదివఱకు విని యుండలేదు. రాముఁడు వచ్చినాఁ డని గర్వోత్సాహములచేఁ బొంగుచుంటివి కాఁబోలు! అట్టె యెగరనైచి రాముని గీమునిఁ బదునాలుగుముక్కలక్రిందఁ దెగ నఱుకుదు నని యెఱుఁగక నిఁక నా కేమని మిట్టిపడుచుంటివా? జాగ్రత్త! రాముఁడు నాచేఁ జచ్చుట నిశ్చయము. నిన్ను నా కౌఁగిట గ్రుచ్చుట నిశ్చయము.

సీత—దురాత్ముఁడా! మూఢా! మూర్ఖుఁడవై యేమి ప్రేలుచున్నావు? రాముఁడు—మారీచసుబాహుమర్దనుఁడు—తాటకాంతకుఁడు—మహాస్త్రపరిగ్రహణప్రవీణుఁడు—శిష్టపరిపాలకుఁడు—దుష్టరాక్షసాంతకుఁడు—అమోఘసాయకుఁడు—లోకనాయకుఁడు—అవతారపురుషుఁడు—అట్టినానాథునికాలిగోటినైన నీ వంటఁగలవా? ఆమహానుభావునిసీడనైనఁ ద్రొక్కఁగలవా? ఆసహస్రాదిత్యతేజునివంకఁ గన్నెత్తి చూడనైనఁ గలవా? ఏల యీయఱ్ఱులు? ~~ఈ~~ తెగనీలుగుటలు—ఈశౌండీర్యవిజృంభణములు—మహాపురుషాపచారములు—ఇంతటితోనైన నివి కట్టిపెట్టి బ్రదికి

భాగుపడఁదలఁచినవాఁడ నైనయెడల రాముని రెండుపాదములఁ బట్టికొని నెత్తిపైఁ బెట్టుకొనుము. నామూలమున నీవు మృతిఁ బొందుట నా కిష్టము లేదు. (శ్రీ)రామశరణాగతి నీవు సేయవేని నీవు సుతామాత్యబంధుమిత్రకళత్రాదులతో నశింతువు; నశింతువు; ముమ్మాటికిని నశింతువు. పరమా! నీ వీమాట లాతని తో ననుము.

మ——(అప)——మహాప్రభూ! అంతయు వికటముగ వచ్చుచున్నది. ఏదు రెత్తుగ నున్నది. సగిమువఱకుఁ బనిచేసినయూపధము తిరుగఁ బడుటకుఁ గారణ మగపడదు. మహాప్రభూ! క్షమింపవలెను. మీరు నోటిలో నుంచుకొనినజాళ్లలో నొకదానినైన నమల లేదు కద!

రావ——(అప) మెత్తఁగ నుంటచే దేనినైన నమలియే యుందును.

మ——(అప) చెడఁగొట్టినారు. పనిచేసినమందు పాడై పోయినది.

రావ——(అప) ఎందుచేత?

మ——(అప) చప్పరింప నొకగుణము నమలఁగ గేవలవిరుద్ధగుణము కలుగునుగాదా?

గీ. ఇట్టిపాషాణములు చప్ప ♦ రింప నింతి
మఱుఁగు కుక్కయై; నమలఁగఁ ♦ దిరుగఁబడుచుఁ
గఱచు;చప్పరింపఁజాలుప ♦ మఱియు నమలఁ
గాఁక, జేసెడునలకల ♦ కండఁ బోలె.

రావ——(అప) అలాగా? తెలియలేదు. పోనిమ్ము. (ప్రకాశముగ) సీతా? నేను రామునిచేఁ జత్తు నని నీవు ముమ్మాటికి నిశ్శంకముగఁబలికితివి. అలాగే కానిమ్ము. అయినను నేను నీమానము హరింపకుండ, నాయభిసంధి నెఱవేర్చుకొనకుండ మాత్రము చావను. ఈమాట నిశ్చయము. నీమానము నాచేఁ హరింపఁబ

డినవెనుక నాప్రాణము రాముఁడు హరించిన సరే! రామానుజుఁడు హరించిన సరే!

సీత——చంపకసూనమాలికను భృంగ మంటఁగలదా? అగ్నికీలకు గరళవల్లికిఁ జీమలు చేరునా? తుచ్ఛా! వాచాటా! నీవు నన్నంటనీ శిరములు సహస్రధా భిన్నములు కావా?

రావ——హా. హా. (వికటముగనవ్వి) మొదటిశాపము నాకు వేదవతిదా! రెండవది బ్రహ్మదా? మూఁడవది నలకూబరునిదా? నీది నాలుగవశాపమా? కానీ! రాముని బాణములఁ జచ్చుటకంటె నీబాహువులఁ జచ్చుట మేలుకాదా? తలలు భిన్నము లగుటయే కదా? కానీ! అంటినతరువాత కదా! అనుభవించినతరువాత కదా! ఆపైన శిరములు పగిలిన సరే! బ్రహ్మాండము పగిలిన సరే!

సీత——కావరమునఁ గనులు గానక కాంతాలోలతచే యుక్తాయుక్తవివేచకుణత లేక కాఱులు ప్రేలుచున్నావు. నిన్నుఁ జంపుటకై శ్రమపడి యిచ్చుటకు వేంచేయదలఁచి, దయచేసిననానాథుఁ డగు శ్రీరామచంద్రునియభ్యనుజ్ఞ లేకపోవుటచే నూరకుంటిని గాని లేనియెడల నిన్ను తెప్పపాటులో భస్మముగఁ జేయక యుందునా? అదృష్టవంతుఁడవు. బ్రహ్మవంశమునఁ బుట్టి, వేదాధ్యయనసంపన్నుఁడవై, మహావీరులలో నొకఁడవై, శ్రీమహావిష్ణుచక్రకవ్రణాంకితవక్షుస్కుఁడవై, ఇంతకాలము గొప్పగ బ్రదికిననీవు తుద కాఁడుదివిసరినగడ్డిపోచచేఁ జచ్చితి వను నప్రతిష్ఠ లేకుండ నిప్పటివఱకు బ్రదికి యుంటివి. పో!

సర——(అప) మాబావగా రట్టియప్రతిష్ఠకై జంకువారు కారు. శ్వేతకేతుపవాస్తవ్యసుందరియొకతె యీతనిని కాళ్ళుసేతులు కట్టఁగట్టి

సముద్రముదాఁటిపోవునట్లు విసరి వైచుటచే నాయపకీర్తి వాలాయము యుదివఱకుఁ దీరినది.

మ—(అప) మహాప్రభూ! మీరింకఁ దొందరపడవలదు. ఈదినమున కింకమందు పనిసేయదు. మఱియొకదినమున మఱియొకమందుచేఁ బ్రయత్నింతము. ఆ, యనుసరి కాకాశముపై నున్న యరుంధతియైన నిన్నాశ్రయించునట్టియమూల్యౌషధమును జాగ్రత్తపెట్టియుంచెదను. ఈసీతమంకుతనము నీగీతపెంకితనము దుడిచిపెట్టుకొని పోవలయును.

రావ—సీతా! నీవిప్పటికైన బుద్ధి గలిగినదానవై రామునిపైఁ బ్రేమమును ద్యజించి దారిలోఁ బడుదు వేమో యని యెంచి నిదానించి యుంటిని. నీకు బుద్ధిలేదు. సాధుత్వము లేదు. కాలానుగుణప్రవర్తనా నైపుణ్యము లేదు. సుఖపడుయోగము లేదు; అదృష్టము లేదు; ఆయుష్యము లేదు ఇంక నీయెడల దయఁ దలఁపవలసినపని లేదు. కాన నే నింతకుముందే చేయించినపనిని విను; విను. శ్రవణానందకరముగవిను. రాముఁడు చచ్చినాఁడు; చచ్చినాఁడు.

సీత—ఆఁ! ఆఁ!

రావ—కోపపడకుము. క్షమింపుము. తప్పుఁ జెప్పితిని. చంపఁ బడినాఁడు—ప్రహస్తునిచేత—కోడికూఁత వేళ—

సీత—(గద్గదస్వరమున) సరమా! ఇదేమి? ఇదేమి? నానాథుఁడేడీ? ఈవార్తను నమ్మఁ దగునా?

సర—(అప) విశ్వసింప వీలు లేదు.

రావ—సరమ కేమి తెలియును? న న్నడుగుము. మగనిమరణవార్తను గూర్చి కూడ మధ్యవర్తిసంభాషణము లేల?

గీ. హస్తతలములనెదఁ జేర్చి ♦ యాదమఱచి
నిదురఁ జెందఁ బ్రహస్తుఁడు ♦ మెదలకుండ
గుండెమీఁదఁ గాలిడి కొోళ్ళ ♦ కోయు మనఁగ
మొండికత్తి కటకటను ♦ చుండ రాము
నట్లుఁగోసె సీతా! యని ♦ యఱువనతఁడు.

సీత—హా! రామచంద్రప్రభూ! హా! రామచంద్రప్రభూ! మీకుల
తలు మిమ్ము రక్షింతురుగాక!

రావ—చచ్చినవాని రక్షించుటేమి? భక్షించు టనుము. రామచం
ద్రప్రభుఁ డెక్కడ? రాక్షసేంద్రప్రభూ!, యనుము.

సర—(అప) అమ్మా! నీవేమియు సిబ్బంది పడవలదు. ఇది సత్య
నాకుఁ దోఁచదు.

సీత—(అప) అమ్మా! నీనోటివాక్యములు ఫలింపవలెను గాదా?

రావ—

సీ. అన్న యలోలక్ష్మ ♦ ణా! యనుచుండఁ బ
ర్వెత్తె సౌమిత్రి జీ ♦ వేచ్ఛఁ జేసి
సుగ్రీవు గొంతోక ♦ శూరుండు మెలిఁబెట్ట
నొక్కఁన నతనిగ్రు ♦ డ్లూడి పడియె.
చిటినారకమ్మను ♦ జీల్చిన ట్లాంజనే
యుని జీల్చెఁ ద్రొక్కి కా ♦ గొని యొకండు
బుడిబుడి నిలుదాఁటి ♦ పోయినతమ్మన్న
యినుపసంకెలలతో ♦ నిల్లు సేరె

గీ. బొక్కని కపులు తోఁకలు ♦ ముడిచి కిచకి
చ మని మిన్ను మన్ననక పుం ♦ జాలఁ ద్రొంపు
కొని యథాయథలై యెగ్గు ♦ గొడ్లతోడఁ
బోయెఁ దిరిగి చూడక యదె ♦ పోకగాఁగ.

సీత—సరమా! నాకు గుండెలు తల్లడిల్లుచున్నవి. ఇదియంతయుయథా
ర్థమైయుండునా?

సర—(అప) రాక్షసమాయచే యథార్థమే.

రావ—నీకింక నమ్మకము కలుగ లేదు కాంబోలు! ప్రహస్తునిచేఁ జంపఁ
బడినరామునిశిరము నతనిధనుర్బాణసహితముగఁ దెప్పింతునా?
నేత్రానందకరముగఁ జూచెదవా?

సీత—అమ్మా! అమ్మా! అటు లనుచున్నాఁడేమి? అటు లనుచున్నాఁ
డేమి?

రావ—యథార్థవాదుల కనుట యొకటియుఁ జేయుట యొకటియునా?
దీర్ఘకాయా! సచాపబాణ మైనరామశిరమును బళ్లెరములోఁ
బెట్టి యిటు లు తీసికొని రమ్ము.

—(ప్రవేశించి) చిత్తము. తెచ్చితిని.

సీత—అయ్యో! అయ్యో! అది నానాథునిశిరమా? అదినానాథునిశిర
మైయుండునా?

రావ—దీర్ఘకాయా! నేను వివాహ మాడఁదలఁచిన జానకిని దిరిగి
పెండ్లికూఁతును జేయుచు హెూత్సవ మిపుడు సలుపవలయును
గావున రక్త స్రావమనోహర మగురామునిశిరముతోఁ గూడిన
యాపళ్లెరమును గ్రొత్తపెండ్లికూఁతు మొగముచుట్టు వసంతపు
టారతిగ నివాళు లిచ్చియామెయొద్ద నుంచుము.

—(అట్లు చేయును).

సీత—(చూచి) హా! హా! నానాథుఁడే! నానాథుఁడే! అమ్మయ్యో!
అమ్మయ్యో! ఇఁక నేమున్నది? ఇఁక నేమున్నది? హా. హా. హా
(మూర్ఛపడును.)

స—అమ్మా! సీతా! ఊఱడిల్లుము. ఊఱడిల్లుము. (విసరుచుఁ దనలో)
ఇది యంతయు నిజమేకాఁబోలు! అటులైన నాభర్తకుఁ గారా

గృహాయోగము తటస్థించెను గాబోలు! హా! భగవానుఁడా!
న్యాయపక్షమెట్లుగా వర్ధిల్లఁ జేయుచుంటివి? అమ్మా! అమ్మా!
ఇంకను లేవకుంటివేమి తల్లీ!

రావ—(అప) దీర్ఘకాయా! నీమాయాశక్తి మెచ్చఁదగినది.

గీ. కవిత, పాషాణపాంచాలి ♦ కారచనయుఁ,
జిత్రలేఖనము,నలీక ♦ సృష్టి, యనెడు
కృత్రిమములు నాలుగు దైవ ♦ సృష్టిగతికి
నెంతప్రతిబింబముగ నుండ ♦ నంతఘనము.

దీ—(అప) మహాప్రభూ! ఎక్కడనో తమవంటిమహాపురుషులుతప్ప నా
దరించువారు లేకుంటచే మనవిద్యలు నశించుచున్నవి.

ద్వా—(అప) దీర్ఘకాయా! బుగ్గలు నిండుగనున్నట్లును మొగము కం...
వంతముగ నున్నట్లును సృష్టించితివి కదా! మెడదెగినవాని మొ
గ మట్లుండునా?

దీ—(అప) మెడ తెగక పూర్వము దలిమొగ మిది. తెలిసినదా
ఇఁకనీపాండిత్యము కట్టి పెట్టుము.

మ—(అప)దీర్ఘకాయా! పిల్లిపాషాణములు నాకొంపదీయుటకు సిద్ధప...
గ మఱియొకమోసముచే నిప్పటివఱకు శృంగభంగము కాకుం...
దప్పించుకొంటిని.

దీ—(అప) గిరగిర, ద్రిప్పి నిన్ను నేలఁ గొట్టినను బిల్లివలె నెప్పుడును
నీవుహానినొందువాఁడవు కావు.

సర—అమ్మా! సీతా! ఇంకను లేవవా? (విసరును.)

సీత—(లేచి) నాథా! నాథా! నాథా! నాప్రాణనాథుఁడేఁడీ? నామహా
ప్రభుఁడేఁడీ? నామనోవల్లభుఁడేఁడీ? (ఏడ్చును.)

రావ—నలుసునా? వల్లపూసనా? ఇసుమునా? అణువునా? ఏల కనఁబ
డుట లేదు?

సీ. పదితలలతోఁడ, వింశతి ♦ బాహుపఙ్క్తి
తోఁడ మేరుమందరసాను ♦ తుల్యతుంగ
పృథులవక్షముతోఁడ, నే ♦ నిచట నిలువ
నేఁడి నానాథుఁ డని పల్వ ♦ రింతు వేల?

ద్వి—(తనలో) రాక్షసశృంగారరస మన నిదే?

సీత—(రామశిరము నొడిలోఁ బెట్టుకొని) అయ్యయ్యో! నాథా! ఈశి రము నీదే. ఇదిగో! నాశిరోమాణిక్యము. అమ్మయ్యో! అమ్మయ్యో! ఆకర్ణాంతము లైననీనేత్రములు ప్రమాఁగన్నుపడినవాకి శ్రీకారతుల్యములై దీర్ఘము లైననీచెవులఁ జూచి జ్యోతిషికులు నిన్ను మహాయుఃపరిపూర్ణునిగ వచించినారుగదా! నాథా! వారిమాటలు వృథ లయ్యెనా? రామచంద్రప్రభూ! నావంక నొకసారి కన్నులఁ దెరచి చూడవా? దాశరథీ! నే నేమితప్పుఁ జేసితిని? నన్ను విడిచి నీ వొక్కఁడవు ముందుగ స్వర్గమునకుఁబోవుట న్యాయమా? నీసహధర్మచారిణిని గానా? శివధనుర్భంగమైనదిమొదలు నిన్నాశ్రయించుకొనియుంటిని గదా! నీతో పండ్రెండేండ్లు కాపురముసేసి నీవు వనవాసమునకు బయలుదేరఁ నిన్ను విడువలేక నీడవలె నిన్నుఁ గనిపెట్టుకొని కూడవచ్చితిని గదా! దుర్మార్గుఁ డైనరావణుఁడు న న్నెత్తికొని వచ్చినప్పటికి ని—త్రికరణశుద్ధిగ—అరుంధతి వశిష్ఠునివలె, లోపాముద్ర యగస్త్యునివలె, ని న్నారాధించి, నీనామమే తారకనామముగ నెంచి, అన్నివస్తువులందు నీరూపమే చూచి, సదా నీపాదధ్యానమును జేసి, నీరాకకై వేయిదేవతలకు మ్రొక్కి—రామా, రామా, రామా, యని గొంతెత్తి కురరివలె రేయింబగళ్లు విలపించునన్ను నీ వేల విడిచి పోయితివి? మహాప్రభూ! రఘువంశభూషణా! హా! హా! ని న్ననసేల? నేనే పాపినిని. నేనేమందభా

గ్యురాలను. నేనే దుష్టాత్మురాలను. రామా! రఘువీరా! రామచంద్రా! రాఘవేంద్రా! ప్రాణనాథా! (ఏడ్చును)

సర — అమ్మా! అమితశోకమునఁ దపింపఁ దగదు. దైవగతి కెవ్వ రేమి సేయఁగలరు?

సీత — హా! లక్ష్మణా! హా! సౌమిత్రీ! జనస్థానమున నిన్ను — శ్రీరామ పాదదాసుఁడ వైననిన్ను — నన్నుఁ దల్లికంటె నెక్కువగ భావించుకొనిననిన్ను — సుగుణరాశి వైననిన్ను — న్యాయవాది వైననిన్ను — నోటికి రాఁగూడనిమాట లాడినమహాపాపమునకు ఫల మిప్పు డనుభవించుచున్నాను. హా! కైకేయి! నీసవతికొడుకు గతించెను. పట్టాభిషేకోత్సవ మనుభవింపవలసినపరమపురుషుఁడు పరలోకమున కేగినాఁడు. నీకన్నులు చల్లఁబడినవా? నీవాంఛ నెఱవేఱినదా? నీపగ తీఱినదా? భరతుఁడింక నిర్భీతిగ, నిరుపద్రవముగ నేలుకొనవచ్చును గదా! అయ్యయ్యో! రామా! రఘువీర! రణధీర! ఎక్కడ నున్నావు? ఎక్కడ? ఎక్కడ? (తడవుకొనుచు) నాకన్నులు కాలిపోయినవి. మాయలేడిని దెమ్మని నేను నిన్నుఁ గోర నించుకంతయైనఁ గోప మూనక నాయొద్దనుండి బయలుదేరునప్పుడునాశిరము సమితానురాగముచే మూసిమూసినగవుల నవ్వుచు మూర్కొంటివిగదా? (శిరముతలపై నుంచి) ఇప్పుడుకూడ నొకసారి మూర్కొనవా? అప్పటిసీతనే కదా! ప్రాణనాథా! రామా! రాజీవలోచనా! (ఏడ్చును.)

సర — అమ్మా! ఏల యింత వెఱ్ఱితనము. ఊఱడుము.

సీత — తండ్రీ! జనకచక్రవర్తీ! యాజ్ఞవల్క్యశిష్యుఁడ వైననీవు — రాజర్షి సార్వభౌముఁడ వైననీవు — సత్యధర్మశౌచావతార మవైననీవు — నేను నాకాంతుఁడును — అయ్యయ్యో! నానాథుఁ డిక నేఁడీ — ఏఁడీ — రామా — రామా — నేనును — నా రా — మ

చంద్రుడును మంగళవస్త్రములను మళ్లీ పెట్టుకొని కలిసి నీకు నమస్కరింప—నీమాంగళ్యమున కెన్నడును గొఱంత లేదని—నన్నాశీర్వదించితివి కదా! ఏదీ? ఏదీ? నీమాట బూటక మగు నా? నీయాశీర్వాదము వ్యర్థ మగునా? అత్తా! కౌసల్యా! బ్రహ్మరాక్షసివలె—నల దనుచుండఁగ వెంటఁబడి—నపుత్త్రుని—అనేకతంత్రములచే నీపుగాంచిన—యొక్కఁడైనపుత్త్రుని—మహావతారమూర్తిని—మ్రింగి—కడుపునిండునట్లుగా మ్రింగి ఇచ్చటఁగూరుచుంటిని—

(నేపథ్యమునఁ పెద్దబొబ్బతో) ఇచ్చటఁ గూరుచుంటిని. లోనికిరా సెలవులేక చాలసేపటినుండి యిచ్చటనేకూరుచుంటిని. మహాప్రభూ!

రావ—దీర్ఘకాయా! వాఁ డెవఁడో కనుఁగొనుము.

దీ—(గట్టిగ) ఎవఁడవు నీవు?

(నేపథ్యమున) నేనుకరాళవక్త్రుఁడను. నన్నుఁ బ్రహస్తుఁడు మహారాజుగారియొద్దకుఁ బంపినాఁడు. మంత్రాలోచనమునకై మహారాజుగారిని వెంటనే రమ్మని ప్రహస్తుఁడు ప్రార్థించుచున్నాఁడు. రాముఁ డఁట! ఆయనయుద్ధభేరి సూర్యాస్తమయమున మ్రోగింపనున్నాఁ డఁట! ఇఁక మనకు విశేషకాలము లేదు. రమ్మన్నాఁడు. మహాప్రభూ!

సీత—(సంతోషమునునటించుచున్నది.)

మ—ఛీ! ఛీ! నిర్భాగ్యుఁడా! రాముఁ డెక్కడరా? మరణించినరాముఁ డేమి యుద్ధభేరి యేమిరా? అది గాక వానప్రస్థునకు భేరు లెక్కడనుండి వచ్చెనురా? నోరు మూసికొనుము.

దీ—మహాప్రభూ! చెడఁద్రాగి యొడలు తెలియక ప్రేలువానితో నెందులకు?

సర—(అప) అమ్మా! మహాదృష్టవంతురాలవు. ఇది యంతయు మాయ యని స్పష్టమైనదా?

సీత—(అప) అదృష్టవశమున రాముఁడు బ్రదికియున్నాఁడు గదా?

సర—(అప) ఇంకను సందేహ మేల? రాముఁడు లేనప్పుడు మంత్రాలోచన మేల? యుద్ధ మేల? రణభేరీవాద్య మేల? ఈపండలను వెంటఁబెట్టుకొని మాబావగారీమాయాకలాపము నాడి నిన్ను మోసపుచ్చవలయు నని వచ్చినాఁడు.

సీత—(అప) అయినను నీవు పోయి నానాథుఁ డేమిచేయుచున్నాఁడో; ఇఁక మీఁదట నీరావణునిప్రయత్న మేమో, యుద్ధారంభ మెప్పుడో, యీసంగతులను గమనించి రావలయును. నీకనులతో నీవు నానాథుని జూచువఱకు నాకు మనశ్శాంతి యుండదు.

సర—(అప) ఆలాగే వెళ్లెదను.

ద్వా—(అప) మహాప్రభూ! ఇక్కడకు మనప్రయత్నము భగ్న మైనది. గుట్టు బయటఁ బడినది. మొగములు తెల్లఁబడినవి. మంగలికత్తుల మహావృక్షములు తెగునా? ఈపండలతో నీకార్యములు నెఱవేఱఁగలవా? వీర లతిమాయావిమహామాయావులు. వీరిని నీయొద్ద నుండనీవలదు.

రావ—మహోదరా! యథారీతిగ నశోకవనమునకుఁ బొండని సీతాసరమలతోడఁ జెప్పుము.

సీత—(తనలో) అశోకస్థితికి మేము పోయెదము. శోకస్థితికి నీవుపొమ్ము. (సరమతో నిష్క్రమించును.)

రావ—నాకుఁ గడుపులో నేదియో నావేదనముగ నున్న దేమి?

ద్వా—పిల్లిముక్కులోనిప్రాణ్ల నదేపనిగ నమృతప్రాయముగఁ జప్పరింప వికారము పెట్టదా?

రావ—దీర్ఘకాయా! యుద్ధమున నీ విం్రదజిత్తుని గనిపెట్టుకొని యుండుము.

దీ—చిత్తము

రావ—మహోదరా! నీవు కుంభకర్ణుని గనిపెట్టుకొని యుండుము.

మ—మహాప్రభూ! చిత్తము.

రావ—ద్విజిహ్వా! నీవు యుద్ధమున నాతో నుండుము.

ద్వి—చిత్తము. (తనలో) ఇక్కడ కీరెంటుపిశాచములును రావణాసాన్నిధ్యమునుండి నాప్రయోజకతచేఁ దప్పింపఁబడినవి.

రావ—మన మింకఁ బోవుదము. రండు.

(అందఱునిష్క్రమింతురు.)

ఇదిద్వితీయాంకము.

శ్రీ

# విజయరాఘవము.

## తృతీయాంకము.

ప్రదేశము—లంకావీథి.

(ఒకక్రోంతియు, మఱియొకక్రోంతియుఁ బ్రవేశింతురు)

మొద——నీవు దక్షిణద్వారమునొద్ద కాపు కాదా?

రెండ—ఔను.

మొద—అటులైన నీపశ్చిమద్వారమువైపునకు వచ్చితి వేమి?

రెండ—యుద్ధారంభ మింకఁ గాలేదు కదా! ఏమో కొంచెము వేడుకకై తిరుగుచున్నాను. అది గాక యొకచోటఁ గాపనిన మాటయేమి? అవసరానుసరణముగ నన్నిచోట్లు తిరుగవలయును. మాదక్షిణద్వారరక్షకసేనాధిపతి యంగదుఁడు. ఈపశ్చిమద్వారరక్షణ మెవరియధీనము చేయఁబడినది?

మొద— కేసరిపుత్త్రుఁ డైనయాంజనేయుని—

రెండ—ఆలాగా? తూర్పుగుమ్మ మెవరు రక్షింతురు?

మొద—అగ్నిపుత్త్రుఁ డైననీలుఁడు.

రెండ—ఉత్తరద్వారమో?

మొద—సుమిత్రానందవర్ధనుఁ డైనలక్ష్మణుఁడు. అచ్చటనే శ్రీరామమూర్తి కూడ నున్నారు.

రెండ—ఉత్తరద్వార మత్యుత్కటమైనది.

మొద—వైకుంఠద్వార మదియే. దానిగుండఁ బోవువారికి శ్రీరామ చంద్రభగవానుని దర్శన మగును.

రెండ—అటులైన మనరాజు సుగ్రీవుఁ డెచ్చట?

మొద—సేనామధ్య భాగరక్షణమున సుగ్రీవజాంబవంతులు నియమింపఁ బడినారు. వారికి సహాయులుగ మైంద, ద్వివిద, గవయ, గవాక్ష; సుషేణ, ధూమ్ర, వీరబాహు, సుబాహు, నల పనసాదులు నియమింపఁబడిరి.

రెండ—యుద్ధము ముందుగ మన మారంభింపవలయునా? శత్రువులారంభించెదరా?

మొద—వారు రాకుండ మన మెట్లారంభింపఁగలము? మనము రాకుండ వారె ట్లారంభింపఁగలరు? ఉభయపక్షములవారు తారసిల్లినప్పుడుకదా యుద్ధము.

(నేపథ్యమున యుద్ధభేరి మ్రోగును.)

మొద—అదిగో!

గీ. దశదిశాకటకర్ణవి ♦ దారణంబు
ప్రళయధారాధరోద్ధగ ♦ ర్జాపటిష్ఠ
మాహవౌత్సుక్యకారణ ♦ మైనభేరి
రవ మదిగో! మాఱుమ్రోసె దు ♦ ర్భరముగాఁగ.

కావున నీవు నీద్వారము నొద్దకుఁ బొమ్ము.

రెండ—ఇదిగో! పోయెదను. (పోవును.)

మొద—అదిగో! అప్పుడే యాంజనేయుఁడు జంబుమాలిని జుట్టుపట్టుకొని యీడ్చికొని వచ్చినాఁడు. నేనుఁగూడఁ బోవలయును.

(నిష్క్రమించును.)

ప్రదేశము — యుద్ధరంగము.

(జుట్టుపట్టుకొనంబడిన జంబుమాలి, హనుమంతుఁడును ప్రవేశింతురు.)

హ — జయ! రామభద్రా! జయ! లక్ష్మణా! జయ! రఘువీరప్రభావా! సుగ్రీవా! జయ! రాఘవా! జంబుమాలీ! రా. రా. రా. రఘురామునియొద్దకు రా! రక్షింపు మని రామచరణము లాశ్రయింపుము.

(జుట్టు పట్టియీడ్చుచు,)

జం — విడు. విడు.

హ — మూఢా! విడుచునది నేనా? నీవా?

జం — నేను విడుచున దేది?

హ — ప్రాణము; తెలిసినదా? అనురాధమా! కాదికో.

గీ. జుట్టుచిక్కిననాచేత ♦ నిట్టె గిరగి
రనుచుఁ ద్రిప్పి నోటను బొబ్బ ♦ మనుచు నెత్తు
రొలుక, భళ్ళున నేల ని ♦ న్నడఁచి వైతు
నహిని దోఁకను గొని నేల ♦ నడఁచినట్లు.

ఇఁకఁ జావ నున్నాఁడవు పశ్చిమావస్థనైన భగవన్నామస్మరణము సేయుము. అను! రామా — రామా — రామా — అనియును ము.

(నేపథ్యమున ధ్వని) రామా! రామా! రామా!

హ — అదుగో! రామనామస్మరణము సేయుచు నీలుఁడు నికుంభుని గట్టుకొని వచ్చుచున్నాఁడు. రా. పశువా! రాపశువా! పశువా! పశువు లొడలురాచుకొనుటకుఁ గట్టఁబడినయాస్తంభమున్నైపై నిన్నుఁ ద్రిప్పి కొట్టెదను రామా! రామా!

(నిష్క్రమింపఁగ నికుంభుఁడు పరుగెత్తుకొని ప్రవేశించును.)

నికుం—పరుగెత్తినను గూడ రాలేనిపంద వైనసీవు నన్నుఁ బరిమార్పఁ గలవా? రా. రా.

(నేపథ్యమున) రే కుంభకర్ణపుత్త్రా!

నికుం—అరే! పాంసులా! అధమా! కుంభకర్ణపుత్త్రుఁ డైననికుంభుఁడను నే ననుకొనుచుంటివా? మూఢా! పుట్టించినతండ్రి యొకఁడు పేరునకుఁ బెంచుటకు నొక్కతండ్రియుఁ గలనీబ్రదుకువంటిదే యందఱి దనుకొనుచుంటివా? అగ్నిపుత్త్రా!

(నేపథ్యమున) ఎవఁడవైన నేమి? ఆఁగు. ఆఁగు.

నికుం—ఆఁగవలె నేమి? ఆఁగవలె నేమి? కోయు మని గొంతుక నీచేతిలోఁ బెట్ట నక్కఱ లేదా? మగవాఁడ వైన రా!

(నేపథ్యమున) ఇదిగో వచ్చుచున్నాను.

నికుం—ఇదిగో! వెళ్లుచున్నాను. మన మిద్దఱము కలిసి మృత్యుముఖము నొక్కసారియే ప్రవేశింతము. రా!

(నికుంభుఁడు వెడలఁగా నీలుఁడు ప్రవేశించును.)

నీలు—నికుంభా!

గీ. పిఱికిపంద! తులువ! మూఢ! ♦ పిక్కబలము
పేర్మిఁ బరుగెత్తుచును నోటి ♦ బింకములను
వదలకుంటివా? భయముచేఁ ♦ బఱుగు లిడుచుఁ
గ్రుక్కఁద్రిప్పక మొఱిగెడు ♦ కుక్కవ్రాలె.

అగ్నిపుత్త్రుఁడ నని నన్నధిక్షేపించితివి కాదా? నాయాగ్నేయత్వమే నిన్నుఁ గాల్చును. జాగ్రత్త!

(నేపథ్యమున) ఆగ్నేయాస్త్రమును వదలుచుంటిని. కాచికో!

నీలు—ఆహా! కుమారలక్ష్మణుఁడు విరూపాక్షునిపై నాగ్నేయాస్త్రము నభిమంత్రించి వేయుచున్నాఁడు.

గీ. గప్పుగప్పున ధూమప్రకాండములును
భగ్గుభగ్గున కీలికావళులుఁ గ్రమ్మ
నుల్క లమితంబులై నింగి నుండి యూడ
మహియు నాకస మొక్కటే మంట యయ్యె.

(నేపథ్యమున) మంట. మంట. మంట—

నీలు—అహహో! విరూపాక్షుఁ డత్త్రపరిదగ్ధుఁడై పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు. నేను నికుంభవధనమునకై పోయెదను.

(నిష్క్రమింపఁగ నంతట విరూపాక్షుఁడు ప్రవేశించును.)

విరూ—అయ్యో! అయ్యో! మంటలు. మంటలు. ఒడలంత మంటలు. ఓమేఘమా! నాపై నొక్కజల్లు గురియవా? ఓమారుతమా! చల్లఁగఁ గొంత వీవవా? ఈదిక్కుమాలిన సౌమిత్రి నన్నుఁ దగులఁ బెట్టినాఁడు.

(లక్ష్మణుఁడు ప్రవేశించును)

లక్ష్మ—గట్టిగ నేమ్యము. కన్నీరుచే గాత్రము చల్లఁబడు నేమో? పాపీ! ఫాల్గుణమాసమునఁ బయోధరము లెచ్చటినుండి వచ్చును?

విరూ—హా. హా. హా (ఏడ్చును.)

(నేపథ్యమున) హా. హా. హా. చచ్చితినిరా! హా! హా! హా!

లక్ష్మ—విరూపాక్షా! వినుచుంటివా? ఆంజనేయునిచే జంబుమాలియు, నీలునిచే నికుంభుఁడు మరణించినారు. నాచే నీ వింకఁజావకుంట బాగుగ నున్నదికాదు.

విరూ—చచ్చినతరువాతనైన మంటఁబెట్టుటయే కదా? బ్రదికియుండఁగనే నన్ను దగ్ధునిగఁ జేయఁగ నిఁక వేఱ చావవలయునన్నమాట యేమి?

లక్ష్మ—చచ్చుట పరస్వర్గముకొఱకు.

విరూ—నీమనకు స్వర్గము కాని—(పరుగెత్తును.)

లక్ష్మ—ఛీ! పాఱుబోతా! పోవుచుంటివా? ఆయుఃక్షీణతచే నీ వేలాగైనం
జావక తప్పదు.

గీ. చావు, చాయయు నెప్పుడు ♦ జనుని వెంట
నంటఁగ్రాఁగి యుండును భయ ♦ మంది పరుగు
లిడిన నెట్లుగా వానిఁ ద ♦ ప్పించుకొనును
దన్నుఁ దప్పించుకొని తాను ♦ దాఁగఁ దరమె?

గీ. మరణము బహిరాయాతసా ♦ మగ్రి కాదు
లోనిజీవ మూడుట చావు; ♦ ప్రాణ మెటకు
జనుఁడు పోవు నటకె తీసి ♦ కొనుచుఁబోవు
చుండియును మృతి కెట్లుగా ♦ నోసరిలుట?

(నేపథ్యమున) హా! హా! లక్ష్మణా! లక్ష్మణా!

లక్ష్మ—విరూపాక్షుఁడు గతించినాఁడు.

గీ. లక్ష్మణా! యని పిఁడు గూ ♦ లంగ నేత
దఖిలకష్టదశాహేతు ♦ వైనపూర్వ
కృత్రిమకురంగమరణంబు ♦ స్మృతికి వచ్చి
యొడలు క్షణములోపల నీరు ♦ విడిచె నకట!

(నేపథ్యమున) లక్ష్మణా! లక్ష్మణా! అచ్చటనే యుండుమా! ధ
నుర్ధరుఁడవై యక్కడనే యుండుమా!

లక్ష్మ—హా. హా. ఇప్పుడు యథార్థముగ శ్రీరామచంద్రమూర్తియే
నన్నుఁ బిలుచుచున్నాఁడు. సీతావియోగదుఃఖ మాకరుణ సము
ద్రు నెంతగా బాధించుచున్నది. ఇది జనస్థాన మనియు మారీ
చుఁడే లక్ష్మణా! యని యఱచె ననియు, సీతయొక్క చాపలానే
నై నేను గాఁపుఁడ్రోసితి ననియు, మునుపటివలెనే నేను తొందరపడక సీ
తను త్యజించి వత్తు ననియు, సందేహపడి యిసి వక్కడనే కాస్త్ర
కహస్తుఁడవై యుండుమా,,యని యామహానుభావుఁడు మహా

యుద్ధసంరంభమున నుండియు నన్ను హెచ్చరించుచున్నాఁడు. ఆహా!

గీ. కందుకము లొక్కఁడాని నొ ♦ క్కటియు నంట
వరుసగా నుంచి మొదటిదొ ♦ బాతి వీాట
నవలిబంతులు కదలిన ♦ ట్లగపడక యొ
కడపటిదియగుబంతి క్ర ♦ క్కదలునట్లు.

గీ. పూర్వపరిచితకార్యస ♦ మూహమం దొ
కటి యెటులయిన స్మృతికి రాఁ ♦ గఁ దరువాతి
యర్థములు స్మృతిరాక త ♦ దర్థసంచ
యాంతకృత్యము జ్ఞప్తికి ♦ సట్టె వచ్చు.

గీ. వివిధసంకల్పకోర్మికా ♦ విరచిత మగు
మాయసంకెళ్లఁజిక్కఁగు ♦ మనసు వాని
యం దొకటి యాడ సందర్భ ♦ మనుచుఁ దోఁప
నట్టిది మఱేదొ యాడు న ♦ త్యద్భుతముగ.

రామచంద్రప్రభూ! జానకీదుఃఖము నుపశమింపఁ జేసికొనుఁడు. దుష్టాత్ముఁ డైనరావణుఁడు నాయెదుటఁ బడలేఁడు. పడినఁద క్కలేఁడు.

(నేపథ్యమున) రే! అనేకవాచాడంబరా! అస్మత్పితృపరాక్రమా నూయాతత్పరా! ఆత్మస్తోత్రకథాపారీణ! అధమా! లక్ష్మణా! నిన్నుఁ బరిమార్చుటకు నాతండ్రి కావలెనా? నేను జాలనా? కాచికో! వచ్చుచున్నాను.

లక్ష్మ — సెబాస్! మేఘనాదా! అంతస్సారవిహీనశరత్కాల మేఘనాదము ననుకరించుచు బడబడాడంబరమునఁ బ్రకాశించుచున్నావు.

గీ. నిన్నుఁ గడ తేర్చునుత్కంఠ • నున్న నాదు
బాణములు బాణనిలయంబుఁ • బాసివచ్చు
చుండు నూరక; క్షుద్బాధ • నొందుసర్ప
ములు మరుద్భుభుక్షుతఁ బుట్ట • వెడలినట్లు.

(ఇంద్రజిత్తు ప్రవేశించును.)

ఇంద్ర.—స్వస్తుతివాక్యముల నైన సందర్భముగఁ జెప్పలేవు. నన్నుఁ జంపఁదలఁచిన నీబాణము లూరక వచ్చుచున్నవా? పాపము! వానిపటిమ యంతే. నీపౌరుష మంతే. ఇదిగో! నిన్నుఁ జంపఁదలఁచిన నాబాణము లట్లూరక పైకి వచ్చునవి కావు. అవి వచ్చుట యొకటియు నీవు జచ్చుట యొకటియునా?

(నేపథ్యమున) మహాబలుఁడైనలక్ష్మణుని నీబాణము లఁటరా చంపుట? మదాంధా! అట్టిమహావీరునిచే నింతలోఁ జచ్చుపుణ్యాత్ముఁడ వఁటరా నీవు? ఉండు. ఉండు. నాచేఁ గావలసినంత పరిభవ మైనపిదప సావకాశముగఁ జావవచ్చును. వచ్చుచున్నాను.

లక్ష్మ—(తనలో) అంగదుఁడు సమరౌత్సుక్యమున వచ్చుచున్నాఁడు.

ఇంద్ర— ఈపరవీరశౌర్యాసహనపరాయణుఁ డెవఁడు? ఈలక్ష్మణస్తోత్రకథాకథనాతిసమర్థమాగధాధముఁ డెవఁడు? ఈమర్కటపిశాచ మెవఁడు?

అంగ—(ప్రవేశించి) ఎవఁడనో నేఁ జెప్పనక్కఱ లేదు. నన్నుఁ జూచిన నీకే తెలియును. నాచరణఘాతము చవిచూచిన నీకే తెలియును.

ఇంద్ర—మాకుఁ దెలియున దేమిరా?

అంగ—స్వర్గలోకసుఖము (ఇంద్రజిత్తుకాలిపైఁ దన్నును.) సౌమిత్రీ!

నాకీతనితోఁ బోరాటకమితోత్సాహముగ నున్నది. నన్ను క్షమించి మీ రిప్పు డీతనితో యుద్ధము మానుకొనుఁడు.

లక్ష్మ—నీ కుత్సాహభంగము నే నేల సేయుదును? ఎప్పటికైన నీతఁడు నాబారి పడక పోవువాఁడు గాఁడు లే.

ఇంద్ర—హా. హా. చండాలుఁడా! ఎంతతన్నుఁ దన్నితివిరా? ఇఁక నీవు చచ్చినవాఁడవే. (మీఁదికెగిరి జుట్టుఁ బట్టుకొనఁబోవఁ దప్పించుకొనును.) దూరముగఁ బోయెద వేమిరా? పిఱికిపశువా! నిన్నెక్కడనో చూచినట్లున్నదిరా. నీ వెవఁడవు?

అంగ—ఏమి మదాధికత? ఏమి నేత్రావరోధము! ఏమి మేధాశూన్యత! ఎక్కడనో చూచిన ట్లున్నదా? బుద్ధిహీనా! ఈయుదయమున నీబాబుసభాభవనగోపురమును విఱుగఁ గొట్టుచుండ—దానిమీఁద నేనెమో జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము.

(నేపథ్యమున) వత్సా? అంగదా? లక్ష్మణకుమారుఁ డచ్చట నున్నాఁడా?

విభీ—సుగ్రీవా? అంగదేంద్రజిత్తుల వాక్కలహము వినుచు నిలువఁబడితిని.

(నేపథ్యమున) ఆత్మాశ్చర్యానందదాయక మగు శ్రీరామచంద్రు [illegible] చూడుము. హా! రోమహర్షణ మగుచున్నది. [illegible] కౌశలముగ నున్నది.

లక్ష్మ—సుగ్రీవా! చూచుచున్నాను. ఆహా! ఎంతవింతగ నున్నది!

సీ. యజ్ఞకేతుఁడు మిత్రఘ్నుఁ ♦ డగ్నికేతు
[illegible]కేతులు, నలుగురు ♦ రాక్షసు లోక
[illegible]చి రాముని నాల్గువై ♦ పులను గ్రమ్మి
[illegible]చెప్పలు బాణము ♦ ల్గురియుచుండ.

గీ. ఒక్కవిల్లువంపుచేతనే ♦ యొక్కసారి
నారి లాగుటచేతనే ♦ నాలుగమ్ము
లొకట నలువంకలకుఁ జిమ్ము ♦ చుండె తనదు
పలుకులను నల్వ నాల్గువై ♦ పులకువలెను.

నే నీవిచిత్రముఁ జూడఁ బోయెదను. అదిగాక భుజములు యుద్ధసంరంభమున కాందోళన పడుచుండ నిచ్చట నుండ నేల? అంగదా! నేను సమర మెక్కడ నతికఠోరముగ జరుగుచున్నదో యక్కడకుఁబోవుదును. నీ కీతనితో ద్వంద్వయుద్ధమున నాయాసము గలిగిన నన్ను శంఖనాదమునఁ బిలువుము. నేనుబోయెదను.

ంగ—ఈతనితోడిద్వంద్వయుద్ధమున నా కాయాసమా? ఇతనితండ్రిని బాహుమూలమున ముడిచిపెట్టి మున్నీట ముంచి ముప్పతిప్పలఁ బెట్టినవాలిపుత్త్రుఁడ నైననాకీతనితోడి ముష్టియుద్ధమున నాయాసమా?

ంద్ర—నాచాటా!

సీ. ఎప్పుడో బ్రదికియు ♦ న్నప్పుడు నీతండ్రి
యేమొ నాపితకుఁ గా ♦ వించినాఁడ
టంచుఁ గోతలు కోసి ♦ నందున "నేనుపె
ద్దమ్మనం" చందఱు ♦ నమ్మఁడంచు
డప్పుకొట్టుట—నేనె— ♦ ఎప్పుడో కాదు—మొ
న్ననె—నేశ—డిక్కమా ♦ లినమరణముఁ
గాంచునీతండ్రిని ♦ గాదు—నీతండ్రిని
బుట్టించుతండ్రిని ♦ జుట్టుమొలత

గీ. ద్రేసి—మొఱ్ఱో! యనఁగ—విను ♦ వీథులందుఁ
ద్రోఁతి నాడించిన ట్లెక్కు ♦ గుమ్మము దిగు

గుమ్మముగ నేడిపించి బం ♦ ధ మ్మొనర్చు
నింద్రజిత్తును రా! యొడ ♦ లెఱిఁగి పలుకు.

(జుట్టుపట్టుకొని లాగును.)

అంగ—రామా! రామా! కోదండరామా!

(నేపథ్యమున) ఇదిగో! వచ్చుచున్నాను.

(అంగదుని లాగుచు నింద్రజిత్తు నిష్క్రమించును. రాముఁడు ప్రవేశించును.)

రాము—ఛీ! వాలిపుత్త్రా! పితృతుల్యపరాక్రమస్ఫురణముచే శోభించుచున్నావు. అంగదా! నీతండ్రి రావణుని గెలిచినట్టే నీవు రావణిని గెలుతువుగాక!

(నేపథ్యమున) తథాస్తు! తథాస్తు!

రాము—ఆంజనేయుఁడు "తథాస్తు, తథాస్తు"నుచు నెందఱు రాక్షసులను మర్దించుచున్నాఁడో.

సీ. బాహుబలంబునఁ ♦ బర్వతా ల్వెకలించి
పడవైచి కొండఱ ♦ మడియఁ జేయు
పాదపప్రశోభి ♦ పాణితాడనసము
ద్యద్ధాటిఁ గొందఱి ♦ నడఁగఁ జేయు
శిఖరశతకోటి ♦ నీకాశముష్టిచే
గ్రుద్ది కొండఱినేలఁ ♦ గూలఁ జేయుఁ
దోఁక గిఱ్ఱున వైచి ♦ దూరస్థదనుజులఁ
బడలాగి కొండఱి ♦ నడఁగఁ ద్రొక్కు-
గీ. నంతనఖరపాదాయుధో ♦ ద్దాముఁ డగుచు
నాజిరంగంబు కఠినకా ♦ లాస్రమయము,
బహుళరుధిరరక్షఃకళే ♦ బరమయంబు,
సేయుచున్నాఁడు వద్దిర! యాంజ ♦ నేయుఁ డచట.

(నేపథ్యమున) జయ! రామభద్రా! జయ! రాఘవేంద్రా!

**రాము**—అదె చప్పటిధ్వని! సెబాస్! అంగదా! ఇంద్రజిత్తు నోడించితివా?

గీ. తల కిరీట మూడఁగ రక్త ♦ మొలుక నోట
స్రస్తకేశము లంగదా ♦ గ్రములఁ జిక్కి
వడఁగఁ గవచసంధులు ఘల్లు ♦ ఘల్లుమనఁగ
పరుగువారు రక్కసుఁడు వె ♦ న్జరువఁ గపియు.

అంగదా! అదిగో! ప్రాగ్ద్వారమువైపునఁ బోవుచున్నాఁడు. కూడఁ బరుగెత్తు. వదలకు.

(నేపథ్యమున) ప్రాగ్ద్వారరక్షకా! నీలా! అంగదకశాఘాతమున రాక్షసపశువు పాఱిపోవుచున్నది. గదచే మఱలించు. మఱలించు.

**రాము**—అంజనీపుత్త్రా! నీలునిఁ బ్రోత్సాహపఱచుటయే కాక నీవుకూడ రక్కసున కడ్డదగులుము.

(నేపథ్యమున) జయ! రామభద్రా! జయ! రాఘవేంద్రా! జయా! జయా!

**రాము**—ఆంజనేయుఁడు కూడ నింద్రజిత్తు వెన్నాడుచున్నాఁడు. సౌమిత్రీ! కొంతసేపు యుద్ధము మాని నీ విచిత్రమును జూచుట కిటు రమ్ము. (లక్ష్మణుఁడు ప్రవేశించును.)

**లక్ష్మ**—అగ్రజా! వచ్చితిని. ఇంద్రజిత్తు దొరకునట్లు కనఁబడదు. సెలవైనయెడల—

గీ. హేమపుంఖసముజ్జ్వల ♦ దాశుగమును
వింట సంధించి కర్ణాంత ♦ మంటలాగి
వెన్ను దుసియాడి పొట్టను ♦ విచ్చునట్లు
వేసెదను ముందొకడుగైనఁ ♦ బెట్టకుండ.

గీ. పణవరవమున బెదరింపఁ ◆ బడినగంధ
కలభము నిరంకుశోద్ధుర ◆ గమన మగుచు
కడపట మహోత్తుంగ గోతఁ ◆ బడినయట్లు
దనుజుఁ డిపుడె నాబాహుబం ◆ ధమునఁ బడును.

ఓప్లవంగవీరులారా! అంత యాయాసపడి పరుగెత్తకుఁడు.

గీ. ఎదుటఁబడు యోధుతో మోహ ◆ రింపవచ్చు
దుర్గభూస్థలవాస్తవ్య ◆ దుర్జను-
నైన వెదకి చంపఁగవచ్చుఁ ◆ గాని చాప
పరుగువారు పరునితోడఁ ◆ బోరుటరిది.

రాముడు—(తనలో)

గీ. ఇందఱుమహాకపులు పర్వ ◆ లెత్తు టేమి?
ఒక్కదనుజుఁడు చిక్కక ◆ యుండు టేమి?
ప్రబలరాక్షసమాయాప్ర ◆ భావపటిమ
యేమొ యిది యంచుఁ గడు సంశ ◆ యింతు మదిని.

(నేపథ్యమున) అమ్మగో! అమ్మగో! కాచికో! కాచికో. రామానుజా!

లక్ష్మ—(అటు నిటు పరుగెత్తుచు) ఏఁడీ! ఏఁడీ! ఆఁ! ఆఁ! ఎక్కడ? ఎక్కడ?

(నేపథ్యమున) ఎక్కడోనా? అక్కడనే. అక్కడనే.

లక్ష్మ—ఏఁడీ? కనఁబడఁడేమి? కనఁబడఁడేమి? ఆంజనేయా! అంగదా మీరిద్దఱటు రండు. ఇచ్చటకు వచ్చినవాఁడు కానఁబడఁ డేమి?

(నేపథ్యమున) అక్కడ లేఁడా? అక్కడకే వచ్చినాఁడే!

(ఆంజనేయుఁడు, అంగదుఁడు ప్రవేశింతురు.)

లక్ష్మ—అంజనీపుత్త్రా! ఆతఁడిచ్చటకు వచ్చుచుండ నీవు చూచితివా? నిశ్చయముగఁ జూచితివా?

అంజ—నిశ్చయముగఁ జూచితిని.

అంగ—సౌమిత్రీ! మీాకంబడిబారలదూరమున నిలువఁబడఁగఁజూచితిని.

లక్ష్మ—ఏకబారలదూరములోనే! ఇంతే! ఉన్నాఁడని తెలిసిన నెగిరి తన్నుదునే! ఆఁ! ఆశ్చర్యముగ నున్నది! సీరోరితులువా! అధమా! పలాయనప్రవీణా! కాతరహృదయా! మేఘనాదా!

రాము—(సాశంకముగనవ్వి) సౌమిత్రీ! ఏమి నీకీవెఱ్ఱి?

సీ. సరస నుండియు దృష్టిగో ♦ చరుఁడుకాని
పీనని గ్రహింపనెంచియా ♦ పిలుచుచుంటి?
పఁటీయుఁడియుఁ గన్నుల ♦ కగపడనియ
నిలను నరవండములను బా ♦ ధింపఁగలమొ?

ఇంద్రజిత్తు మహామాయావిశారదుఁడు, సామాన్యుఁడు కాడు.

(రోహితులై మేఘనాదుఁడు, దీర్ఘకాయుఁడు ప్రవేశింతురు.)

(నేపథ్యమున)

సీ. ఘనరనామకరాక్షస ♦ ప్రవరుఁ డొకఁడు
తీక్ష్ణకుంతంబు గుఱిచేసి ♦ దృప్తవీర్య
మునను సుగ్రీవుపై వచ్చు ♦ ముక్కుకొమ్ము
నొకము సారంగరాజంబు ♦ మీాఁది కట్లు.

రాము—అంగదా! అది నలవాక్యమువలె నున్నది. ఎందులకైన మంచిదే. నీవు సుగ్రీవాంతికముననే యుద్ధము సేయుము.

సీ. అతఁడసాధ్యరణోత్సాహ ♦ మతి; యపరిమి
తాగ్రహుఁడు; విపన్ముఖమున ♦ నట్టె ముందు
వెనుక చూడక చొరఁబాఱు; ♦ ననిన యప్పు
డెట్లు కోటలతన ముపయో ♦ గించునొక్కొ!

సీ. రామహారాజు శ్లఘనయా ♦ థంబు తన్నుఁ
బట్టి కిఁచుము; స్వక్షేమ ♦ భంగమైన

యనవసరసాహసక్రియ ♦ లతఁడు సేయఁ
గార్యభంగంబు స్వజనతా ♦ కష్టదంబు.

గీ. జ్ఞానయుని దురుకాయక ♦ ష్టంబు గాదు
కనఁబడనిధిప్రణాకష్ట ♦ కలన గాని
కరపదాదులకుఁ జలన ♦ కష్ట మగును
తలకు మొదలనిధీప్రవ ♦ ర్తనము కాదె?

అది గాక!

గీ. ఆత్మబుద్ధికి విశ్వాస ♦ హైన్య మెట్లొ
త్యాగమునకుఁ బాత్రాపాత్ర ♦ తావిచార
మెట్లొ బాహుపరాక్రమ ♦ జృంభణమున
కవసరజ్ఞత భూషణ ♦ మగును గాదె?

గీ. శోభితకప్రాణ్ణధూమసం ♦ శోభిఖడ్గ
పట్టసగదాహతులతోడ ♦ వధము నొందు
శత్రువులసంఖ్యకంటెను ♦ చాలఘనము
రాజశీలవాగ్ఘతశత్రు ♦ రాజసంఖ్య.

గీ. ఖరదనుజశిగఃకర్తన ♦ కార్యమునకు
వచ్చితిమి; యాత్మహత్యకై ♦ వచ్చియుండ
ము; తనకేదైనఁ గీడురా ♦ భూతనూజ
తోడఁ బనిలేదు నాకంచు ♦ నాఁడుమయ్య!

నువేలపర్వతారోహణావసరమునఁ దాను జేసినరావణమకుటభం
గసాహసక్రియ నుద్దేశించి యప్పు డాతనితోఁ జెప్పినమాటలనే
యిప్పుడు తిరిగి జ్ఞప్తిచేయుచుంటి నని చెప్పుము. పొమ్ము.

అంగ—(తనలో) ఆహా! శ్రీరామచంద్రుఁ డెంతదయా సాంద్రుఁడో!
(ప్రకాశము) అయ్యా! పోయెదను.

ఇంద్ర—దీర్ఘకాయా! మనమాయామాహాత్మ్యమున వీరికి మనము గానఁబడము. మనమాటలు వీరికి వినఁబడవు. కాని వింటివా రామభద్రుని శిష్యప్రలాపములు? తాను బిఱికివాఁడగుటయేకాక తన బిఱికితనము నితరులకు వ్యాపింపఁజేయుచున్నాఁడు. ఇతఁడు భగవంతుఁడఁట!

దీ—పాఱిపోవుటకు—శాపము మని భార్యకొఱకు కేష్చుటకు—

ఆ. వె. కంటికిలకవలెను ♦ కర్కటీకావ్యాధి
యట్లు కాతరతయు ♦ నంటురోగ
మంచు వైద్యవేత్త ♦ లానతిచ్చిరి వారి
పలుకు పొల్లుగాదు ♦ ప్రభుకుమార!

ఆ. వె. భువి నరాధములకు ♦ మూఁడె నాడులు శ్లేష్మ
పిత్తవాతనామ ♦ విశ్రుతములు;
శౌర్యనాడి యనెడు ♦ సరిక్రొత్తనాడితోఁ
గలసి నాల్గునాళ్లు ♦ గలవు మనకు.

ఇం—(స్వగతము) ఏమి దీర్ఘకాయా! మనకిద్దఱకుఁ గలసి యిఁక నున్నవి నాల్గునాళ్లేనా? అటుపైన—మనగతి—ఇఁక పైననేనా?

ఆంజ—అన్నోగతినెందుట తప్పదు. నిశ్చయము; పైన నున్నట్లు లేదు. భూమిపై నున్నట్లు లేదు.

ఇంద్ర—ఆంజనేయుఁడా! పైన లేను; పాతాళమున లేను; ప్రక్కనే యున్నాను.

రాము—మారుతీ! లేఁడని చెప్పకుము. మనకుఁ గానఁబడుట లేదు.

క. ఇంద్రియగోచరుఁ డౌట ♦ నిలను లేఁడ
టంచుఁ బలుకఁ దగదు; సృష్టి ♦ యంతరహింత;
నింద్రియము లింక భగవంతుఁ ♦ డిచ్చియున్న
నప్పు డెఱిఁగెదవని నెన్నుగ ♦ హింతునయ్య!

గీ. కరణదత్తవస్తుజ్ఞాన ♦ కలనఁ గాని
వస్తుపరమార్థతత్త్వమె ♦ వ్వరికి లేదు;
లేదనుట తద్గ్రహణశక్తి ♦ లేదనుటయె
వస్తువే లేకపోవుట ♦ వలనఁ గాదు.

ఇంద్ర——ఈరాముని రణసమయ వేదాంతమును వింటివా? వీరు నన్ను గుఱించి యస్తినాస్తివిచికిత్సలు చాలఁ జేయుచున్నారు. ప్రపంచజ్ఞానము మన కింద్రియాళిగుండ వచ్చినదే కాని మనకు వస్తుయాథార్థ్యము తెలియ దఁట! వింటివా? కావున, మహామాయావి యైనయింద్రజిత్తు తమసన్నిధానమున నున్నాఁ డనుపరిజ్ఞానము వీరి కస్మదీయబాణసంఘాతఘాతసంభూతవ్రణబాధచేఁ దెలియవలసినదే కాని యింద్రజిద్వస్తుయాథార్థ్యము దెలియఁ దగదు. అంతేనా? సరే! ఇఁకఁ గానిత్తము. ఈవీరవేదాంతిని——ఈనరరూపదేవుని——ఈరాముని ముందుగాఁ గొట్టి వేదాంతపరిజ్ఞానమునకు వేదనాపరిసహిష్ణుతకు నెంతదూర మున్నదో కనఁబఱచెదను. అటు వెడలి వచ్చెదను. (నిష్క్రమించును.)

దీ——ఈదినమున నామహాపరాక్రమవిజృంభణమున కవసరము కలిగినది. యుద్ధము లేనికాలమందును యుద్ధకాలమందును గూడ నావృత్తి ప్రాణినాశనమే. శాస్త్రముచే నప్పుడు——శస్త్రముచే నిప్పుడు—— మందుచే నప్పుడు——మందుచే నిప్పుడు——

గీ. దాశరథిలోహమును సుమి ♦ త్రాతనూజ
గంధకమును గలిపి దగ్ధ ♦ కపివరగజ
పుట మొకటను రాఘవభస్మ ♦ మును నేఁడు పుఁగఁ
జేసి వాడెద బైరాగి ♦ చిటుకగాఁగ.

(తిరోహితుఁ డగునింద్రజిత్తు మఱియొకవైపునుండి రామునిపై బాణముల విసుచున్నాఁడు.)

రాము—హా. హా. హా. హా. (అటు నిటు తప్పించుకొనును.)

లక్ష్మ—అగ్రజా! అది యేమి? అట్లు తత్తరపడెద రేల?

(నేపథ్యమున) సౌమిత్రీ! అది యేమి యని యన్నగారి నడుగు చుంటివా? ఏమియో నీవుకూడ రుచిఁజూడుము.

లక్ష్మ—అబ్బ! అబ్బ! బాణములు గ్రుచ్చుకొను చున్నవి.

ఆంజ—(రఘువీరులను కౌఁగిలించుకొని) రాఘవులారా! బాణము లెక్కడివి? బాణము లెక్కడివి?

మే—ఎక్కడివి యెక్కడివి వని నీఁడు మిక్కిలి నిక్కుచున్నాఁడు. తగిలించు మేఘనాథా! ఈక్రోతి కొకమాత్ర తగిలించు.

రాము—హా. హా. హా. (అటు నిటు తిరుగును.)

ఆంజ—రాఘవులారా! మిమ్ములను నాబాహువులచేతను వాలముచేతను జుట్టఁ బెట్టెదను. బాణము లేవియో నాకుఁ దగులును. రామచంద్రప్రభూ! ఈవిధముగ నాశరీరమును బవిత్రము చేసి కొనెదను. కటాక్షింపుఁడు. (సాష్టాంగపడును.]

లక్ష్మ—అబ్బ! అబ్బ! మర్మములు భేదిల్లుచున్నవి.

ఆంజ—అయ్యయ్యో! లక్ష్మణా! రామప్రభూ! మీరు బాధపడుచుండ పాపాత్ముఁడ నైననే నూరకుండవలసినదేనా? ఇఁక నాసేవకాత్వ మేల? నాజన్మ కేల?

(కౌఁగిలించుకొని తోఁకఁ జుట్టఁ బోవును.)

రాము—నీకు మాయందు మిగుల ననురాగ మున్నది. సంతోషించితిమి. స్వకీయయకసుఖపరాఙ్ముఖత, పరకష్టదర్శనాసహిష్ణుత యను నీ రెండుసుగుణములు నీయందుఁ బూర్ణముగ నున్నవి. నాకుఁ దగిలవలసిన బాణఘాతముల కడ్డుపడి నీవు దగిలించుకొనుట న్యాయమా? అడ్డుపడి మమ్ము బాణపీడనుండి తొలఁగించి నకంటె నీమాటవలన నెక్కువ సంతస మొం

దితిమి. కావున నటుండుము. అటుండుము. తొందర లేదు హా. హా. హా.

లక్ష్మ.—అబ్బ! అబ్బ! రామచంద్రా! రామభద్రా!

రాము.— హా. హా. హా. లక్ష్మణా! లక్ష్మణా!

దీ.—ఒకరినొక రోదార్చుకొనుట లేదు సరేకదా యొకరినిజూచి యొకరు నొకనిపేరు దలఁచుకొని యొకఁ డేడ్చుచుండుట నేను జూచుట నా కీదినమునఁ గ్రొత్త కాదు. నేను వైద్యము చేసినచోటుల నెల్ల నిట్టివిచిత్ర దర్శనము నా కలవాటే.

లక్ష్మ.—అబ్బ! అబ్బ! ఏమి సేయుదును? ఏమియుఁ దోఁచదు. ఎట్లు తప్పించుకొనఁగలము హా. హా.

రాము.—హా. హా. హా. హా.

ఆంజ.—మీకుఁ బ్రతినిధిగ నేను బాధపడుదును. నన్నుఁ గటాక్షింపుఁడు.

రాము.—కేసరీతనయా! మహాభిమానముచే నాకంటె నాందోళనపడుచుంటివి కాని బ్రహ్మాండ మైననీకుఁ దెలియని దేమున్నది? ఇది యంతయు నింద్రజిత్తుపని.

గీ. కష్టసుఖభుక్తియందు లో ♦ కమున జీవ
పాళి భేదంబు లేదు; మా ♦ వంతుకష్ట
మిపుడు వచ్చె; నింక మఱి రా ♦ నీ; సహించి
తలల నొగ్గుటకంటె వై ♦ ద్యంబు కలదె?

గీ. ప్రాగ్జననకృత్య జమిది ప్రా ♦ రబ్ధ మనుభ
వమునఁ గాని శాంతింపదు; ♦ బాధమాకు
వల దనిన నోసరిలునె? కా ♦ పాడవలయు
నంచు నుంచిన స్వాధీన ♦ మగునె నీకు?



అది గాక,

గీ. త్రిజగంబఁ జెడ దన్న నను మన ♦ తర మగునె? మ
నతను ధీశక్తి యంత ము ♦ న్నటిదె; యైన
నేమి? దురదృష్టదినము లే ♦ తెంచునపుడు
పని యొనర్పవు; మఱియు న ♦ భ్యాంతరమగు.

గీ. అంధకారంబునను నేత్ర ♦ మట్టిబలు, సుడి
గాలివిసరిన యప్పుడు ♦ కాగితంపు
బుట్టిలోని దీపికయట్లు, ♦ బుద్ధిగాత్ర
శక్తు లట్టివె కష్టావ ♦ సరములందు.

ఇంద్ర.—ఛీ! అప్రయోజకునివలె నాఁడుదానివలె నదృష్టమును దూషించుకొందు వేమి? పౌరుష మీయని బ్రహ్మను దిట్టుము. బుద్ధి లేక యిక్కడకు వచ్చితి నని నిన్నుఁ దిట్టుకొనుము. అంతేకాని దినము లేమి చేసినవి?

ఆ. వె. బుద్ధి లేనిపనులఁ ♦ బొనరించువానికి
దినము లేమి సేసె? ♦ తను వెఱుఁగక
వ్యయము సేసి ముష్టి ♦ పాత్రఁ బూనిన భాగ్య
హీనునకు గ్రహంబు ♦ లేమి సేసె?

లక్ష్మ.—అబ్బ! అబ్బ! అరే! నీచుఁడా! దురాత్మా! చండాలా! పాపీ!

గీ. ఏమిపని సేయుచుండితి ♦ వీవు? నీది
యొక్క బ్రదుకె? థూ! గొంతుక ♦ నొక్కుకొంచు
చావరాదొ? గడ్డిఁదినుము ♦ చౌర్యమునను
మమ్ము బాధింపనే పౌరు ♦ షమ్మె నీకు?

గీ. అబలల బాధించుటయె శౌర్య ♦ మని తలంచితె?
తేళ్లు జెఱ్ఱెలు ముండ్లు బా ♦ ధింపవో? జ్వ
రాదిరుజలు బాధింపవో? ♦ రా! మగతన
మన్న రా! ముక్కలుగఁ గోయ ♦ కన్న హా. హా. హా.

(కొంక్రించి మీసాలు దువ్వును.)

ఇం—లక్ష్మణా!

గీ. తన కఠినుఁడు గానట్టి ◆ జనునిపైనిఁ
గలుగుకోపము తన్నె సం ◆ క్షయము సేయు
చమురు గలుగని ప్రమిదలో ◆ జ్వాలనమొందు
నట్టి వత్తి యంతయు బుగ్గి ◆ యగును గాదె?

లక్ష్మ—ఓరీ! అధమా! అధమాధమా!

గీ. మగతనము లేదు; కనఁబడి ◆ మనఁగ లేవు?
సరియె; నన్నొట్టు నే నీవు ◆ సముల; మెడను
కాలిగోటిమట్టికయినఁ ◆ బోల లేని
యీ వతని గొట్టి నన్ను బా ◆ ధింప కిఁక.

రాము—తమ్ముఁడా!

గీ. నేను జ్యేష్ఠుఁడ ననుమాట ◆ కాని యెపుడు
నీ కుపచరింప లేదయ్యె; ◆ నీదు దేవు
లాట యెప్పుడు నాకొఱ ◆ కయ్యె; నిపుడు
కూడ నా బాధకే వగఁ ◆ గూరుచుంటె?

ఆంజ—మహాప్రభూ! మీరు బాధ నొందుటచే సేవకుఁడ నైననేను వగఁ గూరుటయేకాక యంతకంటె నేమి చేయఁగలను? వ్యర్థుఁడనై యపగతలజ్జాశక్తినై మీ వేదనను జూడలేక కన్నులఁ బొడుచుకొనవలయు ననుకోరికఁ గలవాఁడనై బ్రదికి యుండియుమృతతుల్యుఁడ నై యిచ్చట మొరడువలె నుంటిని. రామచంద్రప్రభూ! సౌమిత్రీ! బాధగనున్నది కాఁబోలు నేమి? హా. హా! రామా! రామా! రామా! ఇట్టిమాయాశక్తిప్రభావ మీతనికి బ్రహ్మావరమువలనఁ గలిగినదై యుండును. ముదిజముఁ డైనబ్రహ్మ నిట్టిపరమనీచున కిట్టివరము లిచ్చినందులకు శిక్షింపవలసియున్నది. మహాప్రభూ! నాకు సెలవిమ్ము.

సీ. బ్రహ్మలోకంబునకు నేగి ♦ బ్రహ్మతలలఁ
బట్టి వానితోఁ గినిసి ♦ గొట్టి మఱియు
కీడె[illegible] దాని మోది వి ♦ హీనజీవుఁ
[illegible] జేసివచ్చెద నయ్య ♦ క్షణములోన.

నాయ—ఆంజనేయా! ఏను మంటివా? అలౌకికబాహుపరాక్రమము గల యంజనాసుతునిమాటలు. ఆంజనేయా! మాయెడల నీకుఁ గల యనురాగము భగవంతునివిన్నాతుకజాయమానకటాక్షముగాంటి [illegible] కదా! నాకు సంభవించినప్రారబ్ధమువంటిదే సుగ్రీవునకు వచ్చుటచే నే నాతనికి సాహాయ్య మొనర్చి యతనియనురాగము [illegible] మిత్రమ నైతిని. నేను నీ కేమైన యుపకార మొనర్చి యుంటినా? సీతాన్వేషణముఁ జేసి నా కమితానంద మొసంగితివి. యుద్ధమున ననేకరాక్షసులఁ జంపి నాకు సాహాయ్యసంతోషము [illegible]మంటివి. ఇప్పుడు మాబాధఁ జూడలేక బ్రహ్మను [illegible] నంటివి. నీ వెంతచేయుటకైనఁ దగినవాఁడవే కాని,

సీ. నలున వానికి వర మిచ్చి ♦ నాఁడు గాని
యిట్టిగతి నొందుఁ డని శాప ♦ మిచ్చినాఁడె
మాకు? మాదు ప్రారబ్ధక ♦ ర్మ ఫల మిద్ది
బ్రహ్మ నూరక నిందింపఁ ♦ బాడి గాదు.

తే. గీ. మాకుఁ దండ్రి లేఁడు ♦ మాదుసంసారముల్
పుత్త్రజననఫలముఁ ♦ బూన వయ్యె
మాతృదేవతలును ♦ మాయొద్ద లేరైరి.
[illegible] నేను, నాకు ♦ నతఁడు నంతె.

[illegible] బాహ్యకష్టదశలు ♦ ప్రాప్తమైనటు లెంతు
[illegible] నగును ♦ యెఱుఁగ రాదు

తల్లి, దండ్రి వీవె ♦ తనయుండ వగు దీవె
మమ్ము విడచి పోకు ♦ బమ్మకడకు.

దీ—మేఘనాదా! వినుచున్నావా? రాముఁడు కూనుశాగము నారంభించినాఁడు.

ఆంజ—అయ్యయ్యో! రామా! రామా! రామా! (ఏడ్చును.)

లక్ష్మ—హరిహరీ! హరిహరీ! రామచంద్రప్రభూ! రామా! రామా! (ఏడ్చుచు) ఓరీ! మేఘనాదా! రేమూఢా! క్రూరా! ఏమిపని చేయుచుంటివిరా చండాలుఁడా?

ఆ. వె. రార! ఎదుటఁ బడర! ♦ వీరున కిది నీతి
గాదు; రార! ఏర ♦ కానఁబడర!
రావణునికొడుకవు ♦ గావఁటరా? నీచ!
మూర్ఖ! దొంగ! కుక్క! ♦ మూఢ! పశువ!

రాము—సౌమిత్రీ! తొందర పడకు. మన కపకారి యైనను బ్రహ్మావంశమునఁ బుట్టినయింద్రజిత్తు నట్లాడఁ దగునా?

గీ. మనము మనలాభమును గోరి ♦ యనికి రాఁగ
నతనిక్షేమముకై యాతఁ ♦ డట్లు చేసె
స్వపరతయె జీవస్వభా ♦ వంబుగానఁ
బరునిఁ బల్లెత్తుమాటయుఁ ♦ బలుకఁ దగదు.

ఇంద్ర—వింటివా? దీర్ఘకాయా! రాముఁడు మెత్తఁబడినాఁడు. కాని లక్ష్మణుఁ డింకను బింకముగ నున్నాఁ డేమి?

దీ—గీ. ఓటమి గలిగినపుడు వా ♦ క్పాటవమును
భయముగా నెంచవలయును ♦ ప్రాణయాన
సమయమున నాడుతర్జని ♦ స్థమగుపైత్య
నాడిని గ్రహింపఁదగు వాత ♦ నాడిగాఁగ.

గీ. ఇప్డటకుఁ బూర్తి యయ్యె; నిం ♦ కేమి లేదు;
స్వాంతనము చే నిందాఁక ♦ నిలువఁబడిరి;
గాత్రమున గుచ్చుకొనిన నా ♦ గశరసంఖ్య
వలనఁ జూడనెప్పిరి యేఁడు ♦ పందులట్లు.

ఆంజ—మహాప్రభూ! తూలుచున్నారు. పట్టుకొననా?

(పట్టుకొనును.)

గీ. అతులిత స్థైర్యసంశోభి ♦ యసురమాయఁ
దూలవలసె స్వోత్తమగతి ♦ కై లలితప
దములఁ బట్టనే నితనియూఁ ♦ తకయి కరముఁ
బట్టవలసివచ్చెను నేఁడు ♦ బ్రహ్మవాత్రిత.

ఇంద్ర—«అబ్బ, అబ్బ,» యనునాక్రందనములు హాహాకారము లిప్పుడ
చల్లారిన వేమి?

దీ—దింప సిద్ధముగ నున్న యౌషధపాకఘుటికలలోనిగుడగుడలు
సాంగశీతల మైనతరువాత మానవా? చూడుఁ! రాముసకు,

గీ. దండశూకవిషం బెల్లఁ ♦ దలకు నెక్కె-
నలువులో నల్పుగానఁ గా ♦ నంగఁబడదు
కాని, మొగము నల్పయ్యె మూర్ఛ ♦ గన్ను పడియె
నోటివెంట లుబ్బలుగాఁగ ♦ నురుగు జారు.

రాము—హా! లక్ష్మణా! హా! లక్ష్మణా! (నేల వ్రాలును.)

లక్ష్మ—రామా! రామా! రామా! రామా! రామా! రామచంద్రా!
రాఘవేంద్రా! నాకంటె నీవు సుకుమారతరుఁడవు గాన నీవా
టు నే జూడవలసి వచ్చెనా? రామా! రామా!

గీ. కోసలాత్మజాఫల మిలఁ ♦ గూలె నొక్కొ?
అర్కవంశదీపంబు చ ♦ ల్లారె నొక్కొ?

భువనములయూఁత హా! పడి ♦ పోయె నెక్కొ?

జానకీలక్ష్మణులగతి ♦ జాఱె నెక్కొ?

రామా! రామా! (నేలఁ గూలును.)

ఇంద్ర——సెబాస్! సెబాస్! దీర్ఘకాయా! రాముఁడే లక్ష్మణునికంటె బలీయుఁడు గదా! రాముఁ డేల ముందు పడిపోయినాఁడు?

దీ——సీ. విషదశనవేదన, విసూచి ♦ విషమజ్వార్తి
యనెడుమూఁడురోగములచే ♦ తను బలిష్ఠుఁ
డే త్వరగఁ జచ్చెడును బల ♦ హీనుకంటె
నని మరణశాస్త్రమర్మ మ ♦ య్యా! సురారి.

అదిగాక,

గీ. వంత సిద్ధించినప్పుడు ♦ బాగుసుతుచు
నేర్పువాఁడు, కోపమువచ్చె ♦ నేని యెడ తె
ఱఁగక చెడఁదొబ్బువాఁడు త్వ ♦ రగ నశింపఁ
డవ్వి యడఁచునాతఁడు చావు ♦ నందుఁ ద్వరగ.

గీ. వంత యెటులో వెల్వడఁగ నా ♦ పత్తు లేదు
రో నడఁచిపెట్టుచో మహా ♦ హాని యగును
తేలి చిక్కినకుఱు పవ ♦ లీల మాను
గుండెనంటు నెదుగురాచ ♦ పుండు చంపు.

రాజ——హా! హా! సౌమిత్రీ! నీవు కూడ నేలఁ గూలితివా? ఈయవస్థ లోఁగూడ శ్రీరామచంద్రుని ననుసరించి కృతార్థతను బొందనై యుంటివా? నేను మిమ్ములను నింపులకే యాశ్రయించితినా? రామా! రామా! రామానుజా! (ఏడ్చును.)

ఇంద్ర——రామలక్ష్మణులు నరులు; వీఁడు కపి ఏమిసంబంధ మున్నది? వీఁడేల యేడ్వవలయును?

దీ—

సీ. అద్దిరయొకవింతగా నెంచ ♦ కంతికొక్క
తగలయిద్దూరం బోకం బేడ్వం ♦ దక్కువాండు
నేడ్చు; నోరు కారము భుజి ♦ యించి పొక్కం
గన్నులగవ బాష్పనీరంబుం ♦ గార్చుం గాదె?

ఇం ద్ర—రామలక్ష్మణు లిక్కడికి నామమాత్రు లైనట్లే కదా?

దీ—దేవేంద్రుని గెలిచిననీవు దలంచుకొనిన నరులును; ధన్వంతరినిముక్కు నేలరాచిననేను దలంచుకొనిన రోగులును నశించుట వింత యేమున్నది?

ఇంద్ర—అయిన నొకసారి నాడిం జూచి వచ్చెదవా?

దీ—(తనలో) దగ్గఱకుంబోయి స్పృశించుటకు భయ మగుచున్నది. (ప్రకాశముగా) చూచుటకు నాడియెక్కడిది? అయినను వైద్య శాస్త్రరహస్య మొకటి—

సీ. నాడియున్నం జావంగ లేదు; ♦ నాడి పోవం
జచ్చె; నింతె చెప్పంగలము; ♦ జబ్బురీతి
పైగుణములచే గ్రహియింపం ♦ బడును; నాడి
గనుట టక్కు; భేషజము; దొం ♦ గతన మగును.

ఇంద్ర—సరే! ఏమో ఏమో, యని సంశయించినమాత్రం బ్రతికిగా రిక సీతాసమేతుండై హాయిగ నుండవచ్చును. ఈశుభవార్త నాయ నకు నివేదింతము రమ్ము.

దీ—శక్ర మిూతండ్రికి సీతాసంధానమును జేసి కృతార్థుం డైతివి. నేను గూడ నాతని కేమైన నుపకారముం జేసినంగాని యాతని దర్శింప నెల్లను.

ఇంద్ర—నీ వేమి యుపకార మొనరింపం దలంచితివి?

దీ—— గీ. భల్లూకంబుల నెత్తుటఁ ♦ బ్లవగఖండ
పాళిఁ బెట్టి సన్ననిసెగ ♦ బట్టిఁబెట్టి
రహిని మర్కటకామేశ్వ ♦ రంబు వండి
దానితో దర్శన మొనర్తు ♦ దనుజపతిని.

ఇంద్ర——(నవ్వుచు) మర్కటకామేశ్వర మను లేహ్యా మిప్పు డాతని కేల?

దీ——సతులసంఖ్య వృద్ధి యగుచున్న సార్వభౌమునకు సంస్తంభన లేహ్యా దులు వలదా? వైద్యుఁడను నాపని యదియే కదా!

ఇంద్ర——స రే. నీయిష్టానుసారముగ నీవు పొమ్ము. నేనుఁ బోయెద.

దీ——నేను ముందు సుగ్రీవవధమునకై పోయెదను. (ఇద్దఱునిష్క్రమింతురు.)

ఆంజ——రామా! రామా! రామా! లక్ష్మణా! లక్ష్మణా! పలుకరా? మహాప్రభూ! రామభద్రా! నీదాస్యమునఁ దరింపవచ్చిననన్ను విడనాడితివా? నావలన లోప మేమి? భక్తదోషభోగ్యత్వగుణ ముగలనీకు నాపైఁ గోపమేల? దాశరథీ! రాఘవా! రామచంద్రా! రఘువీరా! రామా! రామా!

గీ. అగ్నికంటెను బరిశుద్ధుఁ, ♦ డాంగిరసుని
కంటె ధీశాలి, యమృతాంశు ♦ కంటె సుంద
రుండు, నబ్ధికంటెను గభీ ♦ రుం డభాగ్య
పీడితాంజనేయునిదేవుఁ ♦ డేఁడి? యేఁడి?

గీ. అర్కకులము పవిత్రత ♦ నందఁ బుట్టి,
దశరథునకుఁ దనూజుఁడై ♦ ధరణిసుతకు
భర్తయై ద్వితీయబ్రహ్మ ♦ పరిగృహీత
జృంభకాస్త్రుఁడు నగుధీరుఁ ♦ డేఁడి? యేఁడి?

గీ. ఎంతదివ్యాస్త్రకోవిదుఁ, ♦ డెంతధీరుఁ,
డెంతబలగముగలమాతఁ, ♦ డెంతభోగి,

మొత్తమునకు శ్రేయాంకు, ♦ కొంతబలియుఁ,
కెటు సమాధ్య? మెచ్చటిలంక? ♦ యిట్టులగునె?

గీ, ఉన్న రాజ్యంబునను గాక, ♦ కన్నతల్లి
యొద్ద లేక, బంధుపటలి ♦ యొద్ద లేక,
యున్న తమ్ముఁడైనను నిట్టు ♦ లుండ, నూర
నున్న సతికైనఁ గనుపాపు ♦ లుండకుండ,
నుద్ధరించినసెల్లు నోటిలో ♦ నుంచుకొనుచు
పేరయిన లేక, యతినుకు ♦ మారకైన
మేనునకు మెత్తనైనచా ♦ పైన లేక

రామ! రామ! రామా! రామ! ♦ రామ! రామ! (పడును)

క. కఠినమర్కటముఁ దొక్కడు ♦ కాంతుఁ గాయ
బాణశయ్యపైఁ బవళించి ♦ పాణిపాద
ము లెచటను బెట్టిన వచటె ♦ నిలువ రామా!
రామ! రామ! రామా! రామ! ♦ రామ! రామ!

గీ. రామ! రఘువర! రఘువీర! ♦ రామభద్ర!
యనుచు మొత్తుకొనినసైనఁ ♦ గనుఁ దెఱువక
యిట్లుగానుంటి వేమయ్య! ♦ ఇనగా! తమ్ము
నైన నకకంటఁ జూడవే ♦ మయ్య! రామ!

గీ. అండజనుబాసి, నీవెంది ♦ క్కుంచు నన్ను,
నిపదంబుల సేవించి, ♦ నిన్నుఁ గొలిచి,
తనువు సాఫల్యముగఁ జేసి ♦ కొనినరాము
భక్తమాణిక్య మిదిగో! ఈ ♦ వంకఁ జూడు.

(అనిలక్ష్మణునిజూపుచున్నాఁడు.)

వీథివీథికి హరి ♦ గాథ, లింటింటి కో
క్కటి రెండుశివశక్తు ♦ లెట్లను జూడ
గ్రామదేవతలయో ♦ రలు, పోతరాజపూ
జలు, గణాధిపతుల ♦ సందడులును,

గీ. ముడుపులును, మ్రొక్కులును, బలి ♦ పోతు, లమిత
కుంభనైవేద్యములు, భక్త ♦ కోటితాండ
వములుఁ గల్గి గ్రామము శుభా ♦ వహ మగును; త
దాసద తొలంగ నెప్పటి ♦ యాట యగును.

గీ. కడుపునిండఁ గల్గెనుహరి ♦ గానకళన
కడుపుచల్లఁబడెనుదాఁక ♦ నిలుచు; ముష్టి
దాసరయ్యనారాయణ ♦ ధ్యానగాన
తత్పరత జోలి నిండెను ♦ దాఁకఁ గాదె?

గీ. కలఁగనెనునాతఁ డిది కల ♦ గాని సత్య
గాథ కాదని యొకపుడు ♦ కనుఁగొనియును
మఱల మాయఁజైనట్టు లు ♦ న్మత్తుఁడు తన
భ్రమ నొఱఁగియుఁ దిరిగి పిచ్చఁ ♦ బడినయట్లు
ప్రకృతిపరిబద్ధజీవాత్మ ♦ యొకపు డైహి
కార్థమిథ్యాత్వవిజ్ఞాన ♦ మందియును ది
రిగి మహామాయలోన జా ♦ ఱి పడి మునిఁగి
మునిఁగి కెక్కుకెక్కని కొట్టు ♦ కొనును గాదె?

నేను నిక్కం పట్లే. ఈమహామాయావు లగురాక్షసులు నిశ్చేష్టతనొందిన రామలక్ష్మణులను గ్రహించుకొని పోకుండ నేను వీరిని గాఁపు గాయవలయును! రామ! రామ! రామ! (చుట్టుఁ దిరు గుచు.

(నేపథ్యమున) రాముఁ డెచ్చట నున్నాఁడు? రాముఁ డెచ్చట నున్నాఁడు?

ఆంజ——ఆఁ! ఆఁ! ఎవఁడవు నీవు? నీపేరు చెప్పకుండ నిఁక నొక్కయడుగుముందునకుఁ బెట్టిన నీప్రాణములు దక్కవు. జాగ్రత్త!

(నేపథ్యమున) సచివాగ్రణీ! చంపుట కనేక రాక్షసులు లేరా? రాజునే చంపఁదలఁచితి వేమి?

ఆంజ——మహాప్రభూ! సుగ్రీవరాజేంద్రా! క్షమింపుము. ఇటు రమ్ము.

సుగ్రీ——(ప్రవేశించి) ఆఁ! ఆఁ! రామలక్ష్మణు లిట్లుండి రేమి? అయ్యయ్యో! జీవించియున్నారు గదా? ఇంతపని చేసినవాఁ డింద్రజిత్తేనా?

ఆంజ——మాయాసంగరకర్తోరుఁ డైనయాతఁడుతప్ప మఱి యెవ్వఁ డిందులకు సమర్థుఁడు?

సుగ్రీ——(రామలక్ష్మణులకు నమస్కరించి,) దాశరథులారా! నేను జీవించియుండఁగ మీ కిట్టియిక్కట్టు సంభవించినదా? హా! నేనీ ఘోరపాపమును జూడలేను. హనుమంతా! "పేరు చెప్పకుండ నొక్కయడుగు ముందునకుఁ బెట్టినయెడల నీప్రాణములు దక్కవు" వని కంఠోక్తిగాఁ బలికితివి. పేరు చెప్పలేదు. ఎన్నియో యడుగులు ముందునకుఁ బెట్టితిని. నన్నింక నేలచంపవు? హనుమంతా! సత్యవంతా! కానీ—కానీ—(ఆంజనేయునిపాదములకు మ్రొక్కును.)

ఆంజ——(లేవఁదీసి, కన్నులనీరు వెట్టుకొని) హా. హా. హా. హా.

(నేపథ్యమున) హా. హా. హా. హా. ఇఁక సంఘమరణమే. ఇఁక సంఘమరణమే. అయ్యో! అయ్యో! (పెద్దకేకలు కలుగును.)

సుగ్రీ——(అటు చూచి) అది యేమి? రామలక్ష్మణమూర్ఛను విని క్రోతులు చెల్లాచెదరై పాఱిపోవుచున్నవి. ఎంతప్రారబ్ధము. ఓ వానరవీరులారా!

సుగ్రీ—(ఏడ్చుచు)

గీ. దుష్టసోదరబాధను ♦ దొలఁచి నాకు
రాజ్యమొసఁగినఘనుఁడు దు ♦ ర్భ్రాతఁ జంపి
యుర్విపతిని నన్నుఁ జేయఁగ ♦ నున్నఘనుఁడు
మింటికేగెను గట్ట! సౌ ♦ మిత్రితోడ.

(ఎదురుపోయి కౌఁగిలించుకొని యేడ్చును.)

విభీ—ఆఁ! ఆఁ! ఏమీ? ఎంతమాట! ఏది! ఏది!

సుగ్రీ.—గీ. సూర్యవంశప్రదీపు, ల ♦ వార్యదివ్య
శరులు, లోకత్రయీధురం ♦ ధరులు, దాశ
రథులు, బహుబాహుబలు లతి ♦ రథులు, రామ
లక్ష్మణులు వీరె కట్ట! నే ♦ లపయి; విరుగో!

విభీ—(సమీపించిచూచి) హా! రామచంద్రా! హా సౌమిత్రీ! మహాను
భావులు మహాపురుషు లగుమీకు దుర్మార్గశిరోమణి యగు
మాయన్నవలన నెంతయాపత్తు సంభవించెను?

సుగ్రీ—రావణునివలనఁ గాదు. రావణివలన.

విభీ—అఖిలలోకాపన్మూలకారణ మగురావణుని మూలచ్ఛేదము సేయ
కుండ నప్పుడే యొఱఁగినా రేమి? దుష్టశిక్షణము శిష్టరక్షణము
సత్యవాక్యప్రపాలనమును రాఘవులబిరుదు గదా! మహాప్రభూ!
వంశాచారవిరుద్ధత సంభవింప నున్నది. లెండు; లెండు.

సుగ్రీ—విభీషణా! నీకీవెఱ్ఱి యేమి? ఇఁక నేమున్నది? ఇఁక నేమున్నది?
అయ్యో! రామా! రామా! (ఏడ్చును.)

విభీ—వానరరాజా! నీవు బేలపడి విచారించి నన్ను మఱింత యడలఁ
గొట్టకుము. ఏమిసేయఁ గలము?

గీ. సామ్రాజ్యమునఁ, బందెమున, శాస్త్ర ♦ వాదమునను,
బవరమున జయాపజయ సం ♦ భవము వెఱ్ఱి

నానిచేతాయి; జలగతా ♦ వర్త్చలము;
గాలిపాటు; గాడే యెట్టి ♦ ఘనులకైన?
ఇఁక నిప్పుడు మనము చేయఁదగిన దేమి?

సుగ్రీ—ఏమున్నది? రామలక్ష్మణుల నాంజనేయునిచేఁ గిష్కింధకుఁ బంపి

గీ. ఆశనినీకాశముష్టిప్ర ♦ హారములను
రావణునిఁ జంపి సీతను ♦ రామునకును,
బ్రాకటాసురరాజ్యంబు ♦ నీకు, నిచ్చి
పోవువాఁడను నారాజ్య ♦ మునకు నేను.

(నేపథ్యమున) చచ్చినరామునకు సీత నిచ్చుట యెంతసౌభాగ్యముగ నుండునో బ్రదికియున్నవిభీషణునకు లంకారాజ్య మిచ్చుట యంతయసందర్భముగ నుండును. ఓరాక్షసవీరులారా! విజయ మైనది. రామలక్ష్మణులు కడ తేరిరి. కపులారా! తోఁకలు ద్రెంపుకొని పాఱిపొండు.

విభీ—ఆమాట లాడువాఁడు రావణముష్టివైద్యుఁ డగుదీర్ఘకాయుఁడు. చూచితివా! రామలక్ష్మణులమూర్ఛ నెట్లు వెల్లడించుచున్నాఁడో? మహాప్రమాదము సంభవించును. ముక్కు నూపిరి యున్నంతవఱకు యుద్ధముజరుపవలయు గావున నేను రణరంగమునకుఁ బోయెదను. కలకలము నివారించెదను.

(పోవును.)

(నేపథ్యమున) ఎక్కడ? సుగ్రీవుఁ డెక్కడ? సుగ్రీవుఁ డెక్కడ?

సుగ్రీ—ఇక్కడ.

(నేపథ్యమున) ఇక్కడ నిక్కడ ననుచు మూలమూలల డాఁగినా వేమి?

గీ. ఆఁడుదానవౌరా! మగవారి ♦ కగపడవు! బి
డియపడకుము! నిను జూటఁ బొ ♦ డిచి, ఘటమున

నడిమి, యష్టభాగముకషా ♦ యంబుఁ దీసి,
యసురపతి కిచ్చి, రణజ్వార్తి ♦ నాహరింతు.

సుగ్రీ—ఓ హెూ! ఈవీరవైద్యుఁ డెవఁడు? ఓరీశూరశుంఠా! రావణ రణజ్వరము రామబాణరసమునఁగాని హరింపదు. సుగ్రీవకషాయమున నీపురాణజ్వరము హరించును. ఓరీభిషగ్వాచాటా! మూఢా! ఇదిగో! వచ్చుచున్నాను. నీమందుల సంచి సిద్ధముగ నుంచుకొమ్ము. ఆంజనేయా! భద్రముగ నుండుము. ఒక్కగడియ నిరీక్షించి వీరికిఁ జైతన్యము రాకుండినయెడలఁ గిష్కింధకుఁ దీసికొనిపోవుటయే మంచిది. విభీషణుఁడు తనయభిప్రాయము సెప్పకుండ నేగినాఁడు.

(సుగ్రీవుఁడు నిష్క్రమించును)

ఆంజ—రామా! రామా! ఎంతసేపుమోహపడియుందువు? ఇంకనైన లేవరాదా? మీ రిట్లుంటచే సృష్టియంతయు వ్యత్యాసముగ నున్నట్లు తోఁచుచున్నది

గీ. గాలి స్తంభించె; నాకల్ల ♦ లాడకుండె;
గుండెలో గుబుల్పుట్టెఁ; జం ♦ ద్రుండు సగము
వచ్చి మునుఁగువడు వఁ దాఁటె; ♦ సర్వజగతి
జీవశూన్యమైనట్లు తోఁ ♦ చెడిని మదికి.

రామా! రామా!

రాము—(ఉస్సురనుచు) ఆంజనేయా! కనిపెట్టి యుంటివి కదా? తమ్ముఁ డేఁడీ?

ఆంజ—(లేచి) మహాప్రభూ! సంజ్ఞ నొందితిరా? ఇదిగో! సౌమిత్రియిచ్చట నున్నాఁడు.

రాము—హా. తమ్ముఁడా! తమ్ముఁడా! మారుతీ! నాచేతిని తమ్మునిమొడలిపై నుంచుము.

ఆంజ—(కన్నుల నీరు నొత్తుకొని) రామభద్రా! ఎంతగతి పట్టెను! త్రిలోకీభరణక్షమ మైనహస్తమునకు నిర్భాగ్యునియూఁత కావలసివచ్చెను! (అట్లు చేయును.)

రాము—(ఉస్సురనుచు) హా తమ్ముఁడా! తమ్ముఁడా! పలుకవా? పలుకవేఁ? నాయనా! నాయనా! పాపుఁడ నైననాతో మాటాడ నొల్లవా? హా! నీవంటిసోదరుఁడు నావంటిమందభాగ్యుని కేల దక్కును? రాష్ట్రమును విడిచి—తల్లిని విడిచి—సతినివిడిచి—సౌఖ్యమును విడిచి—నిద్రాహారములు విడిచి—నన్నే సర్వముగ నమ్మి—మహారణ్యములో—పదునాల్గు వత్సరములు—నాకోఁ బడరానియిడుమలు పొంది—నాతండ్రీ!—నాతండ్రీ!—నేనింక జీవించి యుండఁగా—నీ విట్టిదశకు వచ్చితివా? లక్ష్మణుఁ డేఁడీ యని యడుగుమీతల్లికి నే నేమి చెప్పను? మాతాపుత్త్రుల నెడఁబాపినపాపము నాగొంతుక కుర్త్రాడై చుట్టుకొనినదా? నీచే సేవ చేయించుకొనుటయే కాని, నీకెప్పుడును నే నుపకృతి నైనఁ జేసి యుండనుగదా! ఈయుద్ధమం దైన నిన్ను రక్షించుకొనుటకు నే నసమర్థుఁడ నైతిని గదా? ఇట్టియశక్తుని నమ్మి నీవుమోసపోయితివి. నీగొంతు నేను గోసితినిరా! తండ్రీ! హా! సీతా! మహాసుగుణసంపన్నుఁడై—మనకుఁ బుత్త్రప్రాయుఁడై—పాదభక్తుఁడైన—నీమఱఁదియవస్థవింటివా? హా! సౌమిత్రీ! హా! సుగుణరాశీ! హా! మహాధనుర్ధరా! హా! బాహాపరాక్రమక్రమనిరసితకార్తవీర్యా! (ఏడ్చును)

ఆంజ—రామప్రభూ! కలుషపడకుఁడు. మీకువలెనే లక్ష్మణునకుఁగూడఁ గొంతసేపటికైనఁ గొంతసంజ్ఞ రావచ్చును.

రాము—మారుతీ! రావణునిఁ జంపి తద్రాజ్యమున విభీషణునిఁ బట్టాభిషేకి నొనర్తు నని యాతనిముందర నేమేమో గర్వప్రలాపము

లాడితిని. ఉత్తమక్షత్రియుని చేత చేసినతరువాతఁ దెలియవలసిన దే కాని మాటలచే ముందుగ వెల్లడికావలసినది కాదు. ,,మాట నెఱవేర్చుకొనలేకుంటి ననిమిగుల విచారించితిని; దయ యుంచి క్షమింపు,, మని చెప్పుము.

ఆంజ——మహాప్రభూ! మీ కట్టిచింత వలదు. సత్యవాక్యపరిపాలకు లగు మీపలుకు వృథ వోవునా?

రాము——ఏమో! చూడు. అంగదపురస్సరముగఁ గపిసేనను వెంటఁబెట్టి కొని సుగ్రీవునిఁ గిష్కింధకుఁ బొమ్మని చెప్పుము. వానరవీరు లందఱు నాకుఁ బ్రాణతుల్యులు. నా కెంతయుపకారమైనఁ జేసి నారు. యుద్ధమున మహాపరాక్రమము నగపఱిచినారు. నాయం దు బద్ధానురాగులై యున్నారు. అట్టివారినిన్నిర్హేతుకకటాక్ష మెన్ని జన్మములకైన మఱవను. మాకర్మగతి యిట్లుండ వా రేమి చే యఁగలరు? చేయఁగలయంతవట్టు చేయనే చేసినారు. కావున ద యయుంచి యెవరియిండ్లకు వారిని బొమ్మని చెప్పుము.

ఆంజ——ఎంతమాటాడితిరి! ,,హరీ!,, యని యిచ్చట నందఱుకపులును బ్రాణములను విడుచువారే కాని యొక్కఁడైన వెనుకకుఁ బో వునా?

రాము——పోవుభీరుస్వభావము కలవారు గారు; కావుననే యనుజ్ఞ యి చ్చుచుంటిని. వృథగ నుండనేల? నామాట విని పొమ్మని చెప్పు ము మారుతీ! నాతమ్ముఁడు కొంచెము కదలినట్లు నీ కగపడు చున్నదా?

ఆంజ——ఇప్పుడు మునుపటికంటె నూపిరి బాగుగ నాడుచున్నట్లు తోఁ చుచున్నది.

రాము——సంతోషమే! అబ్బ! ప్రాణములు తెప్పిఱిలునట్లుగ మంచిగాలి విసరుచున్నది! హా. హా.

ఆంజ—కాలకూటానలసర్పగరళము పొలాహ్లత మీకు దేహమున వ్యా పించియుండుటచే మీకీగాలి సుఖకరముగ నగపడుచున్నది. కాని, యిది మహాభయంకరమై ప్రబలమైన ప్రభంజనము.

గీ. విటపములు పెళ్ళుపెళ్ళన ♦ విఱుగసాగె;
రోదసీగహ్వరము పాంసు ♦ రుద్ధమయ్యె;
అబ్ధి పొంగినగతి హోరు ♦ మనియె నేదొ;
సమర మాఁగెను తప్పని ♦ సరియె యాగుట.

రాము—(తనలో) నాగబంధవిమోచనమునకై గరుడమంత్రము స్మ రించుచుంటిని. భగవానుఁడైన వైనతేయుఁడు దర్శన మిచ్చుచు న్నట్లున్నది. (ప్రకాశముగ)

గీ. జానకినిఁ జూచి నామది ♦ చల్లఁబఱుప
నమిత వేగంబునను వ్యోమ ♦ యానకలన
నటకు వచ్చుచీవంటిని ♦ స్వైతుకోప
కారులెవరైన వచ్చుచు ♦ న్నారొ? కనుము.

ఆంజ—మహాప్రభూ! విష్ణువహనకృతార్థతనుఁ డగువినతానందనుఁడు వేంచేయుచున్నాఁడు. (గరుడుఁడు ప్రవేశించును.)

ఆంజ—సర్పవైరీ! నమస్కారము.

గరు—(మారుతిని కౌఁగిలించుకొని) రామభద్రభక్తిచే జన్మమును ధరిం పఁజేసికొనుచున్నావు. రామచంద్రా! లక్ష్మణా!

రాము—మహానుభావా! నమస్కారము.

గరు—నమస్కారము.

ఆంజ—గీ. గరుడదర్శన మైనట్టి ♦ క్షణమునందె
సర్పబంధంబు లన్నియు ♦ జాఱిపోయె;
విష్ణుదర్శన మైనట్టి ♦ వేళయందు
భవమహాపాశము లైగి ♦ పడినయట్లు.

గరు—(రామలక్ష్మణులను స్పృశించి) మీ కింక నాగపాశవిమోచన మైనది లెండు; లెండు.

రాము & లక్ష్మ—ఆహా! ఆహా! (లేచుచున్నారు.)

రాము—మహానుభావా! (తమ్ముని గౌఁగిలించుకొని)

గీ. వసుధఁ దమ్ములందఱు కుండ ♦ వచ్చుఁ దఱచు
గాని యేజన్మమం దేరి ♦ కైనఁ గాని
యిట్టితమ్ముఁడు లేఁడు; న ♦ న్నితనిఁ గలిపి
బ్రదుకఁ జేసితివయ్యా! హా! ♦ వైనతేయ!

గరు—మీవలన లోకము బ్రదికె ననుఁడు. దేవతలు బ్రదికినా రనుఁడు. అయ్యా! మీచే రావణసంహార మతిశీఘ్రకాలములోఁ గానున్నది. దుష్టశిక్షణశిష్టరక్షణమునకై యవతరించినమహాపురుషులరు!

గీ. ఎంతటిమహాత్మునకునైన ♦ నిలను బ్రకృతి
బద్ధుఁ డైయుండ నేదొ యా ♦ పద గలుగక
పోదు; నుబ్బురీతిగ విడి ♦ పోక తీఱ
దయ్యా! మీ రెఱుంగని దేది ♦ యయ్యా? రామ!

మహానుభావా! నేనింకఁ బోయెదను. లంకానాథసంహారమును శీఘ్రముగఁ జేసి బృందారకబాధఁ దొలఁగింతువుగాక!

ఆంజ—తథాస్తు. ఒక్కబృందారకగణబాధయే కాదు. సర్వలోకపీడ.

రాము—తమయాశీర్వాదమును శిరమున ధరించితిని. నమస్కారము.

లక్ష్మ—నమస్కారము.

గరు—ఇవే యనేకనమస్కారములు. నేను బోయెదను.

(నిష్క్రమించును.)

రాము—

గీ. ఇడుములు గడచి బయటను ♦ బడినపిదప
కష్టములఁగూర్చి మిత్రాది ♦ గణముతోడ
ముచ్చటించుకొనుటకంటె ♦ మోద మొండు
గలుగ దని చెప్పుదురు కాదె? ♦ కపివరేణ్యా!

కావున శిబిరములకుఁ బోయి సుగ్రీవవిభీషణాంగదనలనీలాదిమిత్రులతోడఁ గొంత సేపు ముచ్చటింతము. రండు.

ఆంజ—మహాప్రభూ! చిత్తము.

రాము—తమ్ముఁడా! రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

శ్రీ

# విజయరాఘవము.

## చతుర్థాంకము.

[ప్రదేశము—యుద్ధరంగసమీపమున నొకశిబిరము.]

(ప్రవేశము—ద్విజిహ్వుఁడు.)

ద్వి—గీ. వీరుఁడు జయముకై చచ్చు; ♦ పిసిడి ధనము
వెంటఁ బరుగెత్తు; వైద్యుఁ డే ♦ వేళ జనరు
జలగలకు మ్రొక్కు; నిర్భాగ్య ♦ చక్రవర్తి
యైనకవి వట్టిమాటల ♦ కయియె యేడ్చు.

సీ. తలను గొట్టుకొని మె ♦ దడుఁజింపుకొని యొక్క-
గద్యమో పద్యమో ♦ కవిత యల్లి
జనులకు వినిపింపఁ ♦ గను బొమ చిట్లించు
నొకఁ డడ్డముగ మొగ ♦ మూఁచు; నొకఁడొ
కొకఁ డోష్ఠము విఱుచు; ♦ నొకఁడు వంకగ నవ్వు
నొకఁడు పూర్వకవుల ♦ నుబ్బ పొగడు;
ఎవ్వనున్న దండి యం ♦ చేద్వఁగ సకిలించి
యెడఁ, యున్న దని సాఁగ దీయు నొకఁడు.

ఆ. వె. వ్రాయుచుండ బాధ ♦ వ్రాయువిదపఁ దిట్లు
కనుచుంట బగులఁ ♦ గలుగుఁ గవిగ

బుట్టుకంటె ఘోర ♦ పూర్వజన్మారబ్ధ
కఠినఫలము లేదు ♦ గాదె యొకటి?

సీ. "బండీరా" యన నెద్ద ♦ బండియా పోతుల
బండియా? యనెడు మొ ♦ ద్దుండవచ్చు
"కుక్కగొడుగు" గనఁగ ♦ గుడ్డదో త్రాటాకు
దో? యని యడుగు మొ ♦ ద్దుండవచ్చు
"తాండ్రపు" చనఁ ద్రాటి ♦ తాండ్రయో? మామిడి
దో? యని యడుగు మొ ♦ ద్దుండవచ్చు
"చాముండ" యనఁగ ము ♦ సలిముండయో బాల
రండయో? యనెడు మొ ♦ ద్దుండవచ్చు

గీ. నన్నెకువంటి మొద్దైన ♦ నుండుఁ గాని
రాఘవకవికవితయం ♦ దన్ని దోష
ములె యటంచుఁ బల్కఁగ లేని ♦ మొద్దు లేఁడు
సర్వదేశంబులను సర్వ ♦ జాతులందు.

అదుగో! మహాహ్లాదరుఁడిచ్చటకు వచ్చుచున్నాఁడు.

సీ. పలకలుగల మొద్దు ♦ వదనంబువాఁడు, న
డవిపందివంటి మె ♦ డగలవాఁడు,
గోఁకుకొనఁగ నోచు ♦ కొననీనిపొణకక
డుపువాఁడు, దుర్వ్యస ♦ నపరిబద్ధుఁ
డగువాఁడు, చలిమంట ♦ కై గ్రామ మంటించు
వాఁడు తీఁటనియాబ ♦ మాఁడువాఁడు,
పూజ్యాలయములలో ♦ ముండలసంతలఁ
బెట్టువాఁ, డర్చిత ♦ విగ్రహములఁ

సీ. జెఱపి వేశ్యల కండెలు ♦ చేయఁ బనుచు
వాఁడు, పార్థివలింగముల్ ♦ బట్టి విసరి
కుక్కలను గొట్టువాఁ, డన్ని ♦ కర్కశుతులు
గలుగువాఁడు, కాలిమచోటఁ ♦ గాల్చువాఁడు.

(మహాహాదరుఁడు ప్రవేశించును.)

మ——ఓ హాహాద్విజహ్వాఁడా! సాలోచనముగ నుంటి వేమి? విశేష బుద్ధిపరిశ్రమమున బడలిన ట్లుంటి వేమి?

ద్వి——నావంటిస్వల్పగాత్రుఁ డైనవానికి బుద్ధిపరిశ్రమవిశేషముచే వింత యేమున్నది?

గీ. ఒడలు చెడమడ దశదిక్కు ♦ లోహటించి
లావగుకొలంది బుద్ధివి ♦ లాస మడఁగుఁ
గాదె? దయ్యాపుఁగొబ్బరి ♦ కాయ యెదుగు
కొలఁది నాంతరఫలనీర ♦ ములనుబోలి.

మ——ఓరీమూఢా! ఇంకొక్కసారి నాకడుపునుగూర్చి నీవు నిందించినఁ బచ్చడిబద్దవలె నిన్నుఁ జప్పళింతును. జాగ్రత్త.

ద్వి——మిత్రమా! నిన్ను నేను నిందింతునా? పరిహాసమునకుఁ బలికిన మాటలు పాటిసేయవచ్చునా? నాకు నీకంటె మిత్రుఁ డెవ్వఁడు?

(కౌఁగిలించుకొనును.)

మ——అబ్బ! నీగొంతుక కొయ్య! ఏదియో కడుపున గ్రుచ్చుకొన్నది.

ద్వి——(తనలో) అమితముగ నెదిగినకడు పపాయస్థలముకంటె నధ్కతర మైనది. (ప్రకాశముగ) మఱేమియు లేదు. గంటము. (చూపించును.)

మ——అసురవీరు లంద ఱీయూహావనమయమునఁ గత్తులు గదలు పూనఁగ నీవు గంటము ధరించితి వేమి?

ద్వి——ఈనడుమఁ గవిత్వ మేర్పుచుంటిమి కాదా?

మ—ఔను. అప్పు డేదో గ్రంథము చేసెద నని చెప్పితివి: వ్రాయు చుంటివా?

ద్వి—ఔను. విజయరావణము.

మ—నాటకమా?

ద్వి—నాటకము! నాటకము సేయుటకుఁ బదములు, పాటలు, కందార్థములు, గంతులు, తాళములు, తప్పెటలు, దరువులు, తాండవములు కావలదా? అంతయుడుకులదంపు లేల? అంతమిడిమేలము లేల? నిక్షేపముగఁ బ్రబంధము వ్రాసినయెడల నుత్కృష్టమని-

మ—ప్రబంధమా? నేను వినవలయును. అదిగో! నక్కలోలున మూటఁగట్టినది గ్రంథమేనా?

ద్వి—ఔను.

మ—నేను దలమొదలు తోఁకవఱకు విందును. అదిమొద లంతమువఱకు వింటిను.

ద్వి—ఇఁక నే నంతమువఱకు రానిదే?

మ—నీ కేమయ్యా? ఈదినమునఁ గాకపోయిన రేపు వచ్చెదవు? ఈ యుద్ధముతో నీపనిగూడ నంతము కాకుండునా?

ద్వి—నీద్వ్యర్థిసంభాషణములఁ గట్టిపెట్టుము. ప్రబంధరచనాబంధురుఁడైనపండితకవియొద్ద వాజైఖర్యమా? చాలించు.

మ—అది లేదనియే నేను జెప్పుచున్నాను.

ద్వి—లేదు? లేదో యున్నదో సరసుఁడైనవాఁ డెవఁడుఁ గూర్చుండి చదివించినపుడు బయట పడును.

మ—నేను సరసుఁడను గానా?

ద్వి—ఆ. సానులకు.

మ—ఉక్కిరిటుకే యది. కాంతారసజ్ఞత గలవానికిఁగాని కవితారసజ్ఞత యెక్కడిది? వృథాకాలయాపన మేల? చదువుము.

ద్వి — గ్రంథము మొదటినుండియు నిపుడు నాయొద్ద లేదు.

మ — ఎప్పటినుండి నీయొద్ద నున్నది?

ద్వి — నాగపాశబంధవిమోచనానంతరమునుండి —

మ — చదువు. వినుటకుఁ గుతూహలపడుచున్నాను.

ద్వి — సావకాశముగఁ గూరుచుండుము. ముంగాళ్లపైఁ బురాణశ్రవణ మొనర్చువాఁ డుండునా?

మ — పఠన మొనర్చువానితోఁ బాటు. కానీ. (కూరుచుందురు.)

ద్వి — శ్రీః (చదువుచున్నాఁడు.)

మ — చీచీ! "శ్రీః" అనుటకు మనము నిర్భాగ్యుల మైనవైష్ణవులమా?

ద్వి — హా. హా. హా. కవిహృదయ మగాధము కదా? "శ్రీః" అనఁగ గౌరి యనియర్థము.

మ — ఊఁ,.........స.........రే...

ద్వి — విజయరావణము. తృతీయాఘాతము.

మ — హా. హా! బంగాళాఘాతమువలె నాఘాతము లని పేరిడితివా? మనకొంపలు నట్టేటఁ గట్టితివా?

ద్వి — నేనుఁ గ్రొత్తగాఁ గట్టిన దేమి? ఈద్వీప మంతయు నట్టేటనే యున్నదిగాదా? బంగాళాఖాత మనుశబ్దము వేఱు. ఈయాఘాత శబ్దము వేఱు. దీనికి దెబ్బ యని యర్థము.

మ — సరే కాని గ్రంథవిభాగమున కాఘాత మనుపే రెట్లు తగునో నాకుఁ దెలియ లేదు.

ద్వి — పూర్వసంబంధము తెలియనిపురాణశ్రవణమువలనఁ బుట్టుబాఁతు లాట యిదే. నేను బ్రథమాశ్వాసములో నేమని చెప్పితి ననఁగా రావణుఁ డనుకొండకట్టను హనుమదాదులు త్రాళ్లున్న వనియు నొక్కొక్కయాశ్వాస మొక్కొక్కతాఁకులు దెబ్బగా రూపకాలంకారసహితముగా నుత్ప్రేక్షించినాను.

మ—అట్టులైన నీయువతియోపఘాతములఁ జెప్పి చదువువారిని జంపఁదలఁచితివా? కాని, ఒక్కసందేహము. కొడుకుతో నెవఁడైన నొకఁడు గొట్టవలయును గాదా? రావణుఁ డనుకొడుకుతో నెవఁడు కొట్టు నని నీయభిప్రాయము?

శ్వా—అటు లడుగుము. ఎవఁడో చెప్పనా? విధి. విధి. తెలిసినదా? ఉత్తమకావ్యప్రధాన మీవ్యంగ్యము. ఉండు. ఉండు. ఏతద్విషయిక మగుపద్యమే జ్ఞప్తికిఁ గొంచెము వచ్చుచున్నది.

కం. దశముఖదేహం బసయొకు

కశదండము—ఊఁ—ఊఁ—ఊఁ—ఉండు.

మ—పోసి. ఇఁకఁ జదువనక్కఱ లేదు. కశదండము—కశదండము—ఇది—దుష్టసమాసము. కశా యని స్త్రీలింగము.

శ్వా—పోవోయి! మాటమాటకు శంక లే. స్త్రీలింగ మని నే నెఱుఁగక యట్లుంచ లేను. మహాపౌరుషప్రతాపవంతుఁ డగు రావణాసురునిగాత్రమునకు సామ్యము స్త్రీలింగపదముతోఁ దీసికొనివచ్చినయెడలఁ జెప్పినందులకు నన్ను, వినినందులకు నిన్నుఁ జెప్పునఁ గొట్టును. తెలిసినదా? శాస్త్రము తెలిసినంతమాత్రమున నే కవిత్వము సరసముగ నుండు ననుకొంటివా? శ్రోత్రియపుఁగవిత్వము శుద్ధమయ్యు నాహితాగ్నికాపురమువలె సరసవ్యభిచారిభావచేష్టాభూయిష్ఠ మైయుండదు. దీనికిఁ గావలసినది లౌకికజ్ఞానము. మాటలతో నేల? గ్రంథము వినుము. ఇఁకను వెనుకటి పద్యము జ్ఞప్తి లేదు.

మ—జ్ఞప్తిలేని వస్తువును జచ్చినజీవమును స్మరింపనెంచుట బాధయేగాని ఫలము లేదు. ముందు చదువుము.

శ్వా—

చం. ఒకకనునూఁతచేతఁగఱి ♦ యొప్పఁగనానుటప్రాణికోటికిం
ప్రకటితనైజవాసనని ♦ రంకునె నిశ్చలవీక్షణంబుస్వా

త్మకుగుఱ్ఱెపెట్టనెంచితను ♦ దమ్ములలో నొకదానిఁ బోవఁద్రో
బ్బికొనిసమాధిఁజేరుఘన ♦ పుణ్యుఁడు శుక్రుఁడుస్వస్థుఁడయ్యెఁ గ్రుక్.

మ——కఱకుగడ్డిపోఁచచేఁ బొడిచి విష్ణుఁడు శుక్రాచార్యులవారిని జంప లేకపోయెను గాని, కవిత్వముచే నవలీల నీవు చంపుటకుఁ జాలి యున్నావు. 'సమాధిఁ జేరు, 'స్వస్థుఁ డయ్యెఁ గ్రుక్, అనునీరెం డుపదములు——పాపము——శుక్రాచార్యుల వారికి——ద్విజిహ్వా ముఖోత్థితగరళబిందువులు గదా? హరహరా!

ద్వి——పోవోయి! శ్లేషవశ్యార్థములనుబట్టియా యధిక్షేపించుచున్నావు? ఛీ! ఛీ!

మ——పోనీ. ఆకింటఁత,వర్ణముంచినా వేమి? "ఒకకనునూఁత,, యని——

ద్వి——ఇది యొకయాక్షేపణమా? ఊఁత——చేత——యని యమకప్రాస కొఱ కుంచితిని.

మ——ప్రాసము కొఱకుఁ బ్రాణములఁ దీసెదవయ్యా!

ద్వి——ఇప్పుడు కవులకు లోకులకుఁగూడఁ గవితాభిరుచి దీపావళిరోజున నజ్ఞబాలుర వేడుకవలె నర్థనాశనసహిత మగుశబ్దాడంబరముపైఁ దగిలియున్నది. నే నొక్కమాట చెప్పెదను.

సీ. కవిత, కాంతయు నతి ♦ క్రమమైనట్టివి;
యంటిఁ యంటనియట్టు ♦ లాదరింప
వలయు; నట్టిట్టులు ♦ పడలాగి; లేశ లే
శములుగాఁ జీల్చి దు ♦ స్తను ధరించి,
దూదేఁకినట్టులు ♦ తూలఁ గొట్టిన నింక
రస మేమి? గుణ మేమి? ♦ రమ్యసాంఘి
కస్వరూపమున ను ♦ ఖము నొందవలయును;
పట్టి చూచిన నంత ♦ పాడెనుమ్మ;

సీ. అన్ని తొస్సులె; యన్ని హే ♦ యతలె; యన్ని
యలుసులే; పైకి సత్యాద్భ ♦ తాకృతిని ధ
రించి లోఁగఁ బీ, చేసె, ♦ లీఁకె లున్న
కులుకుబంగారు పిచ్చుక ♦ గూఁటిఁబోలె.

నీవు లేనిపోనిశంకలు నిందలు మాని వేయుదు వనినఁ గాని నేను చదువను.

మ—ఆఁ. ఆఁ. చదువక తప్పదు ఇది శుక్రాచార్యులవారికిఁ గృతి నిచ్చితివి కాఁబోలు!

ద్వా—అవధరింపుము. తరువాతికథాక్రమం బెట్టి దనిన,

మ—సరే; సరి. రామలక్ష్మణవిమోచనానంతరమా?

ద్వా—

చ. పటపటపండ్లు గీటుచును ♦ భగ్గున మండుచు నెంతమాట! యా
కుటిలులు చావకుండిరె? య ♦ కుంఠితశౌర్యరసానివార్యను
త్పటుతరచాపముక్తసిత ♦ బాణకృశానుకరాళకీలలన్
జిటచిటలాడ విద్దఱిని ♦ జిక్కఁగఁ గట్టినుగట్టి కాల్చెదన్.

మ—దిక్కుమాలిన కాపురమువలెఁ గర్త లేనిపద్యమును జెప్పితి వేమి?

ద్వా—

మ. అనిలంకేతుఁడు బల్కెఁ గోపమున ధూ ♦ మ్రాక్షుండు బాహాపటు
ధ్వనులాకాశముఁ గ్రమ్మఁ బల్కె దనుజా ♦ ధ్యక్షా! ననుం బంపుఁడీ
యనికిన్ స్మృత్కరకర్కశోగ్రకరవా ♦ లాచ్ఛిన్నశత్రుండ నే
చని మేషంబున వత్తు రాముఁ డిఁకఁ జ ♦ చ్చుం గాదు చచ్చుం జుఁడీ!

శా. ఆమాటల్విని మెచ్చి రావణుఁడు ధూ ♦ మ్రాక్షున్ సువాసైనిక
స్తోమప్రావృతుఁ జేసి యాలమునకున్ ♦ దోలన్ మరుత్పుత్త్రబా
హామాహాత్మ్యవిజృంభణాధికదిదృ ♦ క్షాయత్తుఁడై యాతనిన్
భీమప్రక్రియఁ దాఁకె నాతఁ డపుడా ♦ వీరుల్ రణోత్సేకులై.

క. పొడుపొడు మని విడువిడుమని
కడువడి బడబడలు నింగిఁ ♦ గ్రమ్ముఁగఁ బోరన్
గడ కాకస్యధముఁడు మో
దుఁడు సుడివడి పుడమిఁ బడియె ♦ ధూమ్రముఁ డకటా!

ఉ. ఆపయివజ్రదంష్ట్రుఁడు ర ♦ ణావని కేగిననంగదుండుచూ
పోపకతచ్ఛిరంబుపయి ♦ నొక్కమహీజము వ్రేసియ భీకరా
టోపమునన్ మఱల్చుచుఁ గ ♦ ఠోరకుఠారముచేతనంగదున్
గోపమురూపమందుక్రియఁ ♦ గొట్టఁగనట్టిటులాతఁ డూఁగుచున్!

క. పడుచును, లేచుచుఁ, బడుచును,
దడఁబడుచును, గ్రోఁతి పర్వ ♦ తముఁ దెచ్చి వెసన్
బడవైచినఁ దల పగులఁగఁ
దడ వించుక లేక వజ్ర ♦ దంష్ట్రుం డీల్గెన్.

మ—నీ వేమో చదువుచుంటివి కాని నా కేమి బాగుగ నున్నదిగాదు. ఎంత సేపును యతిప్రాసములకుఁ దడవుకొనుట యొప్పులతోడనే సరిపోయెను. ఒకకల్పనము లేదు. ఒక్కయలంకారము లేదు.

ద్వి—నీసరసజ్ఞత మండిపోను! ఎంతకష్టపడి చెప్పినపద్యములు! అదిగో. విను. తరువాతదివ్యమైనకల్పన మున్నది. (చదువును) వజ్ర దంష్ట్రుఁడు యుద్ధమునఁ గడతేఱె నని విని రావణుఁడు మహా కోపసమ్మూర్ఛితుఁడై భయంకరాకారుండై యుండె.

మ—ఏదీ కల్పన మంటివే?

ద్వి—అట్టిసమయమున రావణుని మొగమును వర్ణించితిని. నీ వధిక్షేపించు నెడఁ జదువను.

మ—ఆక్షేపించను. చదువుము.

ద్వి—

ఉ. ముక్కులవుట్టవెల్వడిబు ♦ భుకుతవచ్చినమీసలన్ మడు
ద్భుకుక్కులఁగాలతుండికుఁడు ♦ పొల్పుగనోళ్లనుబట్టిలంచునన్

జిక్కఁగఁబట్టనెంచియొజ్జ ♦ చేసెనుపండ్లనుకోడిగ్రుడ్లలన్
గ్రక్కనఁజిక్కకవ్విపృథు ♦ కర్ణములన్ గుహాలందుదూఱెహో.

మ—చీ! చీ! నీస్వభావవర్ణనము చట్టుఁబండలై పోను! ఇంతకంటె కథ యేబాగుగ నున్నది. దానినేచదువు.

ద్వి—ఏది చదివినను నిందించుచున్నావు. నీ కసూయాపిశాచ మావహించిన ట్లున్నదే?

ఉ. కన్నులనగ్ని రేఁగెడున ♦ కంపనునాజికిఁబంపనాతఁడున్
మిన్నునుమన్నెఱుంగకన ♦ మీరతనూజునిబట్టికొట్టనా
పన్నతనొందియున్ గపియు ♦ వైరిపదంబులఁబట్టిగిఱ్ఱునన్
గ్రన్ననఁద్రిప్పినేలనడఁ ♦ గన్ బడఁగొట్టెమహాభుజోన్నతిన్.

ఉ. ఆతనియంతయున్ వినిసు ♦ రాంతకుఁడంతఁబ్రహస్తుసంగర
ఖ్యాతియశఃప్రశస్తు, సము ♦ దంచితకార్ముకహస్తు, భక్తసం
ప్రీతశశాంకమస్తు, పరి ♦ పీడితదేవసమస్తు, రాఘవ
భ్రాతృజిఘాంసతాలులిత ♦ భావముతోడుతఁబంపె నాజికిన్.

మ—పరిపీడితదేవసమస్తు, దుష్టసమాసము. అంత్యనియమముకొఱ కేన్వఁబోయి యాదినియమమగు వ్యాకరణమును దగులఁబెట్టితివి.

ద్వి-ఉ. నీలుఁడువానిఁదాఁకికరి ♦ ణీకరభీకరతాకరోత్కరో
ద్వేలనఖప్రహారముల ♦ దీటుల, పోటుల, వ్రేటులన్, శ్రమా
ఖీలునిజేయబాణముల ♦ భేదితు, బోధితు, బాధితుండుగా
లీలనుద్రోచెనప్పుడవ ♦ లీలనులోలునినీలునిన్ భువిన్.

మ—అబ్బబ్బ! మానివేయుము. నీయమకములు చెవిలోఁ దిరివెట్టి గూబ గుంయిమనునట్లు చేయుచున్నవి. అదేమి? నీలుఁడు ప్రహస్తునిచే మరణించినట్లు చెప్పుచుంటివి.

ద్వి—పోనిమ్ము. ఈమాత్ర మసత్యమువలన బాధ లేదు. ఎప్పుడును కపులేగెలిచినట్లు కవిత్వముఁ గట్టినయెడలఁ గాలిజోడుఁ దీసి రా

జూ తన్నను. ఇందుకొఱకే లౌకికజ్ఞానము కవి కుండవలయు న
ని మొదటినుండి యేడ్చుట! కాని నాకవిత్వ మెట్లున్నదో నీవు
మనస్ఫూర్తిగఁ జెప్పుము.

మ—అంతయుం బూర్తి కానిమ్ము చెప్పెద.

ద్వి—ఈయాఘాతము నింతవఱకే యైనది. ఈదిన ముదయమువఱకు
నాహవమునఁ బ్రహస్తమరణమువఱకే జరిగినది. ఎప్పటిగ్రంథ
మప్పుడే వ్రాయుచున్నాను. అతిశీఘ్రముగ రణగుణధ్వనిలో వ్రా
యుటచేత నక్కడక్కడ పొరబాటు లుండవచ్చును. ఏమి? నీ
యభిప్రాయము మనస్ఫూర్తిగఁ జెప్పుము.

మ—నాకడుపుకోడు. నా కిన్నిమనస్సు లిన్నిజిహ్వాలు లేవు.
ఏమో—ఉ—న్న—ది.

ద్వి—ఉన్న దేది? నీమొగమా? నామొగమా? మూర్ఖుఁడా! ఏమో.
ఏమో! ఉన్నది యని యేడ్చువాఁడ విట్టికవిత్వము చెప్పు. చెప్పి
నయెడల నేను జెప్పునఁ గొట్టించుకొందును. లేనియెడల నిన్నుఁ
గొట్టనా? అబ్బా! విమర్శనాశక్తి! అన్నియుఁ దప్పులే? ఛీ! ఛీ!
ఇఁక గవితఁ జెప్పినవానిని కాలితోఁ దన్నవలయును.

మ—ఈకవితను బలాత్కారముగఁ గొనితెచ్చుకొనుట యెందులకు?
నీవు బాధపడు టెందులకు? ఒకరిని బాధపెట్టు టెందులకు? వ
దలివేయరాదా?

ద్వి—సీతను బలాత్కారముగ రావణుఁడు దెచ్చు టెందులకు? తాను
జచ్చుటకు సిద్ధపడి యుండు టెందులకు? ఇందఱఁ జంపు టెందు
లకు? వదలివేయరాదా? రావణునికి, నాకు నీకున్నజ్ఞానమంత
యైన లేదనుకొంటివా? పెద్దపెద్దమాటలఁ జెప్పకుము.

మ—మొదట గ్రంథముపేరే సందర్భముగ నుండలేదు.

ద్వి—ఎల?

మ—విజయరావణమన నేమి?

ద్వి—విజయము నొందినరావణునిగూర్చినది, యని యర్థము.

మ—ఒక వేళ—మనలో మనమాట—కాలకర్మవశమున—రాక్షసుల ప్రారబ్ధమున—రాఘవులయదృష్టమున—సీత యుసురు దాఁకి-రావణునికి జయము తటస్థింపకపోవునెడల గ్రంథము వృథ కా నలసినదేకదా?

ద్వి—హో. హో. నే నంతవెఱ్ఱిముండకొడుకను గాను. లౌకికపురోహిత బ్రాహ్మణుఁడను. పూర్వాపరములఁ గనిపెట్టుచునే యుందును. బ్రదుకునొకకంటఁ జావు నొకకంట నిష్పక్షపాతముగఁ జూతును. పెండ్లిమంత్ర మొకజిహ్వతో శ్రాద్ధమంత్ర మొకజిహ్వతో చెప్పుదును. ఇదిగో! మంగళాక్షత లొకకొంగునఁ దిల లొక కొంగున—గంట మొకచేత, దర్భ లొకచేత—లౌకిక మొక వైపు వైదిక మొక వైపు—గలప్రు—అర్ధనారీశ్వరవేష మైననేను—పేరు పనికిరాకపోవుటచే గ్రంథము పనికిరాకుండునట్లు చేసికొందునా? నీ వనినరావణపరాజయము సంభవించినప్పుడు విజయరావణమునకు విగత మగుజయము గల రావణునిగూర్చి యనియర్థము చెప్పుదును.

మ—ఏమో! సాఫుగ లేదు. క్లిష్టముగ నున్నది. కష్టసాధ్యముగ నున్నది.

ద్వి—రావణునిమరణముగూడ నట్లేకదా?

(నేపథ్యమున) జయ! రామభద్ర! జయ! రామభద్ర! జయ రాఘవేంద్రా!

మ—అదేమి? అదేమి? ఇప్పుడు యుద్ధ మగుచున్నదా? ఈదినమున మనవా రెవరు యుద్ధమునకు వెడలుదురు?

(నేపథ్యమున) కపివీరులారా! భల్లుకయోధులారా! గోలాంగూలశూరులారా!

గీ. ప్రబలయోధమహాయోధ ♦ వరులతోడ
జానకీసతీహర్తయే ♦ సమరమునకు
వచ్చినాఁడు రాఘవపాద ♦ పద్మచింత
నాధికావేశులై చూఁడుఁ ♦ డాలమునను.

(నేపథ్యమున) రామభద్రా! జయ. జయ. జయ! రాఘవేంద్రా! జయ. జయ. జయ! రామా! రాజీవలోచనా! జయ. జయ. జయ!

ద్వి—సుగ్రీవుఁడు కపులను హెచ్చరించుచున్నాఁడు. రావణునితోఁగూడ నేనుండవలయును గాదా? నేనుబోయెదను.

మ—నాపని కుంభకర్ణయుద్ధమునఁగాని రాదు. నేను బోయెదను.

ఇది విష్కంభము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

---

[ప్రదేశము—రణరంగము.]

---

ప్రవేశము—సుగ్రీవుఁడు—ఆంజనేయుఁడు.

సుగ్రీ—ఓహో! వానరయోధులారా! ఓహో! కాలవదనులారా! చిరకాలమునకు రావణుఁ డెదుటఁ బడినాఁడు. ఈదినము మన కు పండుగ. మనమహాబాహుపరాక్రమక్రమ మీదినమున రావణవధాకార్యమున వినియోగపడుటచే మనతనువులు కృతార్థము లగునుగాక! ఏదీ? ఏదీ? జయ! రామభద్రా!

(నేపథ్యమున) జయ! జయ! జయ! రామభద్రా! జయ! జయ! రాఘవేంద్రా! రామా! రాజీవలోచనా! జయ! జయ!

(తిరిగి నేపథ్యమున) జయ! జయ! రాక్షసేశ్వరా! జయ! జయ! జయ! దేవాంతకనరాంతకమహాసార్వభౌమ! జయ! జయ! శుక్రాచార్యప్రియశిష్యా! జయ! జయ! రామవనితాపహర్తా! జయ! జయ!

సుగ్రీ—అదిగో! అదిగో! ఆబిరుదు కోసెదను. అబిరుదు త్రవ్వి పాఱవైచెదను. ఆబిరుదును గాల్చెదను. ఆబిరుదు వచించినవాని నాలుకఁ గోసెదను. ఆః! ఆః! ఎవఁడురా? రాక్షసమార్గాధాధమాధమా! ఏమి ప్రేలుచున్నావు? ఆః! మహారాజ్ఞియు, మహాపతివ్రతయు, మహాలక్ష్మ్యంశసంభూతయు నైనశ్రీరామచంద్రువనితనే రెత్తుటకు నీవస్వాఁడ వఁటరా? బాలిశా! మూర్ఖా! దానవపశువా!

రావ—(నేపథ్యమున) దానవవీరులారా! మీ రందఱు నన్నుఁ జుట్ట నేల? ఇక్కడ గుమురుగ నుండఁ గపులు ద్వారములనుండి లోనికిం బోవరా? పొండు. మీమీప్రదేశములకుఁ బొండు. ద్వారసన్నిధికి వచ్చుకపులను గందకములఁ బడ్రవేయుఁడు. మోరలెత్తుకొని మీఁదికి వచ్చుభల్లుకములను గుక్కలను గొట్టినట్లు కొట్టుఁడు.

సుగ్రీ—అదుగో! అదుగో! రామరామాపహర్త యైనపాపి! భగవదపచార మొనర్చినచండాలుఁడు. అరే! రావణాధమా! సాధుబాధాచరణవిదగ్ధ! మహాఘోరపాతకస్వరూపా! అబ్బ! అబ్బ! మా రామభద్రునకు నీ వెంతయపకృతిని జేసితివిరా! నీమోములఁ జూడ నాకడుపు మండుచున్నదిరా! నాఁడు కిరీటములనే నేలఁ బడవైచితిని కాని, యీదినమున నీశిరముల నేలపాలు జేసెదను.

వాలితమ్ముఁడను. కాచికో! జయ! రామా! రామా! రామా!

(లోనికిఁ బోవును.)

రావ—(ప్రవేశించి) రా! అగస్త్యభ్రాతా! అధమరామసేవకాధమా!

గీ. రామసతి నే హరింప నీ ♦ కేమి? నీదు
పుట్టి యేమిమునింగెను? ♦ భూతనూజ
యెవతె? రాఘువుఁ డెవఁడు? నీ ♦ వెవఁడ వారె
యేటితగులాట మీామెఱు ♦ వేస్వ లేల?

గీ. దత్తపుత్త్రి యేల? యీా ♦ తద్దినంబు
మీాఁద వైచుకోవల దని ♦ మేము బుద్ధి
సెప్పి నను దిగఁదుడిచి వై ♦ చితివి; మూర్ఖ!
వదరుపోత! యిప్డనుభవిం ♦ చెదవుగాక!

ఆంజ—నే నిప్పు డీతనితోఁ బోరఁ దగదు.

(నేపథ్యమున) ఓహో! కపులారా! నాకు మీారే యడ్డు వచ్చుచుంటి రేమి? నన్నుఁ బోనిండు. నేను సుగ్రీవుఁడను. రావణాధముని పైకిఁ బోవుచుంటిని. ఓసరిల్లుఁడు! ఓసరిల్లుఁడు! ఒకనికి దారియిచ్చినఁ జాలు. అసహాయశూరుఁడనై రావణవధ మొనర్తును.

(తిరిగి నేపథ్యమున)

సుగ్రీవుఁ డఁట! అడ్డు దగులు! కొట్టు! రావణవధ మఁట! వీనిత ర మఁట! క్రోఁతిముండకొడుకు. సింగపుబొబ్బ లిడుచున్నాఁడు. పట్టుకో! నెత్తి చిదుగఁ గొట్టు!

అంజ—(తనలో) రాక్షసు లొక్క పెట్టున సుగ్రీవునిఁ జుట్టుముట్టిరి. మహాబాహుపరాక్రమమున నందఱను గొట్టుచున్నాఁడు. కపులు భయభ్రాంతులై పర్వు లిడుచున్నారు. నేను బోయినఁగాని—

(నిష్క్రమించును.)

రా—ఓరీ! సుగ్రీవా!

సీ. నీ సేవకులె యిట్లు ♦ నిను విరోధించుచు
నుండిరే! పాప మ ♦ య్యో! యిదేమి?
నీమాట చెవిఁ బెట్ట ♦ నితలబిరుసువారు
గాఁబోలు! రాచఱి ♦ క మిటు లేడ్చు
చుంటివే? నాబంట్ల ♦ నోసరిల్లఁగఁ జేయఁ
దగనిపందవు నీవు ♦ దానవేంద్రు
తలలుగొట్టెద నంచు ♦ దబ్బులు పలుకఁగ
సిగ్గు లేదె? యోరి ♦ చెనఁటి! తులువ!

గీ. అసురవరులార! యుద్ధమునఁ ♦ దాకపి నను
జంపుటకు వచ్చుచుండె ము ♦ చ్చటను దీర్చు
కొనఁగనిండు; రా లేకయుం ♦ డినను జంక
నెత్తుకొని రండు; న జ్జంప ♦ నిండు దయను.

సుగ్రీ—(పరుగునఁ బ్రవేశించి) మూఢా! ఏమి ప్రేలుచున్నావు? వాచాశౌండీర్యాడంబరా! బాహుపరాక్రమాభావా! తుచ్ఛా! మాయావీ! పరదారాపహరణప్రవీణా! ఏమి వదరుచున్నావు?

రావ—అట్టె మాటలాడి యాయాసపడకు. ఉన్న పౌరుషము కాసంత మాటలలోనే యూడిపోవ నన్నెట్లు చంపఁగలవు? 'పరదారాపహరణప్రవీణా,' యని నీవు నన్ను దూషించితివే? నేను నీకొంప గూల్చితినా? నీసంసారము మాపితినా? నీ కీకడుపుమంట యేల? నీ కీరోదన మేల? సిగ్గుమాలినవాఁడా! భవద్దారాహరణపరాయణుఁడైన నీయన్న మహాపాతకమునుసహించి చిరకాలము నోరు మూసికొనినమహావేదాంతివి! ఇప్పుడీనీతిబోధము లేల? ఈయభిమానగాంభీర్యవిజృంభణము లేల? ఈప్రబలపౌరుషము

లేల? ఈదుష్టశిక్షణవాంఛ లేల? కూలికై యీకూనురాగము
లేల? మూఢా!

సీ. ఇంటిలోపలియలుకు ◊ నెంతకాలము చచ్చి
నట్టులు సహియించి ◊ యట్టిగతియొ
పట్టినరాముని ◊ పదములఁ బట్టి నా
తనిచేఁత పౌరుషం ◊ బునను గాదు
దొంగపోఁటున సతి ◊ దొంగమగని గొంతుఁ
గోయించి యాతనిఁ ◊ గూడి యతని
నారిని హరియించు ◊ నన్ను సాధింపంగ
నిటకుఁ జేరితివి సి ◊ గ్గింత లేక

గీ. సతులఁ గోల్పోవుటలు భవ ◊ త్సఖ్యమునకు
హేతువులె? రాముఁ డింతి ని ◊ ప్పించినట్లె
వనితరాముని కిప్పింప ◊ వచ్చినాఁడ
వెట్టు లిప్పింతు వింకఁ గా ◊ నీ దురాత్మ.

(అని మీఁదికి వచ్చుచున్నాఁడు.)

గ్రి—జయరామభద్రా! జయరాఘవేంద్రా!

(త్రోసివేయును.)

ప—ఆఁ! పాపీ! ఆఁ! వానరాధమా! గెంటెదవా?

(మీఁదికి వచ్చి చేయి పట్టికొనును.)

గీ. సీత విడిపించుమాట త ◊ ర్వాతఁ జూడ
వచ్చుఁ గాని, మీనలమగ ◊ వాఁడ వైన
చేయి వదలించుకొనుము; చూ ◊ చెదను నీది
కూఁతపసయొ యట్టులు గాక ◊ చేఁతపసయొ.

గ్రి—ఆలాగా? ఇదిగో! చూడు. (చేయి వదలించుకొనును.)

రావ—ఆః! ఆః! ప్లవగచండాలుఁడా! దీర్ఘనఖరముల గిల్లి లాగికొంటి వా? ఈసారి తప్పించుకొనుము.

(జుట్టు పట్టుకొని లాగును.)

సుగ్రీ—నీ వెట్లుతప్పించుకొందువో నేనును జూచెదను.

(రావణునిజుట్టు పట్టుకొనును.)

రావ—రా. రా. రా. (లాగును.)

సుగ్రీ—రా కాదురా మూఢా! రామా రామా రామా యనుము.

(ఇట్లు ఉభయులు లాగుకొనుచు నిష్క్రమింపఁగ రాముఁడుప్రవేశించును.)

రాము—సౌమిత్రీ! ఇటు రా! ఇటు రా!

(లక్ష్మణుఁడుప్రవేశించును.)

గీ. కాంతపేరెంత తలఁచు న్స్మ ♦ రింతు నంత
కంటఁదలఁచుగ నీదశ ♦ కంఠుఁ దలఁతు
కనులఁ బడె నిప్పటికిఁ గాన ♦ మనసుబాధ
సగము దీఱె; చంపి మిగులు ♦ సగముఁ ద్రోతు.

చూచితివా? ఎంతచెప్పిన వినక పీరావేశభరమున సుగ్రీవుఁడు రావణునితో నెట్లుద్వంద్వయుద్ధ మొనర్చుచున్నాఁడో! ఈతనికి నేను దోడు పడవలయును. నీవు పశ్చిమద్వారసమీపస్థు లగు నరాంతకాతికాయులతో యుద్ధ మొనర్పుము.

లక్ష్మ—(రామునకు నమస్కరించి) మహాప్రభూ! క్షమింపవలయు.

రాము—ఏల?

లక్ష్మ—నేను సుగ్రీవునికిఁ దోడుపడుటయే కాక యీదినమున రావణుని తో నేనుయుద్ధమొనరింతును.

గీ. వానియంతము మీచేతి ♦ లోని దంచు
నెఱుఁగుదును గాని యాతఁడ ♦ హీనబలుఁడ

టించు వినియుందు వేడుక ♦ యయ్యె నొక
సారి యాతనితోఁ డుతఁ ♦ బోరుటకును.
అగ్రజా! నాకోరికఁ దీర్పవలయును.

రాము—.

ఆ. వె. పిన్న వాఁడ వీవు ♦ భీకరాహవముల
నారితేరి వాఁడి ♦ యైనయతనిఁ
దాఁకఁగష్టమంచుఁ ♦ దలఁచెదఁ గావున
వలదు సాహసంబు ♦ వలదు తండ్రి!

లక్ష్మ—

ఆ. వె. దేవసంగరములఁ ♦ దేఱినవాఁడని
ప్రబలశూరుఁ డనియె ♦ ప్రధనవాంఛఁ
జేసినాఁడ నతని ♦ చేవయె ప్రబలమో
నాబలము ఘనమొ గ ♦ నంగఁదగును.

గీ. ఎంతసంగర పాండితీ ♦ మంతుఁడైన
జనుఁ డధర్ముఁడౌ చో నది ♦ పనికిరాదు
కాన సీతని మత్కాండ ♦ కాండములను
గొట్టి వెతఁబెట్టి పడఁగొట్టఁ ♦ గోరువాఁడ.

రాము—నీయుత్సాహ భంగము నేను జేయను. గాని యాతఁడు మా యావి కావున బహుజాగరూకతతో యుద్ధ మొనర్పవలయును.

లక్ష్మ—చిత్తము. సెలవుదీసికొందును.

రాము—సరే,

(లక్ష్మణుఁడు నిష్క్రమించును.)

(నేపథ్యమున) ఓహో! రాఘవజ్యేష్ఠా! ఐశ్వర్యజ్యేష్ఠా! ఎక్కడ నున్నావు?

గీ. మన్మహాదీర్ఘ వర్తుల ♦ మందరాభ
గాత్రదర్శన భీతిచేఁ ♦ గాలుకొలఁది
యురికితివి గాని లేకున్న ♦ నెక్కుచప్ప
ళింపుచే నిన్ను నంతమొం ♦ దింపనొక్కొ!

రాము—(నవ్వుచు) ఓహో! అతికాయా! అశనప్రియా! నన్ను మ్రింగుదువా? కానీ! ఇదుగో! వచ్చెదను.

(నేపథ్యమున) రామా! రామా! రామా!

రాము—సుగ్రీవుని జయోత్సేకమున రావణుఁడు గొట్టుచున్నాఁడు. ఆహా! లక్ష్మణుఁ డేమయ్యెఁ జెపుమా! (అటుజూచి) ఓహో! నరాంతక దేవాంతక మహాపార్శ్వులతోఁ దలపడి పోరుచున్నాఁడు.

(నేపథ్యమున) రామా! రామా! రామా! లక్ష్మణుఁడు మాచేతఁ జిక్కి చావనైయున్నాఁడు.

రాము—(నవ్వుచు) ఇది దొంగమాట. అడుగో! సౌమిత్రి మహాబలుఁడై యుద్ధము సేయుచున్నాఁడు.

(నేపథ్యమున) హా! రామా! రామా! రామా!

రాము—రావణబాణఘాతమున సుగ్రీవుఁడు మూర్ఛపడినట్లున్నాఁడు. నేనుబోయెదను. (రాముఁ డొకవంకనుండి పోవఁగ రెండవవంకనుండి రావణుఁడు ప్రవేశించును.)

(నేపథ్యమున) రామా! రామా! రామా! హా! హా! పరుగెత్తు! ప్రాణములు దక్కించుకో! పిక్కబలముఖల మిప్పుడే! బ్రదికియుండినప్పుడుగద—కానీ—కానీ—వెనుక చూడకు—ఎగురు—దాఁటు—

రావ—ఆ. వె. క్రోఁతిరాజుగాఁడు ♦ గోతిరా జగుటను
గాంచి పొట్టలెల్ల ♦ గలగ లనఁగ

బడుగు, పేక గాఁగఁ ♦ బరుగెత్తుదురు పండ్లు
పైకిఁ దోఁకలు దిగు ♦ వకును బెట్టి.

(నేపథ్యమున) ఓహో! కపులారా! భయము వలదు. సుగ్రీవునిది మూర్ఛగాని మఱియొకటి కాదు. వెనుకకుఁ దిరుగుఁడు. ముం దడుగు పెట్టుకుఁడు. పౌరుషము నగపఱుచుఁడు. రామకార్యకరణమునఁ దనువులు పవిత్రములుగఁ జేసికొనుఁడు. జన్మములు కృతార్థములు చేసికొనుఁడు.

రావ——ఓహో! అంగదుఁడు శక్తికొలఁదిఁ గపులను బ్రోత్సాహపఱుచుచున్నాఁడు. కాని యింకను దిరుగకున్నవి.

ఆ. వె. ఒకటి చేర నన్ని ♦ యొకచోటికే చేరు
నొకటి పోవ నన్ని ♦ వికలము లయి
పోవు నిట్టె కపుల ♦ మూఁక, కాకులమూఁక
యొక్క రీతిగాఁగ ♦ నొప్పుఁ గాదె?

(నేపథ్యమున) ఆఁ! పాపీ! ఆఁ! బాలిశా! ఆఁ! రావణహతకా! కపిరాజమూర్ఛాకరణమహాపకారీ! ఎక్కడ నుంటివి? ఎక్కడ నుంటివి? నీకొఱకు వెదకు చుంటిని. ఎదుటఁ బడరా!

రావ——అడుగో! పావని ప్రబలసంహారావేశుఁ డగుచు నన్ను వెదకుచున్నాఁడు. ఓరీ! బుద్ధిహీనా! నన్ను వెదకు చుంటివా?

సీ. అందఱ కొకరంగు ♦ నాకృతు ల్మాతులే
యందఱకును దోఁక ♦ లందఱకు నొ
కపలుకిచకిచ లగు ♦ కపులలో నొకకపి
హతకు నీసేనలో ♦ వెతుకఁ గష్ట
మగుఁగాని ఆఁ! పది ♦ మొగములు నిరువది
భుజము లుండిననేను ♦ పోతుమాని

కపుఁగీటాళి యా ♦ కాశంబు నెఱయఁగ
ధవళగిరిముఖోన్న ♦ తశిఖరప్ర

గీ. దీప్త హిమగిరితీరునఁ ♦ దేజరిలుచు
నిట నిలువఁబడు నేను—ఆఁ— ♦ యిట్టి నేను!—
గనఁబడుట లేదో! నీకనుల్ ♦ గాలిపోయె
నెక్కొ! రే! యిట రా! చెవు ♦ లుండుఁగాదె?

ఆంజ—(పరుగెత్తుచుఁ బ్రవేశించి ముష్టితో బెదరించును.)

గీ. తలలు పదియైన సరె; భుజ ♦ ము లిరువదియు
నైన సరె; తుషారాచల ♦ మైన సరియె;
మిన్నయిన సరె, యన్నియు ♦ మన్ను గావ
లసినదియె; యొక్క గ్రుద్దుతో ♦ నసురహాతక!

రావ—సెబాస్! పవనపుత్రా!

గీ. ఇదిగో! ఏఁ బోసంగితిని; గా ♦ నీ! యొకటియె
ఏది? యుంకించి పంప్లు బి ♦ గించి యేది?
రార! నీదు వ్రేటైన త ♦ ర్వాత నాది!
ఏమి? నాదికూడ నొకటె! ♦ ఇదిగో! ఏది?

ఆంజ—జయ రామభద్రా! జయ! రాఘవేంద్రా! ఇదిగో! ఊఁ ఊఁ.

(గ్రుద్దును.)

రావ—(నోళ్లపైఁ జేతులు కొట్టుకొనుచు) అ. ఆ. అ. ఆ. అ.

(నేల నడఁగును.)

(నేపథ్యమున ధ్వనితో) సెబాస్! ప్రభంజనపుత్రా! సెబాస్!

ఆంజ—కపులు రావణపతనముఁ జూచి మహాకోలాహలమునఁ బునస్సంగరోత్సాహులై పొంగుచున్నారు. కపివీరులారా! రాజమూర్ఛనుగూర్చి యడలవలదు. కొలఁది సేపటిలో నాతఁడు ప్రజ్ఞనొందును.

(నేపథ్యమున) మాకు భయము లేదు. మారాజుగారు మూర్ఛ నుండి తెలివి నొందినారు. మంత్రివై యుండి మహారాజుగారి ఋణము బాగుగఁ దీర్చికొంటివి. సెబాస్! మారుతీ!

రావ——(మోకాళ్లపైఁ జేతు లూదికొని లేచి) సెబాస్! మారుతీ! ఎంతవాఁడవు?

సీ. హుమ్మని డీకొని ♦ కొమ్ములఁ బొడిచిన
యైరావతముధాక ♦ కడల లేదు
శతమన్యుఁ డెదపైని ♦ శతకోటిఁ బడవేయ
నపుడైన నల్లల ♦ నాడ లేదు
శంకరశాంకరీ ♦ సహితాద్రి శిరముపైఁ
బడినప్పు డింతైన ♦ వంగ లేదు
కాలపాశము మెడఁ ♦ గీలించి కాలుండు
లాగిన నింతైన ♦ నూఁగ లేదు

గీ. ఔర! ‹లబ,లబ, యని నెత్తి ♦ నోరు గొట్టు
కొనుచు నేలఁ గ్రుంగఁబడఁగఁ ♦ గొట్టినావు
భళిర భవదీయబాహుప్ర ♦ పాటవమును
మెచ్చఁగాఁ దగునయ్య! స ♦ మీరతనయ!

ఆంజ——ఛీ. ఛీ! ఒక్కగ్రుద్దుతో నిన్ను జంపలేకపోయితి నని లోలోన మిగుల లజ్జపడుచున్న నన్ను నీ వేల స్తుతియింతువు? నీవు స్మృతి లేక పడియుండినపుడు నే నింక నొకగ్రుద్దును గ్రుద్దియుండినయెడల నీసరికి నీవును యుద్ధమును గూడ నంత మొంది యుండును. ఒక్కగ్రేటే యని నీవు బాసఁజేసి యుంటను, సత్యవాక్యావనమర్యాదచేతను, విశేషశ్రమ మొనర్చి నిన్నుఁ జంప నిక్కడకు వచ్చినరామునిప్రయత్నము నిష్ఫల మగుటచే నామహానుభావుని మొగము చిన్నఁబోవు ననుభీతిచేతను, మహావతారమూ

_ర్తి యైన శ్రీరామమూర్తిచేతిలో నీకు మరణము సంభవించు నెడల నీవు ధన్యుఁడవై ముక్తుఁడ వగుదువని నీయందలియకారణకారుణ్యము చేతను, నిన్ను రెండవదెబ్బచేఁ జంజనొల్ల కూరకుంటిని.

రావ—ఆఁ! ఆఁ! ఏమి వాచాలత! ఏమి కాఱులు! ఎంతవికత్థనప్రసంగము. స్తుతించితి నని కన్నులు నెత్తికి వచ్చినవా? ఓరీ చంచలబుద్ధీ! ఊఁ. కాచికో! వంగు. వంగు. కైలాసపర్వత మాడించినరావణునిదెబ్బ రుచి కనిపెట్టెదవు. కాచికో!

ఆంజ—శక్తి తగ్గినప్పుడు కొట్టితి నని తరువాత వంకఁ బెట్టెద వేమో! ఇప్పుడే బాగుగఁ నాలోచించుకొనుము. తొందర లేదు. ఆయాసము తీర్చుకొనుము. బలమును బూరించుకొనుము. కోపము తెచ్చుకొనుము. అప్పుడు కొట్టుము.

రావ—ఛీ! ఛీ! నిన్నుఁ గొట్టుటకే నాకు నీరసతయా? ఈడ్చి—యీడ్చి, ఊఁకించి, సాఁగఁదీసి పాతాళమునకుఁ గ్రుంగునట్లు కొట్టెదను. కాచికో! వంగు. వంగు.

ఆంజ—

గీ. పిఱికివాఁడను గాను; నీ ♦ వరుస వంగు
వాఁడఁ గాను; వె న్నొసఁగెడు ♦ వాఁడఁ గాను;
రామబంటను నాయుర ♦ స్సీమ యిదిగో!
కొట్టుకో శక్తియున్నవ ♦ ట్టెట్టులైన.

(నేపథ్యమున) సెబాస్! కేసరీతనయా!

రావ—ఆఁ ఆఁ క్రోఁతిమూకలారా! సెబాసు సెబా సనుచు సిగ్గులేక హెచ్చరికలు సేయుచున్నారా! చూడుఁడు! ఒక్కత్రృటితాళుఁడు. సెబాసు లింకఁ గట్టిపెట్టుఁడు. మీకేసరీతనయునివస యిదిగో! యీయొక్కగ్రుద్దు నకె సరి. ఊఁ ఊఁ. (వక్షముపైగ్రుద్దును.)

ఆంజ——రామా! రామా! రామా! (నేలఁబడును.)

రావ——వహవ్వా! వహవ్వా! కపి పండ్లిగిలించినాఁడు. కిచకిచ లడఁగినవి. ఆఁ! ఇంక నూపిరి విడుచుచున్నాఁడు.

(నేపథ్యమున) హా! హా! హా! రామచంద్రా! సుగ్రీవప్రభూ (తిరిగి నేపథ్యమున) మఱి యేమియు భయములేదు. తొందరపడకుఁడు. మీామీా తావులఁ గదలకుఁడు.

రావ——సుగ్రీవుఁడు ప్లవగముల హెచ్చరించుచున్నాఁడు. కప్పలతక్కెడవలె పీతలబుట్టవలెనెప్పుడీ వానరసేనను గూడఁబఱుచుటతోడనే సరిపోయెను. ఆఁ ఇంక నూపిరి విడచుచున్నాఁడు. వీఁడు మహాపౌరుషశాలి. బ్రహ్మాస్త్రమునకైనఁ బడువాఁడుకాఁడు. వీఁడుచచ్చిన కపిసేన సగము చచ్చినట్లే స్మృతిఁదప్పియున్నాఁడు, ఇదే సమయము. మఱియొక్కవ్రేటున బ్రాణము లూడఁగొట్టెదను. (చేయిన ర్దుకొని పిడికిలి ముడుచును.) అబ్బబ్బ! ఈబాణమెవరువైచినారు? ఆఁ! ఆఁ! ఆఁ! హనుమంతుని జంపనెంచిన యీాకరమునే కొట్టినారే! బాణము లాగుకొని కొట్టెదను. ఆఁ! ఆఁ! ఆఁ! సౌమిత్రియని పేరున్నది. ఇదియాతఁడే వైచియుండునా! (లాగుకొని) ఈసారిచావుము. (అనిపిడికిలియెత్తును.)

(లక్ష్మణుఁడు ప్రవేశించును.)

లక్ష్మ——ఛీ! ఛీ! అసత్యవాదీ! అలీకప్రతిజ్ఞా! అధర్మసంగరా! అసురాధమా! ఆఁగు! అంతటితో నాఁగు.

రావ——ఓహో! రామానుజులు! ద్వితీయభగవదవతారము కాఁబలు! దాసుని గృతార్థునిఁజేయ వేంచేసితిరి. నమస్కారము. నమస్కారము.

లక్ష్మ——వైరియైన నమస్కరించినప్పు డాశీర్వదింప కుండఁగూడదు.

గీ. నీవు తమ్ముఁడు రాముచే ♦ నిహతు లగుత!
ఇంద్రజిత్తుండు నాచేత ♦ నీల్గుఁగాత!
సీతచేత నీకులము న ♦ శించుఁగాత!
ఇఁక విభీషణుఁ డీలంక ♦ నేలుఁగాత!

రావ—ఏమి?

గీ. వయసుచే బాలుఁడవె కాని ♦ వాక్పటిమను
గాట మగునడికాలవు ♦ గంద్ర వీవు;

లక్ష్మ—మాట లోకతీరు చేష్టలు ♦ మఱొకతీరు
వరలు మిథ్యాప్రవర్తన ♦ వాఁడఁ గాను.

రావ—అనినమాట నెఱపుకొనునసహాయశూరుఁడవా? ఏదీ? ఏలాగు? నేను గుంభకర్ణుఁడు రామునిపాలఁ బడితిమా? ఇంద్రజిత్తు నీవంతునకు వచ్చెనా?

గీ. ధనము లేక రాజ్యము లేక ♦ తినఁగ నన్న
మును, ధరింప గుడ్డయు, లేక ♦ వనినిదిరిగి
యన్నదమ్ములపాల్లకై ♦ యసురవరులఁ
బంచుకొనుచున్నవారె? స్వ ♦ ప్నములయందు.

నేను రామునిభాగములోవాఁడను గదా? నీవు నాతో యుద్ధమున కేల వచ్చితివి? లెంపకాయలు తినుటకా? లేక నాచేఁ జచ్చినతరువాఁత నింద్రజిత్తుఁ జంపఁ దలఁచితివా? సిగ్గుమాలినవాఁడా! మొన్న నింద్రజిత్తుచేత నీకు, నారాయణావతారమైననీ సోదరునకుఁ జచ్చినంతపని యైనదికాదా? ఇప్పు డింద్రజిత్తు నావంతు అని రజ్జులు కొట్టుటకు నీ కెట్లు నోరు వచ్చెను? రావణి నాగపాశములచేఁ దలప్రాణము తోఁకకు వచ్చి తల్లడిల్లిన యారాముఁ డిప్పుడు రావణునే చంపెద నని ప్రతిజ్ఞఁ జేసి యుండెనా? మీా కేమి మతులు లేవా? స్మృతులు లేవా?

లక్ష్మ—ఛీ! ప్రేలరీ! ధ్వని చేయఁదగినది శూరునినారి కాని, నోరు కాదు. విడువవలసినవి ములుకులు గాని పలుకులు గావు. బ్రహ్మకాయవలె వటవట వదఱెద వేమి? మొఱఁగు పోఁతా! మగఁవాఁడ వైనయెడలఁ గిమ్మనక నోరు మూసి యమ్మురివ్రాసి రా! మీఁదికి రా! నాకుమతియున్నదో నీకు గతియున్నదో చూచెదవు. నాకు స్మృతి లేదో నీకు మతిలేదో తెలిసికొందువు.

రావ—అబ్బో! అబ్బో! రఘువీరునిప్రతాపములు! భ్రాతృవిత్తాపహరణప్రవీణుఁడవై నీవే నన్నుఁ జంపఁ దలఁచితివా? రాఘవులు మహావీర్యవంతులు. మహాతేజశ్శాలులు. వారిపరాక్రమవైఖరి మాకుఁ గ్రొత్తకాదు.

సీ. నీదుపూర్వుని ననరణ్యు ♦ నేను బడితె
తోడఁ గుక్కను గొట్టిన ♦ లీలఁ గొట్ట
కుయ్యొ! మొఱ్ఱో! యనుచు వంట ♦ ప్రొయ్యివెనుకఁ
ముడిచికొని డాఁగి గడగడ ♦ వడఁక లేదా?

అంతదూర మొందులకు?

సీ. బాపనపిసాచి యొక్కఁడు ♦ పరశు వెత్తి
మీఁదుతండ్రిపై రాఁగ నా ♦ మేటిమగఁడు
గాజులఁ దొడిగించుకొని లా ♦ డును ధరించి
కాంతలగుడారముల దూరెఁ ♦ గాదె? యహహా!

లక్ష్మ—ఇన్నితల లుండియు నీకుఁ దెలివి లేదేమి? పూర్వగాథ లనుభవించియు బుద్ధి దెచ్చికొన వేమి? ఆయనరణ్యునిశాపమే నీ కిప్పుడు శ్రీరామమూర్తియై ప్రత్యక్షమైనది. రఘువీరునిచే నీకుఁ జావుతప్పదు. అదిగాక యీమాత్రమైనఁ దెలిసికొనరాదా?

క. మస్తపుఖరమును బంపెకుఁ ♦ దోలినట్లు
కారులో నిన్నుఁ బెట్టిన ♦ కార్తవీర్య
బాహుదశశతమును జెండు ♦ పరశురాము,
మత్తతను దూల్చువీరుని ♦ మఱచినావె?

బ్రాహ్మణోత్తముఁడై పరమతేజశ్శాలి యైనపరశురాముని నీవు బ్రాహ్మణుఁడవయ్యును బాపనపిసాచి యని నిందింతువా? బ్రహ్మరాక్షసుఁడవు. పూజ్యుల నధిక్షేపించిననిన్ను నోటిపైఁబొడువలయును. (చాపాగ్రమున నోటిపైఁ బొడుచును.)

రావ—హా. హా. హా. హా. హా. రాఘవాధమా!

(నేపథ్యమున) హా. హా. హా. హా. హా. రాఘవాధమా! నరాంతక దేవాంతకాతికాయవీరులఁ జంపితి నని మహాగర్వమున విఱ్ఱవీఁగుచుంటివా? రా! న న్నెట్లు చంపెదవో చూచెదను.

రావ—హా. హా. హా. హా. హా. ఎట్టిమహావీరులు నరాధమునిచే మడియింపఁబడిరి. ఓమహాపార్శ్వా! రాము నెదుర్కొనుము. కన్నులూడఁదీయుము. కడుపు చీల్చుము. ప్రేఁగులు మెడలో వైచుకొనుము. నాలుక నూడలాగి చూలింతరా లగునీభార్యకు నూడిగా నర్పింపుము. ఇదిగో—రామభ్రాతను—సీతమ్మమఱఁది ని—కోటశక్తికి బలి నిచ్చెదను. నీతోనాకు యుద్ధమేల? ఇరువదిబాహువులఁ బట్టి యజ్ఞపశువును జంపినట్లు చంపెదను. నడు—మద్గాలయమునకు నడు—

(లక్ష్మణుని ద్రోసివేసి తానును బోవును.)

(నేపథ్యమున) జయ! రామభద్రా! జయ! రామచంద్రా! మహాపార్శ్వుఁడు కడతేఱినాఁడు.

అంజ—(త్రుళ్లిపడి లేచి) అఁ! దశకంధరా! అఁ! బ్రహ్మవంశపాంసులా! త్రిలోకకంటకా! హా! రా! జయ! రఘువీరా! జయ! రణధీరా!

ఆహా! కుమారలక్ష్మణుఁడు రావణునితోఁ దలపడి విచిత్రసంగర మొనర్చుచున్నాఁడు. నే నీసమయమున రావణునితో మొనసి సుమిత్రానందనుని కుత్సాభంగము సేయఁగూడదు. జయ! రామానుజా! జయ!

(నేపథ్యమున) ధనుస్సు! వేఱొకధనుస్సు! శీఘ్రము! శీఘ్రము!

ఆంజ——జయ! రామానుజా! జయ! రావణధనుఃఖండన మొనర్చి ప్రకాశించుచున్నావు.

రావ——(ప్రవేశించి) ఓ రాక్షసులారా! ఏదీ! ధనుస్సు! ఎవఁడైన నొక్క ధను వీయఁడా? అర్ధరాజ్య మిచ్చెదను. ఏదీ? మీరు! మీరు!

(నేపథ్యమున) ఇదిగో! ధనుస్సు! తీసికొనుము.

(ధనుస్సు విసరి పారవైచును.)

రావ——ఆఁ! ఆఁ! లక్ష్మణా! నాకు చాప మిచ్చినది నీవేనా?

(నేపథ్యమున) ఔను! వీరస్వర్గముకూడ నిచ్చెదను రా!

రావ——హా. హా. హా. వీరస్వర్గమా? ఎందులకు? రంభాసంభోగమునకా? ఆయువశిష్టము మా కీలోకముననే తీఱినది. నీవు పసిచువాఁడవు. నీకుఁ దీరఁదగి యున్నది. ఇదిగో! ఇదిగో!

(రావణుఁడు నిష్క్రమించును.)

ఆంజ——ఆహా! సౌమిత్రిశరపాత మత్యద్భుతముగ నున్నది.

(నేపథ్యమున) సౌమిత్రీ! కాచికో! కాచికో!

ఆంజ——రావణుఁ డేదో మహాశరము సంధించి లక్ష్మణుని గొట్ట నుద్యుక్తుఁడై యున్నాఁడు.

లక్ష్మ——(ప్రవేశించి) ఆఁ! ఆఁ! అసురాధమా! ఎక్కడ నుంటివి? ఆంజనేయా! రావణుఁ డిక్కడకు వచ్చినాఁడా?

ఆంజ——(లక్ష్మణునిఁ గౌఁగిలించుకొని) వత్సా! నుదుటిపై రక్త మంతేమి

స్రమముగ వచ్చుచున్న దేమి? (తుడుచుచు) రావణబాణపీడితుఁడ వైతివా?

లక్ష్మ—మారుతీ! దయ యుంచి రావణుఁ డెక్కడనో చెప్పి నన్ను వదలుము.

(నేపథ్యమున) నుదురు తూఁటుపడఁగ నేను గొట్టినదెబ్బచే నీకన్నులు చీఁకటులు గ్రమ్మ నేను గానఁబడకయుంటిని. ఇదిగో! ఇక్కడ! రా. రా.

లక్ష్మ—ఇంకను బ్రదికియే యుంటివా? ఇఁక నెంతసేపు? జయ! రామభద్రా! జయ! రామభద్రా! జయ! (లక్ష్మణుఁడు నిష్క్రమించును.)

ఆంజ—జయరామభద్రా! జయ! రామచంద్రా! జయ!

(నేపథ్యమున) హా. హా. హా. హా. హా. హా.

ఆంజ—రావణుఁడు బాణపీడితుఁడై పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు. జయ! రఘురామ! జయ! రణభీమా! జయ!

రావ—(తలపట్టుకొని ప్రవేశించి) హా! హా! హా! హాహాహా!

గీ. కణత ఛస్సిపోఁ బడఁ గొట్టెఁ ♦ గా! దురాత్ముఁ
డెవఁ! యెంతవాఁడు! చెవ్వుల ♦ హోరు పుట్టె;
కనులు పచ్చఁబడియె; నొప ♦ ల్గింప మొందె
నసిలమున నన్ని యీడుచు ♦ న్నట్లుతోఁచె.

(నేపథ్యమున)

ఆ. వె. పాఱిపోవు దేర? ♦ పరువెత్తి వ్యాఘ్రము
బ్రదుకఁగలవె? నాదు ♦ వాఁతఁ బడక?
కరము లిరువ దేల? ♦ కాల్పనే? కాళ్లతో
నుఱుకుచుంటి తిరుగు; ♦ తిరుగు! కుక్క!

రావ—ఓరీ! లక్ష్మణా! ఆత్మస్తుతిపరాయణా! పరనిందాప్రవీణా! నీపౌరుషమునకు భయపడియే పరుగెత్తితి నని గౌరవించుకొనుచుంటివా? ఇదిగో! వచ్చుచున్నాను. (నిష్క్రమించును.)

(నేపథ్యమున) జయ రామభద్రా! జయ! రామచంద్రా! జయ!

ఆంజ—ఆహాహా. రావణుం డతిరౌద్రమూర్తియై మహాస్త్రమేదియో యభిమంత్రించుచున్నాఁడు. ఆహా! బ్రహ్మాస్త్రముకాఁబోలు!

(నేపథ్యమున) ఇదిగో! బ్రహ్మనామకాస్త్రము. దీనితో నీపని సరి.

ఆంజ—ఆహా! ఆహా! సౌమిత్రీ! చిరంజీవి! చిరంజీవి! శ్రీరామరక్ష!

గీ. ఖరమహోల్కాసహస్రము ♦ ల్గ్రమ్మె మింట;
గజగజనుభూమి వడఁకె; నా ♦ కాశమునను
గ్రహము లట్టిట్టులయ్యె; ల ♦ క్ష్మణుఁడు శరము
నెంత వారించెను భుజంబు ♦ పొంత దూఱె.

లక్ష్మ—(ప్రవేశించి) హా! రామా! హా! రామా! హా! రామా!

(నేల వ్రాలును)

(నేపథ్యమున) జయ! రాక్షసేశ్వరా! జయ! దేవాంతకసార్వభౌమా! జయ! రామభార్యాపరిగ్రహణప్రవీణా!

(రావణుఁడు తొందరగఁ బ్రవేశించును.)

రావ—(లక్ష్మణుని బట్టుకొని) లక్ష్మణా! అందఱిజన్మముకంటె నీది యుత్తమజన్మము. ఇక్కడ చచ్చినకపిరాక్షసవీరులకళేబరములను కాకులో గ్రద్దలో నక్కలో పిశాచములో కబళించుచుందును గాని నీ కట్టిగతి రాదయ్యెను.

ఆ వె. నీకళేబరమును ♦ నేమోసికొని పోయి
శక్తిదేవళమున ♦ స్వస్త్యబంధు
రమ్ముఁ జేసి తఱిగి ♦ రక్తంబు కుండ కె
క్కించి దేవి కార ♦ గింపు లిడుదు.

ఏమి? ఎత్త లేకుంటిని! ఊఁడు. ఊఁడు. కదలనే కదలఁడే! ఎంతబిరు తగ నున్నది!

గీ. అర్కచంద్రుల భుజబలా ♦ ధ్యతను లాగి
చెలిమొకకరమున గ్రహించి ♦ గిఱగిఱంచుఁ
జక్రిసాధనముగఁ ద్రిప్పఁ ♦ జాలు నేనుఁ
జచ్చునరుని గదల్పంగఁ ♦ జాల కుంటి.

ఊఁ. ఊఁ. శాంకరీ! భవానీ! దుర్గా! త్రిపురసుందరీ! ఊఁడు.

(లేవదీయ యత్నించును.)

ఆంజ—ముూఢా! ఆమహానుభావు నెత్త నీతర మగునా? అతని నంట కుము. నీ విటురా! రా! ఇంక రావేమి?

రావ—నత్తును గాని నీ వెత్తి నావీఁపునఁ బెట్టఁగలవా?

ఆంజ—నేను నీవీఁపునఁ బెట్టునది దానిని గాదు—దీనిని.

(జుట్టువంచి గుద్దును.)

రావ—హా! హా! హా! (నేలవ్రాలును.)

ఆంజ—హా! లక్ష్మణా! ఎంతప్రమాదము సంభవించినది. ని న్నెత్తికొని శ్రీరామమూర్తి సన్నిధికి నెడలెదను. (లేవనెత్తి నిష్క్రమించును.)

(నేపథ్యమున) అసురాధిపా! మహాప్రభూ! ఈయంగదుఁడు నీమి త్త్రుఁడు ద్విజిహ్వుఁడనై ననన్నుఁ జంపుచున్నాఁడు.

రావ—(లేచి) హా హా! రాక్షసచమూయోధులారా!

గీ. ఏపు లేల? మొత్తుకొనుట ♦ లేల? యిట్లు
త్రొక్కికొనుచు బఱగు లేల? ♦ దిక్కు లేదె?
రావణుఁడు లేఁడని తలఁచి ♦ రా? వెనుకది
రిగిన జాగ్రత్త! మిమ్ము న ♦ ఱకెద నేనె.

(నేపథ్యమున) అమ్మయ్యో! రాముఁడు! రాముఁడు! శార్దూలము లేళ్లను జంపినట్లు మమ్ము చంపు చున్నాఁడు. బాణజ్వాలలు రోదసీకుహరమంతఁ గ్రమ్మి పాఱిపోవుటకు దారియైన లేదు. (తిరిగి నేపథ్యమున)

ఉ. ఆలపుమంగలంబునను ♦ రాయలజోన్న లఁబోసి తేజమున్
జ్వాలలపాల్యిఁగాచినిజ ♦ చాపపుఁజీపురుగట్టితోఁడుతఁ
జేలలుపుట్టటానివద ♦ భీకరమై ఖరిరామపాచకుం
డోలినియాయజూకుఁడగు ♦ న్యోపతిపీతిగ వేఁచుచుండెడున్.

రావ—ఓహో! ఈకల్పనము ద్విజిహ్వారావణాయనములోనిదివలెనున్నది. ఓరక్షోవీరులారా! నేను వచ్చుచుంటిని భయము లేదు. (నేపథ్యమున) భయము లేదు. నీ కేమియు భయము లేదు. పరుగెత్తకు. (రావణుఁడునిష్క్రమింప ద్విజిహ్వుఁడుప్రవేశించును).

ద్వి—(పరుగెత్తుచు) అమ్మయ్యో! అమ్మయ్యో! అంగదుఁడు నన్ను వెంటాడించుచున్నాఁడు. (అంగదుఁడుప్రవేశించును.)

అంగ—పాఱిపోకు. నీ కేమియు భయము లేదు. ఎందులకుఁగన్నులూడఁదీయుచుంటివో చెప్పు.

ద్వి—(వడఁకుచు) బుద్ధి లేక—ధైర్యము లేక—నమస్కారము. నన్ను వదలిపెట్టుము. నీకడుపునఁబుట్టెదను.

అంగ—ఓరి రాక్షసపశువా! నాకడుపున బుట్టెదవఁటరా?

ద్వి—(తనలో) నీ వెవరికడుపునఁ బుట్టితివిరా? రాక్షస క్షేత్రము, మర్కట బీజముఁ గాదఁటరా? కంచరగాడిదా? (ప్రకాశముగా) హాప్రభూ! బుద్ధిలేక యటులంటిని. లెంపలువైచుకొను చుంటిని

అంగ—చెప్పక పోయినయెడలఁ దన్నెదను. చచ్చిపోయినక్రోఁతుల కన్నులు గంటముతో నేల యూడఁదీయుచుంటివి?

ద్వి—బ్రదికియుండఁగ నెవరూడఁదీయనిత్తురు?

అంగ—ఉండఁదీసి యేమిచేయ నెంచితివి?

ద్వా—కవులను నేనే చంపితి ననుటకుఁ దార్కాణముగ రావణున కగ పఱతును.

అంగ—ఛీ! ఛీ! ఛీ! ఇందఱురాక్షసులఁ జూచితిని గాని కాతరత్వంబున నీ యంతవాఁడు లేఁడు.

ద్వా—కవిత్వములోను నంతే.

అంగ—నీవు కవివా?

ద్వా—ఆస్థాన—

అంగ—నీవు రచించినగ్రంథ మేది?

ద్వా—రచించుచున్న దనుము.

అంగ—ఏ దది?

ద్వా—విజయ రావణము.

అంగ—రావణుఁడు చచ్చునెడల రచించినగ్రంథ మేమి చేసెదవు?

ద్వా—కొంచెము తక్కువగ నంతపని తిరిగి చేసెదను.

అంగ—ఏమి చేసెదవు?

ద్వా—చించెదను.

అంగ—అప్పుడు చించుట నిశ్చయమే కాన నిప్పుడే చించెదను. తెమ్ము.

ద్వా—నీవుచెప్పినమాట బాగుగ నున్నదికాదు.

అంగ—ఏల?

ద్వా—అప్పుడు చచ్చురావణాసురు నిప్పుడు చంపఁగలవా?

అంగ—నేను జంపలేను. చంపఁగలిగినయెడల నిప్పుడు చంపవలసినదే. నీపుస్తక మిప్పుడు చింపఁగలను. కావునఁ జింపెదను.

(లాగుకొనును.)

ద్వా—అయ్యయ్యో! కష్టపడి తలఁ గొట్టుకొని దయ్యముపట్టినవానివలె నెక్కుచు యేవతో యతిప్రాసలు కుదుఱక పిచ్చికుక్కవలె,

మోర మింటి కెత్తి యేడ్చుచుఁ, గల్పనలు కుదుఱక తోఁచక కారాగృహస్థునివలె నటు లిట్లుతచ్చాడుచు, నుస్సురనుచు, నస్సురనుచు, లేచుచు, బండుచు, జోరీఁగలగొడ్డువలె నటుని ట్లు కొట్టుకొనుచు, నపహరించినరాజవస్త్రముల కంచులు చించి, క్రొత్త రంగుఁ బూసి తమవిగ వాఁడుకొనుతస్కరసేవకులవలెఁ బూర్వగ్రంథకర్తలశబ్దార్థములుహరించి తలలు విఱిచి సొంతమసిఁ బూసి గ్రంథములలో నిముడ్చుకొనుచుఁ, బ్రసవవేదనఁ బడు పడఁతివలె నాంతరవస్తువుపైకిరాకమూల్గుచు, మందుఁడగు నటునివలె చదివినపద్యమే వెనుకముందున కదేపనిగఁ జదువుచు, గూసి కూసి చివర కుఱ్ఱుమని తనకూఁతను దానే మెచ్చుకొను కాకివలెవ్రాసివ్రాసి వహవ్వా యనుకొనుచు, భాగవతోత్తములను నపుంసకు లని తిట్టువారకాంతవలెఁ దనగ్రంథశ్రవణమునకై రానివారి నసరసు లని నిందించుచు, నాటచూచి డబ్బీయని వాని నెత్తిపైనిమొండిదొమ్మరి దుమ్మెత్తిపోసినట్లు విని స్తుతింపనివానిని నోటికిరానిబూఁతులఁదిట్టుచు, నినుపగజ్జలతల్లిగంటముసేడనే యాశ్రయించి యనువర్తింపఁ బూటలు మూఁడిటికి మందాగ్నిరోగివలె నొకభోజనము సేయుచు, నున్మత్తునివలె రేలు నిదుర లేక, బ్రదికియుండఁ జచ్చియుఁ జచ్చి బ్రదికియుండుదునని గంపంత యాస పెట్టుకొని—సోమరితనమున దేహపటుత్వము లేక—నలుగుఱను జూచుటకు ధైర్యము లేక—బుద్ధిలేక—దూరదృష్టి లేక—సుఖపడునేర్పు లేక—

అంగ—(నోరు మూసి) నోరుమూఁత లేక—సిగ్గు లేక—చెప్పదెబ్బలు లేక—(ఏడ్చుచున్నాఁడు.)

డ్బా—శివశివా! శివశివా! (ఏడ్చును.)

అంగ—అటు కాదు. రామ. రామాయనుము. అను; అను.

(నెత్తిపైఁ గొట్టఁబోవును.)

ద్వి—అన్న శ్లే.

అంగ—ఆఁ. ఆఁ. లేనియెడ నాలుకఁ గోసెదను. రామా! రఘువీరా! రామభద్రా! రామచంద్రా!

ద్వి—రామా! రఘుభద్రవీరా! రామవీరా! (అనుచున్నాఁడు.)

అంగ—నీ వింక రామదాసుఁడవేనా?

ద్వి—(తనలో) లోన పాషండశైవ్యుఁడను. పైకి వీరవైష్ణవునిగ రామ భక్తునిగ నటించెదను. (ప్రకాశముగ) రామా! రామా! రామా!

అంగ—సెబాస్! ఇఁక మన మందఱ మొక్కటియే కద?

ద్వి—మీది పచ్చనిరంగు; నాది పచ్చనిరంగే. మీస్వభావము చాంచ ల్యమే; నాస్వభావము చాంచల్యమే. మీరు రామభక్తులు; నే ను రామభక్తుఁడను. మీరు కపులు; మేము కవులము. భేద మేమున్నది?

అంగ—సరే. గొంతెత్తి యరువుము. జయరామభద్రా! జయరామ చంద్రా!

ద్వి—(అటు లనుచున్నాఁడు.)

అంగ—అదిగో! అటు చూడు. శ్రీరామభద్రుఁ డచ్చట రావణునితో నెంతవిచిత్రముగ యుద్ధముసేయుచున్నాఁడో!

ద్వి—ఆహాహా! బాగుగనున్నది. నే నొకకథ పాడిచెదను. చెప్పుకొనఁగ లవా?

గీ. రెండుతల లిలపైమోాయు ♦ రెండుకాళ్లు,
నాల్గుభుజములు, కన్నులు ♦ నాల్గు, వాల
మొకటియై, నాఱితోడిదా ♦ మొకము, నలుపు,
పచ్చరంగుల దేదొ చె ♦ ప్పంగదయ్య!

అంగ—చెప్పనా? ఆంజనేయారూఢుఁ డగుకోదండరాముఁడు. ఆహా అటుచూడు.

గీ. మెదడుతోడ నెత్తురు తల ♦ మీఁదనుండి
కారఁ, దుడుచుకొనుటకైనఁ ♦ దీఱ కుత్థి
తం బయినక్రొవ్వు క్రొంబోగ ♦ ల్దనువుఁ గ్రమ్మ
పరుగు లిడుచుండెఁ జూడు భీ ♦ భత్సుఁడగుచు.

ద్వి—(తనలో) నాగతి యేమగునో! శత్రువులచేతిలోఁ జిక్కితిని. జిహ్వాలు రెండయినట్లే లౌకికవైదికములను వృత్తులు రెండైనట్లే ప్రభువులుగూడ నిద్ద రైనారు. (ప్రకాశముగ) అంగదా! రాముఁడు ధానుష్క-శిఖామణి సుమా!

అంగ—కాదా? ద్విజిహ్వాకవీ! ఏదీ మీరావణునియిప్పటియవస్థను వర్ణింపుము.

ద్వి—మీరావణుఁ డేమి? మనమిద్దఱ మొక్కటే కావున మనరావణుఁ డనుము.

అంగ—చావఁదలఁచినవాఁడు మీవాఁడైన నేమి? మావాఁడైన నేమి? మనవాఁడైన నేమి? చెప్పు. పద్య మొక్కటి చెప్పు.

ద్వి—మత్తకోకిల.

ఆరఁ ద్రాఁగినవానిరీతిగ ♦ నట్టు లిట్టులు తూఁగుచున్
వారి నీదెడువానివైఖరి ♦ బారబారలు వేయుచున్
వారుగాలినపందిలాగున ♦ బారుబారునఁ గూయుచున్
బాఱిపోయె సురారివీరుఁడు ♦ బాణబాధితగాత్రుఁడై.

అంగ—భోజనకాలే గోవిందనామస్మరణే గోవిందా! ఎక్కడకో పాఱిపోవుట లేదు. ఇక్కడకే దొలులుచు వచ్చుచున్నాఁడు.

ద్వి—అయ్యయ్యో! మన మిచ్చట నుండఁగూడదు. పోవుదము రమ్ము. (ఉభయులు నిష్క్రమింపఁగ రావణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

రావ—ఆహా! ఆహా!

సీ. పనస, మైంద, నీలాంగద ♦ ప్రముఖబహుల
కపుల నజకాల రాచి ల ♦ క్ష్మణకుమారు
నట్టె చాఁపచుట్టఁగఁ బడఁ ♦ గొట్టి సంఖ్య
కు మితిమీఱిన క్రోఁతులఁ ♦ గూల్చినాఁడు.

గీ. అలసి, తూలి, సొలసి, వాఁడి ♦ నట్టివేళ
జానకీపతితో నని ♦ సంభవించెఁ
గాన నిలఁబడ లేకుంటిఁ ♦ గాకయున్న
జగతి నీరాము నేయక ♦ చనుదు నొక్క—.

గీ. సర్వసంగరమున నాకు ♦ సంభవించు
నంతబాధయు నొకపెట్టు ♦ నంజనాను
తుండు హనుమ్మని గ్రుద్దిన ♦ రెండుగ్రుద్దు
లొక్క-పె ట్టయ్యెఁగా! నేఁటి ♦ యుద్ధముననను.

(నేపథ్యమున) ఆంజనేయా! ఆఁగుము! దిగుమనను.

రావ—ఆహా! రాముఁడు మారుతినుండి దిగి యిటకువచ్చుచున్నాఁడు.
నే నిఁకఁబాఱిపోదును. (రాముఁడు ప్రవేశించును.)

రాము—రావణా! భయము లేదు. పఱుగెత్తకుము.

సీ. అమితకపివీరకోటిఁ జ ♦ క్క-డఁచినావు
కాలవదనాళి లక్షలఁ ♦ గాల్చినావు
భల్లుకసహస్రములఁ జీల్చి ♦ వైచినావు
మించుభుజశక్తి నేఁడు చూ ♦ పించినావు.

గీ. బడలితివి చాలు; యుద్ధంపు ♦ గొడవకిపుడు
పనికిరావు; శ్రమము దీర్చు ♦ కొని మఱొక్క—

మారుర మ్మిట్టినిన్ను నే ♦ మడియఁజేయ
నాకుఁ జేతులు రావు; మా ♦ న్యతయుఁ గాదు.

(నేపథ్యమున) ఆహా! రామకారుణ్యము. రామచంద్రదాక్షిణ్యము. మహావీరునిహృదయమంజులత. జయ! రామభద్రా! జయ! రామచంద్రా!

రావ——(నిష్క్రమించును.)

(నేపథ్యమున) సంధ్యాకాల మైనది. శిబిరమునకు దయచేయవలయును.

రాము——ఇదిగో వచ్చుచున్నాను.

(నిష్క్రమించును)

ఇదిచతుర్థాంకము.

శ్రీ

# విజయరాఘవము.



## పంచమాంకము.

---

[ప్రదేశము—రణరంగమున నొకచోటు.]

(ప్రవేశము—మహోదరదీర్ఘకాయులు.)

మ—నీ వదృష్టవంతుఁడవు.

దీ—ఎందుచేత?

మ—ఇంద్రజిత్తుతో యుద్ధమునకుఁ బోయి రామలక్ష్మణులకుఁ జచ్చునంతటి శిక్షఁ జేసి మఱి వచ్చినావు.

దీ—అందుచేత నావలన నింద్రజిత్తదృష్టవంతుఁ డయ్యెనని చెప్పుము.

గీ. భటకృతి ఫలింపఁ దత్కీర్తి ♦ ప్రభుని దగును
ఫలము గనకున్న నపకీర్తి ♦ భటుని దగును
అసి శితంబైన యోధుబా ♦ హానిపుణత,
కాకయుండిన దోషంబు ♦ కత్తిదగును.

మ—వైద్యునిధనయోగముచేతనైన నేమి, రోగియాయుర్యోగముచేతనైన నేమి, రోగము నశించినది. అప్పటికి—

దీ—అదే—సద్యశ్శాంతిచికిత్స జరిగినది. ఈదినమున నిర్మూలము గావింపవలయును.

మ—ఈదినమునఁ గుంభకర్ణయుద్ధమే కాక మేఘనాదయుద్ధముకూడ నున్నదా?

దీ—కుంభకర్ణుఁడు లేవనిదే—

మ—అయ్యయ్యో! అటు కాదు. లేచినాఁడు. యుద్ధప్రయత్నమున నున్నాఁడు.

దీ—తుట్టతుద కేసాధనమున లేచినాఁడు.

మ—నాలుగువందల రాక్షసులు పణవధ్వనులతో లేపవలయు నని యాతనిఁ గొంచెము సమీపించునంతలోఁ గుంభకర్ణుని నిశ్వాసతీవ్రతచే నారక్కసులు డప్పులతోఁ గూడ ముక్కుపుటములలోనికిఁ బోయినారు.

దీ—అయ్యో! తిరిగిరాలేదా?

మ—అబ్బే.

దీ—నాయొద్ద నొకనస్య మున్నది. అది ముక్కునొద్దఁ బెట్టుసరికి ఫెడీ ఫెడీమని తుమ్ములు వచ్చి కపాలకల్మషము హరించును.

మ—ఆనస్యము ముక్కువఱకు వెళ్లుసాధన మున్నయెడల నంతమంచి యుపాయము లేదు. తరువాతఁ గొందఱు ప్రక్కలను, దలవైపునను, దూరముగ నుండి బడితెలతో మోద నారంభించిరి.

దీ—అటుపైన నేమైనది?

మ—ఏమైనది? బడితెలు విఱిగినవి. తరువాతఁ బెద్దపెద్దపాషాణములు దెచ్చి మీఁదఁ బడవైచిరి.

దీ—అప్పుడైన నులికిపడినాఁడా?

మ—పాషాణములు మాత్రము తూలి పడినవి. పిదప సలసలలాడుచమురు చెంబులకొలఁదిఁ జెవులలో దిమ్మరించిరి.

దీ—కుంభకర్ణునికిఁ జెంబులు లెక్కయా?

మ—తరువాత ముక్కులలోఁ దలవైపునుండి ఫిరంగిమందు దట్టించి నిప్పంటించిరి.

దీ—అప్పుడైన లేచెనా?

మ—పొగలు మంటలు—తరువాత పెద్దగొడ్డళ్లతో జోడుజోడుగా ప్పున మూఁడువందలజోళ్లు దబ్బచిప్పలు బిగించి నటుక నారంభిచిరి. ఆసమయముననే సహస్రగజములచే నొడలంటఁ ద్రొక్కించిరి. ఆసమయమందే శతఘ్నులతో సంధులందుఁ గొట్టించిరి. ఒడలుకాల్పించిరి. చర్మ మొలిపించిరి. కన్నులలో గునపములు దిగవేయించిరి. త్రాఁచుపాములచేఁ గఱపించిరి. అప్పుడు లేచెను.

దీ—అమ్మయ్యో! లేచియేమిచేసెను?

మ—ఆఱువేలదున్నపోతులను ఫలాహారప్రాయముగ నావులించుచు నాహారించెను. అటుపైన లోనఁబడిననజీవనిర్జీవపదార్థములబండ్లకు లెక్కయే లేదు. తరువాఁత లేచి తూలుచు రావణసభకుఁ బోయి యక్కడ రామలక్ష్మణనాశనమునకై ప్రోత్సాహపెట్టఁబడి గదచేతఁ బుచ్చుకొని—సింహద్వారముగుండ వెడలవచ్చునా! కోటప్రాకారము దాఁటి వానరసేనలలోఁ బడెను. ఇఁక నేను గూడనాతనిసాహాయ్యమునకై పోవలయును.

(నేపథ్యమున) పోకు. పోకు. పాఱిపోకు.

ద్వి—అదిగో! చూడు. అంగదుఁడు కుంభకర్ణదర్శనసంత్రస్తమైనవానరసేనను బురికొల్పుచున్నాఁడు. మనము పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

ఇదివిష్కంభము.

---

ప్రదేశము—రణరంగము.

ప్రవేశము—అంగదుఁడు,

అంగ—పోకు. పాఱిపోకు. ఆఁగు. భయము లేదు.

గీ. నల! తిరుగు; నీల! పోకు; ప ♦ నస! యదేల?
ద్వివిద! వెనుకచూడుము; మైంద! ♦ బెదరకయ్య!

క్రోఁతులను భీతిలఁగఁ జేయు • కొఱకు నెత్తఁ
బడుమహాయంత్ర మిద్ది జీ • వంబుగాదు.

(నేపథ్యమున) అమ్మయ్యో! అమ్మయ్యో! అయ్యయ్యో! జీవము
గా దనెద వేమి? అనేకజీవములఁ దుక్కుకేఁగఁ గొట్టుచున్నాఁ
డు. నమలుచున్నాఁడు. నంజుకొనుచున్నాఁడు. చప్పరించు
చున్నాఁడు. మునిపండ్లఁ గొఱుకుచున్నాఁడు. మ్రింగుచున్నాఁ
డు. అమ్మయ్యో! అయ్యయ్యో! నిలువలేము. నిలువలేము.

అంగ——ఆహా! కపులకలకలారవ ముల్లోలకల్లోల ముగనున్న ది. అదిగో!

గీ. కొండముచ్చులు గుంపులై • కొండలెక్కె;
భల్లుకంబులు చెల్లెక్కె; • వానరములు
వార్ధివంకకు నెక్కెడు • పరుగువారె
కోటులుగ గొల్లుమనుచుఁగ • గ్గోలువడుచు.

(ప్రకాశముగా) ప్లవగవీరులారా! పోకుఁడు. ఆఁగుఁడు.

గీ. ఇటకు వచ్చినపని యేమి? • యిపుడు మీరు
సేయుపని యేమి? యక్కటా! • సిగ్గులే దె?
చచ్చియైనను శ్రీరామ • చంద్రునకిని
సాయపడకున్న ఫలమేమి • జన్మమునకు?

గీ. ఇది యొనర్చెద మద్ది చే • సెద మటంచు
నేమి యేమియో రజ్జుల • నెగచి నఱికి
కొసకుఁ దలలు తోఁకలు పీఁకు • కొనుచునుఱకఁ
జనునె? నాల్కలీడుచుకొని • చావరాదె?

గీ. ఉఱికి యెడకుఁ బోవఁగ • నుత్సహింతు?
రిండ్లకేనా? త్రపాశౌర్య • హీనులైన
మిమ్ముఁ గని పేఁడనీళ్లను • మీఁదు మొగము
లందు మీసతుల్ చల్లక • యుందురొక్కొ!

సీ. స్వర్గ గర్భిణసతులను ♦ సిగ్గులేని
మీర లేకీతిగా నేలు ♦ వార లింక
కంచుకములఁ దొడిగికొని ♦ గరిటెకాడ
లూని ప్రాయివద్ద వంచేయఁ ♦ బూనినారొ?
గీ. యుద్ధమునఁ జచ్చువా; రిండ్ల ♦ యొద్ద గట్టి
యుట్టిఁ గట్టుకొనుచు దూఁగు ♦ నట్టివారుఁ;
గలరె? యెచటనైన మృతి ని ♦ క్కంబు గాన
మగతనపుఁజావు చచ్చుట ♦ తగదె మీకు?

ఛీ! ఛీ! తిరుగరా? ఇంకనాఁగరా?

సీ. కలితవీరపతివ్రతా ♦ తిలకములగు
తల్లులకడుపు చెఱుపఁగ ♦ దాఁపరించి
నారె? పాఱిపోకుఁడి యప ♦ చారమునకుఁ
జెంపలను గొట్టికొని రణ ♦ సీమనిలుఁడు.

(నేపథ్యమున)

గీ. పోకుఁడీ! పాఱకుఁడివలీ ♦ ముఖములార!
భూజభూధరభారప్ర ♦ పూర్ణహస్త
తలులగుచు ద్వారములయొద్ద ♦ నిలువఁబడుఁడు
కుంభకర్ణుని నిప్పుడే ♦ కూల్చువాఁడ.

రా-జ——ఓహో! వానరులారా! ఘనఘనాఘనగర్జాగభీరము లగుశ్రీ రామవాక్యములను వింటిరా? ఆయమోఘసాయకునిప్రతిజ్ఞను వింటిరా?

(నేపథ్యమున) జయ! రామభద్రా! జయ! రామచంద్రా! భయము లేదు. కాసి. పొడు. చూచెదవేమి? రాముఁడే రక్షకుఁడు. ఏమైన సరే. రామచంద్రుఁడే రక్షకుఁడు. రే! రాక్షసాధమా! రే! కుంభకర్ణా! కాచికో! కాచికో! కోసెదము! చీఱె

దము! నతికేదము! జాగ్రత్త! హా! హా! వేయి! కొట్టు! చంపు! జయరామభద్రా! జయరామచంద్రా!

అంగ——సెబాస్! భటులారా! సెబాస్! మీరిప్పుడు మాబంటులై రామభక్తులై ప్రకాశించుచున్నారు. వెక్కిరుక్కను బదిమంది పది వైపులనుండి రాలు మోది చంపునట్లు మన మీతని రాలఁగొట్టిచంపుదము. రే! కుంభకర్ణా!

(అంగదుఁడు నిష్క్రమింపఁ గుంభకర్ణుఁడు ప్రవేశించును.)

కుంభ——(భయంకరరూపమున నోరు తెఱచుకొని) హా. హా. హా. హా. పంటిక్రిందకుఁ బదియాఱుక్రోఁతులు. పండ్రెండు కొండముచ్చులు. పదిభల్లూకములు. వహావ్వా! కరకర, కసకస, కటకట నమిలివైచితిని. కపిసేన గగ్గోలు చేసితిని. వహాగంధభూయిష్ఠ మగుకపిరక్తము కడవలకొలఁదిఁ ద్రాగితిని. రాముఁ డఁట! ఏఁడీ? లక్ష్మణుఁ డఁట! ఏఁడీ? సుగ్రీవుఁ డఁట! ఏఁడీ? రే! మహోదరా! హా. హా. హా. హా. (నోరు తెఱచుకొని తిరుగును.)

(మహోదరుఁడు ప్రవేశించి)

మ——మహాప్రభూ! వచ్చితిని. (తనలో) లోకవిరుద్ధమైన నాకడుపీతని కడుపుపై నెక్కుడుమెయంత లేదు.

కుంభ——మహోదరా! యుద్ధమున నీవేమిచేసితివి?

మ——దంతక్షతములఁ గొందఱను, నఖక్షతములఁ గొందఱను, తాడనపీడనములఁ గొందఱను, చుంబనములఁగొందఱను, నాలింగనములఁగొందఱను, చపేటములఁ గొందఱను——

కుంభ——ఆఁగు; ఆఁగు! రణరంగశృంగారమా యిది. హా. హా. హా. హా. (నోరుతెఱచుకొని తిరుగును) మేమేమి చేసితిమో చూచితివా?

మ——చూడలేదా?

సీ. హనుమంతువీఁపుపై ◆ నట్టు మాడఁగఁ గొట్టి
ద్వివిదుని భూమిపై ◆ విసరికొట్టి
పనసుని వాఁడపైఁ ◆ బప్పుఁ గాలిచి పెట్టి
కుముదనీలులను ము ◆ క్కునను బీల్చి
జాంబవంతునిమోర ◆ జాడించి డిగరాచి
చండనేత్రుని క్రొవ్వు ◆ చప్పళించి
వేగదర్శిని పొట్ట ◆ విడఁ గొట్టి పడఁబీల్చి
గంధమాదను తలఁ ◆ గాలఁ దన్ని

గీ. కరమునఁ దొడిమఁ గొని పచ్చి ◆ మిరపకాయ
కటుకునఁ గొఱుకుగతిని తోఁ ◆ కలను చేతఁ
బట్టి కపులను భల్లుకే ◆ శ్వరులఁ గొండ
ప్రముచ్చుగమిఁ గొఱికితివి క ◆ ఱుక్కుమనుచు.

కుంభ—పండ్లసందునఁ గొన్ని క్రోఁతులు చిక్కుకొన్న ట్లున్నవి. ఏదీ? నీగద యేదీ? పండ్లు కుట్టుకొందును.

మ—ఇది సన్న మగునేమో! (ఇచ్చును.)

(నేపథ్యమున) రాక్షసాగ్రణీ! గద యేల? నేను బంధుఁడను క్షమింపుము.

కుంభ—ఆతఁ డెవఁడో యిటు పంపినపు యుద్ధమునకుఁ బోయి సుగ్రీవుఁ డెచ్చట నున్నాఁడో కనిపెట్టి యుండుము నేనును వచ్చెద.

మ—చిత్తము. (పోవును.)

(విభీషణుఁడు ప్రవేశించును.)

కుంభ—ఎవఁడవు నీవు?

విభీ—అన్నయ్యా! నే నెవఁడనా?

గీ. ఒక్కతల్లిగర్భంబున ◆ నుద్భవించి
యొక్కచోఁ గుడిచి పెఱిగి ◆ యొక్కప్రభువు

నాశ్రయించుమనకు విడి ♦ యాకు లిట్లు
గలిగెఁ బెద్దన్నగారిమ ♦ మ్కారతవలన.

(కన్నుల నీరుఁ బెట్టుకొనును.)

కుంభ——నీవు విచారింపకుము. మంచిపనియే చేసితివి. అదృష్టవంతుఁడవు. ఆయుష్మంతుఁడవు. బుద్ధిమంతుఁడవు. రామునిచే రాక్షసవంశహానియగుట తప్పదు. నేనును రావణుఁడును రామబాణములఁ గడతేఱువారమే. నీ వొక్కఁడవే చిరంజీవివై వంశము నుద్ధరించి మా కింతనోటికి నీళ్లు నిచ్చి రాజ్యపరిపాలనము చేసికొనుచు వర్ధిల్లువాఁడవు. మాగతికై నీవు చింతనొంద వలదు. నీవు రాముని గొల్చి యుండుము. ఇదివఱకే వీరావేశ మడఁచికొని నీతో మిగుల మాట లాడితిని. ఇప్పుడు తనవా రెవ్వరో పరు లెవ్వరో నాకుఁ దెలియఁదగినసమయము కాదు. ఇఁక నీవు నాయెదుటఁ బడకు. పొమ్ము. వెంటనే పొమ్ము.

విభీ——అగ్రజా! నమస్కారము. (పోవును.)

(నేపథ్యమున) సుగ్రీవుఁ డాప్రక్కనుండి పరుగెత్తుకొనిపోవుచున్నాఁడు. మహాప్రభూ! నేనువారింపలేకుంటిని. అడ్డు తగులుము.

కుంభ——(నోరు తెఱచుకొని) హా. హా. మ్రింగెదను. నమలకుండ మ్రింగెదను. ఒక్కగ్రుక్కను మ్రింగెదను. గుటుక్కున మ్రింగెదను. ఏఁడీ? పశువా! సుగ్రీవా! హా. హా. హా. హా.

(నోరు తెఱచి నిష్క్రమింపఁగ సుగ్రీవుఁడు ప్రవేశించును.)

సుగ్రీ——ఆహా! ఆహా! ఎంతయుపద్రవము.

గీ. అబ్ధిలోనితిమింగిల ♦ మావురనుచు
నోరు తెఱచి దుముక నట ♦ నీరుకలఁగు
నల్లరిని జేఁప లడలి యి ♦ ట్టట్టు లెగిరి
సుడివడి తిమింగిలపునోటఁ ♦ బడెడునట్లు.

గీ. అదెఁ గుంభకర్ణుం డావు ♦ రావు రనుచు
మీఁదఁ బడ వ్యూహవైఖరి ♦ భేదిలుటను
గపులు చెడఁదల్లడిల్లి బె ♦ గ్గడిలి స్మృతులు
చెడి యసురనోటఁ గుప్పలై ♦ పడుదు రకట!

గీ. కపులు కొందఱు రాక్షసు ♦ కంటిలోనఁ
బడ వలకలట్లు చికిలించి ♦ యొకమచేతి
వ్రేళ్లతో తెప్పలు కుసక ♦ రించి కపుల
వెలికిఁ దీసి పృష్టంబున ♦ నలుపఁదొడఁగె.

(నేపథ్యమున) కపులారా! అట్లు కాదు. తలపైఁ గొందఱు, భుజములపైఁ గొందఱు, చెక్కులపైఁ గొందఱు, నాసికాపుటమునఁ గొందఱు, నొకసారి యెక్కి తన్ని, కఱచి, పీఁకి, ఱక్కి, గుద్ది యన్నివిధములైనయల్లరి సేయుఁడు.

సుగ్రీ—లక్ష్మణమూర్తి కపుల కుత్సాహము గలిగించుచున్నాఁడు. ఆహా! అసురయొడలిపై సందులేకుండ నెన్నికపిసహస్రము లెక్కినవో!

గీ. ఖస్థలిని వేనవేలు తోఁ ♦ కలువిచిత్ర
గతులఁ దూఁగాడఁ దత్కుంభ కర్ణుఁడొప్పు
పవనచాలితశాఖౌఘ ♦ భారసహిత
విటపిసమధిష్ఠితాగము ♦ విధముగాఁగ.

గీ. కాళ్లుసేతులు జాడించి ♦ కరయుగమున
దనుజసంఘము నదలించి ♦ తాండవించి
మొగిఁ గినను పీడకున్నఁ దా ♦ నిలను దొరల
సాఁగె జోకఁగలున్న రా ♦ సభము వ్రాలె.

ఆహా!

గీ. ఒడలు విఱుచుకొనుచుఁ దూర్పు ♦ పడమరలకు
నొక్క తేపొడుగుగ సాఁగి ♦ యుద్ధభూమి
నన్నె కంటిపైఁ బొత్తంబు ♦ సరణి దొరలి
వీరకపులఁ బచ్చడిని గా ♦ వించుచుండె.

(నేపథ్యమున) రే! సుగ్రీవా! మర్కటరాజాధమా! ఎక్కడ? ఎక్కడ?

సుగ్రీ—నన్నుఁ గుంభకర్ణుఁడు వెదకుకొనుచున్నాఁడు. ఇక్కడ—ఇక్కడ—

(నేపథ్యము) ఎక్కడ!—ఎక్కడ!—

సుగ్రీ—ఇక్కడ నని చెప్పఁ దిరిగి యడిగెద వేమి? చెవుడా! బుద్ధివైశద్యమున కక్కఱకురానివదితలలవట్టిమోఁత నీయన్న కెట్టిప్రారబ్ధమో వినుటకక్కఱకురాని కడవలంత చెవ్రులమోఁత నీకట్టి ప్రారబ్ధమే కదా!

(నేపథ్యమున) రే! వాచాటా! అన్నగారినిగూడ నిందించుచుంటివా? ఇదిగో! నిన్నుఁ జంపుటకు వచ్చుచున్నాను.

(కుంభకర్ణుఁడు ప్రవేశించును.)

సుగ్రీ—నేను నిన్ను మోసమునఁ బట్టుదును. (సుగ్రీవుఁడు నిష్క్రమించును.)

కుంభ—సుగ్రీవా! ఎక్కడ నుంటివిరా? పాఱిపోతా! పందా! చెవులపిల్లీ!

గీ. "హా,, తనంగఁ "దురో,, యంచు ♦ నొడలెఱుంగ
కొక్కతేముందుపోకయా ♦ దిక్కుమాలి
నట్టిజాతికిఁ బ్రభుఁడ వై ♦ నట్టినీకు
వెట్టిధైర్యము లేకుంట ♦ వింతకాదు.

ఛీ! ఛీ! ప్రాణావనమునకై పాఱిపోయితివా?

సుగ్రీ—(ప్రవేశించి) ప్రాణాపహరణమునకై వెనుకనే యున్నాను. ఇదిగో! (వెనుకనుండి వచ్చి గట్టిగఁ బట్టుకొనును.)

కుంభ—(ఒడలు జాడించి గింజుకొని) వదలు! వదలు!

సుగ్రీ—వదలిపించుకో! చేతనైనయెడల వదలిపించుకో!

కుంభ—. హా. హా. హా. పిఱికీ! నీబుద్ధికిఁ దగినపని జేసితివిరా!

సుగ్రీ—రే! రాక్షసాధమా! తిండిపోతా! వదలకు వదలకు! శత్రువునకు వెన్ను నీవిచ్చితివా? నేనిచ్చితినా? పిఱికివాఁడవు నీవా నేనా? పౌరుఁడ వైనయెడలఁ దిరుగుము.

కుంభ—ఇదిగో తిరిగెదను. (గిరగిర దిరుగుచు సుగ్రీవునిగూడఁ ద్రిప్పును.)

(నేపథ్యమున) మహారాజా! గట్టిగ మెడఁ బట్టికొనుము.

సుగ్రీ—ఆంజనేయా! ఇటురా! ఈచిత్రమును జూడుము.

(ఆంజనేయుఁడు ప్రవేశించును.)

సుగ్రీ—

గీ. వినుతులఁ బిస్సిడి పిడికిలి ♦ విషముఁ జచ్చి
చావకుండఁ; గత్తిసిబట్టు ♦ జాణ శత్రు
శౌర్యమున వీఁడుఁ బిడికిలి ♦ చచ్చి; క్రోఁతి
సడలఁజేయదు పిడికిలి ♦ చచ్చియైన.

ఆంజ—(తనలో)

గీ. కుంభకర్ణుండు తిరుగఁగఁ ♦ గూడ గిఱ్ఱు
మనుచుఁ దిరుగును సుగ్రీవుఁ ♦ డతని నాశ్ర
యించి; మందగ్రహమును సే ♦ వించి వ్యోమ
మందుఁ దిరిగెడు తదుపగ్ర ♦ హంబురీతి.

కుంభ—వానరాధమా! వానరాధమా! వదలవా?

సుగ్రీ—అసురాధమా! అసురాధమా! వదలఁజేసికొనలేవా?

కుంభ——అటులైన—రా. రా.

సుగ్రీ——నడువు. వచ్చెదను. నిన్ను మృత్యువువలె నేనెక్కడ వదలుదును?

కుంభ——హా. హా. హా. హా.

సుగ్రీ——జయ రామభద్రా! జయ రామచంద్రా! (ఇద్దఱునిష్క్రమించుచున్నారు.)

(నేపథ్యమున) హా. హా. హా. హా. మనరాజుగారిని కుంభకర్ణుఁడెత్తికొనిపోవుచున్నాఁడు. హా. హా. ఇంక నేమున్నది?

ఆంజ——కపియోధులారా! భయపడకుఁడు. రాజుగారికిఁ బ్రమాద మేదియు లేదు. ఆతనిని బట్టికొని కుంభకర్ణుఁడు పాఱిపోవుట కాదు. అతఁడు కుంభకర్ణుని బట్టుకొనఁగ వదలిపించుకొనఁగ లేక కుంభకర్ణుఁడు పాఱిపోవుచున్నాఁడు.

(నేపథ్యమున) ఆలాగా? ఆలాగా? కొట్టుఁడు! కుంభకర్ణుని కర్ణం దగిలి పొట్టపైఁ గొట్టుఁడు. చెట్లుతీసి మోఁకాళ్లపైఁ గొట్టుఁడు. కానిండు. కానిండు. చూడకుఁడు. చూడకుఁడు. జయరామభద్రా! జయరామచంద్రా! జయరఘువీరా!

ఆంజ——హా! హా. ప్రమాదము సంభవించినట్లున్నది. కుంభకర్ణుఁడాకస్మికముగ వెల్లగితలఁ బడినాఁడు. ఆహా! సుగ్రీవుఁడు నలిగియుండలేదుకద! సెబాస్! విచిత్రలాఘవమునఁ దప్పించుకొనినాఁడు. కాని, యాతని రెండుచేతులు కుంభకర్ణుఁడు గ్రహించినాఁడు. ఏమి యగునో!

(నేపథ్యమున) హా. హా. హా. హా. హా. చావు. పోడియగు. ఇదిగో! ఉ. ఉ.

ఆంజ——రామా! రామా! రామా! కుంభకర్ణుఁడు సుగ్రీవుని నేల నడఁచినాఁడు. రామ. రామ. రామ. వానరాధిపతి మూర్ఛనొంది

నాఁడు. ఆఁ! కుంభకర్ణా! ఆఁ! అధమా! అదేమి? మహారాజు గారి నెత్తికొని యెచ్చుటకుఁ బాఱిపోయెదవు? డొక్క చీల్చెదను. ప్రేఁగు లూడఁదీసెదను. తలఁ బగులఁగొట్టెదను. జాగ్రత్త! విడు; విడు. రే! మూర్ఖా! విడువవా? విడువవా? ఇదిగో వచ్చుచున్నాను. ఎగిరినెత్తిపైఁ బడెదను. అదిగో (ఆలోచించి) యక్షరక్షఃపన్నగులచేఁ బట్టఁబడినను సుగ్రీవుఁ డవలీలఁగఁ దప్పించుకొనులఘుత్వనైపుణ్యములు గలవాఁడు. ఇంకను స్మృతి రాకయున్నది, కాని యీసరికే తప్పించుకొని కర్తవ్య మాలోచించి యుండును. ఈసమయమున మహాబలుఁ డైనయాతనివిడుదల నేను జేసియుండినయెడల నాతనికి నాపైఁ గోపము వచ్చునేమో! అదిగాక యీయవసరమున నాసహాయు మతనిబాహుపరాక్రమమునకెంతయపకీర్తికరము! కాన నేను గుంభకర్ణునిమీఁదికిఁ బోయియాతని విడిపింపఁగూడదు. ఊరకుండినయెడల మహాప్రమాదము సంభవించు నేమో! అయినను గొంత సేపు నిరీక్షింతును.

గీ. రాజభటు లిలఁ గొందఱు ♦ ప్రాఁకులాడి
కాళులకు నల్లుకొని, పాద ♦ ధూళి పచ్చ
కప్రముగఁ జేసికొని రాజు ♦ కరుణఁబడసి
నిత్యసన్నిధివర్తులై ♦ నెగడువారు.

గీ. తన్నిరంతరరాట్సన్ని ♦ ధానసంస్థి
తినిఁ బురస్కరించుకొని నె ♦ త్తికిని గనులు
రాఁగ మేముచెప్పినరీతి ♦ రాజు నడచు
బుట్టలోపల రాజును ♦ బెట్టినాము.

గీ. కదలుమన్నఁ గదలును; వ ♦ లదనమానుఁ;
పాడుముకాయఁగ బొండిని ♦ ముడిచినాము;

మేము లేకున్నఁ దెలియును ♦ భూమిధవుని
పసయటంచును దద్భటుల్ ♦ వదఱుచుంద్రు.

గీ. పొట్టకక్కుర్తిచే మొట్ట ♦ మొదటఁ జేరి
యాతనిఁ బోషించుచున్నార ♦ మనుచుఁ బలుకు
చుంట తమఖ్యాతియుఁ దమప్ర ♦ యోజకతయుఁ
జాటుకొనుటకుఁ గాఁబోలు ♦ జగతియందు.

గీ. అందువలన మహారాజు ♦ నప్రతిష్ఠ
యజ్ఞతయు, నస్వతంత్రత ♦ యనుచితతయు,
నెంతవెల్లడియగునొ కా ♦ పంతమైన
నెంచ రెంచుదాఁకను వారి ♦ కేమిమునిఁగె?

గీ. దగ నివారించుకొన, దేహ ♦ తాపమడఁచు
కొనఁగ, స్వచ్ఛాంబుపూర్ణమౌ ♦ కొలను జేసు
దున్నపోతున కబ్జముల్ ♦ దునిసె నంచు
జలము గలఁగె నంచును జింత ♦ కలదె యింతె

గీ. తమతమపని దీరఁ జాలును ♦ దమకు; పరమ
హార్త్రికైనను జింత యా ♦ వంత లేదు;
తనగుడిసె ప్రాంతతాఁగాకు ♦ దునియకున్న
గ్రామ మంతయుఁ గాలిన ♦ నేమి తనకు?

గీ. ఇట్టి స్వార్థైకచిత్తుల ♦ నిట్టిదుష్ట
తరుల, నిట్టిరాజద్రోహ ♦ కరులనిట్టి
యంతికస్థస్వదాసరూ ♦ పారివరుల,
నెప్పుడు ధరాధవుఁడు చేర ♦ నీయరాఁ

గీ. దాలిపైఁ బాలు చెడఁద్రాఁగి ♦ దానితోడఁ
దృప్తిఁ బొందుచు నుండక ♦ యింటివారి

లక్ష్మీశ్రీహాన్యులు గావలె ♦ నంచుఁ గోరు
కొనెడుపిల్లియు వీరికం ♦ టెను ఘనంబు.

గీ. భటులు స్వయశఃప్రతిజ్ఞాది ♦ వైభవముల
కెప్పుడు చూడఁగఁదగదు, రా ♦ జేంద్రునకు య
శస్సమృద్ధి రాఁదగుసర్వ ♦ సాధనముల
నాచరించుటె యుత్కృష్ట ♦ మైనసేవ.

గీ. స్వామిభక్తుఁ డొనర్పఁదలంచు ప్ర ♦ ఖ్యాతకార్య
మును భటుఁడు ముందుగాఁ జేసి ♦ భూపవరుని
కపయశంబును దేఁగూడ ♦ దన్నిగొప్ప
పనులకీర్తి రాజునకె చే ♦ పఱుపవలయు.

గీ. భటునిబుద్ధిచే నేకగొప్ప ♦ పని జరిగిన
నైన నదికూడ రాజుచే ♦ నైనయట్లె
యుంచవలయు మహారాజు ♦ గుండ భటుని
ధిషణ మెఱయవలయుఁ గాచ ♦ దీపమట్లు.

కావున నేనిప్పుడు తొందర పడి సుగ్రీవుని విడిపింపను. అదిగో! కుంభకర్ణుఁ డాతని నెత్తుకొని యిటకే వచ్చుచున్నాఁడు.

(కుంభకర్ణుఁడు సుగ్రీవు నెత్తుకొని ప్రవేశించును.)

కుంభ—సీ. నీమద్భ్రాతకతంబున ♦ నూది యిట్లె
నామద్భ్రాతను బట్టఁద్రిప్పి ♦ నాఁడు; నేఁడు
నిన్నుఁ గష్టాంతరంబున ♦ నిలిపి భ్రాతృ
పరిభవ ఋణముఁ దీర్చి ♦ వైచినాఁడ.

మ—మహోదరా! ఇటు. ఇటు.

(మహోదరుఁడు ప్రవేశించును.)

మ—సంతతకృతసఖకృతాచార మొక్కటి లోపముగ నున్నది కానివిజ యాపేక్షాకాంక్షణమహోత్సాహమునఁ బ్రకాశించుచున్నావు.

ంజ——(తనలో) వానరరాజేంద్రునకు స్మృతి వచ్చినపిదప నాలోపము తీరఁగలదు.

ంభ—గీ. వీని నాలుగుపక్షముల్ ♦ గా నిలువునఁ
దఱిగి యావకాయఁగఁ బెట్టి ♦ పరమమధుర
వారుణీరసపానంబు ♦ వలనిమత్తు
దోఁచఁగఁ బచ్చడిబద్దగాఁ ♦ గోయువాఁడ.

——నీవు తరువాతఁ గోయుకుందువో లేదో కాని యీతనికిఁ బ్రజ్ఞ వచ్చినయెడల నిన్నుఁ గోటికి తప్పించుకొనునేమో! జాగ్రత్త!

ంభ——ఈతనిని గుండ కెక్కింపు మని నాభార్యతోఁ జెప్పి యిప్పుడే వచ్చెదను. నీవు యుద్ధభూమి వదలకు.

——అయ్యో! నన్ను విడిచి వెళ్లెదవా?
గీ. మనుగుమవు పెండ్లికొడుకుతోఁ ♦ కను గ్రహించి
వచ్చుతోడపెండ్లికొడుకు ♦ వలెను బొట్ట
ప్రేల దట్టించుచుంటి సం ♦ ప్రీతితోడ
నీవరుగ నాఁకటను మర ♦ ణింతు నేమొ?

ంభ——ఉండుము. మఱేమియు భయము లేదు. (నిష్క్రమించును.)

ంజ——(తనలో) నేనును రాజావనావసరము వేచి యిచ్చటనే యుండవలయును. ఊరక యేల యుండవలయును? ఇంతలో నీగాలి తిత్తిని టప్పు మనిపించెదను- (ప్రకాశముగా) మహాబాదరా! మహాబాదరా!

——ఆఁ. ఆఁ. నాపేరు నీ కెట్లుతెలిసెను?

ంజ——ఏఁడుబారల బెడముగా నిలువఁబడినను నాయుదరమును దాఁచుచున్న నీకడుపే చెప్పుచున్నది.

ఆ. వె. కడుపు లావుగలుగు ♦ గంగాళమును రెండు
చెవులఁ బట్టి కడుసు ♦ లువుగఁ బైకి

నెత్తినట్లు నిన్ను ♦ నెత్తి యట్లిటు లూఁపి
త్రొవ్వ గార నేలఁ ♦ గొట్టువాఁడ.

మ—అమ్మయ్యో! అమ్మయ్యో! (నేల బోరగిలఁ బడును.)

ఆంజ—గీ. కాలితలవైపులును పైనఁ ♦ గ్రాల నడఁగి
రెండుపాయలుగా వీడి ♦ యుండుపొట్ట
పై ధరణి నాను రెండుతుం ♦ బలను నేల
నిలువఁబడురుద్రవీణాకాం ♦ తిని హసించు.

మ—రెండువైపు లక్ష్యముగ పైనుండి పొట్టపై నిల్చుజంతికలగొట్టమువలె నేల నిలిచియుండుటచేత మరణబాధగ నున్నది. మహాప్రభూ! రక్షించి నాకడుపునకు నక్షత్రదర్శనము గలుగఁజేయుఁడు.

ఆంజ—నక్షత్రదర్శనము కావలసినది నీకడుపునకే కావున నీకడుపూడఁదీసి పీఁపుపైఁ బెట్టెదను. అప్పుడు నత్తగుల్లవలెఁ బైనుండును. ఇదిగో! కాచికో! (తన్నఁబోవును.)

(నేపథ్యమున) పావనీ! ఆతని దన్నినయెడలఁ గడుపు విచ్చి త్రొవ్వంతయుఁ జెదఱి నేలపా లగును. అట్లు చేయవలదు. చీఁకటి రేలు. రాక్షసయుద్ధములు. అందులో మాయాయుద్ధప్రవీణుఁడైనయింద్రజిత్తు రానైయున్నాఁడఁట! ఈరాత్రి మనకు వెలుతురు విశేషముగఁ గావలయును. అందుకొఱకు వీతనిత్రొవ్వ మన ముపయోగించుకొందము. ఈతని ముక్కులుగ నఱికి బానల కెక్కించి బట్టిపెట్టి చమురుఁదీసి యాచమురులోఁ బాలకఱ్ఱలను దడిపియంటించి యాదీప్తిని మనము యుద్ధము సేయవలయును. ఈతనిత్రొవ్వ రావణమరణపర్యంతము మనకు సరిపోవును.

ఆంజ—వింటివా? నీలుఁడు నీయం దెంతదయఁగలవాఁడై యెట్టిమాటలు చెప్పుచున్నాఁడో! నీమహోదరము మాకు నింక మహోపకృతిని జేయఁదగి యున్నది. ఇంక రావణవధవఱకు

నీ తేజస్సహాయముచేతనే మేము యుద్ధము సేయఁదలఁచితిమి. నీ జన్మము రామకార్యోపయుక్త మగుటచే ధన్య మగును.

మ—సరే. కడుపులోఁ గ్రొవ్వు చాల నున్నమాట నిజమే. అందులో గ్రొవ్వు తీయుట నాకు సమ్మతమే. ముక్కముక్కలుగ నఱికి కుండల కెక్కించి, యనుమాటలు నాకుఁ గేవల మనభిమతము లనర్థకరములు. ప్రాణమునకు ముప్పురాకుండ నెన్ని బాసవ్రల క్రొవ్వుతీసినను నాకు సమ్మతమే. ఆమాత్రపుఁద్యాగము లేక పోలేదు.

ఆంజ—నీలా! ఇద్దఱుకపులను బంపి యీగడ్డిబొమ్మను, ఈమాంజిబుంగ ను దీసికొనిపొమ్మని చెప్పుము.

(నేపథ్యమున) అలాగే. (ఇద్దఱుకపులు ప్రవేశింతురు.)

మొదటి—అమ్మయ్యో! దబ్బిచిప్పలు లేకుండ నీతనిఁ గదుపఁగలమా?

రెండవ—దబ్బిచిప్పలకుఁ గూడలొంగడోయిబాబూ!

మ—ఇప్పుడు నాకర్మముచేత నలవాటులేనివీరరసము వచ్చినది. కావు న నింతబరువై మెదలలేకుంటిని గాని నాకభిమానరసమైన శృం గారరసములో నే నేనుండినయెడల వట్టిముద్దను గానా? గుబ గుబలాడుగుద్దను గానా? నాప్రారబ్ధమీలాగున కావలసివచ్చి నది. అయినను నారసప్రకాశము నేను జచ్చినతరువాతనైన యుండుననని కొంత—

ఆంజ—మీరిద్ద ఱీనిర్భాగ్యుని దీసికొనిపొండు.

మొదటి—చావకముందే యింతబరువుగనుండువాఁడు, చచ్చినతరువాత నెట్లుండునో!

రెండవ—బ్రదికియుండియే చచ్చినవీఁ డట్లుభారతరముగఁ గానేరఁడు.

(మహోదరునితో నిష్క్రమింతురు.)

(నేపథ్యమున) హా. హా. హా. హా. హా. చచ్చితిని; చచ్చితిని. హా. హా. హా. సుగ్రీవచండాలుఁడు ముక్కు సెవులు రొంటికి పాఱిపోయినాఁడు.

ఆంజ—సెబాస్! కుంభకర్ణా! కాదు. కృత్తకర్ణా! ఇటురా! ఇటురా!

గీ. అట్టె సుగ్రీవుఁ జేపట్టి ♦ నతఁడు నీదు
ముక్కు సెవులఁ గోసెను యుద్ధ ♦ మూలమైన
శూర్పణఖకర్ణనాసికల్ ♦ చురియతోడఁ
బరసతీచోరసౌమిత్రి ♦ తఱిగినట్లు.

(నేపథ్యమున) ఆఁ! పాపీ! మాయాశీలా! కంటఁ బడితివా! యీసారి నీవు చచ్చితివి.

ఆంజ—అహా! కుమారలక్ష్మణుఁడు సమరసన్నాహియైనయింద్రజిత్తును దలపడయత్నించుచున్నాఁడు.

(నేపథ్యమున) లక్ష్మణా! ఏమంటివి? ఈసారి నేను జచ్చెదనా? వెనుక—వెనుక—నీవు చచ్చితివా? సిగ్గు లేక—యేలయింక బీరములు?

ఆంజ—ఆహా! ఈయసాధ్యావసరమున నింద్రజిత్తుకూడఁ బ్రబలయుద్ధార్థియై వచ్చుట కపిసేనకు మహోపద్రవకరము కాదా? లక్ష్మణకుమారుఁ డిటకు వచ్చుచున్నాఁడు. నేను బోయి సేనారక్షణమున జాగరూకుఁడనై యుందును. (ఆంజనేయుఁడు నిష్క్రమింప లక్ష్మణుఁడుప్రవేశించును.)

లక్ష్మ—ఏమంటివి? మూఢా! మేఘనాదా!

(మేఘనాదుఁడుప్రవేశించును.)

ఇంద్ర—ఏమంటినా?

ఆ. వె. ఇంతలోన మఱచి ♦ తే? నిన్న నాచేత
నేమి జరిగినదియొ; ♦ యిపుడు మగత

నము గలిగెనె? నీవు ♦ నను జంపుదువొ? నిన్ను
నేవధింపఁగలనొ? ♦ యెఱుఁగఁగలవు.

ఒక్కయఱగడియమాత్రము తాళుము.

లక్ష్మ — హా. హా. హా. "నిన్న లేనిపౌరుషము నీ కిప్పుడు గలిగెనా," యనికూసితివే? ఇప్పుడు నీకు లేనిధైర్యసార మొక్కయఱగడియ కెట్లు రాఁగలదురా?

ఇంద్ర — (తనలో) నికుంభిలాహోమము నెఱవేర్చి కాని యీదినము న వీరిని మార్కొన నెల్లను.

(ప్రకాశముగా)

గీ. తోఁకమృగములు పశువుల ♦ మూఁకలుగద
యని యుపేక్షించినకొలంది ♦ నాగడంబు
ఘనమగుచు మాదుతలలపైఁ ♦ గాళ్లనిడఁగ
సాగెఁ; గపిసేనసర్వంబుఁ ♦ జక్కడంతు.

గీ. అందులోపల సుగ్రీవుఁ ♦ డఁట! ప్లవగుల
లోన మొనగాఁడఁట! పొగఱు ♦ మేనువిఱుచు
కొని తిరుగునఁట! బలియఁట! ♦ కుంభకర్ణుఁ
బరిభవించెనఁట! యతఁడె ♦ వ్వండొ కనెద!

కావున ముందు కపిసంహారమొనర్చినఁగాని నిన్నుఁ దాఁక నెల్లను. నీవు చేఁబడకుండ నెక్కడకుఁ బోయెదవు? పోవుచున్నాను.

(నిష్క్రమించును.)

లక్ష్మ — ఛీ! కుక్కా! మొఱుగుబలమేకాని కఱచుబలము లేదా? పో!
(నేపథ్యమున) ముక్కుచెవులు పడఁగఱచినాఁడు. ఏమయ్యెను? ఎవ రక్కడ?

లక్ష్మ — ఎవ్వరైన నేమి? కుంభకర్ణా! ఇటురా!

కుంభ—(మొగమునకుఁ గొంచె మడ్డమై చుకొని) హా. హా. హా. ఎవ్వఁడవురా? నీవు సుగ్రీవుఁడ వేనా?

లక్ష్మ—సుగ్రీవునివలన నీవు నష్టపడినవి కన్నులుగూడనా? రాక్షసా! నీవు సుగ్రీవుని శిక్షింప వచ్చితివా?

కుంభ—హా. హా. హా. హా. హా. హా. (నోరు తెఱచుకొని గంతులు వైచును.)

లక్ష్మ—ఏల?

కుంభ—నా చెవులఁ గొఱికినాఁడు. నాముక్కుగూడఁ బీఁకినాఁడు. హా. హా. హా. హా.

లక్ష్మ—నీచెల్లెలికర్ణనాసికముల ఛేదించిననన్ను ముందు శిక్షించి పిదప నాతని శిక్షింపుము. రాక్షసాధమా! ముక్కు సెవు లూడినందు ల కింతహాహాకారము లేల? ఇంతయపరిమిత దేహమునఁ గొంత తగ్గినఁ దగ్గుటయేకదా!

కుంభ—హా. హా. లక్ష్మణుఁడవా నీవు?

లక్ష్మ—నాపే రేదైన నీ కేమి? నేను శ్రీరామచంద్రుని తమ్ముఁడను.

కుంభ—ఓరిపసివాఁడా! నీ బ్రదుకునకు నన్నుఁజూచి భయపడి పాఱిపోక నిలువఁబడి పెదవులు మెదపుటయే మహాపౌరుషము. నీకంటెఁ బెద్దవాఁ డుండఁగ నీతోఁ బోరాడుట నాపరాక్రమమునకు లోపముగాదా? నాతోడయంత లేవు. అగస్త్యభ్రాతా! నీవెక్కడ—నేనెక్కడ? ఒక్కచేయి చూచిన రామునితోఁ జూడవలయును. చచ్చినరామునిచేతఁ జావవలయును.

రాము—(ప్రవేశించి) సెబాస్! కుంభకర్ణా! దేవతలు మెచ్చఁదగినమాటనాడితివి. నేనే లక్ష్మణాగ్రజుఁడను. రా! వెనుకదీయక రా! ఈదినమున నీవు ధన్యుఁడ వగుదువు.

కుంభ—లక్ష్మణాగ్రజుఁడవు నీవైన రావణానుజుఁడ నేను. ఇంతమిట్టిపాటేల? 'వెనుకదీయక—రా!' యని వేఱె చెప్పనేల? మాయింటఁ బుట్టినకుక్కకైన వెనుదీయుట యెన్నఁడును లేదని నీ వెఱుఁగవా?

లక్ష్మ—మీయింటఁ గుక్కలు పుట్టుటకూడ నాచార మైయున్నదా?

రాము—లక్ష్మణా! పరిహాసము వలదు. కుంభకర్ణా! నీవుపరాక్రమశాలి వని నే నెఱుఁగుదును. బ్రహ్మవంశమునఁ బుట్టిననీకుఁ దేజమున కేమికొఱంత?

కుంభ—కొఱంత లేదా? ముక్కుచెవులే కొఱంత. ఇందువలన, నిజమే నీవు చెప్పినట్లు—నాకుఁ బరాక్రమమునకుఁ గొఱంత లేదు. అదటిపాటున నన్నిట్లు భంగపఱిచినయీపాడుక్రోఁతికిఁ బరాక్రమాధికతయు లేదు.

రాము—కాలవశమున జరిగినదానికి విచారింపఁ బనిలేదు.

గీ. భంగబహుమానములు కాల ♦ వశ్యము లయి
వచ్చుఁ బోవును; వానికై ♦ వంత నొంద
వలదు; మనము నిమిత్తమా ♦ త్రులము; సర్వ
మమితదుర్లంఘ్యవిధిమార్గ ♦ మనుసరించు.

కుంభ—ఏమీ? నన్నోదార్చుచుంటివా? నాకు జరిగినయవమానమున కూరక యదేపనిగ నేడ్చుచుంటినా? ముక్కుచెవులు కొఱికిన బాధమైన నాకున్నదా? ఇందుమూలమున నన్ను నీవు ప్రచ్ఛన్నముగఁ బరిహసించుచుంటివా? ఏదీ! నీపరాక్రమము చవి చూడవలయును రా!

లక్ష్మ—(అపవారించి) చవియే కాదు. చావుకూడఁ జూతువు.

రాము—నాబాణములు చవియెఱుఁగనివాఁడవు నీవొక్కఁడవే మిగిలితివి.

లక్ష్మ—(అపవారించి) చవిచూచుమాత్రమున సంతుష్టి కలుగునా? కడుపునిండ ననుభవింపుము.

కుంభ—నేనెక్కడనేనా మిగిలితిని? నీమార్గణములబారిఁ బడకపోవుటచేతనేనా మిగిలితిని? అబ్బ! ఏమిగర్వాలాపములు! ఇదిగో!—గద—వజ్రకఠినసారము. దీనిచేతనే దేవతాసీకములను దెయితక్క లాడించితిని. ఇఁక నీలెక్క నాకేమి? నీమాత్రమువానితోఁ బోరుటకు నాకాయుధము కావలయునా? బాహుదండమైనఁ గావలయునా? పట్టుమన్న నెక్కవంటి క్రిందకు రావు. గాని బ్రహ్మలోకమంటు పలుకులు పలికెదవా? ఆఁ! కాచికో! (మీఁదఁబడును.)

లక్ష్మ—ఓరిపశువా! "బ్రహ్మలోకమంటు పలుకులుపలికెదవా" కాదు. బ్రహ్మరంధ్రమంటు ములుకులు చిలికెదవా యనుము.

రాము—ఛీ! మూర్ఖా! (కుంభకర్ణుని ముందునకుఁ ద్రోచివైచి యాతనితో నిష్క్రమించును)

లక్ష్మ—ఆహా! గదతోఁ బెద్దకొండవలెఁ గుంభకర్ణుఁడు తనపైఁబడిన నెక్కయడునైన వెనుక కీడకుండనే యాతనిని ముందునకు శ్రీరామచంద్రుఁడు త్రోచి కొనిపోయినాఁడుకదా! ఆహా! ఆమహాబలునిభుజవీర్యము. అదిగో! రాముఁడు దివ్యాస్త్రముల నసురశిఖామణిపై వైచుచున్నాఁడు.

(నేపథ్యమున) ఆహా! ధోమకాటు! నల్లికుట్టు! వైచితివి! వైవఁబడితిని! అబ్బ! కొట్టితివి! కొట్టఁబడితిని! ఇచ్చితివి! పుచ్చుకొంటిని! మాటలయంతవాఁడి మార్గణములకే యున్నయెడలనీకంటెమ. హాశూరుఁ డెవఁడు?

లక్ష్మ—ఆఁ! ఆఁ! ఇదేమి! వి తగ నున్నది!

గీ. సప్తసాలవిభేదన ♦ చండములును
వాలిహరణచణంబులౌ ♦ బాణరాజ
ములు సురారియొడ ల్దాఁకి ♦ ముల్లుగుచ్చు
కొనినబాధయునైనఁ జే ♦ కూర్పవయ్యె.

ఆహా! ఆహా! ఇప్పుడు శ్రీరామమూర్తి యేమివీరదర్శన మి
చ్చుచున్నాఁడు!

గీ. ఆఁ! యని తల యూఁచుచు నంత ♦ నాగ్రహించి
కొలుకు లెఱ్ఱవాఱఁ జూపు ♦ తళుకుమనఁగఁ
బ్రబలవాయవ్యము నభిమం ♦ త్రణముచేసి
వింట బాణంబు సంధించి ♦ విడుచునదిగో!

(నేపథ్యమున) హా. హా. హా. హా.

స్త్రీ—గీ. రాఘవేంద్ర బాణప్రహా ♦ రంబుచేత
నసురబాహువు మింటిపై ♦ కట్టె యెగసి
పిడుగు పడినట్లు బడబడ ♦ విఱిగి దనుజ
సైన్యమునఁ బడి యెందఱో ♦ చచ్చి రహహా!

(నేపథ్యమున) హా. హా. హా. హా. హా.

గీ. వేదనాభరమున రణా ♦ వేశమునను
మొదలు తెలియక గొంతెత్తి ♦ యొండ్రపెట్టి
కాల్కొలఁదిని బర్వెత్తి రా ♦ క్షసుల నసక
కపుల ననక తన్నుచుఁ జంపఁ ♦ గడఁగె నహహా!

(నేపథ్యమున) రావణానుజా! మేము రక్కసులము; మేము ర
క్కసులము. ఆఁగు! ఆఁగు! అరుగో! కపులు! కపు లక్కడ ను
న్నారు. అచ్చటికేఁ బొమ్ము. అమ్మయ్యో! అమ్మయ్యో! హా.
హా. హా. హా. హా. హా.

స్త్రీ—కుంభకర్ణుఁ డిటు వచ్చుచున్నాఁడు. (కుంభకర్ణుఁడు ప్రవేశిం
చును.)

కుంభ—గీ. కపులవారలో? మీరు ర ♦ క్కసులో? యంద
ఱొకటై నాకు; జగంబంత ♦ యూడ్చిపెట్టు
వాడ; బ్రళయమువచ్చె; నా ♦ బాహు వేది?
రణతలం బేది? గద యేది? ♦ రాముఁ డేఁడి?

(నేపథ్యమున) మఱలు! మఱలు! రాముఁ డిట నున్నాఁడు.

కుంభ—ఆఁ! ఆఁ! అక్కడ నింక బ్రదికి యుంటివా? వచ్చుచున్నాను. గదయేది? గదయేది? గదయేది? మహోదరా! మహోదరా! అక్కడ నున్నావా?

(నేపథ్యమున) మాయోద్ధమహోదరరసమే కాని మహోదరుఁడు లేఁడు.

లక్ష్మ—పశువా! తిరుగు! తిరుగు! దస్! దస్! (విల్లుచే వీఁపునఁ గొట్టును.)

(కుంభకర్ణుఁడు నిష్క్రమించును.)

(నేపథ్యమున) అమ్మయ్యో! అమ్మయ్యో! స్వసేనాకబళనతత్పరుఁ డైనకుంభకర్ణుఁడు వచ్చుచున్నాఁడు.

లక్ష్మ—(నవ్వుచు) విభీషణుఁడు మావంకకు వచ్చి యుపకారము చేయుచున్నాఁడు. నీవు శత్రుపక్షమున నుండియే మహోపకారమును జేయుచున్నావు. సెబాస్! కుంభకర్ణా! మాకు శ్రమ మక్కఱలేకుండ రాక్షసుల నీవే చంపుచుంటివి.

(నేపథ్యమున) హా. హా. హా. హా. అయ్యయ్యో! మీఁదఁ బడుచున్నది. చచ్చితిమి. చచ్చితిమి. ఇఁక నేమున్నది! అమ్మయ్యో! అటు; అటు; ఇటు; ఇటు! పో; పో!

లక్ష్మ—కుంభకర్ణునిరెండవబాహువుకూడ నెగిరి రాక్షసులపైఁ బడి యొందఱనో పొడిచేసినది. హా. హా! ఈయుద్ధ మెంతచిత్రముగ నున్నది!

(నేపథ్యమున)

గీ. కపులఁ రక్కసులను, ఖండ ♦ ఖండములుగఁ
జేసి పొగఁదేలునెత్తురు ♦ చింతపండు
పులుసుమఱిగించి నోటితో ♦ బుస్సుమనుచుఁ
బీల్చిననుగాని తలతిక్క ♦ విడువ దహహా!

...క్ష్మ—ఓరీ కుంభకర్ణా! తల విడిచినప్పుడే తిక్కగూడ విడుచును.

...ంభ—(ప్రవేశించి) రెండుబాహువులు నూడినవి. మొండి నైతిని.

గీ. కపుల రక్కసుల మెదడుఁ ♦ గలిపి యెలుఁగు
గొడ్లనెత్తుటఁ బదనుగాఁ ♦ గ్రుమ్మి నాదు
కాళ్ల నడుసుఁద్రొక్కుచు గుంభ ♦ కర్ణవిజయ
కథనస్మృతిమస్తంభంబు ♦ గట్టువాఁడ.

...క్ష్మ—అడుసుఁద్రొక్కుటకుఁ గాళ్లున్నవి కాని కట్టుటకుఁజేతులెక్కడివి?

(నేపథ్యమున) రావణానుజా! విజయస్తంభమున కడుసుమఱి యెవ్వరిచేతనైనఁ ద్రొక్కింపవచ్చును. రమ్ము.

...ంభ—ఆఁ! నరాధమా! నాకాళ్లుకూడ నఱికెదవా? ఏమి పొగరు? ఏమి మిట్టిపాటు! ఏమి గర్వాలాపములు! సుగ్రీవచండాలుఁడు ముక్కుఁ గోసినవేళ మంచిదిగాక యిన్నికోఁతలగుచున్నవి. నాకాళ్లు నఱికెదవా? ఒక్కకాలు చెఱిపినఁ బదియార్గురు రాములగుదురు. తలకుమీఱిన ప్రేలుటలా! ఇదిగో! వచ్చుచున్నాను. కాలిక్రింద నిట్టె యిట్టె నల్లిసి ఊచినట్లు ఊచెదను. చూడు.

(నిష్క్రమించును.)

...క్ష్మ—బడలిక హెచ్చినకొలఁదిఁ బందెపుగుఱ్ఱమునకువలె వీనికిఁ జౌరుషము హెచ్చుచున్నది.

(నేపథ్యమున)
హా. హా. హా, హా. అమ్మయ్యో! అయ్యయ్యో! ఇఁక బ్రదుకులు దక్కవు. పోండు. పాఱిపోండు. చచ్చితిమి. చచ్చితిమి. హరహరా! హరహరా! శివశివా! హా. హా. హా, హా.

లక్ష్మ—సెబాస్! సెబాస్! స్తంభము లూడినమండపమువలెఁ గాళ్లూడి కుంభకర్ణుఁడు గుభిల్లున నేలఁ గూలినాఁడు. ఓరీ! కుంభకర్ణా నీకాలితో రాముని ఱాచెద నంటివే? ఇప్పుడు కాళ్లెక్కడనున్నవో చూచుకొనుము.

(నేపథ్యమున) కాళ్లు పోయిన సరే! కనులు పోయిన సరే! కడుపుపోయిన సరే! నోరున్న చాలదా? అల్లనేరేడుపండును జప్పరించినట్లు చప్పరించి యమియనా? హా. హా. హా. హా. (పెద్ద ధ్వనియగును.)

లక్ష్మ—అదేమి? అదేమి? హా! హా!

ఇ. వె. కాలుసేతు లూడి ♦ కడవలతో నెత్తు
గారుచుండ నట్టె ♦ నోరు తెఱచి
గాంద్రుమనుచు రాముఁ ♦ గబళింప మీఁదికి
నెగిరివచ్చె జగతి ♦ బెగడుచుండ.

రామచంద్రప్రభూ! జాగ్రత్త! ఆహా! ఆహా! రాముని మ్రింగఁదలఁచినకుంభకర్ణునినోరు రామబాణములను మ్రింగుచున్నది. సెబాస్! కుంభకర్ణా! రామబాణములను జవిచూడవలయునని కోరితివి. ఇష్టార్థసిద్ధినొందితివి. ధన్యుఁడవైతివి. ఆఁ! అదేమి? కుంభకర్ణునిమొండెము కానఁబడ దేమి? ఏదియోయొకవెల్గురాముని లో నేకీభవించిన దేమి?

(నేపథ్యమున) లక్ష్మణా! మహాశూరుఁడైనకుంభకర్ణుఁడు కాలవశమున సమాప్తి నొందినాఁడు.

లక్ష్మ—మహాప్రభూ! తమ రొనర్చిన మహోపకారమునకై సురలు పుష్పవృష్టిని గురియుచున్నారు.

(నేపథ్యమున) హా. హా. హా. పట్టుకొనుఁడు. పట్టుకొనుఁడు. తి రిగిమాయాసంగరమునకై వచ్చినమహాపాపిని గనఁబడునపుడే న ఱికి వేయుఁడు.

లక్ష్మ—సెబాస్! ఇంద్రజిత్తుని గపులు తరుముదురు. అతనితో నా కీది నము దైవకృపచే యుద్ధము సంభవించినయెడల రామచంద్రుఁడు కుంభకర్ణుని జంపినట్లు నే నాతని జంపి మహానంద మొందుదు ను. కపులారా! ధనుర్ధరుఁడనై వచ్చుచుంటిని. (నిష్క్రమింప నింద్రజిత్తు ప్రవేశించును.)

ఇంద్ర—ఓసిగ్గుమాలిన దేవతలారా! ఓపిఱికిపందలారా!

సీ. కాలాంతకునిభంగి ♦ గదఁబూని మాపిన
తండ్రి హుమ్మని మిమ్ముఁ ♦ దారసిల్లఁ
గటకటంబడి గుట ♦ గుటలాడి, గడగడ
వడఁకి, మొఱ్ఱో యని, ♦ వంకదండ
ములఁ బెట్టి, కన్నీళ్ల ♦ మునురిచ్చి, యసురుని
ముం దీడ్డిలంబడి, ♦ మొత్తుకొనిన
పందలు బానిసల్, ♦ పాపులు కుక్కలా
మీ రిప్డు డాతఁడు ♦ మృతిని బడయ
గీ. గులుకుచుండిరే? పుష్పముల్ ♦ జిలుకుచుండి
రే? యతఁడు పోఁగ నేనులే ♦ నే? సురేంద్ర!
జుట్టు జాడించి కాలితో ♦ మెట్టినపుడు
గురియు బాష్పవృష్టుల నప్డె ♦ మఱచినావె?
ఆ. వె. చిపురకాగాఁగ నిన్నుఁ ♦ జెడనఱికిననాటి
గాయములను నేత్ర ♦ గాఱుచుండఁ

దుముకుచుకొనుకరముల ♦ తడి యారకుండనే
కరములారఁ బూలఁ ♦ గురియుచుంటె?

కానీ! మీపని నామీఁదను బెట్టెదను. ఓరాక్షసవీరులారా!

గీ. పరుగు లిడ నేల? యిదె నేను ♦ బ్రదికి యుండ
మీకు భయ మేల? యాఁగుఁడీ! ♦ తాఁకుఁడీ! క
పులను; రామలక్ష్మణులను ♦ ముక్కలుగను
తెగనఱుకవచ్చినాఁడ ని ♦ దినమునందు.

ఆఁ! ఆ! అదేమి? ఇంక వెనుకతిరుగరా? ఆఁ! ఆఁ!

గీ. పాఱుపోతులారా! మొండు ♦ లార! మీర
లొక్కతల్లిదండ్రికిఁ బుట్ట ♦ రొక్కొ! చేతు
లందు గద లేల? మూఁతుల ♦ యందుబుగ్గ
మీస లేల? కాల్పనే? చావ ♦ మేలుగాదె?

ఓవానరాధములారా!

గీ. ఇంతమాత్రకే పండ్లిగి ♦ లించుచుండి
రే? కిచకిచలాడుచునుండి ♦ రే? యసురే? పొ
గరునఁ దోఁకల జాడించి ♦ గంతులిడుచు
నుండిరే? అద్దిరా! కాచి ♦ కొండి యిపుడె.

గీ. పొట్టలను జింపి ప్రేవ్లను ♦ గొట్టువాఁడ
దూఁటబిళ్లలలాగునఁ ♦ దొంబతొంబ
వేచ్చి కరకరనఱికెద ♦ పింజపింజ
గాఁగ నేకెద వచ్చితిఁ ♦ గ చికొనుఁడీ.

(నిష్క్రమింపఁగ నిద్దఱువానరులు ప్రవేశింతురు.)

మొద——అమ్మయ్యో! అమ్మయ్యో! ఇంద్రజిత్తు! ఇంద్రజిత్తు!

రెం——ఈదినమున మనకు సంఘమరణము తప్పదు.

మొద—తప్ప దనకము. నాకుఁ గడుపులో గలగలలాడుచున్నది. కా లుకొలందిఁ బర్వెత్తుదము.

రెం—ఈమారుతి మనల రణరంగమునుండి పాజీపోనిచ్చునా?

(ఆంజనేయుఁడుప్రవేశించును.)

మొద—రా! రా! ఇంద్రజిత్తునిచేతఁ జావు సందేహముగాని పావనిచేత నిశ్చయము. యుద్ధభూమికే పోవుదము. రమ్ము.

(నిష్క్రమింతురు.)

(నేపథ్యమున)

సీత! సీత! హాదిహారీ! సీత! ఛే! మేఘనాదా! విడు; విడు!

ఇంద్ర—(సీతను జుట్టుపట్టికొని యీడ్చుచుఁ బ్రవేశించును.) రా! దు రాత్మికా! చండాలీ!

సీత—హా! రామప్రభూ! రామచంద్రా! నన్నీదురాత్ముఁడు పరిభవిం చుచున్నాఁడు. నీ వూరకుండుట న్యాయమా? మహావీరచక్ర వర్తీ! ఈచండాలుని జంపి నన్ను రక్షింపవా? రామా! రామా! రఘువీరా! రామచంద్రా! రామప్రభూ! ఆంజనేయా! సముద్ర లంఘనప్రవీణా! మహాబలా! నీవు చూచుచు నూరకుందువా? నీవైన నా కీచెఱఁ దప్పింపరాదా?

ఆంజ—గీ. విడువు! విడువు! ఊఁ! విడుమి! ఆఁ! ♦ విడువ వేర?
చితుకుమని నెత్తి రిలపైని ♦ జిందునట్లు
లొక్కగుద్దిదె! విడువరా! ♦ ఊఁ. ఊఁ. సీదు
నబ్బకే దిక్కు లేదు నీ ♦ వనఁగ నెంత?

(ఇంద్రజిత్తును గొట్టఁబోవును.)

ఇంద్ర—ఆఁగు. ఆఁగు. ఇఁక నొక్కయడుగైన ముందు పెట్టవలదు. పెట్టినయెడల సీతను నఱుకుదును.

గీ. ఇదిగో! చంద్రహాసలతిక ♦ యిదిగోసీత!

(జుట్టు లాగుచున్నాఁడు)

సీత—రామా! రామా! రామా! (ఏడ్చును.)

ఆంజ—(తనలో) రామా! రామా! రామా! ఎంతపాపకార్యమును వ్యర్థుఁడనై చూచుచుంటిని.

ఇంద్ర—గీ. ఇదిగో! చంద్రహాసలతిక ♦ యిదిగో! సీత
తెప్పపాటులో నొకవ్రేటు— ♦ రెండుముక్క
లు!—తళుకనిపించు—జాగ్రత్త! ♦ సతి గతించు
పిడప గ్రుద్దెదో! నీవు కూ ♦ లెదవు తెలియు.

ఆంజ—(తనలో) హా! రామచంద్రా! రామభద్రా! ఇంక నే నేమిసేయఁగలను? ఆహా! ఎట్టివిషమసంధి వచ్చెను! హా! భగవానుఁడా! ఏది గతి?

గీ. ముందడుగువెట్ట సతిని జం ♦ పును; వెనుకకుఁ
బోవఁ గాళ్లాడ కున్నవి; ♦ మొద్దువలెను
నిలబడుదమన్నఁ గనులు చి ♦ ల్లులుపడియెను
రామ! ఏమి సేయుదు? రామ! ♦ రామ! రామ!

(ఏడ్చును.)

సీత—నాప్రాణములు పోవుచుండ నట్లు నిశ్చలుఁడవై నిర్వికారుఁడవై నిలువఁబడుట న్యాయమా? నామీఁద నీ కేల దయతప్పెను? మారుతీ! నాభర్త క్షేమమును నాకుఁ దెలిపి నన్ను నాతనిని వెనుక రక్షింపలేదా? అట్లే యిప్పుడు నాయాసన్నమరణమును నానాథునికిఁ దెలిపి నన్ను బ్రదికించి యాతనికి మేలుసేసి మహాపుణ్యమును గట్టికొనరాదా? పొమ్ము. నాతండ్రీ! రామునిదీసికొనిరమ్ము. నీపాదములకు మ్రొక్కుచున్నాను.

ఆంజ—(తనలో) రామ. రామ. రామా! లోకమాతవు, పరమపూజ్యవు, శ్రీరామచంద్రునిసతి వగునీవు నాపాదములకు మ్రొక్కెదననుమాట యాడఁదగినదుస్థితికి రావలసివచ్చెనా? హా! తల్లీ!

తల్లీ! ఇదిగో! వెళ్ళిరామునితోఁ జెప్పెదను. ఈసమయమున
కుంభనికుంభత్రిశీర్షమకరాక్షులయుద్ధమున రామలక్ష్మణు లిద్ద
ఱింతవఱకుఁ దెలివిలేక యున్నారు. (నిమ్మళముగ వెళ్ళిఁబోవును)

ంద్ర—పావనీ! పౌరుషశీలుఁడవు. వెనుకడుగు వెట్టెదవా? సీతప్రాణ
ములు నాఖడ్గాగ్రముల నున్నవి. నీ వటు తిరుగునరికి నస్త్రాంపు
నియాదెదను. జాగ్రత్త! రామునియొద్దకుఁబోయి పిలుచుకొని
వచ్చి నన్నుఁ జంపించి నాచేతిలోనిసీతను మీరుగ్రహించినవఱ
కాఁగునా? చూడు; చూడు! ఇప్పుడే చంపెదను.

(కత్తి యెత్తుచున్నాఁడు)

సీ—రామా. రామరామా! హా! రామా! (ఏడ్చును.)

జ—మేఘనాదా! చంపవలదు. నేను మొరదులాగున నిచ్చటనిలి
చెదను. (తనలో) హా! విధీ! హతవిధీ! ఎంతగతిపట్టినది.

గీ. కన్ను లున్నవి కనలేను; కాళు లుండె
కదల లేను; కరము లుండెఁ కదుపలేను;
నోరు గలదు పలుకలేను; హా! రఘువర!
బ్రదికియుండియుఁ జచ్చిన వాఁడ నైతి.

హా! మేఘనాదా!

గీ. నాఁడు బ్రహ్మాస్త్రమునఁ గొట్టి యేమగడియ
లీవె నన్గట్టినా విప్పె డిల్లువాఙ్మ
హాస్త్రమునను బంధించినా వకట! యెన్ని
యుగము లుంతువొ కానిగ తిగద! కట్టు!

ద్ర—సీతా! రామభక్తుని వేఁడుకొంటివి. .రామదాసుకాళ్లపైఁ బడి
తివే! రక్షింపఁగలిగినాఁడా? మరణము తప్ప నిన్ను నాచేతినుం
డివిడిపింపఁగలఁది మఱియొక్కటి లేదు.

—హా! రామా! రామభద్రా! రామచంద్రా! (ఏడ్చును.)

ఆంజ—హా మేఘనాదా!

సీ. పరమపావనములు, ♦ పట్టాభిషేకర్తై
లార్ఘ్యంబులసితశో ♦ భాన్వితములు,
ప్రసవప్రసాధనా ♦ ర్ఘ్యంబులు, నుంగరా
ల్గట్టియుఁ దెగఁబారు ♦ గలయవి, రఘు
రామనఖముఖప ♦ రామర్శనప్రాంచి
తములు, వసిష్ఠహ ♦ స్తతలమంగ
ళాక్షతౌఘశుభావ ♦ హాము, లిప్డుప్రారబ్ధ
కలనచే జడగట్టి ♦ గఱునుదేఱు

గీ. మొలఁత కేశపాశంబులు ♦ మెలికవేసి
గుండెలు పగుల; నాకనుల్ ♦ మండఁ; నుదలు
నీరువిడువఁ; బ్రాణంబులు ♦ నిల్వనెగ
రఁ; జెడలాగెదేలా? దయ ♦ రాదె? నీకు.

గీ. యజ్ఞసంభవ, రాముని ♦ ల్లాలు, పరమ
సాధ్వి, దశరథుకోడలు, ♦ జనకపుత్రి,
కరమునను దాఁకఁ గందుబం ♦ గారుబొమ్మ
యేమి యపకృతి నీకొన ♦ రించెనకటా!

ఇంద్ర—ఏమియపకృతి మాకుఁ జేసెనా?

గీ. నిన్ను రావించె; నాతమ్ము ♦ మన్నుఁజేసె;
లంకఁ గాల్పించె; నసురబ ♦ లంబు దూల్చె;
వార్ధిఁ గట్టించె; రావణ ♦ భ్రాతను విడఁ
దీసె; లంకను ముట్టడి ♦ వేసె; నింతె!.

గీ. దినమునకుఁ గోటులకొలంది ♦ దనుజవరుల
బలిగ మ్రింగుచున్నది లంక ♦ వల్లకాఁడు

సేసినది చాలదా? ఏమి ♦ చేసె నంచు
నడిగెదవు, సిగ్గు లేదె? క ♦ న్నైన లేదె?

ఆంజ——కల్లుద్రాగినట్టిమాట లాడెద వేల? ఇంతమహోపద్రవమునకు మూలకారణ మైననీతండ్రిని నీ వీరీతిగఁ జేసియుండినయెడల రాతును లందఱకును బుద్ధి వచ్చునుగదా!

ఇంద్ర——

సీ. అనుఁదు లెందఱిస్త్రీల ♦ నపహరింపఁగ లేదు
వారంద ఱిట్లు సం ♦ భ్రమము పడిరె?
నడువీథి కెక్కిరే? ♦ నలుగురితో మొఱ
వెట్టి యేడ్చిరె? యిట్లు ♦ పొట్ట చించు
కొనిరె? తన్నుంబోలు ♦ కుంకల గుమిగూడి
పశువుల ట్లొప్పుచుఁ ♦ బవరమునకుఁ
బోయిరె? యపసవ్య ♦ ముగ మూసికొనిరె? యీ
పశువులసంతలఁ ♦ బాలుపడిరె?

గీ. ఔర! నాలిముచ్చుకవులు ♦ లేరొ! నోటి
యొట్టవుఁజరిత్రకరులు లే ♦ రో! మహోయ
శంబు ప్రళయంబుదాఁకను ♦ సాగఁదీయ
రో! రఘువరదేవుఁ డిది యె ♦ ఱుంగఁడొక్కొ!.

ఆంజ——(తనలో) హా. హా. హా. ఎట్టిమహాకఠోరవాక్యములు వ్యర్థుఁడ నై వినవలసి వచ్చెను.

గీ. మనసు తెక తెక మఱుఁగుచు ♦ మండుచుండ
స్వత్వమునఁ గోపవిస్ఫూర్తి ♦ శాంతిపఱుపఁ
బూన నెక్కుడేమంటయై ♦ మేనుగ్రమ్మె
నుడుకునూనెను జలిసిరు ♦ చిలికినట్లు.

గీ. ఏమి సేయుదు? మనసులో ♦ నేమొ గుబగు
బంచుఁ బొంగుచు గుప్పుగు ♦ ప్పంచుఁ బొగలు
సెగలు దేహమంతయుఁ గ్రమ్మి ♦ యెగయసాఁగె
గుల్లసున్నముపై నీరుఁ ♦ జల్లినట్లు.

సీత—హా! రామచంద్రా! హా! రాజీవలోచనా! (ఏడ్చును) నా కీచెఱ యింక నెన్నాళ్లోయి ప్రాణనాథా!

ఇంద్ర—ఎన్నోనాళ్లా? ఎన్నోగడియలా? ఇప్పుడే! రా! రా! ఇదిగో ఎగచి తెగనఱుకుచున్నాను. (జుట్టు పట్టికొని యెగవైవఁబోవును.)

సీత—హా! రామా! రామా! రామా! (ఏడ్చును.)

అంజ—బ్రహ్మవంశమునఁబుట్టినవాఁడవు. వేదాధ్యయనసంపన్నుఁడవు. నీకీమహానీచకార్యముతగదు. ఇంతక్రౌర్యముతగదు. తొందరపడకు; తొందరపడకు! హా రామా! రామా! రామా!

(ఏడ్చును.)

ఇంద్ర—సేనామధ్యమున సర్వరాక్షసనయనానందకరముగ నఱికెదను.

అంజ—ఓరీ! చండాలుఁడా! ఓరీ! కటికవాఁడా! ఈపని నీవు చేసితక్కువురా! నీవింక మన్నవురా! నీచావు సమీపించినదిరా! ఉండరా! ఉండరా! స్త్రీహత్య తగదురా!

ఇంద్ర—సురసాసింహిణీలంకిణులఁ జంపిననీవుకూడ నాకు బోధించుచుంటివా? తాటకను జంపినరామభగవానునిగూర్చి యుపచారవాక్యములఁ బలుకుచుంటివా?

అంజ—ఆస్త్రీలు ప్రబలదుర్నయలు గావున వారికట్టిశిక్ష విధింపఁబడెను.

ఇంద్ర—హా. హా. మీశిష్టత మాకు దుష్టత. మాశిష్టత మీకుదుష్టత.

గీ. మేలునకుఁ గీడునకు, బొలి ♦ మేరదిమ్మ
గలదె? జనులను బట్టి బు ♦ ద్ధులనుబట్టి

వేళలనుబట్టి యది యిది ♦ భేద మగును;
తత్త్వ మొకటె భేదము కల్పి ♦ తంబు గాదె?

అ. వె. తళుకు తళుకు మనెడు ♦ తరవారి యిదిగో! క
సిక్కుమనుచు నొక్క ♦ చేతివిసరు
విసరి జన్నిదంపుఁ ♦ బెట్టున సీతను
నఱికి భూతతర్ప ♦ ణం బొనర్తు.

నామాటలుగా రామునితో నిట్లు చెప్పుము.

గీ. దేనికొఱ కేడ్చి యేడ్చి నె ♦ త్తి నిలఁగొట్టి
కొని యిటకు వచ్చితో యది ♦ గూలె నింకఁ
బంగనామాలను జెఱిపి ♦ వైచికొనిత
లనుముసుఁగిడి "హరహరా" ♦ యనుచు మఱలు.

(ఇంద్రజిత్తు సీతతో నిష్క్రమించును.)

(నేపథ్యమున)

హా! రామా! హా! కౌసల్యా! హా! తండ్రీ! హా! లక్ష్మణా! హా! రామా! రామా! రామా!

ంజ—అయినది. అయిపోయినది. అయ్యయ్యో! హా! జానకీ!

గీ. ఎంతవానియింటను బుట్టి ♦ తెంతవాని
యింటఁబడి తెంతవానిచేఁ ♦ గొంటి వీవు
కటకటా! యెచ్చటను నెట్టి ♦ కటికవాని
దాగటను గోయఁబడితి సీ ♦ తమ్మతల్లి!

ఇంక దుఃఖించుచు నాలస్యము సేయఁగూడదు. ఇంద్రజిత్తునిచావీదినమునఁ జూడవలయును. హా! మేఘనాదా! దురాత్మా! సీతాఖండనమహాపాతకీ! ఆఁగు! ఆఁగు!

(ఆంజనేయుఁడు నిష్క్రమింప నింద్రజిత్తు ప్రవేశించును.)

ఇంద్ర—నే నింక మాయచే నదృశ్యుఁడను గాకుండినయెడలభయంక రాకారుఁ డైనమారుతిచేఁ జచ్చుట నిశ్చయము. ముందు సర్వ కపిసేనామూర్ఛకై గాంధర్వాస్త్రమును విడుతును. (అభిమం త్రించి) అబ్బో! హుమ్మనుచుఁ బిడికిలితోఁ బెదరించుచు నాంజ నేయుఁడు వచ్చుచున్నాఁడు. (ఇంద్రజిత్తునిష్క్రమింపఁగ నాంజ నేయుఁడుప్రవేశించును.)

ఆంజ—రే! ఇంద్రజిత్తా! ఎక్కడ నుంటివి? రే. రాక్షసాధమా! పాపా ణహృదయా! రామద్రోహీ! బ్రదుకఁ దలఁచి యంతర్ధానమొం దితివా? మగవాఁడవైనఁ గనులఁ బడరా! ఆఁ! ఆఁ! అదేమి? అ దేమి? ఆఁ! అదేమి?

గీ. తలలు వ్రాల్చుచుఁ బైకి నా ♦ ల్కలను జాపి
వెడ కనులఁ దాల్చి నరముల ♦ బింక మెడలి
చాపచుట్టగ నొఱగె భూ ♦ స్థలిని నట్టె
కపులు కొండ్రముచ్చులు భల్లు ♦ కములుఁ గూడ.

ఆహా! ఇది యేమి? మహామాయగా నున్నదే. రే! అసురాధ మా! దానవకులపాంసనా! నీమాయ యేనఁటరా యిది!

(విభీషణుఁడుప్రవేశించును.)

విభీ—నీకంఠస్వరమునుబట్టి యాంజనేయుఁడ వనుకొందును.

ఆంజ—విభీషణా! ఔను. కపిసైన్య మొక్క మాఱు తుపానువదలినత రువాత సముద్రమువలె నింతప్రశాంతి నొందిన దేమి?

విభీ—ఇంద్రజిత్తు గాంధర్వాస్త్రమహిమముచే—

ఆంజ—ఇప్పుడు మఱింతచీఁకటిగ నున్న దేమి?

విభీ—అదియు నాతనిమాయాప్రభావమే!

ఆంజ—నీవిప్పుడు నూఁడుము. నేను రెండుకొఱవులను దెచ్చెదను.

(పోయి రెండుకాఁగడలతో వచ్చును.)

విభీ——ఈకొండ్లు యెంత బాగుగ నుండుచున్నవి!

ఆంజ——మహానుదరుని కొవ్వుచేఁ జేయఁబడినవి బాగుగనుండవా?

విభీ——ఆలాగా? ఒకకొండ నాకిమ్ము. అదుగో! నీలుఁడు నిశ్చేష్టుఁడై యున్నాఁడు.

ఆంజ——అదుగో! మహారాజుసుగ్రీవుఁడు.

విభీ——అదుగో! అంగదుఁడు, గవయుఁడు, గవాక్షుఁడు.

ఆంజ——అదుగో! మైందద్వివిదులు. హా! ఎంతకష్టము! ఎంతకష్టము!

(నేపథ్యమున) ఎవరక్కడ?

ఆంజ——వింటివా? అది జాంబవంతునికంఠరవమువలె నున్నది.

విభీ——ఔను! ఇటు; ఇటు. ఓజాంబవంతా! మహోపద్రవము సంభవించినది.

(నేపథ్యమున) నీ వెవఁడవు?

విభీ——నేను విభీషణుఁడను.

(నేపథ్యమున) నాయనా! పుణ్యాత్ముఁడైనయంజనానుతుఁడు బాగుగ నున్నాఁడుకదా?

విభీ——శ్రీరామలక్ష్మణు లుండఁగ సుగ్రీవరాజేంద్రుఁ డుండ నాంజనేయునిమాట నంతయాందోళనముగా నడిగితి వేమి?

(నేపథ్యమున) ఆతఁ డొక్కఁడు జీవించియున్న నందఱము బ్రదికినవారమే. ఆతఁడు లేనియెడల మన కాశ యేమియు లేదు.

ఆంజ——భల్లూకేశ్వరా! నమస్కారము. నేనే పవనాత్మజుఁడను.

(నేపథ్యమున) చిరంజీవి వగుము. నాతండ్రీ! సంజీవపర్వతమందలి యోషధులఁ దెచ్చి వానరసేనను బ్రదికింపవలయును. గట్టిగ మాటలాడ లేకుంటిని. నాయొద్దకు రమ్ము. ఆవియుండుతావు చెప్పెదను.

(ఆంజనేయుఁడు నిష్క్రమించి తిరిగి ప్రవేశించును.)

ఆంజ—అయ్యా! విభీషణా! నీవు శక్తి నంతయు వినియోగపఱచి యిం ద్రజి త్తెట నున్నాఁడో కనుఁగొని రమ్ము. నేను ముందు రామదర్శనము సేసి తరువాత నోషధులఁ దెచ్చెదను.

విభీ—ఇప్పుడే పోయెదను.

ఆంజ—హా! రామచంద్రా! సౌమిత్రీసమేతా!

(నేపథ్యమున) మహాప్రభూ! నాచేయి పట్టుకొనుఁడు. నిమ్మళము గ రండు.

ఆంజ—లక్ష్మణునికర మూఁతఁగొని చీఁకటిలో రామలక్ష్మణులు విచ్చే యుచున్నారు. (రామలక్ష్మణులు ప్రవేశింతురు.)

రాము—మారుతీ!

ఆంజ—మహాప్రభూ! (కన్నులనీరు వెట్టుకొనును.)

లక్ష్మ—పావనీ! ఏడ్చెద వేల?

ఆంజ—మహాప్రభూ! బహుకఠినవార్తఁ జెప్పఁదలఁచినపాపాత్ముఁడను.

రాము—ఆంజనేయా! మాకుఁ గఠినతరవార్త లేమిటి? చెప్పుము. రా జ్యము పోయి, నారచీరలు ధరించి, అడవులపాలై, కాంతాశి రోమణి యైనజానకిని బోఁగొట్టుకొని,——(ఏడ్చును.)

ఆంజ—(కాళ్లపైఁబడి) జానకీదేవి నింద్రజిత్తు రణరంగమున ఖండించి నాఁడు.

రాము—ఆఁ! ఆఁ! (మూర్ఛిల్లును.)

లక్ష్మ—రామా! రామా! రామా! (ఏడ్చుచున్నాఁడు.)

ఆంజ—రామా! రామా! రామా! (ఏడ్చును.)

లక్ష్మ—రామచంద్రా! ఆశ్వాసిల్లుఁడు. (విసరును.)

ఆంజ—సౌమిత్రీ! సర్వకపిసేనాపరిజ్ఞకై నేనిప్పుడే యోషధులఁ దెచ్చెద ను. తడవు సేయఁదగ దని నీవు శ్రీరామభద్రుని నోదార్పుము.

(నిష్క్రమించును.)

రాము—(లేచి) హా! జానకీ! హా సుగుణ రాశీ! హా! యజ్ఞవేదిసంభవా!
హా! పరమపవిత్రా!

గీ. పరమభాగ్యాన్వితులు సార్వ ♦ భౌము లెంద
ఱో గలుగ వారి నందఱ ♦ రోసి పరమ
భాగ్యహీనుఁడ నన్నుఁ జే ♦ పట్టు కతన
జానకీ! నీకుఁ గష్టముల్ ♦ సంభవించె.

గీ. అడుగులకు మడ్గు లిడితినె! ♦ పుడమిపతికిఁ
బట్టవధు వగుభాగ్యంబుఁ ♦ బట్టనిచ్చి
నానె! ముద్దుముచ్చటల నె ♦ నర్చినానె!
కట్టిడిని నేను నిను సుఖ ♦ పెట్టి యెఱుఁగ.

గీ. తలకు సంపఁగినూనె పూ ♦ వులును లేక
యంగమునకుఁ బచ్చనిపస ♦ పైన లేక
యలికమునఁ దిరుచూర్ణంపుఁ ♦ దిలకమైన
లేక యొడలికి గందంబు ♦ లేక యకట!

గీ. మేనునిండినగుడ్డయు ♦ నైన లేక
పసపుబొంమునఁ బుస్తెత ♦ ప్ప మఱి యేది
లేక కడుపున కన్నము ♦ లేక కంట
నిదుర లేక కష్టము లొందు ♦ నిన్నుఁ గొనుచు.

గీ. ముండ్లనక, ఱాలనక, పొద ♦ రిండ్లనక, గు
హాలనక, గిరులనక, గోతు ♦ లనక యకట!
బ్రిదుకనక, చావనక మహా ♦ వనముల నొక
రీతిఁబదునాలుగేఁడులు ♦ తిరిప్పితిరిప్పి.

గీ. ఇట్టులైనను నిన్నుఁ బో ♦ షింపలేక
తుద కిదిగో! యని చేతిమీఁ ♦ దుగను బాడు

రక్కసుని కెఱయిడి కావు ♦ రమును మాపు
కొని కడుపు గిఱ్ఱుమని నిండఁ ♦ గూరుచుంటి.

హా! తల్లీ! హా! తల్లీ!

గీ. దండకకు నీవు సెలవిమ్ము ♦ దండ మనుచు
తల్లి! నిను వేడ సీత భ ♦ ద్రంబునుమ్మ
టంచుఁ బలికితి కోఁడలి ♦ యంత మీావు
విని ప్రహింతె? యేమొగమునఁ ♦ గనెద నిన్ను?

హా! లక్ష్మణా!

గీ. తండ్రిగా నన్ను, సీతను ♦ దల్లి గాఁగఁ
దలఁచి కన్నతల్లిఁ బాసి ♦ సిలుగుల్లోంది
కనుల నిడుకొని మాకు సౌ ♦ ఖ్యముల నెఱపి
యాదరించితి సీత యే ♦ మయ్యె? తండ్రి!

లక్ష్మ—మహాప్రభూ! విచారమున మునుఁగఁ దగదు. ఆశ్వాసిల్లుఁడు.

(నేపథ్యమున) ఎవ రక్కడ? ఎవ రక్కడ?

లక్ష్మ—విభీషణా! ఇటు రమ్ము. (విభీషణుఁడు ప్రవేశించును.)

విభీ—సౌమిత్రీ! శ్రీరామచంద్రుఁడు దుఃఖాక్రాంతుఁడై యున్నాఁడేమి?

లక్ష్మ(కనులుతుడుచుకొని) త్రిలోకపావని యైనజానకీదేవి యింద్రజిత్తు నిచే—

విభీ—(నవ్వుచు) హా. హా. హా. మీారేమియు విచారింపవలదు. ఇంద్రజిత్తు రణరంగమునఁ ఖండించినది మాయసీత! కపిసేనను మోసపుచ్చ నట్లు చేసినాఁడు.

రాము—ఆఁ! నిజమేనా? నిజమేనా?

విభీ—రామప్రభూ! నిశ్చయమే.

లక్ష్మ—(కత్తిదూసి)

ఆ. వె. మాయసీత యనెడు ♦ మాట యటుంచుము
మమ్ము తిరిగి వంచ ♦ న మ్మొనర్ప
నింద్రజిత్తు పంప ♦ నిట వచ్చుమాయావి
భీషణుండ వేము ♦ వేగఁ జెప్పు.

ము——తమ్ముఁడా! తొందర యేల? విభీషణా! ఎక్కడనుండి వచ్చుచుంటివి?

——గాంధర్వమున సర్వసేనామూర్ఛ నెఱిఁగి మాయమైనయింద్రజిత్తును వెదుకఁ బూనితిని. మాయాసీతాఖండనముఁగూర్చి మీ కెవ్వరు చెప్పిరి.

శ్రీ——ఆంజనేయుఁడు.

——ఆతఁడు నేను నింతకుముందే కలిసికొంటిమి. కాని యీతత్త్వ మాతనికిఁ దెలియునని చెప్ప కూరకుంటిని. మిగుల వ్యసనమొందికిని.

శ్రీ——విభీషణా! ఇంద్రజిద్వార్త ను చెప్పుము.

——నా కెచ్చటను గానఁబడ లేదు.

శ్రీ——రామప్రభూ! ఇంద్రజిత్తుజాడ తెలియదు. ఈసారి మాయాయుద్ధమున మనల నెంతబాధపెట్టఁ దలఁచి యున్నాఁడో! ఇఁకనుపేక్షింప వీలులేదు. ఏమైన సరే. సర్వరాక్షసనాశనార్థము బ్రహ్మాస్త్ర మభిమంత్రణము చేసి విడుతును. సెల విమ్ము. కటాక్షింపుము.

ము——అందులకు నే నంగీకరింపను. బాలురు, వృద్ధులు, స్త్రీలు, వికలాంగులు మొదలగునిర్దోషుల నందఱి నొక్కయింద్రజిత్తుకొఱకై వధించుటయన్యాయము కాదా?

ఆ. వె. కలుపుతోడ జొన్న ♦ కంకు లూడ్తురె? పుష్టి
పంటితోడ మంచి ♦ పండ్లలాగఁ

జనునె? నంఘనంస్కృ ♦ తిని దురాచారాల
తోడ మంచి విద్వు ♦ బాడియగునె?

ఇంద్రజిత్తుమాయాయుద్ధమున నేమియో చేయు ననియా? చేయనీ! అనేకజీవులు నీబ్రహ్మాస్త్రమున బాధపడుటకంటె నింద్రజిత్తుని దొంగబాణములచే మనము బాధనొందుట మంచిది కాదా?

లక్ష్మ—మహాప్రభూ! ఇంక నాతనిపై మీ కంతదాక్షిణ్యమా?

రాము—కాకేమి? లక్ష్మణా! దుర్మార్గునికి ముందుజన్మమునకైన బుద్ధి వచ్చుటకై తగుశిక్ష సేయవలయును కాని యెటులో హానిచేసి పగఁ దీర్చుకొనుట మనపనిగాదని యెఱుఁగవా? మన కొకనిపై నఁబగ యేమున్నది? అట్లేకానిచో నింద్రజిత్తునకు మనకు భేద మేమున్నది?

విభీ—మహాప్రభూ! ఎంతదూరవుమాట సెల విచ్చితిరి?

రాము—విభీషణా! తిరిగి యొకసారి పోయి యింద్రజి త్తేచ్చట నున్నాఁడో మఱింత జాగరూకతగఁ గనిపెట్టి రమ్ము.

విభీ—చిత్తము. (పోవును.)

(నేపథ్యమున) జయ రామభద్రా! జయరామచంద్రా!

లక్ష్మ—అదేమి? (అటునిటుచూచి) ఆంజనేయునియౌషధప్రభావమున సమస్తసేనయు మూర్ఛదేరి కిలకిలలాడుచున్నది.

(నేపథ్యమున) జయరామభద్రా! జయరామచంద్రా!

లక్ష్మ—ఆధ్వనియెవరిదో! అగ్రజా! విభీషణుఁడు తిరిగివచ్చుచున్నాఁడు.

(విభీషణుఁడు ప్రవేశించును.)

విభీ—రామప్రభూ! ఇంద్రజిత్తుజాడలను దెలిసికొంటిని. అతఁడునికుంభిలాహోమము సేయ సమకట్టి యున్నాఁడు. ఆహోమము పూర్తి చేసినయెడల నాతఁ డజేయుఁడు. కావున హోమవి

ఘ్న మెట్టులైన నాచరింపవలయును. ఒక్కనిమేషము తడవు సేయరాదు. చేసినయెడల మనకు జయ మసాధ్యము. కావున నిప్పుడే—నావెంటనే—

రాము—నేను ధనుర్ధరుడనై వచ్చెదను. ఇదిగో! సర్వసిద్ధముగ నున్నాను.

విభీ—మహాప్రభూ! మీరు రావలదు. సౌమిత్రిని బంపఁదగును.

రాము—సౌమిత్రి నొక్కని నే నట్లు వదలుదునా?

విభీ—మ తేమియు సంకోచింపవలదు. అతఁడే యింద్రజిత్తును వధించును.

రాము—తథాస్తు!

లక్ష్మ—(అపవారించి) విభీషణా! ఇంద్రజిత్తుతో యుద్ధము సమకూర్చి నాకు మహోపకార మొనర్చితివి.

విభీ—(అపవారించి) నీవు లోకమునకుఁ జేయఁదలఁచి యున్నావు.

రాము—లక్ష్మణా! బహుజాగరూకుఁడవై యుద్ధ మొనర్పుము. పొమ్ము విభీషణా! తమ్ముఁడు భద్రముసుమా!

విభీ—మహాప్రభూ! చిత్తము. లక్ష్మణా! పోవుదము రమ్ము.

(నిష్క్రమింతురు.)

రాము—ఆంజనేయా!

(నేపథ్యమున) చిత్తము. వచ్చుచుంటిని.

(ఆంజనేయుఁడు ప్రవేశించును.)

రాము—ఆంజనేయా! పసివాఁడైనలక్ష్మణుఁడు మితిలేనిరణోత్సాహమున మాయాసంగరనిపుణుఁడైనయింద్రజిత్తుతోఁ దలపడుటకుఁ బోయినాఁడు. సేనను రెండుభాగములు చేసి యొకభాగముతో నీవు సౌమిత్రిరక్షణమున నుండుము. మేఘనాదుని మాయానైదగ్ధ్యము నీ వెఱిఁగినదే కదా!

ఆంజ—చిత్తము.

రాము—ఆంజనేయా! అవలీలగా సంజీవనౌషధులఁ దెచ్చి మూర్ఛాపరవశు లగు ననేకశతాక్షౌహిణుల కపిభల్లుకగోలాంగూలేశుల నుద్ధరించితివి కదా! నీవంటి మహాపురుషుఁ డెవ్వఁడు?

ఆంజ—మహాప్రభూ! నేనింత సేపటినుండియు మీమొగము చూచుటకు లజ్జపడి యిచ్చటనే యుంటిని.

రాము—ఏల?

ఆంజ—

ఆ. వె. కష్టవార్త నొకని ♦ కర్ణంబులను వైచు
వాఁడు పాపి యంచుఁ ♦ బలుకుచుందు
రనెడుచో నసత్య ♦ మనగు వార్తను జెప్పు
నాతఁ డెంతపాపి ♦ యగునొ! కట్ట!

రాము—(ఆంజనేయుని చేయి పట్టుకొని నవ్వుచు) ఇటు లిబ్బంది పడవలసినదా?

ఆ. వె. మరణవార్త వినుచుఁ ♦ బరితపించెడువాఁడు
మూఢుఁ డంచు జనులు ♦ పొడుచుచుండ
దొంగచావు వినుచు ♦ దుఃఖించు నానరుఁ
డెంతమూఢుఁ డగును ♦ యెవ్వఁ డెఱుఁగు?

అని నేను బరితపింపవలదా! మారుతీ!

ఆ. వె. ఇష్టమైనదైనఁ ♦ గష్టమైనదియైనఁ
గఠినమైనదైనఁ ♦ గ్రమమైన
దైన సత్య మెప్పు ♦ డాడంగవలయును
మంచిచెడ్డ చింత ♦ మనది కాదు.

గీ. వికటసంస్థానపాంచభౌ ♦ తికశరీర
సంవృతు లగునరుల కొకౌ ♦ సమయమందు

దైవరూప మాసత్యత ♦ త్వంబు దెలియ
కుండఁ బోవచ్చు నేమి నే ♦ యుదుము మనము?

ఆ. వె. అట్టివేళ దైవ ♦ మందు భారము నైది
బుద్ధి కేది సత్య ♦ ముగను దోఁచు
నద్ది సత్య మనుచు ♦ నంతఃకరణశుద్ధి
నమ్మి యాచరింప ♦ న్యాయఘనశీలి.

ఆ. వె. మాయసీత దొంగ ♦ మరణంబు సత్య మ
టంచు నీవు త్వాను ♦ తాభిమాన
భక్తితత్పరతను ♦ బల్కితి వచురాగ
మునను నమ్మి నేను ♦ వనటఁ బడితి.

గీ. దైవనిందను గనిస్మృతి ♦ తప్పి భర్తఁ
దొందునలజడి గుణమగు ♦ నొందు గాదు;
సేవకాపదలను విని ♦ చింతిలుట గు
ణంబె యగుఁగాని యెప్పుడు దో ♦ షంబు గాదు.

ఆ. వె. కాన నీకసత్య ♦ కథనదోషము లేదు;
మాంత్యదోషగతియు ♦ మాకు లేదు;
చింత నొందవలదు ♦ శీఘ్రుంబుగా సుమి
త్రాత్మభవునికడకు ♦ నరుగు మయ్య!

ఆంజ——నమస్కరించుచున్నాను. (నిష్క్రమించును.)

రాము——ఈరాత్రి నే నగ్నిరోమ కరాళనేత్రజ్వాలాముఖాదినిముఖ్యా
దిరాక్షసుల ననేకులఁ జంపవలసి యున్నది. సౌమిత్రి యీసరి
కింద్రజిత్తును చాఁకెనో లేదో!

(నిష్క్రమించును. ఇంద్రజిత్తు ప్రవేశించును)

ఇంద్ర——దీర్ఘకాయా! ఇటురా! (దీర్ఘకాయుఁడు ప్రవేశించును.)

ఇంద్ర—ఏమోయి! వేల్చుటకు హోమద్రవ్యముల నన్నింటిని దెచ్చితివా?

ధూమ్ర—తెచ్చితిని. కాని యీహోమమునందున వేల్చనట్టిది శ్రీరామలక్ష్మణులకు గాని సమిధలను గాదు.

ఇంద్ర—అదేమిమాట?

ధూమ్ర—ఇనియే కాదా?

గీ. నల్లపాముమాంస, ముసుము ♦ నల్లగుండె,
నల్లపిల్లికాక్షము, మూల ♦ బల్లితోలు,
మహిషమూత్రము, గాడిదె ♦ మావితిత్తి
కట్టఁగట్టితి నాహుతిఁ ♦ గాల్చుటకును.

ఇంద్ర—సరే! అదే నికుంభిలావటవృక్షము. దానితొఱ్ఱలో నేను దూరి హోమము చేసెదను. నీవు చెట్టుపై గూరుచుండుము. (నేపథ్యమున) కొట్టు! తన్ను! అక్కా! పోడు! ఆఁ! ఆఁ! లోనికి రా వీలు లేదు. పొండి వెనుకకుఁ బొండి. నఱికెదము. చీల్చెదము. పొడిచెదము. కాల్చెదము. జాగ్రత్త! జాగ్రత్త!

ఇంద్ర—అదేమి? అదేమి?

ధూమ్ర—ఎవ్వరో లోపలఁ జొరఁబడ యత్నింప మనభటు లభ్యంతరపెట్టుచుఁ గేకలు వేయుచున్నారు.

ఇంద్ర—ఇప్పు డెవ్వ రిటకు వచ్చుచున్నారో?

(నేపథ్యమున) మఱెవ్వరు గారు. హనుమంతుఁడే వచ్చినాఁడు. అయ్యయ్యో! ఇఁక సంఘమరణము తప్పదు.

ధూమ్ర—రాక్షసులు హనుమంతుని జూచి భయపడుచున్నారు.

(నేపథ్యమున) ఊఁ ఉఁ. ఊఁఉఁ. బాబో! బాబో! ఊఁ ఉఁ. ఊఁ ఉఁ. ఒక్కిరా! అమ్మయ్యో! ఊఁ-ఉ ఊఁ-ఉ. బాబయ్యో! సెబాస్!

చచ్చితిమిరా! ఇఁక నేమున్నదిరా? అయ్యయ్యో! అయ్యయ్యో! హరహరా! హరా! (పెద్దధ్వనులు గలుగును.)

ఇంద్ర—అసురులు భయవిభ్రాంతులై పోయిరా?

దీర్ఘ—వారు పోవుటయే కాదు. లక్ష్మణుఁడు విభీషణుఁడు హనుమత్ప్రభృతులై లోనికి వచ్చుచున్నారు.

ఇంద్ర—ఇదేమి ప్రారబ్ధము? దూరెదను. తోఁట్టలో దూరెదను. హోమద్రవ్యము లేవీ? తెమ్ము; తెమ్ము! అబ్బ! ఏవో కొన్ని తెమ్ము! నీవు చెట్టెక్కుము (అటు నిటు సంభ్రమపడి పరుగెత్తుచుండును)

(లక్ష్మణహనుమద్విభీషణులు ప్రవేశింతురు.)

లక్ష్మ—(ఇంద్రజిత్తున కెదుటఁ బడి) ఆఁగు! మోసగాఁడా!

గీ. తుట్టుమని వటవృక్షంపుఁ ♦ దొట్టిలోన
దూరి యభిచారహోమంబు ♦ నోఁడదొంగ!
పూర్తి గావించి నన్నుఁ రా ♦ ముని వధింప
నెంచితివె? యొక్కయుఁడు గిడు ♦ మేమి యగును!

గీ. పగలు శౌర్యమున నెదుటఁ ♦ బడఁగ లేవె?
గ్రుడ్లగూబ! సంజలను గూ ♦ ర్కట్టుటంచుఁ
దొట్టిలో నుండి వెలికిని ♦ బుట్టఁ జూపి
శత్రువులఁ జంపఁబూనితే! ♦ చచ్చుపంద!

గీ. శత్రులను జంపుటకు రణ ♦ స్థలము లేదా?
అస్త్రములు లేవొ? ఖడ్గాది ♦ శస్త్రములును
లేవొ? కనుల కెదుటఁ బడ ♦ లేవొ? దొంగ
మొగమ! కుక్క! నక్క! నాలి ♦ ముచ్చ! చెనఁటీ!

గీ. కాకిమాంసము లేల? యీ ♦ గ్రద్దఱెక్క
లేల? గంగులయన్నంబు ♦ లేల? పిండి

బొమ్మ లేల? యీయాతక ♦ ట్టుంత లేల?
తుమ్మనుం డ్లేల? పశువుల ♦ దుమ్ము లేల?

గీ. పరమగాంభీర్యసంస్థైర్య ♦ బాహువీర్య
నిష్ప్రమాదోరుధీసమ ♦ న్వితుని రాముఁ
గోడియాఁకెలతోడను ♦ గుక్కగొడుగు
లను వధింపవచ్చు నని త ♦ లంచినావె?

గీ. ఆఁడువుట్టువుకంటెను ♦ నాఁడువుట్టు
వవు; పశువుకంటెఁ బశువవు; ♦ పాముకంటెఁ
బా మగుదు; పంచమునికంటెఁ ♦ బంచముఁడవు;
దొంగ లందఱకంటెను ♦ దొంగ వీవె.

గీ. దినమునకు నంగుళంబుదొ ♦ ప్పునను గోసి
పైనఁ జింతపిప్పనఁ గాల్చి ♦ పైన నుప్పు
కారమును రాచి పదిపదు ♦ నాఱువత్స
రములలో నిన్నుఁ జంప న ♦ ర్హంబు నాకు.

కాని నే నంతదనుక శాంతించి యుండలేను. ఇప్పుడే చంపెదను.

(మీఁదికిఁ బోవును.)

ఇంద్ర—నీసాఱకాయకోఁతలును గత్తికోఁతలు నొకనిముషము గట్టిపెట్టుము. విభీషణా! ఇది యేమి?

లక్ష్మ—మూర్ఖా! న న్నడుగుము. ఇది యేమా? ఇది యుద్ధభూమి—ఇది విల్లు—ఇది బాణము—ఇది వటవృక్షము—ఇది నీ హోమప్రయత్నము—ఇది తద్విఘ్నాచరణము—ఇది కృపాణము—ఇది వ్రేటు—ఇదె నీచావు. (మీఁదికిఁ బోవును.)

ఇంద్ర—ఉండు. చచ్చుట కంతతొందరపడెద వేల? విభీషణా! ఈనికుంభిలాహోమరహస్యము నీ వొక్కఁడ వెఱిఁగినదికదా? ఏల యీతనికి దీనిని వెల్లడించితివి?

లక్ష్మ—నన్నడుగుము. నిన్ను వధించుటకు—

ఇంద్ర—మాయలు పనికిరావనుచు, జిత్తులు కూడవనుచు, యుద్ధభూమిని యుద్ధ మొనర్పవలయుననియు వీరవరోపన్యాసమును జేసితివి, ఈపనిమాయకాదా? ఈరహస్యభేదనము దొంగతనము కాదా? ఆకస్మికముగ నిటులడ్డుదగులుట దొంగతనముకాదా? ఇదియుద్ధభూమియా? శ్మశానవాటిక కాదా? తుచ్ఛుఁడు—నీచుఁడు—కులద్రోహి—వంశమును నాశము చేయఁ బుట్టినచండాలుఁడు—నైనయీమహాపాతకుని యొద్ద నుంచుకొని—మెచ్చి—బుజ్జగించి—శ్లాఘించి—కాళ్లుపట్టుకొని—ఈమహారహస్యమును నేర్చుకొని—తగుదునమ్మ యని—అంబులువిల్లుఁ బూని—చంపెద నని—మగతనమున నిప్పుడు బయలుదేరితివా? ఇదివఱకు నీ కీపౌరుష్య మెక్కడకుఁ బోయెను? ఓరి విభీషణా! ఓరీ వంశపాంసనా! ఓరీపతితాధమా! ఎంతకును మాటలాడ వేల? నీనోరు పడిపోయెనా? నీనాలుక తెగెనా? నీదౌడలు దగ్గఱగనొక్కుకొనిపోయెనా? అట్టియాపద నీకింతకుముందు తటస్థించియుండినయెడల నీవు ప్రాణపదమైనరహస్యమును వెల్లడిసేయకయుందువుకదా!

భీ—నానాలుక తెగలేదు. నీకంఠము తెగుటకు సిద్ధముగ నున్నది. నానోరు పడిపోలేదు. నీచావు దగ్గఱపడినది. నీ కీయాపద యిదివఱకే తటస్థపడియుండినయెడల నే నీరహస్యమును బయలుసేయుటయే సంభవించి యుండదు.

ంద్ర—నన్నుఁ గన్నతండ్రికిఁ దమ్ముఁడవు కదా? నీకు సంతానము లేకుంటచే నన్నే పుత్త్రునిగ నిదివఱకెంచి యుంటివికదా? అట్టినన్నుఁజంపుటకు నీవీతనికి నాయాయువుపట్టును దెలుపవచ్చునా? సీతాప్రదానమును నీవు బోధించితివి. అదిమాతండ్రి యంగీకరిం

పకపోయెను. అందుచేత నీకు మాకు నంతఃకరణములంగాలు ష్యములు సంభవించెను. అంతేనా? అంతకంటె మాపైనిఁ బగ కు నీ కితరకారణ మేమైన నున్నదా?

విభీ—అదే. అదిగాక నన్ను మీతండ్రి సభలోఁ బరిభవింపలేదా?

ఇంద్ర—అన్నగారును, బుద్ధిఁజెప్పఁదగినవాఁడు, నైనపుడు బహుమా నించిన బహుమానింపవచ్చును. పరిభవించినఁ బరిభవింపవచ్చు ను. అది యాయనతప్పుకాదు. నీ వది గణింపవలదు. సీతాప్ర దానమును గూర్చి కుంభకర్ణుఁడు నెక్కు మాతండ్రితోఁ జెప్ప లేదా? ఆతఁ డిట్లే చేసెనా? ప్రహస్తుఁడు మాల్యవంతుఁడు, మొదలగు వా రందఱు సీత నిమ్మని చెప్పలేదా? వా రందఱు మాతండ్రిపక్షమును విడనాడిరా? నీదేహ మెక్కడనుండి వచ్చె ను? రావణునిదేహ మేగర్భమునుండి వచ్చెనో నీదియు నక్కడ నుండియే కదా! రావణుఁ డేబీజమున నంకురించెనో నీవుఁ దద్బీ జముననే యంకురించితివికద! చిన్నతనముననే నీతండ్రి మృతి నొందుటచే నీదేహమెవరివలనఁ బెంచఁబడినది? ఈరక్తము— ఈమాంసము—ఈక్రొవ్వు యెవరివలన వర్ధిల్లజేయఁబడినవి? రావణునిసొమ్మువలన—రావణుని యనురాగమువలన—రావ ణునికాయకష్టమువలననే కదా? మాట లాడవేమి? అట్టిచో నీకు పితృప్రాయుఁడైన రావణుని కాపద వచ్చినప్పుడు నీరక్త మాతనికి ధారపోయవలదా? నీమాంసమును హోమము సేసి యాతనిక్షేమమునకై నీవు ప్రార్థింపవలదా? నీచర్మము జెప్పులు కుట్టి యాతని కాళులకుఁ దొడిగింపవలదా?

విభీ—ఊరకుండినకొలఁది వాగ్ధోరణి హెచ్చుగనున్నది. రావణుని కా పద నెవఁడు తెచ్చిపెట్టినాఁడు? ఒడలు పొగరెక్కి—యూరకుం డ లేక—బుద్ధిపూర్వకముగ—చేతులార—తానే కొనితెచ్చు

కొనినాఁడు. “నీవు చేసినది తప్పు. నీకిది నీతి కాదు. దీనికిఁ బ్రా
యశ్చిత్త మిది. అట్లుచేసి నిన్నుఁ గులమును గాపాడుకొను”మ
ని నేను సహస్రవిధముల బోధించిన లక్ష్యపెట్టినాఁడా? గణించి
నాఁడా? కొంచెమైన నాలోచించినాఁడా? వినసైన వినినాఁడా?
పోనీ! అంతటితో నూరకుండెనా? నీతిచెప్పినందులకు నాకుఁ జె
ప్పుదెబ్బలా? నే నప్పుడు చెప్పిననీతిబోధమునకు నీ వెంత కీం
ద్రించితివి? మహాపాపమునకు ఫలకాలము తటస్థించినది. నోరు
మూసికొని దేవుఁడా యని యనుభవింపక యిప్పుడుకూడ నాపైఁ
దెగసాఁగెద వేమి?

ఇంద్ర—సరే. నీవు చెప్పినట్లు రావణుఁడు దుష్టుఁడు. ఆపదను స్వయ
ముగా వరించినాఁడు. నీ నీతిని జెవిఁ బెట్టినాఁడుకాఁడు. మీఁ
దుమిక్కిలి పరిహసించినాఁడు. నీ కాతనిపైఁ గోపము కలిగినది.
సరే. నీయింటిలో నీవు గూర్చుండి నీ సొమ్మును వ్యయపఱచు
కొని నీవు దినుచు నీవీయుద్ధమున నేమాత్రమును సాహాయ్య
మొసర్పక—వేఱుగ—రావణునితో మాట్లాడనైన నాడక—
యాతని మొగమైనఁ జూడక—ప్రత్యేకముగ—దూరముగ ని
స్సంబంధముగ—నుండలేకపోయితివా? ఎట్టిదుష్టసోదరుఁడైన
జ్యేష్ఠభ్రాత నింతకంటె నెక్కువగఁ బరాభవించునా? నీమహా
పకారకృత్య మెట్లున్నదో చూడు! నీవు పరులలోఁ గలసితివి క
దా! తనవారు విరోధు లైనచోఁబరు లాప్తు లగుదురా? పరు
లెప్పుడు పరులే కదా? నీకు బొట్టుకాటుక వెట్టి తనపక్షమునకు
రమ్మని నిన్ను రాముఁడు పేరంటమునకుఁ బిలిచెనా? బుడ
బుడ లాడుచు నేల పరపక్షమునకుఁబోయితివి?

విభీ—రాముఁ డేమి పేరంటమునకుఁ బిలిచెనా యని న న్నధిక్షేపించి
తివి. రాముని సర్వసద్గుణసముదాయము న న్నాతనిసన్నిధి కా

కర్షించినది. రావణుని సర్వదుర్గుణసమాజము నన్నిక్కడనుండి త్రోసివైచినది. భక్తుని చిత్తవృత్తి యైహికలంపటతనుండి మఱలి భగవత్పాదారవిందధ్యానమున లగ్నమగుటలో వింత యేమున్నది?

ఇంద్ర—క్రోఁతులతోఁ గొమ్ముసుద్దు లాడుకొనువాఁడు నీకంటికిగుణధురీణుఁ డయ్యెనా? ‘దేవియో, దేవియో, దేవుఁడో దేవుఁడో’ యని తెఱపిలేకుండ నో రెండఁగ దేవులాడు తెలివితేటలు లేని తెల్లమొగము నీకు దేవుఁడయ్యెనా? దేవుఁడే యైనయెడల దీపాలువెట్టుసరికిఁ బ్రక్కలో దేవియేల? దానిని దేవారి యెత్తుకొని పోయె నని యీయేడ్పులేల? ఈపెడబొబ్బ లేల? ఈనెత్తిఁ గొట్టుకొనుట లేల? ఈగుద్దులాట లేల? ఈకాటులాట లేల? ఈ దెబ్బలు దినుటలేల? ఈరాగాలాపము లేల? ఈయెదుటొమ్ము తాళము లేల? ఏదీ! మొన్న నేను నాగపాశబద్ధుని జేసినపు డీతఁడు తనదేవత్వము నగపఱచినాఁడు కాఁడేమి? మొఱ్ఱో! దేవుడో! కుయ్యో! జానకీ! అలోలక్ష్మణా! యనునాక్రందనములు దప్ప నంతకంటె నధిక మేమియుఁ గనపఱుపలేదేమి? ఉండిన దైవత్వమునుగనఁబఱుచుటకంతకంటె నధికావసర మేమి కలుగును?

లక్ష్మ—నోఱు మూసికో! భగవదపచారము సేయక నోరు మూసికో! చావునకు సమీపించి యున్నావు. ఇప్పుడైన శ్రీరామతారక నామము స్మరించి కృతార్థుఁడవు గమ్ము.

ఇంద్ర—ఓహో! మాయెదుటియూపరమోత్తమతేజస్సు భగవంతునికిఁ దమ్మన్నగారు కాఁబోలును! మాయింటిలోపల నేడ్చుచుండువ్యక్తి భగవంతునియెత్తుకొనిపోఁబడినయిల్లాలుగాఁబోలు! భగవంతునినోటికి నీళ్లుపోయుటకుఁ గుమాళ్లెవరైన నున్నారా? పాపము! పాపము! భగవంతునికి మామూలమున నె

న్ని పాటులు వచ్చినవి? ఓరీ! విభీషణా! ఓరీ! యధమాధమా! ఓరీ! వంశనిర్మూలనకారణా! ఓరీ. స్వపక్షనిందాపరాయణా! ఓరీ! పరశ్లాఘాప్రవీణా! ఏమంటివి? దుర్గుణభూయిష్ఠమైనరాక్షసమతమును ద్యజించి సద్గుణసమీచీన మానుషమత మవలంబించితివా? అబ్బ! అబ్బ! ఐహికలంపటత వదలి యాముష్మికలంపటతను జిక్కితివా? అధర్మమును వదలి ధర్మమును జేపట్టితివా? చీకటినుండి వెలుతురులోనికిఁ బోయితివా? మూర్ఖా! పశువా! నీవు చండాలుఁడవేకాని—నీమత మధమాధము మైనమతమే కాని—పరుఁ డుత్కృష్టుఁడేకాని—పరమత ముత్తమమైనదే కాని—నీవు నీమతమును విడిచిన నధోగతిపాలగుదువు కాని యుత్తమగతికేఁగఁ గలవా? కర్మచండాలుఁడు జాతిచండాలునికంటె నధముఁడు గాఁడా? నీకంటెదిక్కుమాలిన వాఁడు—నీతిమాలినవాఁడు—బుద్ధిలేనివాఁడు—కాపురుషుఁడు రాముఁడు నిన్నుదగ్గఱఁదీసినాఁడు. నిన్నుఁ గుక్కను గొట్టినట్లు కొట్టవలసినది. నిన్ను—నిన్ను—నిన్ను—

లక్ష్మ—జుట్టు చేతఁబట్టి యిట్టు లీడ్వవలసినది. కొబ్బరికాయను గొట్టినట్లు తల చిదుకఁ గొట్టవలసినది. రా! యుద్ధభూమికి రా!

(ఇంద్రజిత్తుతో నిష్క్రమించును.)

విభీ—లక్ష్మణా, నేనువచ్చుచున్నాను. (నిష్క్రమించును.)

దీ—మేఘనాదా! నేను వచ్చుచున్నాను. (పోఁబోవును.)

ఆంజ—ఉండవోయి! తోలుసంచీ! ఆగవోయి సాగుడుకాళ్లసన్యాసీ. నీవెవ్వఁడవు?

దీ—నేను రాజవైద్యుఁడను! రాజోద్యోగిని.

ఆంజ—నే నెవఁడనో చెప్పనా? నేను నీపాలిటియమదూతను.

దీ—అటులైన వైద్యుఁడనైననాకు పరమమిత్రుఁడవే.

ఆంజ—అలాగా? నీరాజవైద్యము మారణహోమమేనా? కాస్కో నాచేతియొక్క మాత్ర వేసికో. (గ్రుద్దఁబోవును.)

దీ—వజ్రంవజ్రేణభిద్యత, మ్మనునట్లు నేను వైద్యునిచేతనే కానిచావను.

ఆంజ—ద్రోణాద్రినుండి సంజీవనౌషధులను దెచ్చిననాకంటె వైద్యుఁడెవఁడు?

దీ—అలాగా! నాయనా! గ్రుద్దిన సరేగాని చచ్చినతరువాతను సంజీవకరణిరసము నానాలుకపైఁ గొంత తగులనిమ్ము. నీకడుపునఁ బుట్టెదను.

ఆంజ—మహాదరునిక్రొవ్వు దీపమున నీనాలుక తగులఁబెట్టుటకే నేను గోరుచున్నాను. పెండ్లియగునెడల నీవంటి నిర్భాగ్యులు పుట్టుదు రేమో యని బ్రహ్మచర్యాశ్రమమున నుంటిని రా! వైద్యాధమా!

(నేపథ్యమున) పోకు; పోకు! తులువా! పాఱుపోతా!

ఆంజ—ఇంద్రజిత్తు పరుగెత్తుకొని రోజుచుండ లక్ష్మణుఁడు వెన్నాడుచున్నాఁడు. సావకాశముగఁ జత్తువుకానిరమ్ము.

(ఆంజనేయుఁడు దీర్ఘకాయుఁడు నిష్క్రమించుచున్నారు.)

ఇంద్ర—(ప్రవేశించి)

గీ! రథ్యముల రూపుమాపె; సా ♦ రథినిఁ జంపె;
కేతువును గాల్చె; చాపంబు ♦ చేతినుండి
యెగరఁగొట్టె; తలకిరీట ♦ మిలఁ బడంగఁ
జేసె; నద్దిరా! సౌమిత్రి ♦ చేవ! యకట!

విభీ—సౌమిత్రీ! నికుంభిలావృక్షమువద్దకుఁ బోఁగూడదు! అడ్డుతగులుము.

ఇంద్ర—ఓరీ! విభీషణా! నిన్నుముక్కలుగ ఖండించినను బాపములేదురా!

తము రమ్ము. (లక్ష్మణుని జుట్టుపట్టుకొని లాగుకొని పోవఁగ నాంజనేయుఁడుప్రవేశించును.)

ఆంజ—దీర్ఘకాయునినాలుకఁ గోసి విడిచితిని. ఆహా! ఇంద్రజిల్లక్ష్మణుల కు విచిత్రయుద్ధ మగుచున్నది. ఒకరి నొకర రెగిరి తన్నుకొనుచు న్నారు. అస్త్రములఁ గొట్టుచున్నారు. ఎవఁడు లక్ష్మణుఁడో యెవఁ డింద్రజిత్తో తెలియనంతటిగాత్రలాఘవమునఁ బోరాడు చున్నారు. ఆహా!

(నేపథ్యమున) ఈదెబ్బతోఁ జచ్చితివి.

ఆంజ—ఆహా! ఇంద్రజిత్తు లక్ష్మణునివక్షమున భయంకరమగుగదతోఁ గొట్టినాఁడు.

(నేపథ్యమున) రామా! రామా! రామా!

(తిరిగి నేపథ్యమున) జయ! రాక్షసేశ్వరా! జయ! మేఘనాదా!

ఆంజ—ఆహా! లక్ష్మణుఁ డార్తుఁడై వచ్చుచున్నాఁడు.

(లక్ష్మణుఁడు ప్రవేశించును.)

ఆంజ—(కౌఁగిలించుకొని) కుమారా! కొంతసేపు సేద దీర్చుకొనుము. బాధ నపనయించుకొనుము.

లక్ష్మ—సేద దీర్చుకొనుటకు శ్రమ మెవరికి? బాధనపనయించుకొను టకు దెబ్బ యెవ్వరికిఁ దగిలినది?

(నేపథ్యమున) చంపఁబోయి చచ్చుచుంటివేమి? ఇఁక నొక్క దెబ్బకుఁజాలుదువు. రా!

లక్ష్మ—రే! ఇంద్రజిత్తా! దురాత్మా! వచ్చుచుంటిని. ఒక్కదెబ్బకేచా లుదు వనుమాట నిశ్చయము.

గీ. రాఘవుఁడు సత్యరతుఁడేని ♦ రాఘవుండు
ధర్మసంస్థాపనక్రియా ♦ దక్షుఁడేని

విజయరాఘవుఁ డప్రతి ♦ వీరుఁడేని
యీశరము రావణిని వధి ♦ యించుఁగాత!

(లక్ష్మణుఁడు నిష్క్రమించును.)

రాజ—తథాస్తు!

(నేపథ్యమున) జయరామచంద్రా! జయరామభద్రా! జయరాఘవేంద్రా! (పెద్దచప్పటులు, కేకలు.)

రాజ—ఆహా! ఇంద్రజిత్తు కాలధర్మము నొందినాఁడు. ఆహా! ఏమివిచిత్రము.

గీ. ఖండఖండంబులుగఁ గోసి ♦ కాకులకును
గ్రద్దల కెగరవై చెదఁ ♦ గా! యటంచు
లక్ష్మణుఁడు బీరములఁ బల్కి ♦ లావు చూపు
నప్పు డసురను గొట్టలేఁ ♦ డయ్యెఁగాని.

గీ. వీరరాముఁడు సత్యావ ♦ తారమేని,
యని యతని నెంచి తనబలం ♦ బును గణింప
కిట్టె యేసి చంపె; దురహం ♦ కృతిని నంత
వీడినను గాని దైవంబు ♦ తోడుపడునె?

(నేపథ్యమున) జయ! రామభద్రా! జయ! రామచంద్రా!

రాజ—అదేమి? ఓహో! అగ్నిరోమ, కరాళనేత్ర, జ్వాలాముఖ, విరూపాక్ష, దీర్ఘదంతాదిరాక్షసకోటులను జంపి శ్రీరామభద్రుఁడు వచ్చుచు విజయుఁ డగులక్ష్మణునిఁ జూచి మందహాసముఁ జేయుచున్నాఁడు.

(లక్ష్మణునిభుజముపైఁ జేవైచి రాముఁడు ప్రవేశించును.)

రాము—నాయనా! ఈదినమున దేవతలు మెచ్చఁదగినపనిఁ జేసితివి.

లక్ష్మ—తమయనుగ్రహమే చేసినది.

రాము—అసురయుద్ధములలో నింద్రజిద్యుద్ధమే ప్రబలతమ మైనది. ఇంక రావణుని గెల్చుట యవలీల. హా! సీతా! నీకొఱకు నీమఱఁది యెంతశ్రమ పడుచుండెనో చూడు.

(నేపథ్యమున) సీతమ్మ వచ్చుచున్నది. జయ! రామభద్రా! జయ! రామచంద్రా!

లక్ష్మ—అదేమి? వైదేహి వచ్చుచున్న దనుమాట వినఁబడిన దేమి?

ఆంజ—ఇంద్రజిద్వధమును వినిజయాశ వదలుకొని యమ్మవారిని రామమూర్తి కర్పించి ధన్యుఁ డగుటకు రావణుఁ డపేక్షించుచున్నాఁడేమో!

రాము—మారుతీ! నీయాలోచనము బాగుగనే యున్నది; కాని నే నది సరియనుకొనను.

(నేపథ్యమున) ఆఁవు. సవారి. ఆఁవు.

ఆంజ—ఎవ్వతెయో కాంత వచ్చుచున్నది. (సులోచన ప్రవేశించును.)

సులో—మహానుభావులారా! మీర లెవ్వరెవరో నే నెఱుఁగను. నా భర్త నింద్రజిత్తును జంపినమహావీరుఁ డెవరో యాతని దర్శింప వచ్చితిని.

ఆంజ—(తనలో) శాప మీయదుకద! వాగ్ధోరణినిఁ గోపచిహ్నములు లేవు. భయము లేదనుకొందును. (ప్రకాశము) అమ్మా! ఈతఁడే. శ్రీరామచంద్రసోదరుఁడు; సౌమిత్రి.

సులో—అయ్యా! రాఘవులారా! నమస్కారము. నాభర్తకళేబరమున కగ్నిసంస్కారమును జేసి సహగమనమును జేయుట నాకువిధి కావున నాభర్తకళేబరమును నా కిప్పించి కృతార్థురాలిని జేయుఁడు.

రాము—వత్సా! నీపతిభక్తికి నేను మిక్కిలి మెచ్చితిని. ప్రపంచమునఁ బతివ్రతకంటెఁ బూజ్యమైనవస్తువు మఱియొకటి లేదు. నీభర్త

కళేబరమును గాదు. నే నేపాటులఁ బడెదనో కాని—నీభర్త నే బ్రదికింపఁజేసి నీ కిచ్చెదను.

సులో—రాఘవేంద్రా! వలదు. వలదు. నన్ను క్షమింపుము. నాభర్త కుఁ దిరిగి యీమహానుభావునిచేతిలో మరణము తటస్థపడునా? దుర్లభ మైనయీమహాపుణ్య మాయనకుఁ దిరిగి కలుగునా? ఎప్పటికైనఁ జావవలసినవారలకు శీఘ్రముగ నెంతమంచిమరణము తటస్థింప నంతపుణ్యము.

రాము—సెబాస్! వత్సా! దేవతలు పుష్పవృష్టిం గురియింపఁదగినమాటలాడితివి.

ఆంజ—(తనలో) రాక్షసులయందైన నెంతజ్ఞాను లున్నారో! ఆహా! అమ్మా! ఋషులవలెఁ బరమవిరాగజ్ఞానసంపన్న వైననీకునమస్కారము. శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

(నమస్కరించును.)

రాము—వత్సా! నీయిష్టానుసారమే యిప్పించెదము పొమ్ము.

సులో—చిత్తము. (పోవును)

రాము—సుగ్రీవవిభీషణాదులఁ గలిసికొని కొంతవినోదముగఁ గాలక్షేపము సేయుదము. రండు.

(అందఱునిష్క్రమింతురు.)

(ఇదిపంచమాంకము.)

శ్రీ

# విజయరాఘవము.

షష్ఠాంకము.

[ప్రదేశము—యుద్ధరంగము.]

(ప్రవేశము—ద్విజిహ్వుఁడు.)

ద్వి—రూపమున, వర్ణమున, బుద్ధిని పంచుక్రోఁతి నగు నే నీ క్రోఁతులలో నిట్టె కలిసిపోయితిని! పైకి "రామ రామ" యనుచు లోన "రావణ రావణ" యనుచు నిదివఱకు నేడ్చితిని గాని యింద్రజిత్తు గూలినప్పటినుండియు రావణవిజయమును గూర్చినయాస తెగిపోయినది. రావణుని పైభక్తితో నుండిన వినియోగము లేదు. రామపక్షమువారు నన్ను నమ్మకున్నారు. మృగములలోను గాక పక్షులలోను గాక మధ్యమున నూఁగాడు గబ్బిలమ్ము వలెఁ గిచకిచ లాడుచున్నాను. మహోదరుఁడు చచ్చినను గడుపింకఁ గాలుచునే యున్నది. ఆంజనేయుఁడు దీర్ఘకాయుని నాలుకఁ గోసి విడువఁగ సుషేణుఁ డతనిసంచిలో దాఁచినపాషాణపు మాత్ర లాతనిచే బలాత్కారముగ మ్రింగించి చంపెను. లోకాపకారమైనతనవైద్యము తుదకుఁ దనకే యపకారమయ్యెను. మాముగ్గురిలో నిద్దఱు కడతేఱిరి. నే నుండియు నుండన ట్లున్నాను. నాపని యేమి కావలసి యున్నదో!

(నేపథ్యమున) ద్విజిహ్వా!

ద్వా—ఓహో! మర్కటేశ్వరా! ఇక్కడనున్నాను. (తనలో) ఈతఁడు నన్నుఁ గాఁపుగాయుటకై నియమింపఁబడినాఁడు. (క్రోఁతి ప్రవేశించును)

క్రో—కన్నుగప్పి పాఱిపోఁదలఁచితివా? నిన్ను వదలిన సుగ్రీవుఁడు నాతలఁ బగులఁ గొట్టును. రా!

ద్వా—అయ్యో! నే నెక్కడకుఁ బాఱిపోదును? చూడు! నాసంగతి రామునిమనసులో నేమైనఁ బడినదా?

క్రో—నీసంగతి యనఁగ—

ద్వా—ద్విజిహ్వుఁ డని—బహుచాకచక్యముగలవాఁ డని—లౌకికవైదికములం దసమానప్రజ్ఞ గలవాఁడని—అఘనికాశిష్టియానుశేయని—రాజమోహమును గలుఁగఁజేయువాక్యనిపుణత గలవాఁడని—సత్యసంధుఁ డని—రావణుఁడు దుష్టుఁ డగుటచే రామసాన్నిధ్యమునకు విభీషణునివలె వచ్చినాఁ డని—కోదండరామునిజయమునకై దేవునిఁ బ్రార్థించుచున్నాఁ డని—రావణుని యాయుస్థానము లెక్కిఁగి చెప్పఁగలవాఁ డని—ఇాతవాఁ డని—అవసరమునుబట్టి యింతకంటె నెక్కువవాఁడని—

క్రో—చీ! చీ! అట్లు ప్రేలకుము. నీసంగతి రామునకుఁ గావలయునా?

ద్వా—కోపపడకుము. నీవు దయ యుంచి నాసంగతులు రామునితోఁ జెప్పవలయును.

క్రో—ఇప్పు డీసంగతు లేల?

ద్వా—కొలఁదికాలములో యుద్ధపరిసమాప్తిని రామపట్టాభిషేకముజరుగును గాదా? ఆయుత్సవములలో దానధర్మములలో నాకేమైన దొఱుకఁగలదు. అదిగాక రాజతంత్రనిపుణతగల నాకేమైన నుద్యోగముగూడ దొఱుకును.

క్రో—రామపట్టాభిషేక మిక్కడ నగునా?

ద్వా—ఎక్కడనైన నక్కడకే వచ్చెదను. ధనము దోచుకునపుడు తా వుతోఁబనియేమి? దాత దోచుకునపుడు ధర్మాధర్మనిర్ణయ మేల? మనకుఁ గావలసినది సొమ్ము. శ్రీరామవివాహమునకు మిథిలాపురమునకు రావణునితో రావలయు నని యెంచితిని. కాని ప్రాప్తి లేకపోయినది.

క్రో—రావణమరణానంతరమున నిక్కడ విభీషణునకుఁ బట్టాభిషేక మగును గాదా? ఇక్కడనే నీకు లాభింపరాదా?

ద్వా—ముందిక్కడ నాలాభమును బొందినపిదప నే నక్కడకు వత్తును.

క్రో—ఓరీ నిర్భాగ్యుఁడా! ఇక్కడ నక్కడఁ గూడ నపహరింతువా?

ద్వా—మానుమనా? లౌకిక మనఁగ నేమనుకొంటివి? వట్టిమోసము—కనుకట్టు—ఇంద్రజాలము—వేశ్యావృత్తి—పైమెఱుఁగు—బూటకము—రాజులను జేబులో దాఁచుకొనుట—స్తుతివాక్యములు—అమితనైచ్యాను సంధానము—రానిరోదనము—లేనిప్రేమము—ధనహరణము—మొగముచాటునఁ దిట్లు—సదసద్వివేచనాశూన్యత—అందిన జుట్టు—అందక పోయినఁ గాళ్లు—(నేపథ్యమున)

గీ. జుట్టు నొకచేతఁ గాళ్లను ♦ గట్టి యొక్క—
చేతఁ బట్టి మోకాలికి ♦ నాతని నడు
మాన్చి విఱిచి పావని విరూ ♦ పాక్షుఁ జంపె
చెఱకుకట్టను విఱిచిన ♦ కరణి గాఁగ.

క్రో—విరూపాక్షుఁ డెవఁడు?

ద్వా—రావణసేనానాయకులలో నొకఁడు. ఇందువలన రావణుఁడు యుద్ధ మారంభించినట్లు తోఁచుచున్నది.

క్రో—ఆరంభించి నాలుగుగడియ లైనది. క్రోఁతులకలకలము గనిపెట్టలేకపోయితివా?

ద్వి.—మీదిక్కుమాలినకలకలము సర్వదా. వినుటకే నాకు [illegible] భవించిన ట్లున్నది.

(నేపథ్యమున) బాధిర్యమా? పరాకా? పొగరా? [illegible] నాఁగవేమి?

క్రో.—అహుగో! రావణుఁడు విభీషణుని వెంటాడించుచున్నాఁడు. [illegible] ము పోవుదము. (నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.



ప్రదేశము—యుద్ధరంగము.

(ప్రవేశము—విభీషణుఁడు పాఱిపోవుచుండఁగ రావణుఁడు.)

రావ—అరే! బాధిర్యమా! పరాకా! పొగరా! [illegible] నాఁగవేమి?

విభీ—నేను జెప్పినమాటను నీవు వింటివా? సీత నిమ్మన్న [illegible] యుద్ధము వలదన్న మానితివా? నీమాట నేనేల [illegible]

రావ—ఆలాగఁటరా? మూర్ఖా! నీరహస్యము మే మెఱుఁగ [illegible] మని మారహస్యములన్నియు నీప్రజలకుఁ [illegible] డుకును నేను ఖండించితినని యేనా నీవు నాకొ [illegible]

విభీ—నీపుత్త్రుని నీవే చంపుకొంటివి?

రావ—నేనే చంపుకొంటి నఁటరా! పాపీ! కులద్రోహీ! [illegible] మ్మునిఁగూడ నేనే చంపుకొందును. [illegible] గాల్పించితివా? నాకొంపఁ గూల్చితివా? [illegible] వా? నావంశము దగ్ధము సేసితివా? [illegible]

నన్నింత యల్లరి చేసితివా? నన్నింతక్షోభ పెట్టితివా? నాగొం తుకలు అంపపుగోతను గోసితివా? కులద్రోహీ! చండాలుడా! వంశనాశనా! అధమాధమా! విశ్వాసఘాతుకా! (తన్నును)

విభీ—ఇవియన్నియు నీవు. ఈపను లన్నియు నీవే చేసికొంటివి. నీదుష్ట తను దూఱుకొని తలఁ గొట్టుకొనక నన్నుఁ గొట్టెదేల?

రావ—ఏలా? ఏలయో యెఱుఁగవా? శుంఠా! శత్రుప్రియా! కృత ఘ్నా! తండ్రి చచ్చినతరువాత నిన్నుఁబెంచి పెద్దవానిని జేసినం దులకా నాకీప్రతిఫలము? నిన్నుఁ జిన్నతనముననే నీరీతిగ గొంతు గోసినయెడల నా కీయపకృతిని జేసియుండవుకదా?

(కత్తి దూసి యెత్తుచున్నాఁడు.)

విభీ—రామా! రామా! రామా!

రావ—రాక్షసాధమా! రామా కాదు శివా యనుము.

విభీ—హా! లక్ష్మణాగ్రజా! (లక్ష్మణుఁడు ప్రవేశించును.)

లక్ష్మ—రాముఁ డైననేమి? రామానుజుఁ డైననేమి? వచ్చితిని. ఛీ! ఛీ! రావణాధమా! అన్నిపాపములు కుత్తుకమునుగఁ బూర్తియైన వా? ఇంకఁ దమ్మునిఁ జేతులారఁ జంపుపాపము లోటున్నదని యది పూర్తి చేసికొన నుంటివా? విడు. విడు.

రావ—ఇరువదిబాహువులవాఁడను. ఆతని విడువకుండ నిన్ను గ్రహిం పలేనా? (మఱియొకచేతితో లక్ష్మణునిఁజుట్టుపట్టుకొనును.) రెండు చేతులతో రెండుపేకజువ్వలనువలె మీమొగములఁ దగులఁబెట్టి యాతరికమున కెగరవైతును.

(నేపథ్యమున)

గీ. గోటికొనలను రెండుకా ♦ కోదరములఁ
బట్టిగుఱుడుండు రివ్వనఁ ♦ బైకిఁ బోవు

నట్లు రామానుజుని తన ♦ యనుజు నిపుడు
పట్టి దశకంధరుఁడు మిన్ను ♦ ముట్టెనహహా!

రావ—సెబాస్! రాక్షసవీరా! బాగుగఁ జెప్పితివి. కాని నేనప్పుడే మిన్నుముట్టితి నని చెప్పితివేమి? నీవు నాతమ్ముఁడవు. నీవు రాముని తమ్ముఁడవు. నీవు కీలుసూప నీవు నాపుత్త్రుని వధించితివి. నాపుత్త్రునిమరణమున మీ రొకనికొకఁడు దోడ్పడిరి. మీమగణమునఁ గూడ మీరొకనికొకఁడు దోడ్పడుట మంచిది. ఈతల దీనికి నీతల దీనికిఁ దాఁకించి జుట్లు చేతఁ గొని రెండుకొబ్బరికాయలను గొట్టినట్లు కొట్టెదను.

లక్ష్మ—నీవు కొట్టువాఁడవు నేను గొట్టఁబడువాఁడనా? (వదలిపించుకొని రావణునొక్క (త్రోపుద్రోసి) విడు! విభీషణుని విడు! (విభీషణుని విడిపించును.) విభీషణా! నీవాప్రక్కను వివిధాయుధసహితుండవై యుండుము. నేనీరాక్షసపశువునీకోలచేనావంకకుఁ దోలుదును. (విభీషణుఁడు పోవును.)

రావ—ఓరీ! దుర్మార్గుఁడా! నీవు విడిపించుకొని నన్నుఁ గొట్టి విభీషణుని విడిపించితివా? సెబాస్! గట్టివాఁడవు.

లక్ష్మ—రామభద్రుఁడు మఱింతగట్టివాఁడు. నేను నిన్నుఁ గొట్టి విభీషణునేవిడిపించితిని గాని రాముఁడు నిన్నుఁ జంపి సీతనువిడిపించును. దేవతలచెఱ విడిపించును. లోకము నుపద్రవమునుండి విడిపించును. మందోదరిమంగళసూత్రగ్రంథిని విడిపించును. విభీషణునిచే నీకుఁ దర్పణములు విడిపించును.

రావ—ఇంక? ఈదెబ్బతో—నీచేతికత్తిని విడిపించును. నీకంటనీరు విడిపించును. నీదేహమునుండియాత్మనువిడిపించును. (కొట్టును. జుట్టు పట్టుకొనును) ఆఁ! ఆఁ! తుట్టతుదకు—నాకు—విభీషణుఁడే!—

ఈదొంగ నిర్భాగ్యుఁడే!—ఈభ్రాతృఘాతకుఁడే—ఈవంశవీతి హోత్రుఁడే—నాకుఁదర్పణము లిచ్చుట! ఆఁ! ఆఁ! ఈయ ధమాధముని—అసురవంశమున కపకీర్తి తెచ్చిన—ఈమహాప రాధుని—జంపినఁగాని నేను జత్తునా? రే! విభీషణా! వచ్చుచుం టిని. జాగ్రత్త! ఎక్కడనుంటివిరా? ఏఁడీ? ఏఁడీ?

(నేపథ్యమున) ఇక్కడ—ఇక్కడ—

లక్ష్మ—అదిగో! అంగదుఁడొకరక్కసుని గొట్టుచు వచ్చుచున్నాఁడు.

(రామలక్ష్మణులు నిష్క్రమింతురు.)

(అంగదుఁడు కాకాక్షుని రెండుచేతులతో లాగుచుఁ బ్రవేశించును.)

అంగ—ఏమంటివి?

కా—విడువు మంటిని.

అంగ—ఇఁక విడుచుట యమలోకముననే. ఆమాటకాదు. నీవెవనికొ డుకనని యంటివి?

కా—రావణుని—

అంగ—నిజముగా నీవు రావణునికొడుకవేనా?

కా—ఆసంగతి నేనెట్లు చెప్పఁగలను? నీవు వాలిపుత్త్రుఁడవని నీవు ప్ర మాణమునఁ జెప్పఁగలవా?

అంగ—(తన్నుచు) ఆసంగతి నేనెట్లు చెప్పఁగల నని యందు వేమి? నీ కుఁ దెలియదా? లోకమునకుఁ దెలియుచుండుట లేదా? రావ ణునకుఁ బుట్టినవాఁడవైన నీ వింతపిఱికిపంద వెందులకగుదువు?

కా—ఎందులకా? నీచేతఁ దన్నులు దినుటకు—

అంగ—అలాగున ముద్దుమాట లాడెదవేల? నోటిలో నేమైన నున్నదా?

కా—లేదా?

అంగ—ఏది?

కా—నాలుక—

అంగ—ఒక్కనాలుకమాత్రమేనా? పండ్లు లేవా?

కా—ఇన్నిపండ్లు లేవు. నాకున్న దొక్కటే.

అంగ—ఏదది?

కా—తలపండు.

అంగ—కాయ పక్వతకు వచ్చి పండైనదా? ఇఁక గోతఁబెట్టుటయేనా తర్వాతపని?

కా—మేము శివభక్తుల మైనను మమ్ములఁ గోతఁ బెట్టరు. దహింతురు.

అంగ—శివభక్తి వదలి రామభక్తి నవలంబింతువా? నిన్నుఁ జంపను.

కా—శివశివా! అన్యస్మరణము తప్పు కాదా?

అంగ—అటు లనకుము. రామరామరామా యనుము.

(నేపథ్యమున) రామా! రామా! రామా!

అంగ—అదిగో! విభీషణుఁడు రామస్మరణము సేయుచుఁ బలాయన మగుచు నిట్టులే వచ్చుచున్నాఁడు.

(నేపథ్యమున) మూర్ఖా! ఎచ్చటకు బాఱిపోయెదవు? భూమివిడిచి పోఁగలవా? తిరుగు; తిరుగు!

(విభీషణుఁడు ప్రవేశించును.)

విభీ—అయ్యయ్యో! లోకభయంకర మైనమహాస్త్రమును విడుచుచున్నాఁడు. అయ్యయ్యో! రామా! రామా! రామా! రక్షించువా రెవ్వరు? రామా! రామా! రామా! రామానుజా! రామానుజా!

(లక్ష్మణుఁడు ప్రవేశించును.)

లక్ష్మ—రామదాసుఁడ నైన నేనుండ రక్షించువా రెవ్వ రనియెద వేమి?

(నేపథ్యమున) రామదాసత్వము తిరుమణికాపునకు, తులసిపూసలపేరులకు, శంఖచక్రధారణమునకు, ఫలాహారకైంకర్యముల

కే కాని ప్రాణాపహరణచణ మైనబాణమును సహించుట కక్క అకు వచ్చునా?

లక్ష్మ—మూఢా! అక్కఅకు వచ్చునో రాదో చూతుము గాదా?

(తిరిగి నేపథ్యమున) తరువాతఁ జూచునది వెఱ్ఱిచూపు. గాజుచూపు. నేనుజెప్పుచున్నాను. ఇదిమయనిర్మిత మైనమహాశక్తి. నీవు నాకుశత్రునితమ్ముఁడ వైయుంటచేతను నాపుత్త్రుని జంపుటచేత నెంతశత్రుఁడ వైనను నాతమ్మునికంటె నెక్కువశత్రుఁడవు కావు. ఆతనిఁ జంపుటకు విడుచుచున్నాను. నీకేమిపని? నీవు త్తొ గిలుము.

లక్ష్మ—హా. హా. హా. ఎంతమాటాడితివి! రఘువంశమునఁ బుట్టి శ్రీ రామునితమ్ముఁడ నైననేను శరణాగతరక్షణ ముపేక్షింతునా? నాప్రాణములు నిలియుండఁగ నీతమ్మునిశిరఃకిరీటాగ్రమున నుండుకొంగయీఁకనైన నిన్ను స్పృశింపనిత్తునా? నీతమ్ముఁ డను మాట యేమి? నీవె యిట్లు శరణ మనిననాజీవముల ధారవ్రోసి నిన్ను రక్షింపనా?

(నేపథ్యమున) మూఁతి యింత. ప్రమోఁత యెంత? కానీ. నీకర్మ మిట్లుండ నెవఁడు తప్పింపఁ గలఁడు?

లక్ష్మ—పో. పో. మూసికొనవలసినది నోరు. విడువవలసినది బాణము.

(నేపథ్యమున) విడువవలసినది ప్రాణము! కాచికొండు. హా. హా. హా. హా. హా. (పెద్దమంటలు, ధ్వను లగును.)

లక్ష్మ—విభీషణా! నీ కేమియు భయము లేదు.

విభీ—మీరు సాహసింపవలదు.

(నేపథ్యమున) ఇదిగో! విడిచితిని.

లక్ష్మ—ఇదిగో! వచ్చితిని. హా! హా! (నేలవ్రాలును.)

(నేపథ్యమున) విభీషణా! ఇప్పటివఱకు కాయువ్మంతుఁడవు. కానీ నిన్నుఁ జంపకుండ నేఁ జావను.

అంగ—విభీషణా! మహాప్రమాదము సంభవించెను. నేను లక్ష్మణుని యొద్ద వేచి యుందును.

విభీ—అయ్యయ్యో! లక్ష్మణునికి నామూలమున నెంతయాపత్తు సిద్ధించినది! అయ్యయ్యో! ఏమిసేయుదును!

అంగ—ముందీ కాకాక్షునిఁజంపుము. తరువాత జరుగవలసినది చూతము.

విభీ—ఊరక చంపుట కాదు. మూర్ఛాగతుఁ డగులక్ష్మణుని ప్రాణసంరక్షణార్థ మీతనిబలియిచ్చిన నుభయతారక మగును.

అంగ—అటులైన ,రామ రామ రామా, యనిలక్ష్మణుని చుట్టుఁ బ్రదక్షిణము చేయించుము.

విభీ—కానీ.

కాకా—రామ! రామరామా! (ఏడ్చుచుఁబ్రదక్షిణము చేయును.)

అంగ—కాకాక్షుఁడు రావణునికొడుకు నని చెప్పినాఁడేమి? నీవెఱుఁగుదువా?

విభీ—నాకుఁదెలియదు. వేలకొలఁదిభార్యలున్నవానికిఁ గొడుకునకు గుర్తేమి? రా! కాకాక్షా! (తీసికొనిపోవుచు) అంగదా! రామునితో నీదుర్వార్త చెప్పవలయును గాదా? ఆతఁడెచ్చట నున్నాఁడో నీకుఁ దెలియునా?

అంగ—నేను వచ్చునరికి దక్షిణద్వారమున నొక్కొక్కగడియలో నొక్కొక్కయక్షౌహిణిని జంపుప్రతిజ్ఞఁ జేసి విల్లు, బాణము, ఆకారము చలన మేమియుఁ గనఁబడకుండ సర్వ మొక్కచేజ్వాలామయముగఁ జేసి పోరాడుచున్నాఁడు. అక్కడకుఁ బొమ్ము.

విభీ—సరే! ఆంజనేయుఁడెచ్చట?

అంగ—పశ్చిమద్వారమునొద్ద భూకంపము గలుగునట్లు రక్కసులమూకలను ద్రొక్కుచున్నాఁడు.

విభీ—నేను బోయి రామమారుతులను దీసికొని వచ్చెదను.

అంగ—శీఘ్రముగ—

(విభీషణకాకాత్ములు నిష్క్రమింతురు.)

అంగ—హా! లక్ష్మణకుమారా! ఎంతబాహుశాలికి—ఎంతధనుర్విద్యా కుశలునకు—ఎంతయసహాయశూరునకు—ఈగతి పట్టినది! హా! లక్ష్మణా! సుమిత్రానందవర్ధనా! భరతానుజా! రామపాదభక్తతత్పరా! సుగుణగరిష్ఠా! గురువిధేయా! హా! లక్ష్మణా! (ఏడ్చును)

(నేపథ్యమున) హా! లక్ష్మణా! హా! తండ్రీ! ఎక్కడ నుంటివోయి!

అంగ—రామమారుతివిభీషణులు వచ్చుచున్నారు.

(రాముఁడు, ఆంజనేయుఁడు, విభీషణుఁడు ప్రవేశించును.)

రాము—హా! లక్ష్మణా! హా! తండ్రీ! ఎక్కడ నుంటివోయి నాయనా! (ఏడ్చును.)

(నేపథ్యమున) లక్ష్మణుఁ డెక్కడ నుండెనో తెలియదా? నాచే నూర్ధ్వలోకములకుఁ బంపఁబడినాఁడు. అది లక్ష్మణకళేబరము. లక్ష్మణునియం దనురాగము గలవాఁడ వైనయెడల నక్కడ నేడ్చెద వేమి? ఇచ్చటికి రా! లక్ష్మణునిబంపినతావునకుఁ బంపెదను.

రాము—(తలయెత్తి) ఆపలికినవాఁడు రావణుఁడే కాఁడా?

ఆంజ—చిత్తము.

రాము—హాహా! తమ్ముఁడా! (కౌఁగిలించుకొని) తమ్ముఁడా! నన్ను విడిచి యెక్కడ కేగితివా? నాయనా!

(నేపథ్యమున) ఆలోపము నేఁదీర్చెదను. ఇటురమ్ము. ఆఁ! రమ్మన్న రావేమి?

రాము—(రావణునుద్దేశించి)

గీ. తరుణమాంసలగాత్రుఁడౌ ♦ తమ్ముఁ డిట్లు
నేలపై నుండె నెఱులిడా ♦ ధూర్త! కొంత

తుడిచి విడినిల్వు(గుడ్డులు ♦ వడిచకనుల
మూసి నోటనుజాతెడు ♦ బుఱుగు తుడిచి.

గీ. తలను మెల్లఁగ నాయంక ♦ తలమునందుఁ
జేర్చుకొని చేతితో నుర ♦ స్సీమ నిమిరి
మోముమోముఁగలిపి, యొక్క ♦ మూల్గు మూల్గి
వత్తు; నివు డొక్కక్షణ మాఁగ ♦ వా? సురారి!

(నేపథ్యమున)

'ఆఁగవా? ఆఁగవా?, యని నన్నుఁ బ్రార్థించుచుంటివా?

గీ. మడిని ధరియించి బాణముల్ ♦ విడిచియొక్క
పరిని వేర్చివచ్చెద నన్న ♦ వదల కడ్డు
దగిలి చంపు చంపని చుట్టు ♦ మొగిసి మెదల
కుండ నింద్రజిత్తుని జంపి ♦ యుండ లేదొ?

గీ. ఇట్టిపిరులు మీారు కా ♦ రే? మహాద
యార్ద్రచిత్తులు కారే? య ♦ హా! ఇదేల?
నీదుతమ్ముఁబోలెడువాఁడు ♦ నాదుసుతుఁడు
కాఁడె? యూఁగు మనుటకు నో ♦ రాడె నెట్లు?

గీ. కొడుకుచితి పూర్తిగా నంటు ♦ కొనకయుండఁ
గనె యిటకు నేను రా లేదొ? ♦ కాంతలాగు
కాళులను చాచి కూనుదీ ♦ ర్ఘములఁ బెట్టి
తినె? సరి; సరి! చాలించు. లే ♦ తెలివి లేదొ?

అంగ——మహాప్రభూ! నన్నుఁ బంపుము. నే నీరావణాధముని హరించి వత్తును.

రాము——అంగదా! నాయందలినిష్కేతుకకరుణచే నీ వట్టులంటివి.

గీ. నా కరణ్యావాసము వచ్చి ♦ నదని తా స
హింపలేక వెంటఁబడి శ్రీ ♦ మంపడి తుద

కీర్తు నాకొఱ కనుపు ల ♦ ర్పించి నట్టి
పుణ్యరాశియుఁ గరుణాస ♦ ముద్రుఁ డితఁడు.

గీ. ఇతని బాధించుఖలుని శి ♦ క్షించుటందు
నొడలు దాఁచుకొమ్మంటివో? ♦ యొరుల వేఁడి
పంచి కూలినిబెట్టి చం ♦ పించుమంటి
వో? యితని గనియైన సి ♦ గ్గూనవలదె?

ఎవ్వరు వలదు. నేనే పోవుదును. అంగదా! ఆంజనేయా! మీరు నాతమ్ముని భద్రముగఁ గనిపెట్టి యుండవలయును. నేను బోయెదను. ఆంజనేయా! చూచితివా? రాజవృత్తివైఖరి.

గీ. చంపుకొన్నవారికి బాష్ప ♦ సలిలబిందు
వొక్కటైనను జాఱనీ ♦ కుండ మనసు
మొండిచేసికొని సమర ♦ మునకుఁ బోక
తప్ప దేగుటకును జిత్త ♦ మొప్ప దకట!

ఆ. వె. ఒక్కకంట నంబు ♦ వొకకంట నగ్నియు
నొక్కచేతఁ గుశయు ♦ నొకటఁ గశయు
నొక్కచేతఁ గొఱవి ♦ యొకచేతఁ గోలయు
నొక్కకాలు ముందు ♦ నొకటి వెనుక.

ఆ. వె. ఒక్కవంక నూరు ♦ పొకవంక నుత్సాహ
మట్టె యేడు పట్ట ♦ హాస మొకట
నపరమంత్రనాద ♦ మగు నొక్కచెవి నల్లె
త్రాటిరావ మొక్క ♦ దానియందు.

ఆ. వె. అక్కట! యపసవ్య ♦ మందు జన్నిదమును
పేరురీతిగాఁగ ♦ విజయమాల

వాత నొక్కముద్ద ♦ బంధుర క్తపుఁగూడో
కట పరాస్త్రమిశ్ర ♦ కబళ మహహా!

ఆంజ—మహాప్రభూ! ఒక్కక్షత్రియవృత్తియే కాదు. నరునిమోహింపజే వనవృత్తివైఖరియే సమస్తాసందర్భసమన్విత మైయున్నది.

(నేపథ్యమున)

ఓమహా వేదాంతులారా! ఓయవసరజ్ఞానులారా! అట్టియసందర్భాన్విత మగునసువులను విడుచుట కింతయాలోచన మేల? ఈ వెనుకాడు టేల? శౌర్య మొకటియు జ్ఞాన మొకటియుఁ బలుకులలోఁ గనుపడుపఁ దగునా?

రాము—(లేచి) పలుకులలోనే కాదు. ములుకులలోఁ గనఁబడును. ఇదిగో!—వచ్చితిని. (నిష్క్రమించును.)

అంగ—ఆంజనేయా! చూడు. రామరావణు లెట్లు తలఁపడి పోరుచున్నారో!

ఆంజ—సెబాస్! రామచంద్రా! ఒక్కతూపుతో సారథి నశ్వములను రథమును దుమురు సేసితివి.

అంగ—ఆహాహా! అదేమి? అదేమి! ఒక్కటేజ్వాల! పుట్టెలు, మొండెములు, కత్తులు, గునపములు, గొడ్డళ్లు, ఇనుపగుండ్లు, మొదలగునవి సహస్రములకొలంది యెట్టగఁ గాలి యట్టెయుప్పరమున కెగసి రామభద్రునివైపునకు వచ్చుచున్నవి.

ఆంజ—ఇది రావణునిశత్రుంజయాస్త్రము. సెబాస్! రామభద్రా! సెబాస్! రామచంద్రా!

గీ. రాక్షసప్రచండాస్త్రభై ♦ రవకృశాను
తప్తమారకసంభార ♦ తతియు నంత
పువ్వులై రామునెడలికి ♦ భూష లయ్యె
దుర్గుణుని యపకృతి మహా ♦ త్మునకు నిటులో!

అంగ—జయ రామచంద్రా! జయ రాఘవేంద్రా! పుష్పరథమువలె శోభించుచుంటివి. ఆంజనేయా! మహాస్త్రము వ్యర్థ మగుటయే కాక రాఘవాలంకార మగుటచేఁ గాఁబోలు! రావణుఁ డెట్లున్నాఁడో!

గీ. డిల్లపడి, కొయ్యయై, యట్టె ♦ నోళ్లు తెఱచి,
కత్తి వ్రేటునకైన ర ♦ క్తంపుఁజుక్క
గానఁబడకుండ సేకుము ♦ క్కవలె నయి, న
రములపట్టాడి, యధికవి ♦ భ్రాంతి నొందె.

అదిగో! రామభద్రుఁడేదో బాణమును సంధించుచున్నాఁడు.
(నేపథ్యమున) హా. హా. హా. హా. హా.

ఆంజ—చూచితివా? రామచంద్రుని బాణసంధానము గుణాకర్షణము, లక్ష్యదర్శనము, రావణవక్షః పరితాడనము, రక్తపవనభీభత్సరావణపలాయనము నొక్క తెప్పపాటుకంటెఁ దక్కువకాలములో నైనవి.

అంగ—రామచంద్రుని పునరాగమన మని కూడఁ జెప్పుము.

(రాముఁడు ప్రవేశించును.)

రాము—హా! తమ్ముఁడా! (కౌఁగిలించుకొని)

గీ. గట్టిగా నిన్నుఁ గౌఁగిటఁ ♦ బట్టి లక్ష్మ
ణా! సుమిత్రాత్మజా! తమ్ముఁ ♦ డా! యటంచు
నొక్కపరిని గొంతెత్తి మొ ♦ ఱ్ఱో! యనుటకు
నైన నోఁచను మందభా ♦ గ్యమునఁ గట్టు!

(నేపథ్యమున) రామప్రభూ! విచారింపఁ దగదు శాంతింపుము.

ఆంజ—మహాప్రభూ! సుగ్రీవుఁడు వచ్చున్నాఁడు.

(సుగ్రీవుఁడు ప్రవేశించును.)

రాము—

గీ. హస్తపంచశతంబున ♦ నయిదుమాఱు
లాశుగములు విడిచెనఁట ♦ యర్జునుండు

హా స్త మొకటనె యొకపరి ♦ నతనిరీతి
నాశుగముల విడుచు తమ్ముఁ ♦ డకట! ఇడుగో!

సుగ్రీ—అయ్యా! మఱేమియుఁ దొందర లేదు. ఆంజనేయునిచే సంజీవక రణిని దెప్పించి లక్ష్మణు నుజ్జీవింపఁజేయు మని సుషేణుఁడు చెప్పెను. అందులకై యీతనికి సెలవిచ్చి పంపించవలయును.

రాము—నిర్హేతుక కటాక్షపరిపూర్ణుఁ డగుమారుతి కొకరు చెప్పవల యునా?

ఆంజ—మహాప్రభూ! నమస్కారము, (పోవును.)

రాము—

సీ. పదునాలు గేఁడులు ♦ వనవాస మొనరింపు
మని తండ్రియాజ్ఞ సే ♦ యంగ వెడలి
వచ్చుటచేఁ బితృ ♦ వాక్యపాలకుఁ డని
సత్యశీలుం డని ♦ జగమునన్నుఁ
గొనియాడునఁట! తండ్రి ♦ వనికిఁ బొమ్మన లేదు;
నేను రమ్మన లేదు; ♦ నీవు వలద
టన్నను వినక నా ♦ కడవిలో నుపచార
ములు సేయవచ్చి మ ♦ మ్ములసుఖంబు

గీ. పాలుచేయుచుఁ దా నేల ♦ పాలయిన మ
హాత్ముఁ డీతనికంటె ముం ♦ దరిగి తీవు
తండ్రి! నాదినంబు లటులు ♦ తరలవయ్యె;
నిట్టితమ్ముఁడు కడ తేఱ ♦ నింకనుంటి.

హా! తమ్ముఁడా!

గీ. ఇందులకు వచ్చినాఁడవే ♦ యిటకు నీవు
వెంట నాకర్షణము సేసి ♦ విడువ కడవి

కిట్లు లేడ్చినసీపాలి ♦ మృత్యుదేవ
త నగుదును గాని సీదుసో ♦ దరుఁడఁ గాను.

గీ. కన్నతల్లిని బాసి, సౌ ♦ ఖ్యమును రోసి,
సతిని విరహిణిఁ జేసి, రా ♦ జ్యంబు వీడి,
మమ్ముఁ దలిదండ్రులుగ నెంచి ♦ మాకు మధుర
వన్యఫలముల నర్పించి, ♦ వారి నిచ్చి.

గీ. కఠినకాననముల; సిత ♦ కంటకముల
నూడ్చి దారులు చేసి క ♦ ష్టోర్వియందు
నడుగులకు మడుగు లిడి ధై ♦ ర్యంబు సెప్పి
కాలయాపనమున కిద్ధ ♦ కథలు సెప్పి.

గీ. రవి యపరగిరిఁ జేరెడు ♦ నవసరమున
చెట్లనీడల మముఁ జేర్చి ♦ చెంతనుండు
లలితతృణపల్లవముల శ ♦ య్యలనొనర్చి
గమనకష్టంబు దీఱ మా ♦ కాళ్లు లొత్తి.

గీ. ఏము నిద్రించువెనుక మా ♦ కేది హాని
యగునొ యని ధనుర్ధరుఁడగు ♦ చు గతనిద్రుఁ
డగుచు శ్రీరామ! రాఘవా! ♦ యనుచు మెల్ల
ననుకొనుచుఁ దాఁ బ్రదక్షిణ ♦ మాచరించి.

గీ. కాఱడవినైన రాజసౌ ♦ ఖ్యప్రకల్ప
నంబుఁ గావించి విపినక ♦ ష్టంబు లెవరి
కో యని తలఁచునట్లు మ ♦ మ్మోమినాఁడ
వేడిచిన నైన నిపుడు మా ♦ టాడ వేల?

గీ. వనమునను రాముఁ డెన్నొ యా ♦ పదల నొందె
ననుచు భావికవీశ్వరు ♦ లతిశయోక్తి

పలుకువా రేమొ? బహుకష్ట ♦ భారమంత
యీమహాత్ముని దగును మా ♦ కేమి లేదు.

గీ. ఉంటివో? తింటివో? నిద్ర ♦ నొందినావొ?
చేతులకు ముంకులు దిగెను ♦ చెప్పు తండ్రి!
యనుచు నొక్కమాటైన ని ♦ న్నాడి యెఱుఁగ
దుష్టచిత్తుని ననుఁ బాసి ♦ తొలఁగినావె?

సుగ్రీ—మహాప్రభూ! మీ రెఱుఁగని దేమున్నది? పదునాలుగు సంవత్సరములు నిద్రాహారములు లేనివాఁడు కాని యింద్రజిత్తుని జంపఁజాలఁడు. కావునలక్ష్మణుఁ డట్టియనశననిద్రాదీక్షను వహించినాఁడు. ఊరక విచారింతు రేల?

రామ—శేషమూర్తివలెఁ బవనభారణ మాత్రమొనర్చి నాప్రతిజ్ఞఁ జెల్లింపఁ దలఁచితివా? తండ్రీ!

గీ. వయసునకుఁ దమ్ముఁడవు కాని ♦ బాహుపటిమ
నన్న వీవౌదువయ్యా మ ♦ హాత్మ! నాకు
నేను వధియింపఁజాలని ♦ యింద్రజిత్తుఁ
దీక్ష్ణమాయావి నిట్టె వ ♦ ధించినావు.

(నేపథ్యమున) హె. హె. హె. ఇఁక నీవు వధింపఁజాలినవాఁ డెవఁడు? రావణుఁడా! ఇదిగో! కానీ. నీ కేమైనఁ దెలివి గలదా?

గీ. లక్ష్మణుండె నీకంటె న ♦ లఘుబలుఁడని
పలికితివి గాదె? లక్ష్మణ ♦ స్వామి నిట్టె
మిత్తికి నధీను జేసిన ♦ మేటి నేను
నిన్ను వధియింప లేనని ♦ యెన్న నగునె?

సుగ్రీ—ఆఁ! ఆఁ! దానవాధమా! నిన్నుఁ జంపుటకు రాఘవుఁ డేల? నేను జాలనా? ఇదిగో! వచ్చుచుంటిని.

రామ—(లేచి, సుగ్రీవునిచేయిఁ బట్టికొని) మిత్రమా! నీవచ్చుట నగుము. నేను బోయెదను. (తనలో) ఆహా! తిరిగి సౌమిత్రిని ఎ

డిచివెళ్లవలయును గాఁబోలు! ఈసారి యీతనివలన నీబాధ లేకుండఁ జేసికొనవలయును.

(నేపథ్యమున) ఓహో! క్రోఁతిరాజుగారు మొఱుగుడుకుక్కవలెఁ దోఁక ముడిచినా రేమి? చింతకాయఁ దిన్నట్లు పండ్లిగిలించుచున్నా రేమి?

రాము—సుగ్రీవా! తమ్ముఁడు భద్రమునుమా! దశకంఠా! పాఱిపోయితి వని యుపేక్షించితిని. క్షమింపుము. ఇదిగో! వచ్చుచుంటిని.

(నేపథ్యమున) వెనుకకుఁ బోయినసముద్రము మఱింత పొంగునని యెఱుంగవా?

రాము—ఆలాగా! అటులైన వార్ధిబంధనుఁడు గంధర్వాస్త్రమోక్షణమునకై వచ్చుచున్నాఁడు. కాచికో!

(రాముఁడు నిష్క్రమించును.)

(నేపథ్యమున) అయ్యయ్యో! అయ్యయ్యో! అడుగో రాముఁడు. ఇడుగో! రాముఁడు. నీవు రాముఁడవే? కానుకాను. కాకేమి? రాముఁడనుగో! నిజమైనరాముఁ డేఁడీ? అందఱు రాములే? హా! హా! హా! నన్నుఁ గొట్టకుము. నేనునీవాఁడను. ఆఁ! ఆఁ! కాదు. నీవు రాముఁడవు. హో. హో. హో. (పరుగులు కేకలతోఁ బెద్దకలకలము.)

సుగ్రీ—అహా! అహా! ఇదేమి? ఇదేమి? రక్కసు లొకరి నొకరు కొట్టుకొని చచ్చుచున్నారు. వీనికి వాఁడు రాముఁడు! వానికి వీఁడు రాముఁడు! అయ్యో! అయ్యో! మహామాయవలె నున్నదే? అంగదా! అంగదా! నీవు నాకేమో మాఱినట్లు కనుపడుచున్నావు. నా మొగమువంకఁ జూడు. నేను నీకు రామునివలె నగపడుచుండ లేదుకద!

అంగ—నాకేమియుఁ దెలియుట లేదు. కన్నులు చెదరినవి. అందువలన గట్టిగ మూసికొంటిని.

(నేపథ్యమున) ఆహా! ఆహా! ఆహా! ఆహా! ఒక్కరాముఁడైనఁ
బోరఁగలను గాని లోక మంతయు రామమయమేనా?

అంగ—రావణా! ఎంతమూఢుఁడ వైనను సత్యవాక్యము నాడుచు
న్నావు.

(నేపథ్యమున) రక్షించు. రక్షించు. రక్షించు.

సుగ్రీ—అదుగో! రావణుఁ డిట్లు పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు.

(రావణుఁడు ప్రవేశించును.)

రావ—రామా! రామా! రామా! తరుమకు; తరుమకు! రక్షించు.

(రాముఁడు ప్రవేశించును.)

రావ—రథము విఱిచితివి. గుఱ్ఱములఁ జంపితివి. సారథి మృతినొందిం
చితివి. ఆయుధము లన్ని యూడఁగొట్టితివి. జగమంత రామమ
యము చేసి నన్ను మోహపెట్టితివి. కాతరుఁడనై నిరాయుధుఁ
డనై పరుగెత్తుచు రక్షించు మనఁగ నింకఁ జాపపాణివై వెంటఁ
బడెద వేల? రఘువంశమునఁ బుట్టినవీరులకు శరణాగతరక్షణ
ము కులాచార మందురే? ఇది యేల?

రాము—నీవు నిరాయుధుఁడ ననుచున్నావు. అసత్యము.

రావ—ఏదీ? నాయొద్ద నేయాయుధముగాని లేదిదే?

రాము—చూచుకొనుము. నీకుడివైపునఁ బదునెన్మిదవపాణితలమున
గదయొక్క మొదలు చిక్కుకొనియున్నది. బుద్ధిపూర్వకముగనొ
అబుద్ధిపూర్వకముగనొ యాయుధలేశమును నీవు ధరించుటచేత
వెంటాడించితిని. అంతేకాని రఘువంశసంభవులు వంశమర్యాద
నతిక్రమించువారు కారు.

రావ—(చూచుకొని) ఔను. నిజమే. ఇదిగో! పాఱవైచితిని.

(పాఱవైచును.)

రాము—ఇఁక స్వేచ్ఛగాఁ బొమ్ము.

రావ—(విశ్రమించును)

సుగ్రీ—(తనలో) ఆహా! రాముఁ డెంతవీరుఁడు! ఎంతధీరోదాత్తుఁడు! ఎంతకరుణాసముద్రుఁడు!

గీ. ముష్టి నెట్లొ చిక్కిన గద ♦ మొదలు ద్రోచి
పేదిసంగాని యతని గా ♦ పాడఁ డయ్యె
నాత్మ స్వాతంత్ర్యశూన్యత్వ ♦ మంకినవుడె
భాగవతాదరణార్హమై ♦ వరలుఁ గాదె?

రాము—తమ్ముఁడా! వచ్చితిని. హా! ఎంతగతి పట్టినది!

గీ. సీతను గ్రహించి లంకలోఁ ♦ జేర్చు చెనఁటిఁ
జంప నటకేగి యతనిచేఁ ♦ జచ్చినావు
మొదవు దొంగిలి పల్లెలో ♦ ముడుచు మాలఁ
గ్రుమ్మ యతనికోఁతఁబడు వ ♦ త్సమ్ముఁబోలె.

తండ్రీ! పలుకవా? నావైపునకుఁ జూడవా? "నాయనా! లక్ష్మణుఁ డేఁడీ?" యని సీతల్లి నన్నడుగ నే నేమని చెప్పను తండ్రీ! పెనిమిటి వచ్చెనుగాఁబోలు నని మహానంద మొందునూర్మిళ నే నెట్లు లోఁజూపుదును? హా! నాయనా!

గీ. పోయినట్టిజానకిదేవి ♦ పోయినదియె
యనుచు నే నూరకుండిన ♦ నైన నీవు
బ్రదికియుందువుకాఁబోలు ♦ ముదిత కొట్లు
లాసపడి యిట్టి స్థితి ♦ నాడుకొంటి.

సుగ్రీ—రామచంద్రప్రభూ! విచారింప నేల? జనులకుఁ గష్టసుఖములు రాకుండునా?

రాము—సుగ్రీవా! వచ్చుఁగావుననే స్వపరసుఖములకు సంతసింపవలయును స్వపరకష్టములకు దుఃఖింపవలయును.

గీ. సుఖముతో మాకుఁ బనిలేదు ♦ సుండి యనెడు
వారయిన సుఖమున కట్లు ♦ పలుకుచుందు;
రాపదల మేము గణియింప ♦ మనెడువారు
చిత్తసౌఖ్యంబునకె యట్లు ♦ చెప్పుచుంద్రు.

గీ. పంకలంపట హేయస్వ ♦ భావసూక
రము మొదలు యోగివఱకుఁ జి ♦ త్తముద మొందఁ
గోరు టాపదల్ రాకుండ ♦ నోరుచుంట
యవని దాఁటరాని ప్రకృతి ♦ యగును గాదె?

గీ. సుఖముతోడ శరీరసం ♦ స్ఫురణ గలుగు;
కష్టమున దేహసంకోచ ♦ కలన గలుగు;
గాత్రనిర్మాణగతి యది ♦ కాని మనము
తెచ్చుకొనినది కా దైనఁ ♦ దేఁడరంబె?

గీ. ఏయవస్థకుఁ దగినది ♦ యాయవస్థ
యందుఁ గనుపఱుపవలయు ♦ నిందు మనుజ
జన్మమెత్తుటఁ దన్మన ♦ శ్చలనశాంతు
లిట్లు లోకార్థ మేను జూ ♦ పింపవలసె.

సుగ్రీ—సంజీవకరణిచే లక్ష్మణుఁడు పునర్జీవితుఁ డగును. మీరు విచారింపఁ బని లేదు. క్షమింపుఁడు.

రాము—ఏదీ? తెల్లవాఱకుండ నాంజనేయుఁ డోషధులతో రావలదా? సేతుబంధనపూర్వము రామలింగప్రతిష్ఠఁ జేయఁదలఁచి లింగమూర్తిని దెమ్మని యాతనిఁ గాశికిఁబంప నుద్దిష్టప్రతిష్ఠాముహూర్తములోపుగ నాతఁడు రాలేకపోయినాఁడు. ఇప్పుడుగూడ నట్టియలసత జరిగిన మహాప్రమాదము సంభవించును.

అంగ—అదేమి? అదేమి? అంత వెలుతు రేమి? సూర్యోదయ మగుచున్నదా? ఉత్తరమున సూర్యోదయ మెట్లు?

రాము—(తలవంచుకొని) హా! సూర్యోదయమైనదా? ధనున్న—సౌమి త్రీ!—ధను—అయ్యయ్యో! తమ్ముఁడా! నీవు మాకుఁ జేసిన యుపచారములచే నీకరము లెట్లు కాయలుకాచెనో, సంతతత్వ దీయనామస్మరణంబున నానోరు కాయలుకాచెనురా! తండ్రీ!

అంగ—అటుచూడుము. తేజోమయములగు నోషధులు గలపర్వతము నే పెల్లించుకొని యాంజనేయుఁ డిటకు వచ్చుచున్నాఁడు.

(నేపథ్యమున) పర్వతము నిటనె యుంచుము. ఓషధుల నేను దీసి లక్ష్మణుని కుపయోగింతును.

అంగ—అదిగో! సుషేణుఁ డాంజనేయునిగూర్చి పలుకుచున్నాఁడు.

(ఆంజనేయుఁడు ప్రవేశించును.)

ఆంజ—రామప్రభూ! ఇది సౌమిత్రిముక్కునొద్దఁ బెట్టుమని వానరవైద్యునియభిప్రాయము.

రాము—అలాగే. కానిమ్ము.

ఆంజ—(అటుచేయుచు) సౌమిత్రీ! శ్రీరామపాదభక్తశిఖామణీ! లెమ్ము.

లక్ష్మ—(లేచుచు) హా! శ్రీరామచంద్రా!

రాము—నాయనా! ఇదిగో! ఇక్కడనే యున్నాను.

(కౌఁగిలించుకొనును.)

లక్ష్మ—నమస్కారము. కాని రావణుఁ డెక్కడ?

రాము—తమ్ముఁడ తొందరపడకు. శాంతింపుము. ఆంజనేయా! నాఁడు సముద్రముదాఁటి సీతావార్తను జెప్పి నన్ను బ్రదికించితివి. నేఁడు సంజీవనగిరిఁ దెచ్చి తమ్ముని బ్రదికించి నన్ను బ్రదికింపఁ జేసితివి.

సుగ్రీ—మహాప్రభూ! లోకమును—

రాము—ఆంజనేయా! నీకు సుఖప్రయాణమేనా?

ఆంజ—పోవుచుండఁగ నొకమున్యాశ్రమమును జూచి పిపాసాతురుఁడనై యాతనికడ కేగి నీర మడిగితిని. అంతట నావృత్తాంత మం

తయు విని సెలవిచ్చి సమీపమున నున్న తటాకమున నీరు ద్రావుమని చెప్పెను. ఆసరస్సున దిగుసరికి భయంకరమగు నొక్క మొసలి నన్ను ప్రమింగెను.

రాము—హా. హా! తరువాత—

ఆంజ—ఆమొసలిని ఖండింపఁగ నొకదివ్యాప్సరసయై నిలువఁబడి తనకు శాపవిమోచన మైనదనియును, నన్ను మోసపుచ్చినవాఁడు ముని కాఁడు కాలనేమి యనురావణహితుఁ డనియు నది చెప్పెను.

రాము—అలాగా! దారిలో నాలస్య మగుటకై రావణుఁ డీరీతిగా నాచరించెను.

ఆంజ—అంతట నారాక్షసునిఁ జంపి పర్వతమునందలియోషధులను నేను గుఱుతుపట్టలేనిహేతువున పర్వతమునే పెకలించితిని.

రాము—సెబాస్! మహాబలపుత్త్రుఁడ వైననీ కది వింత యేమి?

ఆంజ—తిరిగి వచ్చుచు నయోధ్యాపురముమీఁదుగ రాఁగ—

రాము—హా! తండ్రీ! నీవు పరలోకమున కేగి మమ్ము పెద్దదిక్కు లేనివారలుగఁ జేసితివా? ఎంతవయోవృద్ధునికైన తండ్రిజీవించియున్నంతకాలము నిర్విచారముకదా?

ఆంజ—నన్నుఁ జూచి భయంకరగ్రహ మని యాగ్రహించి ఖండించుటకై ధనుర్ధరుఁడై మిమ్ముఁబోలినయొకమహానుభావుఁడు బాణమును విడువఁబోయెను.

రాము—చిరంజీవి యైనభరతుఁడు కాఁడుగద!

ఆంజ—ఔను. ఆతనిఁ జూచి మీరని భ్రమసితిని. లక్ష్మణమూర్ఛచే యుద్ధవిరాగులై కాని రావణసంహారము సేసికాని మీ రయోధ్యాపురము సేరినా రని నే నెంచితిని.

రాము—ఔను. అతఁడు నాప్రతిబింబముగ నుండును. కొంచెము పీలగను గొంచెము పొట్టిగను మాత్ర ముండును.

ఆంజ—ఊర్ధ్వతలమునుండి చూచుటచేత నాకంతతారతమ్యము తెలియ దయ్యెను.

రాము—అటుపైన నయోధ్యలో దిగితివా?

ఆంజ—చిత్తము. “జయ రామభద్రా! జయ రామచంద్రా!„ యని స్మరించుచు దిగితిని.

రాము—సెబాస్! భరతునితో మాట లాడితివా?

ఆంజ—రామనామము నాముఖమునుండి వెలువడఁగనే యాతఁడు నేత్రములనానందబాష్పములు వర్షించుచు, పులకితాంగుఁడై పరవశుఁడై యుప్పొంగి “శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః„ అని పెద్దకేక వేసి నాకాళ్లపైఁబడెను.

రాము—భరతునకు నానామ మమృతప్రాయము కదా!

సుగ్రీ—ఒక్కభరతునకే కాదు. భరతవర్షమున కంతకును—

ఆంజ—అటుపైన నిచ్చటిసంగతు లన్నియుఁజెప్పితిని. అతఁడు మిగులఖేదపడిమహాసైన్యసమేతుఁడై శీఘ్రముగఁ దమసహాయమునిమిత్తమై వచ్చెద నని చెప్పెను.

రాము—వెఱ్ఱివాఁడు. అనురాగపూర్ణుఁడు. తానుగూడశ్రమపడవలయునా? మాతల్లు లందఱిక్షేమమువడిగితివా?

ఆంజ—ఆ! అందఱు క్షేమముగా నున్నారు.

రాము—బంధుక్షేమవార్త నీవుచెప్పుటచే బంధుదర్శన మైనట్లుసంతసించుచుంటిని. ఆంజనేయా! నీజన్మము పరోపకారపరాయణతచే సార్థక మైనది.

ఆంజ—మహాప్రభూ! పరకైంకర్యపరాయణతచే నని సెలవీయఁదగును.

రాము—సంతోషమే. కానివిభీషణుఁ డేఁడీ?(విభీషణుఁడు ప్రవేశించును.)

ఆంజ—ఏమోయి విభీషణా! వచ్చితివా? లక్ష్మణుఁడు జీవించినాఁడు.

విభీ—ఇది లక్ష్మణునిబ్రతుకు గాదు. నాబ్రదుకు.

లక్ష్మ—విభీషణా! రావణుఁ డెచ్చట నున్నాఁడు?

విభీ—ఆతని వెదకి వెదకి యొకముఖ్యాంశముఁ జెప్ప వచ్చితిని.

లక్ష్మ—ఉపోద్ఘాత మేల? కానీ—

విభీ—యుద్ధమునఁ దనకు మృతినిశ్చయమని తలపోసి శుక్రాచార్యుని కాళ్లపైఁ బడి జయసాధనమును గటాక్షింపు మని యాతని వేఁడుకొనెను.

లక్ష్మ—కొంపగూలుచుండఁగ నిప్పుడా గురుప్రణామము!

విభీ—నిర్విఘ్నముగఁ బాతాళహోమమును జేసినచో రాఘవుని జయింతు వని యాతఁ డానతిచ్చెను.

లక్ష్మ—సరే! బాగుగనే యున్నది. నికుంభిలాహోమమును విఘ్నమొనర్చినట్టులే యీపాతాళహోమమును విఘ్నముసేసి రావణుని వధింతము, రమ్ము.

రాము—నాయనా! నీవు వలదు. పాతాళహోమవిఘ్నమునకుఁ గపిసేనను బంపుదును. ఇఁక నీవు రావణునిపైఁ జాపమువంచిన నాతోడే. నీవు పడినశ్రమ మిదివఱకే యపారము. నే నెట్లుపోరాడుదునో నీవు వేడుకగఁ జూడుము. విభీషణా! రావణుఁ డెక్కడ నున్నాఁడు?

విభీ—ఒకగుహలోఁ గూర్చుండి పైన పాషాణమును గప్పించి యప్పుడే హోమమారంభించినాఁడు. ఇఁక నాలస్యము కూడదు. నేను గపిసేనతోఁ బోవుదును. సెల వీయవలయును.

రాము—నీవు కపుల కాస్థలము చూపవలసినదే కాని రావణు నెదుటఁ బడవలదు. పడవుకద?

విభీ—చిత్తము.

రాము—మేము శిబిరములకుఁ బోయెదము. నీవు కపులను దీసికొనిపొమ్ము.

విభీ—చిత్తము. (అందఱు నిష్క్రమింతురు.)

ఇది షష్ఠాంకము.

శ్రీ

# విజయరాఘవము.

## సప్తమాంకము.

[ప్రదేశము—యుద్ధరంగమున నొకభాగము.]

---

ప్రవేశము—ఇద్దఱుక్రోఁతులు, అంగదుఁడు,

ఒకఁడు—ఈగోతిలో దూఱి హోమముఁ జేయుచున్న రావణునిదిట్టితిమి. కొట్టితిమి. గునపములఁ బొడిచితిమి. గొడ్డంట నఱికితిమి. నిప్పులు పోసికాల్చితిమి. ఎంతకును లేవఁడు. ఏమిచేయవలయును?

అంగ—నాకు నేమియుఁదోఁచకున్నది. విభీషణుం డేమైన నాలోచనము చెప్పునేమో తెలిసికొనెద. (అపవారించి) విభీషణా! విభీషణా! (విభీషణుఁడుప్రవేశించును.)

అంగ—ఎంతకును రావణాసురుఁడు లేవకున్నాఁడు. ఏమి చేయవలయును? ఆలస్యమగుచున్నది.

విభీ—(చెవులో నేదియో చెప్పుట నభినయించును.)

అంగ—సరే; సరే! ఇప్పుడే పోయెదను. (నిష్క్రమించును.)

విభీ—నే నిక్కడ నుండుటకు రామభద్రుని సెలవు లేదు. (నిష్క్రమించును.)

(నేపథ్యమున) నాథా! నాథా! అసురాధిపతీ! నన్నీదుర్మార్గుఁడు కొప్పుపట్టుకొని యీడ్చుకొని పోవుచున్నాఁడు.

రెండ—సెబాస్! అంగదుఁడు మందోదరినిగాఁబోలు కేశాకర్షణ మొనర్చి యీడ్చుకొని వచ్చుచున్నాఁడు.

మొద—ఈమంత్రమే కాఁబోలు విభీషణుఁ డంగదునకుఁ గర్ణమూలమున నుపదేశించినాఁడు.

(అంగదుఁడు, మందోదరి పైనజెప్పినరీతిగఁ బ్రవేశింతురు.)

మందో—అయ్యో! అయ్యో! ప్రాణనాథా! నన్నీ పాపస్వభావుఁడు కచాకర్షణమునఁ బరిభవించి యీడ్చుకొని పోవుచున్నాఁడు. నాథా! నాథా!

అంగ—ఈడ్చుకొనిపోవుట లేదు. ఈడ్చుకొని వచ్చుచున్నాను. ఎక్కడకో యెఱుఁగుదువా?—నీనాథునియొద్దకు. భార్యాభర్తలను గూర్పఁదలఁచినపావనుఁడు పాపి యెట్లగును? అదుగో! రమ్ము. పాషండశవమువలె గోతిలోఁ గూర్చున్నాఁడు. రా! (లాగుచున్నాఁడు.)

మందో—అయ్యో! నాథా! నాథా! నీవు బ్రతికియుండఁగనే నాకెంతగతి పట్టినది.

అంగ—బ్రదికియుండఁగనే కాదు. ఎదుటనుండఁగనే యనుము.

మందో—నాథా! ఎక్కడ నుంటివి? ఎక్కడ నుంటివి?

అంగ—ఇదిగో! చూడు, (గోతియొద్దకుఁ దీసికొనిపోయి) లే. రావణా! లే. నీభార్య యిదిగో! లేవవేమి? శుంఠా! చండాలుఁడా! కులద్రోహీ! ఆత్మవినాశకా! (గోతిలోఁ దన్నుచున్నాఁడు.)

ఒకఁడు—ఇతని దన్నిన మనకుఁ గాళ్లు విఱుఁగుటయేకాని లాభము లేదు. ఆతన్ను లీమెకుఁ దగిలిన నెటులుండునో!

మందో—అయ్యయ్యో! కొప్పుఁ బట్టుకొనిలాగుటయే కాక దెబ్బలు. తన్నులు కూడనా? అయ్యో! నాథా! నాథా! (ఏడ్చును.)

అంగ—దుర్మార్గుని గట్టుకొన్న నీకు నట్టియనుభవమునకు వింతయేమున్నది. పురుగుచేరిన తాటాకుపుస్తకమునకు నేలమోదుటయు నెండ గాల్చుటయు లేదా? నీరాగధోరణికి లయబ్రహ్మము లోపముగ నున్నది. కానీ! ఏదీ! ముఖారి. ఊఁ. ఉఁ. (ఒక్కదెబ్బకొట్టును.) ఏకతాళ మిప్పటికిఁ జాలు.

మందో—అమ్మయ్యో! అమ్మయ్యో! నీకరములు కాలిపోను.

అంగ—నాకరములు గావు.—నీగళసూత్రము.

మందో—(గోతియొద్దకుఁబోయి) ఏమి? నాథా! నాథా! ఇదిన్యాయమా? మయునికూఁతునై—బ్రహ్మవంశముఁ బుట్టినమహాభిమానినై నసీకు భార్యనై—యీచండాలునిచేతఁ బరిభవింపఁబడుచుంటిని. నాసిగ్గును గాపాడలేని నీసిగ్గేల? నామానమును రక్షింపలేని నీయభిమాన మేల? నేనుదెబ్బలు దినుచుండినఁ జూచుచుండునీపౌరుష మేల? నేనుజేసినపూజ లీవిధముగా బుగ్గియగుచుండ నీపూజలింకేల? నన్ను నీయెదుటనే చంపుచుండ నీబ్రదుకింకేల?

ఒకఁడు—అంగదా! ఈసారి త్రిపుటతాళమునఁ బాట పూర్తి యగునేమో చూడు.

అంగ—ఊఁ. ఉఁ. ఒకటి. ఊఁ. ఉఁ. రెండు. ఊఁ. ఉఁ. మూఁడు.

మందో—అమ్మయ్యో! అమ్మయ్యో! చచ్చితిని! చచ్చితిని!

రావ—(లేచి) హరహరా! నన్నెంత కోసికొని తినుచున్నారు! నాయెముకలు కటకట కొఱుకుచుండిరా! ఓప్లవగాధములారా! ఓపశువులారా! ఒక్కనిముసమైన హోమము చేసికోనీకుంటిరా! నాహోమవిఘ్నమొనర్చి కొంప దీసితిరా! ఓబానిసలారా! నాభార్యను నాయెదుటనే పరాభవింతురా!

అంగ—భర్తృదూర యగుకాంతను బరాభవించినవానికంటె భర్తృసన్నిధానమున నున్నకాంతను బరాభవించుట పౌరుషముకాదా?

రావ—ఆలాగా? మూఢా? అట్లైన శూర్పణఖను బరాభవించినరామలక్ష్మణులు పిరికిపంద లేగదా! దురాత్ములారా! ఇంకనాయెదుట నుండి ప్రేలుచుండిరా? (మీఁదికిఁ బోవును.)

అంగ—మాపని యైనది కావున మేము పోవుచుంటిమి. కాని నీ పౌరుషమునకు భయపడికాదు. కపులారా! రండు. రామునొద్దకుఁ బోవుదము. (నిష్క్రమింతురు.)

రావ—వింటివా? అంగదుఁ డేమనియెనో. వారిపని యేదో యెఱుఁగుదువా? హోమవిఘ్నము. రామవిజయమునకై యీహోమము చేయుచుంటిని. దానికిరీతిగ విఘ్నము సంప్రాప్త మైనది. ఇఁక నేను యుద్ధమునఁ జచ్చుట నిశ్చయము.

గీ. కాంతపైఁ బ్రేమమే దీని ♦ కంత మొదలు;
కాంతపైఁ బ్రేమమే దీని ♦ కంత చివర;
లలనలందలివల పాప ♦ దలకు మొదలు;
అఖిలనాశనకర మదె ♦ యగును దుదకు.

మండో—ఇంతబాధ యేల? అయినదేదో యైనది. సీతను రామునకొప్పించి మిగిలినవంశమునైనఁ గాపాడుకొనుము.

రావ—ఓసీ! వెఱ్ఱిదానా! సీతను రామున కిమ్మంటివా? శ్రీరాముఁడు పరమదయాళుఁడు. ఎంతెంతయపకృతు లాతని కొనర్చినను నన్నింక దయాదృష్టినే చూచుచున్నాఁడు. లక్ష్మణునిఁ బ్రాణావశిష్టునిఁ జేసినను—ఆతనిబారిని బడినను—ప్రాణములు ముక్కుతుదకు వచ్చినను—రక్షింపు మనునరికి వదలివేసినాఁడు. ఇది లోకాతీతమైనదయ కాదా? ఇట్టిస్థితిలో సీతనాతని కిచ్చిననిఁక నేమున్నది? ఇక మనబ్రతుకు లెప్పటి కింతే! చచ్చునెడల

రాముని చేతిలోనే చావవలయును. అందుకొఱకే యింత దేవ్రులా డు చుంటిని. నీవు విచారింపపలదు. నన్నింక రాక్షసాధ్యక్షు నిగా నెంచవలదు. పొమ్ము.

మందో—నాథా! నాథా!

రావ—ఇఁక మాఱుమాట వలదు. వెళ్లు; వెళ్లు!

మందో—(నమస్కరించి పోవును.)

రావ—ఎవ రక్కడ?

(నేపథ్యమున) మహాప్రభూ! సేవకుఁడను.

రావ—(తనలో) మామహాప్రభుత్వము, నీసేవకత్వము నేఁటితో సరి యే. (ప్రకాశముగ) నారథమును సిద్ధపఱిచి యుంచుమని సార థితోఁ జెప్పుము.

(నేపథ్యమున) చిత్తము. ఇచ్చటనే సిద్ధముగ నున్నది.

రావ—సారథీ! ఈదినమున రామునంతము మనమో మనయంతము రాముఁడో కనుఁగొనక తప్పదు. (నిష్క్రమించును.)

(దేవసారథి యైనమాతలితో రాముఁడు ప్రవేశించును.)

రాము—సారథీ! ఇఁక రావణవధము తప్పదు. అందులోఁ బురందరుఁడు స్వరథాశ్వములతో నిన్ను సాహాయ్య మొనర్ప మని పంపిన నన్యథా యేల యగును? రథ మెచ్చట నున్నది?

మా—ఆదేవదారువృక్షము నొద్ద నిలువఁబెట్టితిని. తాము వేగ మధిష్ఠిం చి దేవదేవప్రబలబాధాకరుం డగురావణుని వధింతురుగాక!

(నేపథ్యమున) తథాస్తు. తథాస్తు.

రాము—ఎవ రక్కడ?

మా—మంగళానుశాసకుఁడును, భగవానుఁడు నగునగస్త్యుఁడు విచ్చే సినాఁడు.

రాము—ఓహో! అటులైన నే నాతని సేవింపఁ బోవలయును. నీవు రథస్థుఁడవై సిద్ధముగ నుండుము. (నిష్క్రమించును.)

మా——చిత్తము.

(నేపథ్యమున) ఎవరక్కడఁడు? రాక్షసుఁడా? కపియా? భల్లుకుఁడా? కొండ్రముచ్చా?

మా——(తనలో) ఎవఁడో కపి నన్నుఁ గాఁబోలు పృచ్ఛ సేయుచున్నాఁడు. (ప్రకాశముగ) వీరిలో నెవఁడనుగాను.

(నిష్క్రమింపఁగ నంగదుఁడు ప్రవేశించును.)

అంగ——ఆఁ! ఎవఁడవు నీవు? పరుగెత్తుకొని పోయితివి! కపులారా! కపులారా! వానిని బట్టుకొనుఁడు.

(నేపథ్యమున) పట్టుకొంటిమి; పట్టుకొంటిమి!

అంగ——అదేమి? కపులు ద్విజిహ్వుని బట్టుకొని యిక్కడి కీడ్చుకొని వచ్చుచున్నారు.

(ఒకకపియు ద్విజిహ్వుఁడు ప్రవేశింతురు.)

కపి——వీఁడు మనపక్షమున నున్నట్టులే యుండి రావణపరిచారకులతో నేమేమో గుసగుసలాడుచున్నాఁడు.

అంగ——ఏమి? ద్విజిహ్వా! అట్లు చేసితివా?

ద్వి——చేసితిని. రాక్షసపక్షముననే యున్నట్లు వానికి నమ్మకము కలుగఁజేయునట్లు చేసితిని. నా కెంతవిరోధి యైననరే చూచుటతోనే మందహాసము చేసి కౌఁగిలించుకొని యంతఃకరణమున లేనిదయను కనఁబఱుచునలవాటున్నది.

అంగ——అట్లు చేయుట యేల? వానరా! నీవు నీపనిని జూచుకొనుము.

(వానరుఁడు నిష్క్రమించును.)

ద్వి——అట్లుచేసినఁగాని వారిరహస్యములు మనకుఁ దెలియవు. అదిగాక యెవఁ డెప్పుడు రాజానుగ్రహప్రాప్తుఁ డగునో! ఎవనివలన నాకు నేమిపని యగునో!

అంగ——ఓరీ! మూఢుఁడా! అందువలన నేమిలాభము? విూఁదుమిక్కిలి కష్టముకూడఁ గద!

గీ. రెండుపక్షంబులను జనుఁ ♦ దుండునెడల
నుభయపక్షంబులను గీడు ♦ నొందుఁ గాదె?
పెద్దచేప కరువ విను ♦ వీథి కెగురు
తెక్కచేపను బక్షులు ♦ మ్రింగునట్లు.

ద్వి—నన్ను మీరు నమ్మరు. వారు నన్ను వదలుకొన్నారు. బ్రదుక ద్గాన్నమైనది. ఏమియుఁ దోఁచక యూఁగాడుచున్నాను.

అంగ—నీవు రామదాసుఁడవై యిచ్చటనే యుండఁరాదా?

ద్వి—నేను రామసేవకుఁడను. ఇక్కడనే యుందును. కాని—

అంగ—ఇంకనేమి?

ద్వి—ఈనఁగాచి నక్కలపాలు చేసిన ట్లింతకాలమునుండి రావణు నాశ్రయించి తుదకు మరణకాలమునకు—అనఁగ—శ్రాద్ధాదుల నాకమితముగ దానాదిరూపముగ లాభించుసమయమునకు— ఆతనివిడిచియుండుట సంభవించెనుగదా యని చింతించుచుంటిని.

అంగ—ఓరినిర్భాగ్యుఁడా! ఏయాశ్రితుఁడైన రాజు దినదినప్రవర్ధమానుఁడై బాగుగ నుండవలయు నని కోరుకొనునుగాని—ఇదేమి! నీవు రాజునుత్తరక్రియలలో లబ్ధికై వాంఛింతు వేమి!

ద్వి—నా కట్టు లిట్టులు కూడ లాభించవలయును. మాకత్తికి రెండువైపులు వాఁడి. నీతో రహస్య మేమున్నది? జన్మమున వైదికుఁడ నగుటచేఁ బూర్వాపరములలోఁ బరమం దభిమాన మెక్కువ. వైవాహికవస్త్రముకంటె వాసన్ను ప్రీతికరము. కూటికాసుకంటె సీటికాసు సర్వోత్కృష్టము. కారణ మేమనఁగ—పూర్వార్జనలోఁ గొంతదేహశ్రమ మున్నది. దీనిలో లేదు. పూర్వదానములు విరివిగాజరుగవు. దీనిలో విరాగతచేఁ ద్యాగము విరివిగ నుండును. నాకు లాభ మెక్కువ దీనియందే. అందుచే నధికాభిమానము దీనియందే.

అంగ—ఛీ! ఛీ! నీవంటి తీతువు—నీవంటి యపరప్రియుఁడు—మా శ్రీ రామచంద్రమూర్తి యొద్ద నుండఁగూడదు. పో; పో!
(నేపథ్యమున) పోయెదవా? పోయెదవా? ఎక్కడకుఁ బోనుంటి వి? అంతరిక్షమున కెగిరిన సరే—పాతాళమున దాఁగినసరే—సముద్రమధ్యమున దూఱిన సరే—బ్రహ్మేంద్రాదు లడ్డువచ్చిన సరే—సజీవుఁడ వై నన్నుఁ దప్పించుకొని పోఁగలవా? తిరుగు! తిరుగు!

అంగ—ఆహా! శ్రీరామచంద్రుఁడు విరథుని జేయుటచే భగ్నమనోరథుఁడై రావణుఁడు పరుగువారుచున్నాఁడు. ఓహో! వానర యోధులారా!

గీ. జుట్టుము ల్గూడి కట్టిన ♦ బట్ట జాఱి
తలకిరీటంబు లొఱఁగి కా ♦ ళులు తడఁబడ
నాల్క లూఁగాడ రోజుచు ♦ నలువయింటి
పశువు పరుగెత్తు నడ్డుఁడీ ♦ కశల మోది.

ఆఁ! ఆఁ! ఇక్కడకే వచ్చుచున్నాఁడు. నే నెదుటఁ బడి తన్నెద ను. (రావణుఁడు ప్రవేశించును.)

అంగ—జయరామభద్రా! (తన్నఁబోవును.)
(నేపథ్యమున) ఈదినమున నెవ్వరును రావణుని జేయిచేసికొనవలదు. ఆఁగు. అంగదా! ఆఁగు.

అంగ—(తనలో) రామాజ్ఞ శిరమునఁ దాల్పఁబడినది.

రావ—ఏమిరా ద్విజిహ్వా! విశ్వాసఘాతుకా! స్వామిద్రోహీ! నాసొమ్మింతకాలము దిని—నాసేవ నింతకాలము సేసి—నన్నింతగా నమ్మించి—నా కాపద వచ్చునరికి—తుదకు నాశత్రువుల పక్షమునఁ గలసితివా? పాపీ! (పీఁకపైఁ జఱుచును.)

అంగ—ఆఁ! ఆఁ! జాగ్రత్త! మాపక్షమువానిని నీవు కొట్టఁదగదు.

ద్వి—(తనలో) రామునిచే దెబ్బలు దిని యాతని నేమి సేయలేక యా కోపమంత నాపైఁ గనుపఱుచుచున్నాఁడు. అధికారిచేఁ దిట్లుతి ని యింటికేగినయుద్యోగి యాలిని గొట్టిన ట్లున్నది. (ప్రకాశము గ) మహాప్రభూ! నేను మీసేవకుఁడను. మీభృత్యుఁడను. మీ సొమ్మునిదివఱ కనుభవించితిని. మీాయనంతర మైన ననుభవిం పఁ దలంచితిని. నావలన ద్రోహ మేదియు లేదు. ఈకపులు న న్ను బలాత్కారముగ బాధించినారు. నా కిక్కడ నుండవలె నని లేదు. నా వెఱ విడిపింపుము.

అంగ—ఓరిమూర్ఖా! విశ్వాసహీనా! ‟ఇక్కడనే యుందును. నేను రా మదాసుఁడను„ అని యనేకవిధముల నేడ్చి యిప్పు డిట్లందువా? బాలిశాధమా! (వీఁపుపైఁ జఱుచును.)

ద్వి—(అప) అంగదా! కొట్టకుము. రావణునితో నసత్యము పలికితిని. ఆటు లాడినఁ గాని యాతనికి హితముగనుండదు. నే నెఱుఁగ నా? ప్రాణమును విడుచుటకు సిద్ధముగ నున్న యాతఁడు న న్నె ట్లు విడిపింపఁగలఁడు? నమ్ము. నామాట నమ్ము. నాయనా! కొ ట్టకుము.

రావ—ఓరిఅధమా! నీవు రామదాసుఁడ వఁటరా? రామకింకరుఁడ వఁ టరా? ఇంతకాలము నాభృత్యుఁడవై యుండి యిపుడు నాకుఁ గూడ నప్రతిష్ఠఁ దెచ్చెదవా? అధమా! నీకు సిగ్గు లేదా? నరా ధమునకు దాసాధముఁడ వైతివా? ఇక్కడనే యుందువా? ఈ క్రోఁతులమందలతోఁ దిరుగుచుందువా? ఈభల్లుకములఁ గాచి కొనుచుందువా? ఛీ. ఛీ! తులువా! (వీఁపుపైఁ జఱుచును.)

ద్వి—(అపవారించిరావణునితో) అట్టు లంగదునితో ననినఁగాని మనకు శత్రురహస్యములు దెలియవు. వారు నన్ను విశ్వసించునట్లు నేను నటింపినఁగాని వారు నన్ను నమ్ముదురా? నమ్మినఁగాని

మన సిచ్చెదరా? నీక్షేమము గోరియే నే నిన్ను బాధ లొందుచుండ నన్ను బాధించుట న్యాయమా? మహాప్రభూ! నన్నుఁ గొట్టకుము.

రావ—శే! మూఢా! నీయొద్ద మోసము లేనిదేయాక్రోశింపఁదను జూచి నీ కీభయ మేల? ఈరహస్యము లేల? ఈచేయిచాటు లేల? ఈచెవిగొఱుకుట లేల? ఈగుసగుస లేల? ఈయోర చూపు లేల? ఈదొంగమాట లేల? ఈతడఁబడుట లేల? నిజముగ నీవు రాక్షసపక్షమువాఁడ వైనచో మఱల "శివశివా!" యని గొంతెత్తి యనుము.

ద్వి—ఆనకేమి? నాకేమి భయమా? మీరు చెప్పినట్లు నరాధముఁడైన రాముని దలఁతునా? శివశివా! శివశివా!

అంగ—ఓరీ! దుష్టుఁడా! ఓరీ! అసత్యవాదీ! రాముఁడు నరాధముఁడా! ఇదివఱకు "రామ, రామ" యనియఱచి యింతలో శివశివా యనెద వేమిరా? అను. "రామ, రామ" అనుము.

ద్వి—(అపవారించి) అంగదా! నీ వాగ్రహింపకుము. మనసులో రాముఁ డుండ మాటలో "శివశివా" యన్న నేమి మునిఁగెను?

అంగ—నా కీగుడిసెప్రేటుమాటలు పనికిరావు. అను. "రామా! రామా! రామా!" అని బిగ్గఱగ ననుము.

ద్వి—(తనలో) రావణుఁడు కొంచెము సేపటిలో గతింపనై యున్నాఁడు. ఇతనియాగ్రహమున కంతభయ మేల? (ప్రకాశముగ) అంగదా! అందును. రామా! రామా! రామా!

రావ—నాయెదుటనే—నాకు వినఁబడుచుండగనే—నేను వల దనుచుండఁగనే—దినమునకు సహస్రపార్థివలింగపూజ సేయుశైవశిఖామణి నైననేను గత్తిని ధరించి యిక్కడ నుండఁగనే—ఆఁ! ఆఁ! ఎంతయాగడము! ఎంత కృతఘ్నత! ఎంత నిర్లక్ష్యత! ఎంత

పరాభిమానము! ఎంత స్వపక్షునింద! ఎంత కన్నుఁగానని తన ము! ఆఁ! పొడిచెదను—కోసెదను—చీరెదను—ఆఁ! ఆఁ! నీ కిది బుద్ధియేనా? నీకు—నాపాదములు గొలిచిననీకు—నా యింట గడ్డితినిన నీకు—(కొట్టుచున్నాఁడు.) అను. శివశివా యను. లేనియెడల నిదిగో! కత్తి!

ద్వి—(అంగదునివంకఁజూచి యేడ్చుచున్నాఁడు)

అంగ—ఏడ్చుట యేల? చచ్చుట యేల? ఒకజిహ్వతో ‘రామ,’ యొక జిహ్వతో ‘శివ,’ యనుము.

ద్వి—రెండుజిహ్వ లున్న ఫలము రెంటితో రెండువస్తువుల నేకకాలము న నక్కుకొని, నాకి, చప్పరింపఁగలనుగాని యొకసారి రెండు వేఱు వేఱుమాట లాడలేను. అలాగే యుండిన నీఁకేమి?

రావ—మాటలతోఁ గాలయాపనము చేసెదవా? ‘శివా,’ యనకుండిన యెడలఁ జంపుదును. జాగ్రత్త! (కత్తియెత్తును.)

అంగ—అనినయెడల నిదిగో గద! కత్తితో నాతఁడు నఱికిన దేహము రెండుముక్క లగును గాని దీనితోఁ గొట్టినఁ బచ్చడియగును.

ద్వి—(తనలో) అయ్యయ్యో! నావంటివానిని జంపుటయందుఁ బరమశత్రుపు లేక మైనారు. దొంగతన మెంతకాలము దాఁగును? కృత్రిమ మెంతకాలము బయటఁబడ కుండును? మోస మెంత కాలము గప్పఁబడి యుండును? ఈశిక్ష నాకుఁ దగినదే. (అప వారించి) మహాసురాధీశా! మీకుఁ గోపమే కాని రామా యని నే నెందుల కంటినో నన్నుఁ జెప్పనిచ్చెదరా?

రావ—ఎందులకు?

ద్వి—నన్నుఁ బోషించురాజునెడలనే కాకుండ రాజ్ఞియెడలఁగూడ విశేషభక్తిప్రపత్తులు గలిగి యుండుట నాకు నైజము. మీపేరు

నకు మొదలు 'రా', రాజ్ఞిగారి పేరునకు మొదలు 'మ', రెంటిను గుదిగ్రుచ్చి 'రామరామ' యని యనుచున్నాను. యథార్థమిది.

రావ—అటులైన మావంకకు రా. (లాగును)

అంగ—అటు పోయెద వేల? ఇటురా. (లాగును.)

ద్వి—అయ్యయ్యో! నాప్రాణములు పోవుచున్నవి.

అంగ—రెండుప్రాణములనలు యటు పోనీ, రెండుప్రాణములనలు యిటు పోనీ.

ద్వి—(తల వ్రాల్చును.)

అంగ—ద్విజిహ్వా! చచ్చితివా? గట్టివాఁడవు. గజమును సింహము నెక్కకాలువనీరు ద్రాగించితివి.

రావ—(ద్విజిహ్వుని వదలును. ద్విజిహ్వుఁడు నేలఁబడును)
చీ! కుక్కా! (తన్నును.)

(నేపథ్యమున) పరులను జంపలేక బంధువులఁ జంపుచుంటివా?

రావ—రే! ఆంజనేయా! పరబంధువులను జంపుచుంటిని. నేను బాఱి పోయితి నని రాముఁ డుప్పొంగుచున్నాఁడుకాఁబోలు! ఇదిగో! వచ్చి—మిట్టిపా టుడఁచెద నని చెప్పుము.

(రావణుఁడు నిష్క్రమించును.)

అంగ—ద్విజిహ్వునికి గొంతుకలోఁ బ్రాణ ముండఁగ నివతల కీడ్చవలయును. ఎప్పటిఋణసంబంధమో యీరాక్షసుని కంత్యావస్థలో నుపచారము నేను జేయవలసివచ్చెను.

(ఈడ్చి పాఱవైచును)

అంగ—ఆహా! ఈదినమున నాంజనేయునిరాక్షసవధాప్రాగల్భ్యము వర్ణనాతీతముగ నున్నది కదా?

సీ. చట్టున నంతరి♦.క్షమ్మున కెగిరి హ
మ్మని దూఁకి యసురుల ♦ నడఁగఁ ద్రొక్క

వాలాగ్రమున దాన ♦ వాళిఁ జుట్టగఁ బెట్టి
మింటికిఁ జివ్వున ♦ మీటివైచు
నణురూపమును దాల్చి ♦ యసురులనోళ్లలో
దూఱి పొట్టలు చీల్చి ♦ దుముకుఁ బైకి
బాహువులసందిటఁ ♦ బలలాశులను లాగి
యట్టె చితుక్కన ♦ నప్పళించు
గీ. కరయుగంబున ననురయు ♦ గ్మమును బూని
టక్కుటక్కని కోలలా ♦ టల నొనర్చి
యంగవిస్మృతి రామరా ♦ మా యటంచుఁ
దాండవించెను నదె రణో ♦ త్సాహి యగుచు.

(నేపథ్యమున) ఓరాక్షసులారా! మీరింకఁ దల్లడిల్లక నిలువుఁడు. ఓకపివీరులారా! మీరు రక్కసులపై మొనయకుఁడు. అతిబలుఁడు నలౌకికవీరుఁ డగు శ్రీరామచంద్రుఁ డొనర్చు సంగరము నేత్రానందముగఁ గొంతసేపు చూచెదముగాక!

అంగ — అహా! వీరావతారుఁ డగు శ్రీరామభద్రుసమరకౌశల్యమును పరాపరు లొక్కరీతిగా విస్మయాయత్తచేతస్కులై చూచుటచేసంగరస్థలము చిత్రపటమువలె నున్నది. ఆహా! రాక్షసులు, కపులు గూడ—

ఆ. వె. గదలతోడఁ గ్రింది ♦ పెదవులు జాఱఁగఁ
దనువుతోడఁ గనులు ♦ స్తంభ మొంద
మతులతోడ జీవ ♦ గతులూడఁ గొంతు రె
ఱేఁగియొ మఱి యెఱుకఁదొ ♦ ఱఁగియొ యదిగో!

ఆహా! శ్రీరామకదన మెంతవిచిత్రముగ నున్నది! ఎంత లోకాతీతముగనున్నది!

సీ. అమరారి యిరువది ♦ యక్షులు చీకటుల్
గ్రమ్మంగ నెదుటను ♦ గానుపించి
యట్టె పార్శ్వములకు ♦ నరుగు నల్లంతలో
వెనుకనై పురను శో ♦ భించు నహహ!
యదుగో యనుచు వ్రేలి ♦ నిడు నంత నచ్చట
నుండండు తృటిలోన ♦ యుద్ధభూమి
యంత గ్రుమ్మరుంతఁకు ♦ క్కనుటయె కాని చూ
పట్టండు రణగుణ ♦ ధ్వనియు బాణ
గీ. తతుల రుందుంయిరవములు ♦ తప్ప నేది
వినంబడదు రణశీల మొక్క ♦ వీతిహోత్ర
కీల యొక్కరవమున నా ♦ భీల మగుచు
వాజ్మనంబుల కందని ♦ ఘణితి వరలె.

(నేపథ్యమున) హరహరా! హరహరా!

అంగ — సెబాస్! రావణుండు రథముపై మూర్ఛాగతుం డయ్యెను. అతిశీఘ్రముగం దత్సారథి యారథము నిటంకు దోలుకొని వచ్చుచున్నాండు.

(రథస్థుండై మూర్ఛ నొందినరావణుండు సారథితోం బ్రవేశించును)

సార — ఆహా! దేవదానవుల యుద్ధములలో నెందఱుమహావీరులనో చూచితిని గాని యిట్టి బాణసంధానకౌశలత — ఇట్టియలౌకికహస్తలాఘవము — ఇట్టి యమోఘసాయకత్వము — ఇట్టిసంగరవిజయసాహిత్యము నే నెందును జూచియుండను. వినియైన నుండలేదు. ఆహా! రాముండు మహావతారపురుషుండై యుండును. మా రాక్షసాధీశునిచరిత్రి కింక నాశ్వాసాంతము కావచ్చినది. (విసరుచు) అసురాధిపతీ! మహాప్రిభూ! — లెమ్ము.

రా — (లేచి) ఆం! ఆం! రాఘవా! ఇదిగో! కాచికో!

సార — మహాప్రభూ! మనము యుద్ధభూమికిఁ గొంచె మోసర్రిల్లి యున్నాము.

రావ — ఏల?

సార — నే నీరథము నిచ్చటికి మఱలించుకొని వచ్చుటచేత.

రావ — ఏల? —

సార — మీరు మూర్ఛపడుటచేత —

రావ — ఓరీ మూఢా! మూర్ఛపడుట తప్పా? పడఁగూడదా? ఎంతవీరుఁడైన మూర్ఛపడి యుండఁడా? అందుచేత — రణరంగమునుండి — రథమును మఱలించితివా? మూర్ఛపడిన నేమి? ఒక్కనిమేష మక్కడనే నిరీక్షింపలేక పోయితివా? మూర్ఛనుండి తిరిగి లేవననుకొంటివా?

సార — హరహరా! అట్టిమాట లేల?

రావ — నామాటలు నీకు బాగుగనున్నవి కావా? నీచేష్టలు నాకు బాగుగ నున్నవా? లోకమునకు బాగుగ నుండునా? ఆలోచించుకొనుము. నీకైనబాగుగ నుండునేమో! ఎంతపని జేసితివి! అదుగుదిరుగనియసురసార్వభౌముని కప్రతిష్ఠఁ దెచ్చితివి. మూర్ఛపడిన నేమనుకొంటివి? లేవననుకొంటివా? ఇఁక విల్లుపట్టలే ననుకొంటివా? శక్తి పోయినదనుకొంటివా? ధైర్యసాహసములు మన్నుగలిసెననుకొంటివా? ప్రాణము పోయినదనుకొంటివా?— ఎంతపనిచేసితివి! ఇంద్రాదిదిక్పాలకుల నందఱను శౌర్యాగ్ని వేఁచివేఁచి వేలుఁగఁ బ్రేలి క్రిందఁ బడునట్లు చేసినసంగతి యెఱుఁగనే యెఱుఁగుదువుకదా? ఎఱిఁగియుండియు నిట్లు చేసెదవా?

సార — నాకప్పు డిట్లు చేయదగు నని తోఁచుటచే నిట్లొనర్చితిని.

రావ — నీకుఁ దోఁచుటయే ప్రధానమా? నీబుద్ధియే ముఖ్యమా? నాకీర్తితో నీకుఁ బనిలేదా? రాముఁడు వీరుఁడు కదా? — పరపరా

క్రమమై ఖరి మెచ్చి శిరఃకంపము సేయువాఁడుకదా.—అట్టిశూరునియెదుట నా కింతయపకీర్తిఁ దెచ్చితివికదా?—నారాజ్యమపహరించినఁ గాని—నాకాంతాకనకముల నపహరించినఁగాని—నాశిరములు ఖండించినఁగాని—నీవు నాకింతకంటె నపకృతి సేయఁగలవా? భూమినుండి—శత్రుముఖమునుండి—వెనుకకు—హరహరా! వెనుకకు—చచ్చినవానిఁ దీసికొనివచ్చినట్లు—

అంగ—(తనలో) ఈపౌరుష మంత నిన్న రామసన్నిధినుండి పాఱిపోయినప్పు డెక్కడకుఁ బోయెనో!

సార—తమంతో సత్యము మనవి చేయవలయును. తమ కింతయపకృతి రామునివలన నప్పుడే జరుగునని భయపడి—

రావ—భయమేల? చావనీ—రాముని చేతనే చావనీ—మహాహవమున మహాశూరుని మొగముపై దుముకుచుఁ బ్రాణములు విడుచుట వీరజన్మతారకమా, లేక, ఈబొమ్మజెముడుకంపలసందున దిక్కుమాలినవానిలాగున నశ్వపృష్ఠములను నీమొగమును జూచుచుఁ బ్రాణముల విడుచుట సార్థకమా? అక్కడ చచ్చి యిక్కడ బ్రతుకుదు ననుకొంటివా? ఛీ! ఛీ! ఛీ!

అంగ—(తనలో) సెబాస్! రావణా! చచ్చుట నిశ్చయమే.

సార—అయ్యా!

రావ—నీమాటలు నే విననుం. నీవు నాపౌరుషమును భంగపఱిచితివి. నాకీర్తిని గంగలోఁ గలిపితివి. నాపేరునకుఁ జెఱిగిపోని మచ్చను దగిలించితివి. నీతో నా కిఁకఁ బని లేదు. నీయశ్వములతో నా కిఁకఁ బని లేదు. నీరథముతో నా కిఁకఁ బని లేదు. భగవంతుఁ డిచ్చినపాదము లున్నవి. బాహువు లున్నవి. యుద్ధమునకుఁ బోయెదను. ని న్నెవఁడు నమ్మును? ఒకవేళఁ గొంచె మలసిన నీసారథి యింటికే తోలుకొని పోయెదవేమో!

సార—అట్లు చేయుదు. ఇదిగో! సమువకుండు. రథమును మీకొఱకుఁ దోలుకొని వచ్చుచున్నాను.

రావ—నీరథ మింక నా కక్కఱలేదు. నేను గృతార్థుఁడ నగునెడలఁ బైనుండి నాకొఱకు వచ్చుపుష్పరథమునే యెక్కెదను. ఇఁక నీవు పో (రావణుఁడు నిష్క్రమించును.)

సార—నేను గూడనే యుందును.

(సారథి రథమును దోలుకొని పోవును.)

అంగ—సెబాస్! ప్రథమప్రవేశమున రావణుఁడు శ్రీరామభద్రుని దాఁకెను. విరథుఁ డగునాతనితోఁ బోరాడుటకుఁ గదనకలానుసారముగ శ్రీరామభద్రుఁడు రథము డిగియెను. సెబాస్! రామభద్రా! జయ! రామా! రాజీవలోచనా! కించిన్నేత్రశోణిమచే శోభించు రామప్రభుఁడు రావణునిశిరములలో నొకదానిని ఖండింప నది గప్పమును వెలుతురుతో నంతరిక్షమున కెగిరి గిరగిరఁ దిరిగి నేలఁ బడెను.

(నేపథ్యమున) జయ! రాక్షసేశ్వరా! జయ!

అంగ—అదేమి? ఆఁ! అదేమి వింత! తిరిగి తదనురూపలావణ్యమైనశిరమా స్థానమున మొలచినదే! ఆఁ! ఇఁక వీఁ డెట్లు చచ్చును?

(నేపథ్యమున) జయా! రామా! రాజీవలోచనా!

అంగ—సెబాస్! ఈసారి నాలుగుశిరముల నుప్పరమునకు మహావీరుఁ డెగరఁ గొట్టినాఁడు.

(నేపథ్యమున) జయ! సురకాననవీతిహోత్రా! బ్రహ్మపౌత్రా! జయ!

అంగ—అయ్యయ్యో! తిరిగి తత్స్థానములలో నాలుగు శిరములును మొలిచినవి. ఇంతవింత కని విని యెఱుఁగను రామభద్రా! మ

హా! ప్రభూ! ఈయలౌకికప్రభావ మెట్లు గెలిచిజగముల కానంద మును గలుగఁజేయ నుంటివి?

(నేపథ్యమున) రామభద్రా! జయ రామచంద్రా!

అంగ—ఆహా! ఆహా! ఈసారి తొమ్మిదిశిరములు మింటి కెగరఁగొట్టఁబ డినవి! అయిననేమి తిరిగి మొలచును గాఁబోలు!

(నేపథ్యమున) జయ! దేవసమరోత్కంఠా! దశకంఠా!

అంగ—మొలచినవి! తిరిగి తొమ్మిదియు మొలిచినవి! మహాద్భుతము, అపూర్వము! అతిభయంకరము! ఆహా! ఆహా!

ఆ. వె. బంతు లెగరమీటు ♦ పగిదిని గొట్టంబు
నుండి వెన్నముద్ద ♦ లుప్పరమున
కెగయుభంగి రాఘ ♦ వేశ్వరుశిరము లి
ట్లంతరిక్షమంత ♦ యావరించె.

ఆహా!

గీ. ఖండితాసురపృథుశిరః ♦ కాండములను,
కేశములఁ గాళ్ల గోళ్లలో ♦ గీల్చి పైకిఁ
గంకగృధ్రాదికుణపభు ♦ గ్గణము లట్టె
కబళనాశఁ గొంపోవుఁ ఉగీ ♦ కా, యటంచు.

గీ. ఎన్నిశిరములు పోయిన ♦ నంతరక్త
పూర మొలికిన, దనుజుఁడు ♦ పూర్వమట్లు
చెక్కుచెదఱక యున్నాఁడు ♦ చిత్రభేద
మెంత గలుగ మాఱని బ్రహ్మ ♦ సృష్టి ప్రోలె.

ఆఁ! అదేమి? రాముఁ డాలోచనభావమున మెల్లఁగ నిట్లు వచ్చు చున్నాఁడు.

గీ. తల నెడమవైపునకుఁ గొంత ♦ దార్చి, వెలువ
లికనుదమ్మితోఁ బైకిఁ జూ ♦ చి, కటిమీఁద

నెడమచేయి మడచి కుడి ♦ మడమపైని
విల్లు తాటించుచును వచ్చు ♦ మెల్ల నతఁడు.

(రామభద్రుఁ డట్లు ప్రవేశించును.)

అంగ—జయా! శ్రీరామచంద్రా!

రాము—విజయీభవ!

అంగ—మహాప్రభూ! ఏదియో యాలోచించుచున్న ట్లుంటి రేమి?

రాము—అంగదా! ఖరవిరాధమారీచాదిరాక్షసుల నవలీల నొక్కవ్రేటునఁ గడతేర్చినబాణము లివియే. వాలి నిలువున భస్మముచేసి నభల్లము లివియే. ఎందుచేతనో కాని రావణునెడల నివి నిష్ఫలము లైనవి. ఏమియుఁ దోచకున్నది. రావణునిశిరములు వేలకొలంది ఖండించితిని. అయిన—నాతఁ డెప్పటి యట్ల నున్నాఁడు.

గీ. ఎన్నిశిరములు పోయిన ♦ నన్ని తిరిగి
మొలుచుటను పూర్వవైఖరిఁ ♦ జెలఁగు నతఁడు
ఎంతనీర మావిరిగాఁగ ♦ నెగురు నంత
తిరిగి వచ్చుటఁ జెడనివా ♦ ర్ధివలె నహహా!

గీ. దాశరథి యమోఘాశుగ ♦ త్వంబు నేఁడు
వ్యర్థమైపోయెఁ గాఁబోలు; ♦ నవనిజాత,
గృహమహాలక్ష్మియే త్యజి ♦ యించినప్పు
డింక నను వీడకుండునే ♦ యేదియైన?

గీ. జనునిభాగ్యంబు వీడిన ♦ సమయమందుఁ
దత్ప్రభావంబు లెల్ల నం ♦ తంబుఁ జెందు
ముదితసౌభాగ్య మేగిన ♦ ప్పుడు తదంగ
సౌష్ఠవశ్రీలు సడలెడు ♦ చందమునను.

అంగదా! ఈరావణునివధకు సాధనమేదో యంతమహాకలకల మునఁ దోఁచక యాతని నించుకసేపు మూర్ఛపటిచి యిటకు వచ్చితిని. నిరంతరశిరఃకాండాంకురమునకు గారణ మేమైయుండునో! చూడు. నాభీదేశమున నమృతకలశ ముండవలెకదా?

అంగ—మహాప్రభూ! బాగుగ నాలోచించితిరి.

రాము—కానీ—చూతము. అగస్త్యోద్దిష్ట మగునాదిత్యహృదయమును స్మరించుచు ముం దాగ్నేయాస్త్రమున దానిశోషింపఁ జేసి తరువాత శిరములు ఖడింతును.

(నేపథ్యమున) హా! హా! భగవంతుఁడు పాఱిపోయినాఁడు కాఁబోలును! ఓపరమాత్మా! బ్రదుకన్న నీకుఁ గూడ నెంతపామరత్వము! యుద్ధమునుండి తొలఁగి యచ్చట నూఁగాడు చుంటివేమి?

రాము—రావణా! స్మృతి తప్పియుండుటచేత నేఁజేయవలసినదేమి? తెలితివిగాన నిదిగో! వచ్చుచుంటిని.

(రాముఁడు నిష్క్రమించును.)

అంగ—అదిగో! గుప్పుగుప్పునఁ బొగలు. గప్పుగప్పున మంటలు. వినువీథి గ్రమ్మ నుల్కాకోటితో బయలుదేరినయీమహాతేజఃపుంజమే కాఁబోలు నాగ్నేయాస్త్రము! దాని నభిమంత్రించి రాముఁడు రావణుని నాభిదేశమునఁ గొట్టినాఁడు.

(నేపథ్యమున) జయా! జయా! రామభద్రా! జయా! రామచంద్రా!

అంగ—కపులు మహాసంతోషమున రామునిపరాక్రమమును గొనియాడుచున్నారు. అదుగో! సెబాస్! రామభద్రుఁడు మఱియొక్కబాణమును వేయుచున్నాఁడు.

( నేపథ్యమున ) జయా ! రామభద్రా ! రామచంద్రా ! జయరామా! జయ! రాజీవలోచనా! జయ! రావణశిరఃకర్తన ప్రవీణా! (పెద్దచప్పటలుగలుగును.)

అంగ—ఆహా! ఆహా! ఒక్కబాణముతోఁ దొమ్మిదితలలను బదునెనిమిది బాహువులను ఖండించినాఁడు. సెబాస్! తిరిగిశిరములు మొలువలేదు. ఒక్కశిరముతోడను రెండుబాహువులతోడను నందఱవలెనే రావణుఁడు గనఁబడుచున్నాఁడు. ఇక్కడకుఁ దలబరువు వదలినది. అబ్బ! దేహమంత రక్తసిక్తమై రోజుకొనుచు రావణుఁడిటకుఁ బరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు.

(రావణుఁడు ప్రవేశించును.)

అంగ—రావణా! సుఖపడితివి. మునుపటికంటె లాఘవముగఁ బరుగెత్తుచుంటివి. వెఱ్ఱితలలు మొలచిన వెదురుమూలమువలె నిదివఱకసహ్యముగ నుంటివి కాని, యిప్పుడు బాగుచేసినబెత్తమువలె నున్నగ నున్నావు.

(నేపథ్యమున) అంగదా! తప్పుపని సేయుచున్నావు. అనురాధ్యతుని నధిక్షేపింపవలదు.

అంగ—(లెంపలువైచుకొని) రామభద్రా! క్షమింపుము. (తనలో) ఈతఁ డెట్టిమహాపురుషుఁడో నాకుబోధింపదు.

సీ. కనుగొల్కులైన నె ♦ ఱ్ఱన గాకయుండఁ, నా,
యని గట్టిగానైన ♦ నఱవకుండ
నొడలు చెమ్మటచేతఁ ♦ దడియైనఁ గాకుండ
సిగముడియైనను ♦ చెదరకుండఁ
గోపచిహ్నము లేమి ♦ దీపింపకుండ ర
ణోత్సాహదశయైన ♦ నొదవకుండఁ
బల్లెత్తు పలుకైనఁ ♦ బగతుర నాడక
యుండ మూలబలంబు ♦ రెండుగడల

గీ. లోన లీలగాఁ గడతేర్చి ♦ దానవాధి
పతికి నిట్టులు చేసి యె ♦ వ్వాండు సేసె
నో యటంచు నుండుఁ దటస్థు ♦ నోజ నహహా!
ఇట్టి యద్భుతచారిత్ర ♦ మెచటఁ గలదు?

రావ—రామా! రామా! ఎచ్చట నుంటివి? కనుపడ వేమి? కనుపడవేమి మహానుభావా! ఖండించినవి నాపాపములు గాని బాహువులు కావు. తప్పిదములు కాని తలలు కావు. ఇదియే ముఖ్యమైనశిరము. దీనిని గూడ ఖండింపుము. నమస్కారము. నా కీరెండుకరము లింక నుంచితివి కాన నమస్కరించుచున్నాను.

(రాముఁడు ప్రవేశించును.)

రావ—హా! లోకైకసుందరా! రామచంద్రా!

సీ. బ్రహ్మను నైనను ♦ బహుతపఃపరిపాక
నియతిచేఁ గానని ♦ నిన్ను నేను
గంధి దాఁటించి, లం ♦ కకు నిట్టు రప్పించి,
యరమఁశిచుట్టు గి ♦ గ్గిఅను ద్రిప్పి
త్మ్రోజాపహర్త యె ♦ క్కడ యెక్కడంచు నా
కొఱ కెంతో వెదకించి, ♦ కొనకు నాదు
దర్శనం బిప్పించి, ♦ తటపట లాడించి,
నట్టికట్టిడినని ♦ యాగ్రహింప

గీ. వలదు; తామసుండను; తపం ♦ బులను నిన్ను
నందఁగాఁ జాల; నావృత్తి ♦ కర్హమైన
పనినిఁ జేసితి; నెందుల ♦ క నెద వేసి
యుందులకె; వింటివా? క్షమి ♦ యింపుమయ్య!

గీ. ఈవు లోకపిత వని, సీ ♦ తావధూటి
లోకమాత యంచెఱుఁగుదు; ♦ నీకు నింత

చేసితిని గాన నిటకు వేం ♦ చేసినావు;
కాక యుండినఁ బీఠంబు ♦ గదలిచెదవె?

అంగ—(తనలో) వారనారికి వార్ధకమున, వనితాపహారికి వంశాంతమున వైష్ణవభక్తి వర్ధిల్లుట వాడుక యేకదా?

రాము—(తనలో)

సీ. ఆత్మ యత్యద్భుతా ♦ నంతశక్తి జ్ఞాన
పరిపూర్ణనిత్యత ♦ త్త్వంబుకాని
యద్ది యీ మొద్దుదే ♦ హంబున చిక్కి యు
న్నప్పుడు తచ్ఛక్తు ♦ లగపడ వయి
నను స్వప్నదశయందు ♦ నను మరణాసన్న
సమయమందున దేహ ♦ సంగతి యిసు
మంత వానిని వీడు ♦ నప్పుడు యథార్థ్య
విజ్ఞానశోభియై ♦ వెలయు నద్ది

గీ. యట్టు లీతఁడీపత్వరి ♦ త్యక్తదేహ
బంధనుం డౌటసత్యత ♦ త్త్వజ్ఞతా ప్ర
శాంతుఁడగు; నెల్లజనుల కీ ♦ క్షణమె సార్థ
కంబనుచుఁ జెప్పఁదగును జ ♦ న్మంబునందు.

రావ—శ్రీరామచంద్రా! ఆలోచించుచుంటి వేమి? బ్రహ్మహత్య యని సంకోచించుచుంటివా?

అంగ—(తనలో) బ్రహ్మహత్యాదోషనివారణార్థమే సేతుబంధనసమయమున రామలింగప్రతిష్ఠను శ్రీరామభద్రుఁడు సేసినాఁడు.

రావ—సంకోచింపకుము. నరమాంసభుక్తి బ్రాహ్మణవృత్తియా? అసత్యవాక్కథనము బ్రాహ్మణవృత్తియా? పరవనితాహరణప్రవీణత బ్రాహ్మణవృత్తియా? నేను బ్రాహ్మణుఁడనుగాను.

గీ. దయయు సత్యంబు శౌచంబు ♦ దైవభక్తి
యింద్రియనిరోధ మెవనికి ♦ నెసఁగు నతఁడె
ద్విజుఁడు; వేదముతలక్రిందు ♦ గఁ జదివినను
పితృ ద్విజుండైన మాత్రాన ♦ విప్రుఁ డగునె?

రాము——రావణా! నీవు మంచిమాటలఁ బలుకుచుంటివి. జ్ఞానవంతుఁడ వైతివి. సంతసించితిని. నిన్నంతమొందించుటకే యుద్యమించిన నే నూరకుందునా? నిన్నుఁ జూడ నాకు జాలి యగుచున్నది.

రావ——ఆలాగా! కోపము దెప్పించినఁగాని చంపవా! దైవానుగ్రహార్జనము కష్టముగాని దైవాగ్రహసంపాదన మేమికష్టము! ఇదిగో! కాచికో! ఊఁఁ. (గుద్ది పాఱిపోవును.)

రాము——(నవ్వుచు) సీతను హరించితివి. నాకుఁ గోపము రాలేదు. నాతమ్మునిఁ బడగొట్టితివి. నాకుఁ గోపము రాలేదు. నన్ను గ్రుద్దినఁ గోపపడుదునా? సూర్యోదయసంధ్యయందుఁగాని నీకు మరణము లేదు కావున నిరీక్షించుచుంటిని. అదియు నాసన్నమైనది కావున వచ్చుచుంటిని.

(రాముఁడు నిష్క్రమించును.)

అంగ——బలవచ్ఛత్రు లగురామరావణుల యీవిచిత్రసమావేశమున నేడు గగుర్పొడిచినది. ఆహాహా! అదిగో! రాముఁడు బ్రహ్మాస్త్రమభిమంత్రించుచున్నాఁడు.

(నేపథ్యమున)

గీ. ఋషులు నిర్విఘ్నయోగు ల ♦ య్యెదరుగాక.
త్రిదశు లెల్లరును సుఖు ల ♦ గుదురు గాక!
ఇలను ద్విజులు నిర్భీతు ల ♦ య్యెదరుగాక!
సర్వజనులకు క్షేమంబు ♦ జరుగుఁ గాత!

రావణా! ఇదిగో!

(నేపథ్యమున) జయ రామభద్రా! జయ రామచంద్రా! జయా రామా! రాజీవలోచనా?

(పెద్దచప్పటలు జయజయధ్వను లగును.)

అంగ—సెబాస్! రామభద్రా! రావణుని వధించితిరి. ఆహా! అతని కళేబరమునుండి యొకదివ్యతేజము రామునిలోఁ జేరినది. రామలక్ష్మణసుగ్రీవవిభీషణహనుమంతు లిటకుఁ గొందఱుకపులతో వచ్చుచున్నారు.

(రాముఁడులక్ష్మణుఁడుసుగ్రీవుఁడువిభీషణుఁడుహనుమంతుఁడుప్రవేశింతురు.)

సుగ్రీ—జయా! విజయరాఘవ!

లక్ష్మ—జయా! విజయరాఘవ!

విభీ—జయా! విజయరాఘవ!

హను—జయా! విజయరాఘవ!

లక్ష్మ—అగ్రజా! మహావీరశిఖామణీ! దుష్టశిక్షణ మైనది. శిష్టరక్షణ మింక నున్నది.

రాము—ఆలాగా! విభీషణా! నీవు పోయి సైదేహి నిటకుఁదీసికొని రమ్ము. (విభీషణుఁడు నిష్క్రమించును.)

సుగ్రీ—మీరు కావున రావణుని వధించితిరి గాని మఱియొకఁడట్లు చేయఁగలఁడా?

రాము—సుగ్రీవా! అట్లు కాదు. నేను గాదు. నీవు కాదు. కాలము వధించినది.

లక్ష్మ—(తనలో) ఆహా! రామునియసాధారణసౌమ్యత!

(నేపథ్యమున) కపులారా! మీ రిచ్చటనుండి తొలఁగుఁడు. రామసాన్నిధ్యమునకు జానకి దయచేయుచున్నది.

(నేపథ్యమున) జయ రామభద్రా! జయ రామచంద్రా! జయా రామా! రాజీవలోచనా?

(పెద్దచప్పటలు జయజయధ్వను లగును.)

అంగ—సెబాస్! రామభద్రా! రావణుని వధించితిరి. ఆహా! అతని కళేబరమునుండి యొకదివ్యతేజము రామునిలోఁ జేరినది. రామలక్ష్మణసుగ్రీవవిభీషణహానుమంతు లిటకుఁ గొందఱుకపులతో వచ్చుచున్నారు.

(రాముఁడులక్ష్మణుఁడుసుగ్రీవుఁడువిభీషణుఁడుహానుమంతుఁడుప్రవేశింతురు.)

సుగ్రీ—జయా! విజయరాఘవ!

లక్ష్మ—జయా! విజయరాఘవ!

విభీ—జయా! విజయరాఘవ!

హాను—జయా! విజయరాఘవ!

లక్ష్మ—అగ్రజా! మహావీరశిఖామణీ! దుష్టశిక్షణ మైనది. శిష్టరక్షణ మింక నున్నది.

రాము—ఆలాగా! విభీషణా! నీవు పోయి వైదేహి నిటకుఁదీసికొని రమ్ము. (విభీషణుఁడు నిష్క్రమించును.)

సుగ్రీ—మీరు కావున రావణుని వధించితిరి గాని మఱియొకఁడట్లు చేయఁగలఁడా?

రాము—సుగ్రీవా! అట్లు కాదు. నేను గాదు. నీవు కాదు. కాలము వధించినది.

లక్ష్మ—(తనలో) ఆహా! రామునియసాధారణసామ్యత!

(నేపథ్యమున) కపులారా! మీ రిచ్చటనుండి తొలఁగుఁడు. రామసాన్నిధ్యమునకు జానకి దయచేయు చున్నది.

రాము—విభీషణా! అటు లనఁగూడదు. కపు లందఱు నాకు బిడ్డలవం టివారు! తన కీసిగ్గేల? అదిగాక పరమందిరమున నింతకాలము నుండి పరపురుషాధీనయై యున్నదాని కిప్పు డీదాఁగుడుమూఁత లేల? అందఱియెదుటకుఁదీసికొనిరమ్ము.

లక్ష్మ—మహాప్రభూ! అట్లు సెలవిచ్చుచున్నా రేమి?

(విభీషణుఁడు సీతతోఁ బ్రవేశించును.)

సీత—హా! ప్రాణనాథా! ప్రాణనాథా! (సాష్టాంగపడును.)

రాము—లెమ్ము. లేచిపొమ్ము.

సీత—మహాప్రభూ! మహాప్రభూ! పొమ్మనెద రేల?(గడగడవడఁకును.)

రాము—పొమ్మనక నీతో నింక మా కేల?

సీత—రామ, రామ, రామా! ఇవి యేటిమాటలు? నాతో నింక మీ కేమియు లేనే లేదా?

రాము—ఏమియు లేదు. ఇదివఱ కున్నసంబంధమును బాపుకొంటిమి. గౌరవప్రపూర్ణ మైనమావంశమునకు నీవలనఁ గలిగినయప్రతిష్ఠ బాపుకొంటిమి. నిన్ను రావణుఁ డపహరించినందువలన నాకుఁ గలిగినయవమానమును భుజపరాక్రమమునఁ బాపుకొంటిమి. ఇందుకొఱకే నేనీపనిని జేసితిని. గాని నిన్నుఁ బరిగ్రహించి యింక నీతోఁ గాపురము చేయవలయునని కాదు.

సీత—ఏమి ప్రాణనాథా! ఎన్నఁడును లేనిది నన్నిట్లు సందేహించుచు న్నారు! నేను దుష్టచారిత్ర ననుకొనుచున్నారా! ఇంతకాలము నాతో సంసారమును జేసియున్నమీరు నాయంతఃకరణవృత్తి నెఱుఁగరా? ఏమి నాపాతివ్రత్యమునే సందేహించుచుంటిరా!

రాము—సందేహించుట యెందులకు? సందేహించకపోవుట యెందుల కు? నీవు రావణగృహమున నింతకాలమునుండి యుంటివి కావా! అందుకొఱకే.

సీత—ఉంటిని. అందులకు నేనేమిచేయుదును?

రాము—ఏమిచేయుదు నని నన్నడిగెద వేల? పెనిమిటిచె త్యజించినసతు లందఱు చేయుచున్న పనులు పతి నడిగియే చేయుచున్నారా? నీయిష్టము వచ్చినట్లు చేయుము.

సీత—హా! పెనిమిటి వదలుటయే. హా! నాకు స్వచ్ఛందవృత్తియే. రామ, రామ, రామా! (ఏడ్చుచు నేల వ్రాలును.)

లక్ష్మ—మహాప్రభూ! ఇది యేమి? ఇది యేమి? (కాళ్లపైఁ బడును.)

రాము—ఏదియో చూచుచుండుము.

సుగ్రీ—(తనలో)

గీ. కంధికంటె నగాధ, మా ♦ కాశవీధి
కంటె నెత్తు, పిడుగుకంటె ♦ గట్టి, సుమము
కంటె మార్దవ, మమృతంబు ♦ కంటెఁ దీపి,
మునిడికంటెఁ జేదగు మహా ♦ త్ములమనంబు.

లక్ష్మ—(జానకీదేవిని విసరుచు) ఓకరుణామయా! శ్రీరామభద్రా! కష్టము లేవో గట్టెక్కె నని యానందించుచుండ నీయశని పాత మేల? ఏమి మహాప్రభూ! లోకపావని యైనసీతవలనిసేర మేమి? యజ్ఞవేదిసంభవ యగుమహాపూత యైనయీమెవలన దోష మేమి? జీవన్ముక్తుఁ డనఁబడగు జనకచక్రవర్తిబిడ్డ యైన యీమహాసాధ్వివలన నపచార మేమి? పలుక వేమి? అయ్యయ్యో! ఈవానరసఖ్యము లేల? ఈవార్ధిబంధన మేల? ఈమహాయుద్ధ మేల? ఈజీవనాశ మేల? ఈయాందోళనము లేల? ఏమి మహాప్రభూ!

రాము—ఇవి యన్నియు రావణవధార్థము. దుష్టశిక్షణ మైనది. ఇంత మనకుఁ గావలసిన దేమి?

లక్ష్మ—మహాప్రభూ! అవతారమూర్తులే—అలౌకికసర్వమంగళగుణప రిపూర్ణులే—ఒక్కదుష్టశిక్షణమే చేసి యూరకుందురా? శిష్ట రక్షణముకూడఁ జేయ నక్కఱ లేదా?

రాము—శిష్టత యేదో తేలసి యటులే చేయవచ్చును.

లక్ష్మ—ఇప్పుడు తేలవలసిన దింక నేమున్నది?

రాము—ఇదివఱ కింత మునిఁగినది గావుననే యిప్పుడు తేలవలసియు న్నది. అవసరము రానప్పు డందఱును సద్వృత్తఖ్యాతిమంతు లై యుండవచ్చును. అది సంభవించినప్పుడే వృత్తపరిశీలనము కావలసినది.

లక్ష్మ—ఇది మన దేశము కాదు. ఇక్కడ సీత నెఱిఁగినవారు లేరు. ఎవరామెసువృత్తతను గూర్చి యిచ్చట మీకు బోధింతురు?

రాము—వెఱ్ఱివాఁడా! మన గ్రామమున నొకపంచభూతగణముఁ నిక్కడ నొకటి యున్నదా?

సీత—(లేచి) మహాప్రభూ! నే నగ్నిఁ బ్రవేశింతును. నాకు వేగమ సెలవిమ్ము.

రాము—సెలవిచ్చువాఁడను నేనుగాని యగ్ని నేసి సిద్ధపఱచువాఁడు నీమఱఁది యేకదా?

లక్ష్మ—నాచేతులు మొదలంటఁగోయించుకొందును. నాకన్నులు కొ అవిచేఁ గాల్చుకొందును. నా కీఘోరకృత్యమునునియమింప కుఁడు. రామ, రామ, రామా! (ఏడ్చును.)

సీత—సౌమిత్రీ! లే. ఏడువకు. అన్నగారిమాట కడుగుదాఁటువాఁడవు కావే? ఇప్పుడుమాత్ర మేల దాఁటవలయును.

లక్ష్మ—అమ్మా! న్యాయమా? పితృవాక్యపరిపాలనము చేసి శ్రీరా ముఁడు రావణుని సంహరించెను. కాని భ్రాతృవాక్యపరిపాలనము సేసి నేను నిన్నుఁ గాల్పనా? రామ, రామ, రామా! (ఏడ్చును.

రాము—ఏమిలక్ష్మణా! నీ కీవెఱ్ఱితనము? చంపువాఁడవును బ్రదికించువాఁడవు నీవేనా! లేనిపోని యహంభావ మేల నొందెదవు? మాఱుమా టాడక యగ్నిని బ్రజ్వలింపఁ జేయుము.

లక్ష్మ—మహాప్రభూ! వెల్గించుచున్నాను. రామా! రామా! రామా!

(పెద్దయేడ్పునఁ బోవును.)

సుగ్రీ—మహాప్రభూ! క్షమింపవలయును.

రాము—ఎవరిని?

సుగ్రీ—సీతను.

రాము—సీతవలనఁ దప్పున్నట్లు నీకు స్పష్టపడినదా?

సుగ్రీ—హరిహరీ! హరిహరీ!

రాము—లక్ష్మణా!—ఆలస్య మేల?

లక్ష్మ—(ప్రవేశించి) రా! తల్లీ! రా! సీతమ్మతల్లీ! నీవువనవాసమునకు బయలు దేరునపుడు—మాయమ్మ—నిన్నుఁబట్టుకొని—నాయొద్దకుఁ దీసికొని వచ్చి—నాయనా! సీత నాకు—నీకంటెఁ బ్రియతరసుమా!—యీమె నెట్లు లాదరింతువో!—జాగ్రత్త సుమా! అని చెప్పి తరువాత రామభద్రునిచేతిలో నిన్నప్పజెప్పెను. ఇప్పుడు—నిన్ను—నీభర్తనుండి వేఱుచేసి—యగ్నిలోఁ ద్రోయుచున్నాను. రా! తల్లీ! రా!

సీత—నాయనా! వచ్చెదను. 'రామా! రామా! రామా!' యని కురరివలె నిన్నిమాసము లఱచుటచే గొంతుక మెఱుగు రాచినది. శుష్కోపవాసాది క్లేశములచే దేహము నవసి నవసి శల్యపంజర మైనది. నిత్యధరణీతలశయనమున మేను రంగుమాఱి బూడిదచరచి యున్నది. నఖముఖలాలనశూన్యమైన కేశపాశము గట్టిజడఁ గట్టినది. సంతతబాష్పధారలఁ జెక్కు లొఱసినవి. ఈదేహమున మీయెడఁబాటువలనఁ బ్రాణనాథా! యిట్టిమార్పులు గలిగెను.

గాని నామనసుమాత్రము, నిశ్చలముగ, నిర్వికారముగ నీయం
దే సర్వదా సర్వథా లగ్నమైనది. ఓసూర్యభగవానుఁడా! రా
ముఁడు దూరముగ నుండెను గాని నీయింటికోడలి నైననాచారి
త్రమును నీవు గనిపెట్టుచునే యుంటివి కాదా? ఓభూదేవీ! ఓ
తల్లీ! నమస్కారము. నాథా! ప్రాణనాథా! నాయందు దక్షిణూన
ముగలిగి—నాకొఱకుఁ జింతించి—నాకై యింత శ్రమపడి—
యిక్కడకు దయచేసి—నాకు దర్శన మిచ్చి—నన్నుఁ గృతా
ర్థురాలిని జేసితిరి. అంతే చాలు! ఎక్కడికి! ఎంతకాల మైన
పతికిఁ బతితో సంసారము సేయవలయు ననియే యుండును.
ఎక్కడికి! ఇదివరకుఁ బండ్రెండేండ్లు సమస్తసౌఖ్యములను మీ
తో ననుభవించితిని. నాబ్రదుకున కదియే చాలును. అంతకంటె
నేను గోరను. ఎప్పుడైనఁ జావవలసిన దే! కాని యిప్పుడు చచ్చు
నంతటిమహామోదము నాకెప్పుడు లభించదు. ఏలయన నెప్పుడు
నన్నుఁ జూడవత్తురో యెప్పుడు నాకుదర్శన మిచ్చెదరో యని త్రుటి
యొక్కయుగముగాఁగ నెంతకాలమో మీకై నిద్రాహారములు
లేక నిరీక్షించిననాకు మీదివ్యమంగళరూపసందర్శనమువలన
నమితానందము గలిగినది. ఇంతకంటె నెక్కువసంతోషము నా
కీజన్మములోఁ గలుగనేరదు. కావున నామరణమున కిదియే
సర్వోత్తమావసరము. రక్షింపుము. ఆలస్య మగుచున్నది.
ఓభగవానుఁడా! ఓనారాయణమూర్తీ! నాకు జన్మజన్మమునం
దీశ్రీరామచంద్రునే పతిగ ననుగ్రహింపవలయును. రామా!
రామా! రామా! (ప్రదక్షిణము చేసి నమస్కరించును.) ఓమ
హాజనులారా! నేను బోయెదను. సెలవిండు.

(నేపథ్యమున) హా. హాహా. రామా! రామా! రామా!

సుగ్రీ—కపులెల్లఁ దల్లడిల్లుచున్నారు.

లక్ష్మ—తల్లీ! రా! ఇదిగో! దారిచూపుట కీకఠినహృదయుఁ డున్నాఁడు.

(సీతతో లక్ష్మణుఁడు పోయి తిరిగి ప్రవేశించును.)

(నేపథ్యమున) రామ, రామ. రామా!

సుగ్రీ—సీత యగ్నిఁ బ్రవేశించినది.

లక్ష్మ—రామప్రభూ! నాకాత్మహత్య కనుజ్ఞ దయచేయవలయును.

రాము—తమ్ముఁడా! తొందరపడకు. శాంతించుము.

సుగ్రీ—ఆహా! సీతను బట్టుకొని యెవ్వరో మహానుభావుఁ డగ్నినుండి బయలువెడలి వచ్చుచున్నాఁడు.

(అగ్నిదేవుఁడు సీత ప్రవేశింతురు.)

అగ్ని—రామభద్రా! నీ తండ్రికి సంతానయోగ్యతకై పాయసపాత్రిక నిచ్చినవాఁడను నేనే; నీకునఁ దాఁ యోగ్యతకై భార్యనిచ్చినవాఁడను నేనే. ఈసీత పరిశుద్ధతను గూర్చి నీతోఁ గొంత చెప్పవలసియున్నది.

రాము—అగ్నిదేవా! క్షమింపుము. నాతోఁ జెప్పనక్కఱ లేదు. వీరందఱతోఁ జెప్పుము.

అగ్ని—అటులైన నొక్కటేమాట చెప్పెదను. సర్వపరిశుద్ధిసాధనమైన నేనే నీమెయనుగ్రహమువలనఁ బరిశుద్ధుఁడ నైతిని.

లక్ష్మ—ఆహా! ఆహా! వినఁదగినమాటలు వినఁబడినవి.

అగ్ని—శ్రీరామచంద్రా, నేనింకఁ బోయెదను. (నిష్క్రమించును.)

రాము—సీతా! నేనుజేసిన పనికి నీవు కోపింపవలను. నీపాతివ్రత్యమాహాత్మ్యము నే నెఱుఁగనిది కాదు. ఇట్టిపరిశుద్ధి లేకయే నిన్ను స్వీకరించినయెడల నింద్రియలోలుఁ డగురాముఁడు చిరకాలము పరగృహనివాసినై సందిగ్ధచరిత్రను గలయుంటిని మఱల సిగ్గులే

క తెచ్చుకొనె ననునప్రతిష్ఠ కలుగును; దానిని వారించుటకై యిట్లు చేసితిని క్షమింపుము.

సీత—మహాప్రభూ! అనుగ్రహింపఁబడితిని.

రాము—తమ్ముఁడా! హితులారా! ఓవానరులారా! నేను గతివహ్నాన యుఁడనని మీరందఱు మనసులలో నిందించి యుందురు. లోక మున కెప్పుడును జబ్బుమాట చెప్పుకొనుట యందుకుతూహల మెక్కువ. అందులోఁ గాంతాచరిత్రమును గవితాపరిపాకము నెంతయుత్తమమైన దైన నెవ్వఁడో నోటిమొట్టపువాఁడు టొంపు పొడువక మానఁడు. అగ్నిశోధనముచే సీతాచారిత్రపవిత్రతను మీరెల్లఁగనిపెట్టితిరి కదా? ఐన నీశోధనమును జూడనివాని కింకసందేహమే! నేనొక్కమాట చెప్పుచున్నాను. ఈమె కీయ పవాదమెన్నటికైన వచ్చుటనిశ్చయము. అయినను ముందుదారి నిశూచ్చియిప్పుడీ విచారమేల? విభీషణా! మేమిప్పుడే యయో ధ్యకుఁ బోవలయును. కుబేరపుష్పకమును దెప్పింతువా?

విభీ—చిత్తము. (పోవును)

రాము—సుగ్రీవా! నీవునాకు మహోపకార మొనర్చితివి,

సుగ్రీ—మహాప్రభూ! అట్లులాడఁదగునా?

రాము—నీవు మాతో నయోధ్యకు రావలయును.

సుగ్రీ—చిత్తము.

రాము—ఆంజనేయా! నీవలన మహాద్భుతకార్యములు జరుపఁబడినవి.

ఆంజ—జరిగినకార్యములు జరిగించుకొనినవారిసామర్థ్యమున నైనవే కాని నేనస్వతంత్రుఁడను.

రాము—నీవు మాతో నయోధ్యకు రావలయును.

ఆంజ—ఆకర్షింపఁబడుచుండిన నాప్రయోజకత యేమున్నది? విభీషణా! శీఘ్రముగ రమ్ము.

విభీ—(ప్రవేశించి) పుష్పక మట నున్నది.

రాము—నీవిచ్చట నుండి చేయవలసిన కృత్యము లన్నియు నెఱవేర్చి కొని శీఘ్రముగ నయోధ్యకు రావలయును.

విభీ—తమయిష్టానుసారమే యాచరింతును.

రాము—ఓ విమాన రాజమా! నమస్కారము. మమ్మయోధ్యకుం దీసి కొనిపొమ్ము. రండు పోవుదము.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది సప్తమాంకము.

శ్రీ

# విజయరాఘవము.

## అష్టమాంకము.

[ప్రదేశము — అయోధ్యలోనివీథి]

(ప్రవేశము — గోవిందుఁడు.)

గో — ఓహో! మాధవా! (మాధవుఁడు ప్రవేశించును.)

మా — గోవిందుఁడా. ఈదినము మొగము కలకలలాడుచున్నది!

గో — ఒక్క నా మొగమే! నీమొగమో! గ్రామమంతయునో? కలకల కాకేమి? మనమహారాజుగారు చిరకాలమునకు దక్షిణదేశముల నుండి దయచేసినారు. కన్నులకఱవు దీఱినప్పుడు కలకల కాకేమి?

మా — పట్టాభిషేకమునకై యూరంతయు నెంతశోభావంతముగ నైన సింగారించుచున్నారు.

సీ. ఉదకయంత్రములు, వి ♦ ద్యుద్దీపకళికలు,
వీథులందునఁ జాలఁ ♦ బెట్టినారు.
జనములపైఁ బూలు ♦ చల్లంగఁ బన్నిరు
చిలుకంగ బొమ్మలఁ ♦ జేసినారు
రసపుబుడ్లను గాచ ♦ రచితగోళములు సం
దిళ్ళను వ్రేలాడఁ ♦ దీర్చినారు

"జయమహారాజ! జ ♦ య,,యటంచు బంగారు
వర్ణంబు లంతట ♦ వ్రాసినారు;

గీ. గ్రామ మంతయుఁ గదళికా ♦ కాండములును
బోఁకమ్రాఁకులు కృత్రిమ ♦ పుష్పములును
బసపుతళతళ లగరుధూ ♦ పములు కేతు
పటములును గల్గి శోభాప్ర ♦ భాసి యయ్యె.

గో—ఆహాహా! కోటవైపునఁ జూడు!

సీ. కోఁతిఫారాయొద్ద ♦ కోటబురుజుపైని
రెంకునాల్కలతెల్ల ♦ జెండ యాడు
గుబగుబధ్వనులతో ♦ గుబ్బంపుబం డ్లెన్నొ
బడిబడి కోటలో ♦ పలికి నేగు
గంధగజేంద్రముల్ ♦ గణగణధ్వనులతో
బరువులతో లోని ♦ కరుగు వేగ
దేవళంబులనుండి ♦ దివ్యమూర్తులు దివ్య
వాహనారూఢులై ♦ వచ్చుచుండ్రు.

గీ. క్రిక్కిఱిసి మూఁగు జనముల ♦ పక్కిఱెక్క
వలుదవాగాలు తప్పఁగ ♦ న్పడఁ డెవండు
సూర్యకాంతిచే విరిసిన ♦ శోణజలజ
పుష్పముల నిండుకొలనిసొం ♦ పును వహించి.

అదేమి? అచ్చట మిగుల సందడిగ నున్న దే!

మా—సీ. పసుపు మోమున రాచి ♦ పట్టెనామము పెట్టి
పొడుపుకొమ్ముల బంతి ♦ పూలఁ జుట్టి
మువ్వలు దండలు ♦ మూపురంబునఁ గట్టి
గంటలపేరులు ♦ గాత్ర మంత

జందెపురీతి ము ♦ స్తాబు చేసినత్లె
యెద్దుల చుట్టు సే ♦ వించి నెమలి
కుంచె నొకం డెత్తి ♦ వంచుచుఁ బాడిన
నదె మఱి పాడుచు ♦ నెవను గట్టె
గీ. కొనినఱేకు డొల్లలు మోఁదు ♦ కొనుచుఁ బల్లె
రంపుతాళము లూది ద ♦ ట్టింపు చోడలు
మఱిచి గొల్లలు చిందు లే ♦ సరఁకేఁద్రొక్కు
చుండిరో చూడు లయఁ దప్ప ♦ కుండనచట.

గో—ఈమహారాజుపై జనులకందఱ కెంతయభిమానము.

మా—అభిమానము కాదా? పెద్దమహారాజు గతించి పదునాలుగు సంవత్సరములు దాఁటినది. ఈవఱకును దండ్రులులేని బిడ్డలమై తల్లడించితిమి. నేఁటికాలమునకు జనులభాగ్యము పండినది. ఇప్పటికిఁ బ్రభుఁ డని, పరిపాలన మని, పండితు లని, పారితోషికములని, పండుగలని, పర్వము లని కలిగినది.

గో—నిజమే. మహారాజదర్శనమునకై జను లింతకాలమునుండి మొగము వాచి యున్నారు. ఇప్పు డమితానందమున నొడలు తెలియక యున్నారు.

మా—ఆలస్యమేల? మనము గూడ కోటలోనికిఁ బోయి యీమహానంద మనుభవింతము. రమ్ము. మహారాజదర్శనానందము ముందట నీయలంకారదర్శనానంద మెంత! ఆ.

గో—పట్టాభిషేకముహూర్తముకూడ నిదియే. పోదము. రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

---

శ్రీ

# విజయరాఘవము.

[ప్రదేశము—అయోధ్య—పట్టాభిషేకశాల.]

—•—

(ప్రవేశము—రాముఁడు, లక్ష్మణుఁడు, సీత, భరతుఁడు, వసిష్ఠుఁడు, ఆంజనేయుఁడు.)

వసి—రామభద్రా! లోకములమహాపుణ్యా మిట్లు నీరూపమున ఫలించినది.

రాము—కులగురువులకటాక్షమే యింతకును మూలకారణము.

వసి—చిరకాలము రఘుకులమున గురుత్వము వహించితి గాని యీక్షణమంత సార్థకమైనది నాజన్మమున వెనుక రాలేదు. ముందికరాదు. లోకనాయకుఁడ వైననీకు నాచేతిమీఁదుగ బట్టాభిషేకము సేయుమహాభాగ్యము లభించినది.

(సుగంధితైలమును రామునిమూర్ధమున రాచి కిరీటముంచి సింహాసనముపై సీతతోఁ గూర్చుండఁ బెట్టును.)

రాము—మహానుభావులకృపచేఁ బట్టాభిషిక్తుఁడనైతిని.

భర—(పాదుకలఁ దలపై నుంచుకొని) మహాప్రభూ! తమపాదుకలను శిరమున ధరించి యీపదునాలుగేండ్లును గాలక్షేపము చేసితిని. ఇవి తమపాదములఁ దొడుగుటకు ననుజ్ఞ నీయ వేఁడెదను.

వసి—రామభద్రా! భరతుఁడు లోకోత్తరుఁడు. మహాప్రపన్నుఁడు. పరమవిరాగిశిఖామణి. త్వత్పాదారవిందభక్తాగ్రేసరుఁడు.

రాము—మహానుభావా! నే నెఱుఁగనా?

గీ. మిమ్ముఁబోలుగురుండు, సౌ ♦ మిత్రి భరతు
లకు సరియగుతమ్ములు, జాన ♦ కికిఁ దులయగు
భార్య, యాంజనేయునివంటి ♦ బంటు, వాలి
సోదరునివంటిమిత్రుఁ డె ♦ చ్చోటఁ గలరు?

వసి—రామునివంటిపుత్త్రుఁడు, రామునివంటివీరుఁడు, రామునివంటి దైవ మని కూడఁ జెప్పఁదగును. గురుడనుపేరువహించినవాఁడ ను గాన నీవు చెప్పినదానిపైఁ గొంత చెప్పితిని.

లక్ష్మ—మహాప్రభూ! మేము మీకుఁ దమ్ములము. జన్మతఃరక్తసంబంధ మున్నది. మేము నీయెడల సంపూర్ణభ్రాతృత్వము నెఱప వింత గాదు. సీత నీకు భార్య యగుటచే సామె నీయెడల ననురాగ యుక్తయై యుండుట యాశ్చర్యము కాదు. ఈగురువులవారికి రఘుకులమున సహజాభిమాన ముండుటచే శిష్యులయెడ వా త్సల్య ముండుట విచిత్రము కాదు. తన కపకారి యగువాలిని జంపి రాజ్య మొసఁగినందులకు సుగ్రీవుఁడు మీయెడల సఖ్యము నెఱపుట యద్భుతము కాదు. కాని యెక్కఁడ నేసంబంధము లేన ట్టియు మీవలన నేలాభమును బొందనట్టి యీయాంజనేయుని యుపకారచింత, రాజకార్యధురంధరత్వము, ప్రభుభక్తియు న త్యాశ్చర్యకరములు. అవాఙ్మానసగోచరములు. అలౌకికములు.

ఆంజ—సౌమిత్రీ! నన్ను స్తుతింపవలదు. నేను శ్రీరామమూర్తిని సే వించితి నని చెప్పితివి. సేవించుటయందు నాకుఁ గర్తృత్వ మె క్కడిది? నాచే సేవను శ్రీరామదైవమే చేయించుకొనుచు న్నాఁడు. ఆమహానుభావునిచర్యకై నన్నుఁ గొనియాడవచ్చునా?

వసి—సెబాస్! కేసరీపుత్త్రా!

సీత—(అపవారించి) నాథా! మారుతికి నామెడలోనియీహార మీయ వలయునని కోరిక గలదు. అనుజ్ఞ యిమ్ము.

రాము—(అపవారించి) ఆతని కీహార మేల?

సీత—కంఠభూషణ మైయుండును.

రాము—ఆంజనేయా! సీతాదర్శనము మొదటచేసి నీవు లంకనుండి వచ్చినప్పుడు నన్నే నీ కొసంగికొంటిని. ఇఁక నిచ్చుట కేదియు లేదు. సీతసీ కీహార మిచ్చుచున్నది. గ్రహింపుము. (ఆంజనేయుని మెడలో హార ముంచును.)

ఆంజ—అనుగ్రహింపఁబడితిని.

(మెడలోనుండి తీసి చిదుకఁ గొట్టును.)

లక్ష్మ—వానరోత్తమా! హారము నట్లు చిదుకఁ గొట్టుచుంటి వేమి?

ఆంజ—దీన నెచ్చటనైన రామనామ మున్నదేమో చూచుచుంటిని. ఎచ్చటను గానఁబడదు. ఈహారముతో నా కేమి ప్రయోజనము?

లక్ష్మ—రత్నములలో రామనామ ముండునా?

ఆంజ—ఎల్లచో నిండియుండఁదగిన రామనామము రత్నములలో మాత్ర ముండఁదగదా?

లక్ష్మ—రామనామ మెక్కడ నిండియున్నది?

ఆంజ—ఎక్కడనో యననేల? నీకత్తితో నాయొడలు కోసినయెడల నీవే కనిపెట్టఁగలవు?

వసి—సెబాస్! కృతార్థజన్ముఁడవు. నీసాటివాఁ డెవ్వఁడును లేఁడు.

రాము—

సీ. ఏను దైవముగ భా ♦ వించుచుంటివి నన్నుఁ
దలఁచువాఁ డెవ్వఁడైనఁ ♦ గలిగెనేని
నినుఁగూడ నవ్వాఁడె ♦ వినుతించు; రామనా
మముకంటె సీత నా ♦ ముంబుకంటె
నీపేరె ముందుగా ♦ నిశ్చలభక్తితోఁ
స్మరియింపఁబడుఁగాక! ♦ వాయుపుత్ర!

నినుఁగొల్చు జనులు ధీ ♦ నిర్నిద్రులై రాజ
కార్యధురంధరా ♦ గ్రణు లకార
గీ. ణోపకారపరాయణ ♦ తోజ్వలు లయి
చిరయశఃపరిపూర్ణతఁ ♦ జెలఁగుచుంద్రు
గాక! బాహుపరాక్రమ ♦ క్రమవిశేష!
యమితసద్గుణసముదాయ! ♦ యాంజనేయ!

రంజ——మహాప్రభూ! తమకటాక్షము తప్ప నే నపేక్షించున దేదియు లేదు.

ఓజనులారా!

భర——సీ. ఒప్పుచేసినవాని ♦ నొప్పించితిని తప్పుఁ
చేసినవాని శి ♦ క్షింపలేదొ
యే నెఱుంగను; చేత ♦ నైనయట్టులు కాల
మీడిచివైచితి; ♦ నింక నీమ
హానుభావుఁడు బహు ♦ న్యాయబుద్ధిని మిమ్ముఁ
బాలించు జాగ్రత్త! ♦ భద్ర మింకః
మీయిష్ట మెట్టులో ♦ నాయిష్ట మట్టులే
యనిబుజ్జ నాడించు ♦ నట్టినోరు
గీ. లేనిభరతుఁడు కాఁ డెంత ♦ క్లిష్టుఁ డంత
సుముఖుఁ; డెంతతీక్ష్ణుఁ డంత ♦ సుప్రశాంతుఁ;
డెంత స్వాతంత్ర్యయుక్తుఁడో ♦ యంతజనవి
ధేయుఁ డట్టిరాముఁడు వచ్చెఁ ♦ దెలివిమనుఁడు!

ఓదుష్టులారా!

సీ. బహుసతీరతుల కొం ♦ పలు గాలు నింకన
సత్యవాదులదీప్తి ♦ చల్లబాఱు
మోసంబు సేయఁగ ♦ ముఖసంస్తుతులు సేయు
బుడబుడక్కలవాండ్ర ♦ పుట్టి[illegible]

మేలును దిగ్రమింగి ♦ కీడుఁ గ్రక్కెడు ధర్త్రి
జాడ్యస్థులకు దర్భ ♦ శయ్యలగును
గుర్లు మీఁదికి వచ్చి ♦ కోరమీసములొత్తి
యెగురుపక్షుల నెత్తి ♦ యీకలెగురు
గీ. చెడ్డతనమునకు మిగులఁ ♦ జెడ్డ దగుచు.
బ్రిబలు నీరాజమార్తాండు ♦ రాజ్యమింకఁ
గానఁ బెందలకడఁ దెల్వి ♦ గల్గి మీఁదు
చిట్టగ్రంథంబులను గట్టి ♦ పెట్టుకొనుఁడు.

ఓశిష్టులారా! నేను మీకేదియుఁ జెప్పఁదగిన యావశ్యకత లేదు అయినను వచింతును.

సీ. ఏనుపూజరిగా న ♦ హీనభక్తిని మీరు
శ్రీపాదుకల కిచ్చు ♦ సేవ తల్లి
నర్పించితిని; విగ్ర ♦ హారాధనం బేల?
పూజారిమాధ్యస్థ ♦ ములు నిఁకేల?
రామదైవము మన ♦ ప్రార్థనంబులు విని
దయచేసి యుండెఁ; నా ♦ తనిని మనము
కరములఁ బూజించి ♦ కన్నుల సేవించి
వాక్కులఁ దనిపి శ్రీ ♦ పాదములను
గీ. మెత్తమెత్తఁగ నెత్తి చే ♦ యొత్తి మ్రొక్కి
సకలమగునుపచారముల్ ♦ సలిపి మనదు
బ్రదుకులను జాల సార్థక ♦ పఱచుకొనఁగ
వలయుఁ జనులార! సద్గుణా ♦ భరణులార!

రాము—(లేచి) తమ్ముఁడా! నీయోగ్యత నన్ను నీకు వశ్యుని జేసినది. నిన్నెన్నిసారు లీదినమునఁ గౌఁగిలించుకొనినను నాకేమో తనివి తీరకున్నది.

(కౌఁగిలించుకొని)

గీ. అడవిఁ బదునాలుగేం డ్లెంత ♦ పొడుగొ యంత
పొడుగయినకౌఁగి లిమ్మని ♦ యడిగినాఁడ
వెన్ని సారులు నిన్గౌఁగి ♦ లించినాను
యన్ని పదునాలుగేం డ్లాయు ♦ వగును నీకు.

వసి—జనులారా! మహానుభావులచారిత్రము లెప్పుడు పరమార్థబోధకము లై యుండును. కాన మీ రీమహనీయునిచరిత్రమునుండి యొకనీతిని గ్రహింపవచ్చును.

గీ. దశశిరస్సులు గల్గిన ♦ దనుజుఁ డింద్రి
యదశకము; సీత నరచిత్త; ♦ మాంజనేయుఁ
డు గురువరుఁడు; చక్రాంకణ ♦ మగును ముద్ర;
రామయాత్ర శ్రీహరికృపా ♦ ప్రాప్తి నుండి.

రాము—గురువర్యా! ఇక్కడ నింకఁ గావలసిన దేమి?

వసి—పట్టాభిషేకవైభవము జరిగినది. ఇక్కడ నిప్పుడు కావలసినదేదియు లేదు. ఐన నిట్లు కావలయును.

గీ. ధరణి యీతిబాధలులేక ♦ తనరుఁగాక
ప్రజలయన్యోన్యవైరముల్ ♦ పాయుఁగాక
కవిత రాజపోషణమునఁ ♦ గ్రాలుఁగాక
నీతిపాలనమున రాజు ♦ నెగడుఁగాక.

అందఱు;—తథాస్తు.

(అందఱునిష్క్రమింతురు.)

ఇదియష్టమాంకము.

సర్వముసంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ.

